శ్రీమదాంధ్ర మహాభారత

# శిల్ప కళా దర్శనము

## తృతీయ భాగము



[ రూప ప్రతిరూప రథ యంత్ర ప్రకీర్ణాది శిల్పములు ]

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారిచే స్వర్ణపదకబహూకృతి నందుకొన్న
విశిష్ట సిద్ధాంత గ్రంథము



డాక్టర్ శోభిరాల సత్యనారాయణ
యం. ఏ., పిహెచ్. డి.

శ్రీ విశ్వకర్మా విజ్ఞానకేంద్ర
1-4/6-7 శాంతినగర్
శ్రీకాకుళము
532 001

Srimadandhra Mahabharata

# SILPAKALADARSANAMU

Rupa Pratirupa Radha Yantra
Prakirnadi Silpamulu

**by Dr. Sobhirala Satyanarayana**





ప్రచురణ } భావ జ్యేష్ఠ శుద్ధ పాడ్యమి
~~జూన్ 10,~~ 1994

ప్రతులు : వేయి

మూల్యము : రూ. 75/-



ప్రతులు దొరకుచోటు :

1) డా॥ యస్. యన్. శోభిరాల
సంచాలక్ : శ్రీ విశ్వకర్మా విజ్ఞాన కేంద్ర
1-4/6-7 శాంతినగర్
శ్రీకాకుళం - 532 001

2) కుమారి శోభిరాల శ్రీవిద్య
శ్రీ విద్యానికేతన్
1-4/6-7 శాంతినగర్
శ్రీకాకుళం - 532 001

ముద్రణ : మహోదయ పవర్ ప్రెస్ - శ్రీకాకుళం

## SRIMADANDHRA MAHABHARATA

# SILPAKALADARSANAMU

## Part III

*Dr. Sobhirala Satyanarayana,*
M. A., (Quadruple) Ph. D.

This book is Published
with the financial assistance of
**TIRUMALA TIRUPATI DEVASTHANAMS**
Under their Scheme
"AID to Publish Religious Books"



శ్రీలక్ష్మీ రమణుండగు
బాలాజీ భవ్యపాదపద్మమ్ములకున్
వాలాయము ప్రణమిల్లెదఁ
బాలించెడుఁగాక సకలభాగ్యప్రదుఁడై.

# AWARD OF GOLD MEDAL

## *Andhra University*

No. S. I. (3) /6/85, Waltair, Dt. 22-5-1985

## NOTIFICATION

## AWARD OF RESEARCH MEDALS / PRIZES

The following cancidates whose Ph.D theses have been adjudged to be the best among those accepted by the University, during the years mentioned, have been awarded the Research Medals/Prizes noted against each.

**Faculty of Arts :**

| Name of the Candidate | Prize/Medal | Year |
|---|---|---|
| 1) ... ... ... | ... ... | ... |
| 2) Dr. S Satyanarayana, Lecturer in Telugu, Govt. Arts College, SRIKAKULAM | Sri Tripuraneni Gopichand Memorial Medal | 1984 |

University Office,
Waltair
Date : 28-5-1985.

Sd/- **C. V. APPA RAO**
troller of Examinations.

/ True Extract /



నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్ ॥

విశ్వకర్మా మహాభాగో జజ్ఞే శిల్ప ప్రజాపతిః ।
కర్తా శిల్ప సహస్రాణాం త్రిదశానాం చ వర్ధకిః ॥

భూషణానాం చ సర్వేషాం కర్తా శిల్పవతాం వరః ।
యో దివ్యాని విమానాని త్రిదశానాం చకారహ॥

మనుష్యాశ్చోపజీవంతి యస్య శిల్పం మహాత్మనః ।
పూజయంతి చ యం నిత్యం విశ్వకర్మాణ మవ్యయమ్॥

నరనారాయణ తత్త్వము
నరోత్తముని ధర్మమును మనంబున వెలుఁగన్
విరచింతును 'జయ' గ్రంథము
సరస్వతీదేవి కెఱిగి సకలార్థముగా.

—శోభిరాల

# సకలాంజలి

ఓం ఐం హ్రీం శ్రీం సకలాయై నమః

* * *

సకలజగజ్జనయిత్రిని
సకలాధిష్ఠానరూప సర్వాధారన్
సకల మనోన్మని సమరస
సకలేష్టద శాస్త్రసార సన్నుతిఁ జేతున్

కంజలోచన కమనీయ కారయిత్రి
కంబుకంఠి కలాలాప కావ్యలోల
కర్మఫలదాత్రి కామేశి కల్పవల్లి
కరుణ మమ్మేలు గాత విజ్ఞానకలన.

లక్షణోజ్జ్వలదివ్యాంగి లబ్ధరూప
లబ్ధనానాగమస్థితి లబ్ధభోగ
లక్షకోట్యండనాయిక లలిత మాకు
లబ్ధసంపత్సమున్నతి లభ్య మగుత

హ్రీంకారాంగణదీపిక
హ్రీంకారసువర్ణసౌధశృంగకపోతిన్
హ్రీంకారాధ్వరదక్షిణ
హ్రీంకారేశ్వరిఁ దలంతు హృత్కమలమునన్.



— శోభిరాల

# ఉపోద్ఘాతము

## శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము

ప్రథమ భాగమునందు 1) ప్రథమోన్మేషమున - సాహిత్యము - శిల్పము
2) ద్వితీయోన్మేషమున - వాస్తు శిల్పము

ద్వితీయ భాగమున 3) తృతీయోన్మేషమున యజ్ఞ శిల్పము
4) చతుర్థోన్మేషమున పూర్త శిల్పము వివరింపఁబడినవి

తృతీయ భాగమైన యీ గ్రంథము నందు
5) పంచమోన్మేషమున రూప ప్రతిరూప శిల్పములు,
6) షష్ఠోన్మేషమున రథ శిల్పము,
7) సప్తమోన్మేషమున యంత్ర శిల్పము,
8) అష్టమోన్మేషమున ప్రకీర్ణ శిల్పములు చర్చింపఁబడినవి-

పంచమోన్మేషమునందు ప్రతిమాశిల్పమునకు మూలమైన రూపశిల్పమును గూర్చియు రూపాలంకరణ శిల్పమును గూర్చియు వివరించితిని.

రూపముల కధిపతి త్వష్ట యని భారతము చెప్పుచున్నది.

త్రిలోకసుందరి యగు తిలోత్తమను "సర్వగుణభాసి రూపక్రియా కలా విదుఁడు విశ్వకర్మ" తన కౌశలముతో సృజియించినాఁడని నన్నయ్యవర్ణించినాడు

భారతము నందలి స్త్రీ-పురుషుల రూప వర్ణనలు సాముద్రిక శాస్త్ర లక్షణములు గలిగి, ప్రతిమాకారులకు మార్గదర్శకములుగా నున్నవి.

భారతమునందు మృణ్మయ ప్రతిమలు, కొయ్యబొమ్మలు, ఇనుపరూపులు పటచిత్రములు, కుడ్య చిత్రములు వర్ణింపఁబడినవి. వీనిని గుఱించియు, వీనిని రచించు శిల్పులను గూర్చియు, చిత్రకారులను గుఱించియు, వివరించితిని.

మహాభారత కాలమున స్త్రీ-పురుషులు అనేకవిధములైన సువర్ణ రత్నాభరణములు ధరించుచుండిరి.

సువర్ణ శిల్పమునకు మూలపురుషుడయిన విశ్వకర్మను నన్నయ "నిఖిల దివ్యాభరణ శ్రీ విరచిత పరితోషిత దేవుఁడు"గా వర్ణించినాడు.

షష్ఠోన్మేషము రథశిల్పము నందు రథ నౌకావిమాన శిల్పములు వివరింపఁబడినవి. భారతమునందంతటను బహువిధ రథ యాన విమాన వర్ణనములున్నవి.

మహేశ్వరునకు తపః ప్రభావమహనీయుండగు విశ్వకర్మ రథమును నిర్మించి యిచ్చినాఁడని తిక్కన వర్ణించినాఁడు .

ప్రథమ రథకారుఁడగు విశ్వకర్మయే రథశిల్పమునకు మూల పురుషుఁడు శిల్పప్రజాపతి యగు విశ్వకర్మయే దేవతలకు విమానములు చేసియిచ్చు వాఁడని నన్నయ వ్రాసినాఁడు.

విశ్వకర్మ నిర్మితమగు పుష్పకవిమానమును నన్నయయు ఎఱ్ఱాప్రగడయు వర్ణించినారు.

సాల్వుని సౌంభక విమాన విశేషములను నన్నయ వర్ణించినాఁడు సౌంభకము మయ నిర్మితము.

విమాన శిల్పమును గుఱించి ఆశ్చర్యజనకములగు ననేకాంశము లిందు వివరింపఁబడినవి

సప్తమోన్మేషమున యంత్రశిల్పము ఆయుధశిల్పము నను నంశ ములు చర్చింపఁబడినవి. ఆయుధ శిల్పమున కాద్యుఁడు విశ్వకర్మయే.

త్వష్ట [విశ్వకర్మ] ఇంద్రునకు నూఱు ధారలుగల వజ్రాయుధమును జేసి యిచ్చి నట్లు నన్నయ వర్ణించినాఁడు.

భారతమునందు వర్ణింపఁబడిన వివిధాయుధములు కర్మారకౌశలమునకు నిదర్శనములు.

పంచ శిల్పములు - ప్రకీర్ణ శిల్పములు అను అష్టమోన్మేషము నందు పంచశిల్ప ప్రాముఖ్యమును గూర్చియు, అక్షశిల్పము, దంతశిల్పము, వాద్య శిల్పము, కల్పవృక్ష కామధేను నిర్మాణాది వివిధ శిల్పములను గూర్చియు వివరింపఁబడినది. ఈ నానావిధ శిల్పములకు మూలపురుషుఁడు విశ్వకర్మయే.

విశ్వకర్మ సంతతియు, శిష్యప్రశిష్యులు పరంపరాగత మయిన తమ ప్రతిభాపాటవములతో నానావిధ శిల్పకళల నావిష్కరించి లోకోపకారులయి ప్రశంసాపాత్రులగు చున్నారు.

ఈ విషయములన్నియు నీ గ్రంథమునందు విశదీకరింపఁబడినవి.

జిజ్ఞాసువు లెల్లను నీ సిద్ధాంత గ్రంథమును సంపూర్ణముగా చదివి ప్రాచీన భారతీయ సంస్కృతి సంప్రదాయములను, నాగరకతా లక్షణములను ప్రతిబింబించు భారత శిల్పకళా ప్రాశస్త్యమును, శిల్పాచార్యుల శిల్పవిజ్ఞాన విశేషములను దెలిసికొని యానందింతురు గాక!

ఇతి శమ్.

# తెలుగు విశ్వవిద్యాలయం

# TELUGU UNIVERSITY



*Prof.* **Pervaram Jagannadham,**
M. A. Ph. D.
Vice-Chancellor

Lalitha Kala Kshetram
Public Gardens
HYDERABAD
500 004 (A P.)

*Date* **5—9—1994**

## అభినందన

మిత్రులు డా॥ శోభిరాల సత్యనారాయణగారు గొప్ప పరిశోధకులు. దేశంలో పేరున్న పండితులు, ప్రాచీన శాస్త్రవిజ్ఞానాన్ని సునిశితంగా అధ్యయనం చేసిన విద్వాంసులు. మన సాంస్కృతిక వారసత్వాన్ని చక్కగా అనుశీలించిన వారు; ఆకళింపు చేసుకొన్నవారు. అంతేకాక వివిధ శాస్త్రాం సమన్వయాన్ని తమ పరిశోధనలో సాధించి చూపినవారు.

వీరు శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము అనే అంశంపై పరిశోధనచేసి ఆంధ్ర విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత గ్రంథంలోని తృతీయ భాగాన్ని ఇప్పుడు ప్రకటిస్తున్నారు. తెలుగు భారతంలో ఆయా సందర్భాల్లో అభివర్ణించిన వివిధ కళల నిర్మాణ రహస్యాల గూర్చి వాటి శిల్పకళా సౌందర్యం గూర్చి సునిశితంగా అనుశీలించి దీనిలో విశ్లేషించినారు.

అలంకరణల గూర్చి ఆయుధనిర్మాణ పద్ధతుల గూర్చి వాటి వైవిధ్యాన్ని గూర్చి ప్రాచీన శాస్త్ర విజ్ఞానాన్ని భూమికగా వ్యాఖ్యానించినారు.

డా॥ సత్యనారాయణగారి ఈ కృషిని మనసారా అభినందిస్తున్నాను. వారి సాహిత్య వ్యాసంగం ఇంకా ముందుకు సాగాలని ఆకాంక్షిస్తున్నాను.

భగవంతుడు వారికి అన్నివిధాలుగా విజయ పరంపరలు చేకూర్చుగాక !

(సం॥) పేర్వారం జగన్నాథం

# గ్రంథావిష్కరణ మహోత్సవము

తెలుగు విశ్వవిద్యాలయ కులపతి

**ఆచార్య డా॥ పేర్వారం జగన్నాథంగారు**

శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము

తృతీయ భాగము నావిష్కరించి

గ్రంథకర్తను సన్మానించి జ్ఞాపికను బహూకరించుచున్న దృశ్యము



(ఎడమనుండి కుడికి)

గ్రంథ కర్త : డా॥ శోభిరాల సత్యనారాయణ

సభాపతి : విశ్వబ్రాహ్మణ ధర్మపీఠము

సభాధ్యక్షులు : శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు M A., H.D.C.

ముఖ్య అతిథి : ఆచార్య డా॥ పేర్వారం జగన్నాథం M A., Ph D.

వేదిక : ఆంధ్ర సాహిత్య పరిషత్ ప్రాంగణము

(తిలక్ రోడ్డు - హైదరాబాదు)లో తే 19-9-1994 ది జరిగిన

విశ్వబ్రాహ్మణ ధర్మపీఠ వింశతి వార్షిక మహాసభ.






**Prof. Kothapalli Veerabhadra Rao,**
M.A; Ph.D.

179, West Marredpally, Road No. 6
Secunderabad - 500 026 INDIA
Tel : 800670

Formerly : Head - Dept. of Joytisha, Telugu University (Hyderabad), Dean : School of Literature, Telugu University(Rajahmundry Campus), Professor of Telugu, Director : Centre for Regional Studies and Dean : School of Social Sciences, Central University of Hyderabad, Chairman : Official Language Commission, Govt. of Andhra Pradesh, Director : Telugu Akademi (Hyderabad); Head : Dept. of Telugu, Delhi University, Visiting Professor - Dept. of Indian Studies, Wisconsin University, Madison (U.S.A.), Head : Dept. of Oriental Languages; Maharajah's College, Vizianagaram.


# రమ్యానుశీలనం

సుప్రసిద్ధ పండిత కవులు, సంస్కృతాంధ్రాంగ్ల భాషాసాహిత్య కోవిదులు, తత్త్వమనస్త్వశాస్త్ర మర్మజ్ఞులు, సౌమ్యులు, చిరకాలమిత్రులు అయిన బ్రహ్మశ్రీ డాక్టరు శోభిరాల సత్యనారాయణగారు రచించిన "శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము" మూడు భాగాలు ఆమూలాగ్రంగా పఠించాను. అంతరంగం ఆనందతుందిలమైనది. ఈ రచన బుద్ధికి పదునుతెచ్చేది. హృదయానికి సంతృప్తినిచ్చేది. పూర్తిగా వ్యక్తికి వికాసాన్ని ఇచ్చేది.

ఎందరో వేదవిదులున్నారు; ఎందరో శిల్పకళావేదులున్నారు; ఎందరో సాహిత్యవేత్తలున్నారు - కాని ఈ ముగ్గురి నిగ్గు మూర్తీభవించినవారు అరుదు. డాక్టరు శోభిరాల సత్యనారాయణగారి ఈ సిద్ధాంతగ్రంథం వెలువడేదాకా లేరని ధైర్యంగా అనవచ్చునేమోగాని ఇంక ఇప్పుడు అనడానికి వీలులేదు. ఉన్నారనీ ఆ ఏకైకవ్యక్తి బ్రహ్మశ్రీ సత్యనారాయణగారనీ నిర్ద్వంద్వంగా ప్రకటించవచ్చును.

ఎంతటి విద్వాంసునకైనా నవ్యమైన, అనూహ్యమైన, అచుంబితాలైన అనేక విషయాలు ఈ రచనలో అడుగడుగున కనబడతాయి. ఒక్కముక్కలో చెప్పాలంటే ఈ అద్భుతరచన శిల్పకళా సర్వస్వం కనుకనే డా॥ శోభిరాలవారి చేతులలో శిల్పకళ హృదయాహ్లాది అవుతూనే దర్శన స్థాయిని అందిపుచ్చుకొంది.

నేను అర్ధశతాబ్దికిపైగా భాషాసాహిత్య క్షేత్రంలో మెలుగుతూ ఉన్నా, పరిశోధన ప్రపంచంలో మునిగితేలుతూ ఉన్నా డాక్టరు శోభిరాల సత్యనారాయణ గారెన్నుకొన్న విషయం మీద ఇంతకన్నమిన్న అనదగిన పరిశోధనగ్రంథం కనబడలేదు. పాండిత్యం, రచనాపాటవం, విషయ విశ్లేషణ, వస్తువివరణ - ఈ రచనకు కనిష్ఠికాధిష్ఠతను అలవోకగా సాధించిపెట్టాయి. ఈ రచనకు నేపథ్యంగా బ్రహ్మశ్రీ శోభిరాలవారి లోని కర్మిష్ఠుని కఠోరదీక్ష నిలిచిఉంది. ఈ గ్రంథనామంలో "ఆంధ్రమహాభారత"మని ఉన్నా, అవశ్యకమైన అన్నిచోట్ల వ్యాసభారతాన్ని కూడా పరిశోధనలోనికి పరిశీలనలోనికితెచ్చి డా॥ సత్య నారాయణగారు తమ రచనకు సమగ్రతను సంతరించుకొన్నారు. ఆ వేదాబ్జ భాస్కరుని, ఆ శమాదినిలయుని విశాల బుద్ధి ఈ రచనలో ప్రతిబింబిస్తూ కనబడడంవల్ల దీని గణ్యత ద్విగుణీకృతమైనది. శ్రీమదాంధ్రభారతాన్ని ఆధారంగా గ్రహించి బ్రహ్మశ్రీ శోభిరాలవారు తమ పాండిత్యవైభవాన్ని విషయ పరిజ్ఞానాన్ని ఈ సిద్ధాంత గ్రంథంలో ప్రదర్శించారు. పండితునకు, పామరునకు ఎవరికి తగిన స్థాయిలో వారికి - ఈ గ్రంథంలో అపూర్వ విషయాలను వివరించారు, గూఢార్థాలను వివరించడానికి ఆ జగజ్జనని పరాశక్తి అనుగ్రహం కావాలి. డా॥ సత్యనారాయణగారికి ఆ అనుగ్రహం పుష్కలంగా ఉంది అనాలి! లేకపోతే కావ్యరచనాపాటవంతోబాటు పరిశోధన పటిమ కూడా వీరికి అబ్బి ఉండదు! కేవల బుద్ధిగమ్యములైన విషయాలనుగూడా హృదయంగమంగా విపులీకరించే నేర్పు వచ్చిఉండదు! గహనములైన శాస్త్రవిషయాలను కమ నీయంగా వివరించేశక్తి అడుగడుగున ఈ సిద్ధాంతగ్రంథంలో దర్శనమిస్తుంది.

"సకృన్నత్వా నత్వాకథమివ సతాం సన్నిదధతే ।
మధుక్షీరద్రాక్షా మధురిమధురీణాః ఫణితయః ॥ "

ఈ రచయితకు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసాలు సంపూర్ణంగా ఉండడం వల్లనే సామాన్య పరిశోధకులు స్పృశించడానికే జంకే "శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము" అనే ప్రౌఢవిషయాన్ని పరిశోధనాంశంగా గ్రహించి కృతకృత్యులయ్యారు. "యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్ క్వచిత్"అని నిర్వచింపబడిన మహాభారతంలో సర్వే సర్వత్ర ప్రకటరూపంలోగాని గూఢ రూపంలోగాని నిహితమైఉన్న శిల్పకళాఖండాలను "హ్రీంకారాంగణదీపిక" సాయంతో మనకు చూపించారు ఇతర పరిశోధకులు సాహిత్య శిల్పవిశేషాలనే

మనకు చూపిస్తే, డా॥ శోభిరాలవారు ఇంకో మెట్టు పైకెక్కి పైవాటితోబాటు "నిజమైన" శిల్పవిశేషాలనుకూడా మనదృష్టికి తెచ్చారు. ఇందువల్ల ఈ విశిష్ట రచన మనకు ఉభయతారకమయింది! చతుర్విధ పురుషార్థాల సాధనలో శిల్పశాస్త్రపాత్ర సమున్నతమని నిరూపించారు. ఆ శాస్త్రపారంగతుల వైశిష్ట్యాన్ని స్థాపించారు.

ఈ ఉద్గ్రంథం ఇంతవరకు మూడుభాగాలు ముద్రితాలయ్యాయి, దీనిలోని ప్రధాన విషయాలను గురించి రచయిత ఈవిధంగా వ్రాశారు. "ఈ సిద్ధాంత వ్యాసము నందు వాస్తుశిల్పము, రథశిల్పము, యంత్రశిల్పము. యజ్ఞశిల్పము, రూపశిల్పము ననునవి ప్రధానాంశములు. తదితర శిల్పకళలను గురించి చర్చించుటకు "ప్రకీర్ణశిల్పము"లను నొక యధ్యాయమును చేర్చితిని". ఈ అనుమాకాక, "భారతకాలీన స్థపతుల స్థితిని దెలుపుట కొకధ్యాయమును, శిల్పాచార్యుల చరిత్రలను సంగ్రహముగా తెలుపుట కింకొకయధ్యాయమును" రచయిత చేర్చినారు. ఈ విధంగా ప్రత్యక్షంగా విషయానికి సంబంధించిన అధ్యాయాలు ఎనిమిది అయ్యాయి. వీటికి ఉపక్రమోప సంహారాలు కలుపగా అధ్యాయాల సంఖ్య పది అయింది. ఈ అధ్యాయాలకు రచయిత "ఉన్మేషములు" అని పేరు పెట్టారు. ఈ విభజన విషయానుకూలంగా శాస్త్రీయంగా ఉంది. పూర్వాపర సంబంధాన్ని చక్కగా నిరూపిస్తూ ఉంది. అపేక్షిత విషయాన్ని విడవడంగాని, అనపేక్షిత విషయాన్ని వివరించడంగాని ఈ రచనలో కనబడదు. ప్రణాళికాబద్ధంగా సాగింది.

ఆచార్య శోభిరాల సత్యనారాయణగారు తమ సిద్ధాంతగ్రంథరచన ప్రణాళికలో నాలుగు విషయాలకు విశేష ప్రాముఖ్యం ఇచ్చారు. ఆంధ్ర భారతంలో ఉన్న శిల్పకళా సంబంధాలైన అంశాలను వెలికితీసి వాటిని వ్యాసభారతంలో ఉన్నవాటిలో పోల్చిచూచి తులనాత్మకంగా పరిశీలించడం మొదటి విషయం. నన్నయాదులు చెప్పక విడిచిన అంశాలను వ్యాసభారతం నుండి గ్రహించి పరిశీలించడం రెండో విషయం. మన శ్రుతిస్మృతి పురాణేతి హాసాలలో మూలగ్రంథంలోని అంశాలు ఎక్కడైనా ఉన్నాయేమోనని పరిశీలించి ఉన్నవాటిని ప్రవర్శించడం మూడోది. వేదాలకు శ్రీసాయణ భాష్యమే పరమ ప్రమాణమని విశ్వసించి, ఇతర విద్వాంసుల. ఆచార్యుల, మహాపురుషుల అభిప్రాయాలను - అర్థ వివరణాది విషయాలలో - ఆదరించకపోవడం సనాతనాచారం, దీనికి భిన్నంగా శ్రీ దయానంద సరస్వతి (1824 - 1883), శ్రీ అరవిందయోగి (1827 - 1950) మొదలైన ఆధునిక మహానుభావులు వేద విజ్ఞానాన్ని వివరించినప్పుడు వెలికితీసిన శిల్ప సంబంధాలైన అర్థవిశేషాలను, అంశాలను కూడా ఆచార్య సత్యనారాయణగారు ప్రమాణబుద్ధితో స్వీకరించ డానికి వెనుకాడలేదు.

ఈ మహాపురుషుల విషయంలో క్రింది ఋఙ్మంత్రాలువర్తిస్తాయి :

"సక్తుమివ తితఉనా పునన్తో యత్ర ధీరా మనసా వాచ మక్రత।
అత్రా సఖాయః సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి॥"
—(ఋ. సం. X . 71-2)

"ఉత త్వః పశ్యన్నదదర్శ వాచముత త్వః శృణ్వన్న శృణోత్యేనామ్।
ఉతో త్వస్మై తన్వం విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః॥"
—(ఋ సం. X - 71-4)

వేదప్రామాణ్యాన్ని అంగీకరించడం విషయంలోగాని, అది అపౌరుషేయం అని విశ్వసించడం విషయంలోగాని వీరు ప్రాచీనులకు తీసిపోరు!

ఈ మ హా పు రు షు లు వేద మంత్రాలలో నిక్షిప్తమైఉన్న శిల్ప సంబంధాలైన గూఢార్థాలను - తమ పాండిత్య వైభవం చేతగాని, అనుభూతి విశేషం చేతగాని - దర్శించి ప్రదర్శించినప్పుడు - ఆ అర్థాదికం, ఆ సమన్వయ విధానం - శ్రీసాయణ భాష్యంలో లేకపోయినా లేదా తదనుయాయి కాక పోయినా నిస్సంకోచంగా ఆచార్య శోభిరాల సత్యనారాయణగారు వాటినిగూడా గుణవిశేషాన్నిబట్టి స్వీకరించారు. ఇలాగని శ్రీసాయణ భాష్యాన్నికాదన్నారని కాదు దానితోబాటు వేదమంత్రాలకు ఇతర విద్వాంసులు చెప్పిన అర్థాలను కూడా గ్రహించి మంత్రార్థాలను విస్తృతపరిచారు. ఇది సనాతనులకు ఆమోద యోగ్యం కాక పోవచ్చునేమోగాని దీనిలో అనౌచిత్యం ఏమీ ఉన్నట్లుకనబడదు. వేద వైశిష్ట్యాన్ని కించపరిచినట్లూకాదు! మన ఆర్షసంప్రదాయాలను అర్థం చేసుకొందామనే అభినివేశంతో వేదవిద్యలమీద పరిశోధనలు జరిపిన - గ్రిఫిత్, బ్లూంఫీల్డ్, మేగ్డనిల్, పీటర్‌సన్ మొదలైన పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయా లను కూడా యథోచితంగా ఉపయోగించుకొని తమ సిద్ధాంతగ్రంథానికి పరి పూర్ణతను సంతరించుకొని తమ పరిపక్వతను వ్యక్తం చెసుకొన్నారు డాక్టరు స త్య నా రా య ణ గా రి ప్రణాళికలోని ఈ నాలుగోవిషయం నిర్వివాదంగా విశిష్టమైనది.

సంస్కృతాంధ్ర భారతాలలోని శిల్పసంబంధి విషయాల తులనాత్మక పరిశీలన, తెలుగు భారతంలోలేని సంస్కృత భారతంలోఉన్న శిల్పాంశాల వివరణ, శ్రుతిస్మృత్యాదులలో మూలగ్రంథంలో ఉన్న అంశాల అస్తిత్వాన్ని పరిశీలించి ఉన్ననాటి ప్రదర్శన - అనే ప్రణాళికలోని మూడింటికంటెకూడా, ఆధునికులు - వారు ప్రాక్ప్రతీచీ దేశాలలో దేనికి చెందినవారైనా - చెప్పిన

అర్థాలను ఔచిత్య పురస్కృతంగా గ్రహించి ఆదరించడం అనే ఈ చతుర్థాంశం అయన విశాలదృష్టికి తార్కాణం. సర్వులకు ఆమోదయోగ్యం, ఉపాదేయం అని అనుకోవడంలో విప్రతిపత్తి ఉండరాదు గుణవిశేషం ఉన్నచోట్ల ఆయా అంశాలను పరిగ్రహించడంలో దోషం లేదు గదా! నిజానికి పరిగ్రహింపదగిన వాటిని పరిహరించడమే దోషమనిపించుకొంటుంది!

అనాది (అతి ప్రాచీనమైన) వేదకాలంతో పోల్చిచూస్తే శ్రీసాయణాచార్యులు (14వ శతాబ్ది) చాలా అర్వాచీనులుగదా! అయినా ఆయన మహా ప్రతిభులు, ఋషికల్పులు గనుక తమకు ముందున్న వ్యాఖ్యలను కూడా పరిశీలించి అనన్యసాధ్యమైన భాష్యం రచించారు. అప్పటికే మంత్రార్థ వివరణలలో అభిప్రాయభేధాలున్నట్లు పెద్దలవల్ల వింటున్నాము. నిరుక్తాదుల సాయం ఉన్నా; వేలకొలది సంవత్సరాలు గడవడంవల్ల, సాయపడే అవకాశమున్న శాఖలు కొన్ని లుప్తంకావడం వల్ల అర్థవివరణ కష్టసాధ్యమైనది. ఆధునికులకు - శ్రీసాయణాచార్యుల తరువాత, భారత ప్రపంచ వ్యాప్తంగా జరిగిన వేద పరిశోధనల సత్ఫలితాలు అందుబాటులో ఉండడంవల్ల - అర్థ వివరణలో నవ్యస్ఫూర్తి కలిగి ఉండవచ్చునని విశ్వసించడంలో ఏ అనుపపత్తి కనబడడంలేదు ఈసందర్భంలో మంత్రార్థాలను క్రొత్తగా చెప్పినవారు వేదాల మీద భక్తివిశ్వాసాలు పూర్ణంగాకలవారేననే విషయాన్ని మరిచిపోకూడదు!

ఈ సిద్ధాంతగ్రంథం ప్రథమ భాగంలో వాస్తుశిల్పవిషయాల పరిశీలన సాగింది. దీనిలో ప్రథమ ద్వితీయోన్మేషాలు ఉన్నాయి. ప్రథమోన్మేషంలో "సాహిత్యము - శిల్పము" అనే అంశం మొదలుకొని "పంచమవేద ప్రాశస్త్యము" అంశంవరకు ఇరవైయేడు అంశాలమీద వివరణఉంది. వీటిలో శిల్పప్రాశస్త్యము, వైదికావైదిక శిల్పములు, స్థాపత్య వేదోత్పత్తి, వాస్తుశిల్పము, తక్షణము - దారుశిల్పము, యంత్రశిల్పము, యజ్ఞశిల్పము, శిల్పిలక్షణము, మహాభారతము. శిల్పకళలు అనే అంశాలు ప్రత్యేకంగా పేర్కొదగినవి. "ద్వితీయోన్మేషంలో - వాస్తు శిల్పము", "దుర్గ శిల్పము", "గృహ శిల్పము", "గృహాలంకరణ శిల్పము" అనే ప్రత్యేక శీర్షికలక్రింద విషయ విభజనజరిగి అనేక విషయాల చర్చ జరిగింది. "వాస్తు శిల్పము" క్రింద ఆనాటి మహానగరాలైన "ఇంద్రప్రస్థ పురము, అమరావతి, అలకాపురి, ద్వారకాపురి, హస్తిపురము, అయోధ్యానగరం, మిథిలానగరము, వారణావతము, నాగలోకంలోని భోగవతి, మొదలైనవాటి వర్ణన, వాటిలోని శిల్పనైపుణ్యం సోదాహరణంగా వివరించడం జరిగింది." "దుర్గ శిల్పము" శీర్షిక క్రింద "దుర్గ రక్షణము - శిల్పులు" మొదలుకొని రాజవేశ్మలు : రమ్యహర్మ్యములు: భాండాగారములు : ఆయుధాగారములు; సభా భవనములు; ఇంద్ర, యమ, వరుణ, కుబేర, బ్రహ్మ, మయ సభల

నిర్మాణ వైశిష్ట్యాలను సోదాహరణంగా వర్ణించారు. ఇక్కడ ప్రత్యేకంగా పేర్కొదగినది "మయుని శిల్ప చమత్కారములు". దీనిలో "మయ మాయ" అనే శీర్షిక క్రింద మయుడు సభా భవనంలో చూపించిన చమత్కారాలన్నీ ఉదాహరణ పద్యాలతో శ్లోకాలతో సాహిత్యప్రియులకు ఆనందాన్ని కలిగించేలా డా॥ సత్యనారాయణగారు వివరించారు. మయ సభకు పోటీగా ధృతరాష్ట్రుడు నిర్మింపజేసిన వేయి స్తంభాల నూరు ద్వారాల మహాసభ వర్ణన సమయంలో "హస్తినాపురి" లోని ఈ సభా భవన నిర్మాణంలో ఆర్య ద్రావిడ శిల్ప సంప్రదాయాలనుసరింపబడిన వని రచయిత వివరించి తమ శిల్ప సంప్రదాయ విజ్ఞానాన్ని ప్రదర్శించారు. "గృహాలంకరణ శిల్పము" అనే ప్రత్యేక శీర్షిక క్రింద "మణికుట్టిమములు" మొదలుకొని "ఏకస్తంభ హర్మ్యము" వరకు వివిధాంశలను వివరించారు. దీనిలో - లాక్షా గృహ, క్రీడా గృహాల విశేషాలు, ప్రేక్షాగారము నర్తనశాల అను వాటి నిర్మాణ విశేషాలు పఠితల ముందుంచారు. వీటి తరువాత "సమీక్షణము"లో ఈ ప్రథమభాగంలో వివరించబడిన వివిధ శిల్పకళా విశేషాలను సింహావలోకనం చేస్తూ రచయిత మహాభారతకాలం నాటు స్థాపత్యకళ ఎలా సర్వతోముఖ వికాసాన్ని పొందిఉందో చెప్పారు.

ఈ ప్రథమ భాగంలో ఇచ్చిన "అనుబంధము" లలో మొహంజొదారో-హరప్పానగరాలకు సంబంధించిన వివరాలనిస్తూ ఆ నగరాల వైశిష్ట్యాన్ని డా॥ సత్యనారాయణగారు వివరించారు. సింధునాగరకత - హరప్పా సంస్కృతులను తెలియజేస్తూ ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసులు అభిప్రాయాలను విశేషంగా ఉద్ధరించి చూపించారు బృహత్ స్నానవాటికను గూర్చి ప్రత్యేకంగా వ్రాస్తూ దానిని నిర్మించిన శిల్పుల ప్రజ్ఞాపాటవాలను ప్రస్తుతించారు అక్కడ నివసించి ఉండి ఉంటారని భావించబడే ప్రజల ఆకార వేష భూషలను, ఆచారవ్యవహారాలను, మత సంప్రదాయాలను తెలియజేశారు.

ఈ అనుబంధంలోని రెండోశీర్షిక "గ్రామనగర రచనా విధానము : శిల్పశాస్త్రములు" అని విశ్వకర్మ వాస్తు శాస్త్రము నందు పేర్కొనబడిన గ్రామ నగర పట్టణ నామాలను తెలియజేశారు. ఇందులో, వివిధ శిల్పశాస్త్రాలనుండి గ్రహించిన విశేషాలను, మయ మతానుసారమైన "మానయోజనము" ను (లెక్కలను) ఇచ్చి విషయాన్ని పూర్తిగా అర్థం చేసుకోవడానికి సాయపడ్డారు. ఇందులో, "వాస్తు పూజ" శీర్షిక విశిష్టమైనది దీనివల్ల వాస్తుపూజాదికాన్ని గురించి తెలియడమేకాక, పఠితలకు వాస్తుపురుషుని వివిధాంగాలలో భావింపదగిన దేవతలను గురించి కూడా తెలుస్తుంది. దీనితోబాటు - వాస్తోష్పతి సూక్తము, అథర్వణవేదోక్తశాలా సూక్తము, శాలాసూక్త వినియోగము కూడా ప్రకటించి తమ గ్రంథానికి, డా॥ సత్యనారాయణగారు అనన్యసామాన్యమైన ప్రత్యేకతను సంతరించుకొన్నారు.

గ్రంథాంతంలో ఇచ్చిన "అవలోకిత గ్రంథ పట్టిక" (వివిధభాషలలో) డా॥ శోభిరాల సత్యనారాయణగారి పాండిత్య విస్తృతిని తెలియజాలి ఉంది.

ఆచార్య సత్యనారాయణగారి "శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము" ద్వితీయ భాగంలో యజ్ఞశిల్ప పూర్తశిల్పముల వివరణాత్మక పరిశీలన జరిగినది దీనిలో - తృతీయ చతుర్థోన్మేషాలు ఉన్నాయి. మహాభారత కాలంలో ప్రజలకు ఇష్టాపూర్తాల వల్ల సద్గతులు కలుగుతాయి అనే విశ్వాసం ఉండేది. మహారాజులు వారికి తగిన రాజసూయాశ్వమేధ యాగాలను చేసే వారు ఇందువలన యజ్ఞోపకరణాలను, యజ్ఞాయతనాలను నిర్మించవలసిన ఆవశ్యకం ఏర్పడి శిల్పబ్రహ్మలను గౌరవపూర్వకంగా రావించి వాటి నిర్మాణం చేయించి సత్కరించేవారని తెలుస్తోంది. ఇందులకు పైవాటి విషయంలో శాస్త్రాదికంలో మహావిద్వాంసులైనవారు, శిల్పకార్య ధూర్వహులు అయిన స్థపతులు అనేకులుండేవారని తెలుస్తోంది. ఈ విషయాలను ప్రత్యక్షంగా గ్రహించడానికి కృష్ణ శుక్ల యజుర్వేదాలను భాష్యంతో డాక్టరు సత్యనారాయణ గారు పరిశీలించినట్లు వారి రచన తెలియజేస్తోంది. ఇదేవిధంగా శతపథ బ్రాహ్మణాదులను కూడా రచయిత పరిశీలించారు. ఇందువల్లనే విద్వత్ప్రయుత ధర్మరాజు చేసిన అశ్వమేధయాగంలో స్థపతులు, ఇతర శిల్పులు చతుశ్చిత్యంగా గరుడాకృతిగా యజ్ఞవేదికను నిర్మించిన విధానాన్ని మన కన్నుల ఎదుట ఉంచగలిగారు. ఇదిగాక శిల్పప్రాధాన్యమున్న వాజపేయం, విశ్వజిద్యాగం, బృహస్పతి సవం మొదలైన వాటిని వివరించి తమ పాండిత్యాన్ని వెల్లడించారు. వాపీకూపతటాక దేవాయతనాదుల నిర్మాణం వల్ల పుణ్యలోకాలు సిద్ధిస్తాయని ప్రజలకు విశ్వాసం ఉండడం వల్ల మహాశిల్పుల చేత వాటిని నిర్మింపజేసేవారు. ఆయా వర్ణనల సందర్భంలో శిల్పబ్రహ్మల నైపుణ్యాదికాన్ని రచయిత చక్కగా వర్ణించారు మహాభారత కాలంలో మూర్తిపూజ ప్రాచుర్యాన్ని పొంది ఉండడం వల్ల విగ్రహాలను - మానవుల దేవతల మూర్తులను - విరివిగా చెక్కడం ఉండేదని శివాలయాల దేవ్యాలయాల నిర్మాణం సామాన్యమనీ వివరిస్తూ ఆయా సందర్భాలలో శిల్పులు చూపిన నేర్పరితనాన్ని డా॥ శోభిరాలవారు విశదీకరించారు. ప్రతిమాశిల్ప నిర్మాణం ఏవిధంగా వికాసదశలో ఉన్నదో సోదాహరణంగా వివరించారు. ఈ తృతీయోన్మేషంలో యజ్ఞశిల్ప చర్చావేదికపై భారతంలో వర్ణితాలైన వివిధ యజ్ఞాలను కూలంకషంగా పరిశీలించి చర్చించి వాటి కలరూపు మనకు చూపించారు. ఈ భాగంలోని శీర్షికలలో - అశ్వమేధాది వివిధ యజ్ఞాల, పుత్రకామేష్టి మొదలైన వాటి స్వరూప స్వభావాలను ప్రదర్శించడంతోబాటు పంచయజ్ఞాలను గురించి, షోడశసంస్కారాలను గూర్చి వాటిలో శిల్పుల పాత్రనుగురించివ్రాసి పఠితలకు అనేక విషయాలలో కనువిప్పు కలిగించారు. యజ్ఞయాగాది విషయాలతో పరిచయం అంతగాలేనివారికి

డాక్టరు సత్యనారాయణగారిచ్చిన వివరణలు "ఓహో"అనే భావాన్నికల్పించగా, విషయపరిజ్ఞానం ఉన్నవారిలో "ఆహా" పుట్టించేవిధంగా ఈ భాగరచన సాగింది. "యజ్ఞ శిల్పము - సమీక్ష" అనే శీర్షిక క్రింద యజ్ఞశాలా యజ్ఞవేదీ యజ్ఞ కుండాదుల నిర్మాణంలో స్థాపత్య వేదవేత్తలయిన స్థపతుల, శిల్పాచార్యుల పాత్రలను చక్కగా వివరించారు దారుమయ, హేమమయ యజ్ఞోపకరణాల నిర్మాణంలో ఆయా శిల్పిబ్రహ్మలుచేసే ఉపకరణాదుల వివరణ ఇచ్చారు. మరుత్తుని యజ్ఞంలోను, దుర్యోధనుని వైష్ణవయాగంలోను స్వర్ణకారులైన స్వర్ణ శిల్పులు వహించిన ప్రముఖపాత్రను విశదీకరించారు. అనుబంధంలో విశ్వకర్మ సూక్తాలను రెండింటిని ఇచ్చి వైశ్వకర్మణ మహిమాన్ని పూర్తిగా అర్థం చేసుకోవడానికి సాయపడ్డారు. వీటి తరువాత "శ్రీ విశ్వకర్మ భగవాన్" రమణీయ చిత్రపటాన్ని స్తోత్రాన్ని ప్రకటించి పఠితలకు మేలుచేశారు

ఈ గ్రంథంలో చతుర్థోన్మేషం పూర్తశిల్పానికి పూర్తిగా అంకితమైనది. దీనిలో - వాపీకూపతటాకాదుల, దేవాయతన చైత్యాల, స్థపతిస్థాపకుల, పరమాత్మ స్వరూప, ప్రతిమాశిల్పాది విషయాల వివరణతోబాటు - "ఇంద్రోత్సవము - ప్రతీకపూజ, అగ్నిపూజ, అగ్నిదేవుని రూపకల్పన, సూర్యోపాసన. బ్రహ్మపూజ - బ్రహ్మోత్సవము, బ్రహ్మ - విశ్వకర్మ మొదలైన అనేక విషయాలను చర్చించి వాటి ప్రాముఖ్యాన్ని తెలిపారు ఆనాటి సమాజంలో పశుపతిపూజ, మాతృదేవతారాధన ఎలా ఉండేదో వివరించారు. ఈచర్చలతోను, వర్ణనలతోను తృప్తిపడక పఠితలకు మన సంస్కృతివైశిష్ట్యాన్ని చూపించాలనే సద్బుద్ధితో - సుప్రసిద్ధ సూర్యక్షేత్రాలను (హర్షవల్లీ క్షేత్రంలో వేంచేసియున్న శ్రీ సూర్యనారాయణస్వామి విగ్రహ చిత్రపటంతోబాటు) దేవీ పూజాస్థానాలను వర్ణించారు. రుద్ర పూజాఫలాన్ని, విష్ణు పూజాఫలాన్ని వివరించారు ఇంతటితో తృప్తి పడక శివపూజావిధానాన్ని తెలియచేశారు. బ్రహ్మ - విశ్వకర్మ విగ్రహాలను గురించి, విష్ణు విగ్రహాలను గూర్చి, దేవీ విగ్రహాలను గూర్చి విశేషవివరణలు ఇచ్చారు. శ్రీదేవిని గురించిన విషయాలనన్నింటిని - ఇంచుమించుగా - ఒకచోట చేర్చి సామాన్యులకు విషయపరిజ్ఞానాన్ని. పండితులకు ఆహ్లాదాన్ని కలిగించారు చదువులతల్లి సరస్వతిని గూర్చి - ప్రసన్న సరస్వతి, సరస్వతీమూర్తి, సరస్వతీగీత - అనే మూడు శీర్షికలక్రింద ఆ వీణాపాణిని, ఆ "కవికుటుంబంపుపాలిటి దివిజ సురభి" ని మనకు సాక్షాత్కరింప జేశారు. దేవతాప్రతిమలను, అష్టవిధ ప్రతిమలను సోదాహరణంగా వివరించారు. ఇవన్నీ ఒక ఎత్తు - గణపతి వివరణ ఒక ఎత్తు. వైదిక పౌరాణిక వివరణతోబాటు ఆధునిక దృక్పథమైన గజాననమూర్తి వివరణ ఇస్తూ ఈ మూర్తి "ఆర్యానార్య (ఆర్య - ద్రావిడ) సంస్కృతీ సంగమమునకు నిదర్శనము" అని వ్రాశారు.

ఈ సందర్భంలోనే "భారతలేఖకుడు" ఎవరు ? అని ప్రశ్నించుకొని, ప్రాచీనకాలంలో లేఖకులు శిల్పులేగనుక "భారతలేఖకుఁడైన గణనాయకుఁడు శిల్పిగణనాయకుఁడై యుండవచ్చును" అని నిర్ణయించారు. వ్యాసభారత లేఖకుడు గణేశుడనే "వృత్తాంతము కల్పితమని విమర్శకుల యభిప్రాయము" అని కూడా ధైర్యంగా వ్రాశారు. ఈ సందర్భంలోనే వ్యాసభారతంలో (ఆదిపర్వం) "గజానన" యను మాటలేదు" అని వ్రాశారంటే ఎంతలోతుగా వ్యాసభారతాన్ని పరిశీలించారో తెలుస్తుంది "నన్నయకాలమునఁ గూడ లేఖకులు శిల్పాచార్యులే" అని వ్రాస్తూ "లేఖకోగుండాచార్యః" అని నందంపూడి శాసనలేఖకునిపేరును ఉదాహరించారు.

ఈవిధంగా పండితులకు కూడా తెలియని అనేక విషయాలుచెప్పి "విశ్వకర్మకులో త్పన్నులగు శిల్పిబ్రాహ్మణులే దేవతామూర్తులను నిర్మించి ప్రతిష్ఠింపఁ దగినవారు" అని తమ నిర్ణయాన్ని రచయిత తెలియచేశారు. ఇది సమంజసం అనడంలో నాకు సంశయం లేదు. కాని శిల్పనిర్మాణకుశలులు కాని శిల్ప ప్రతిష్ఠాదకులు ఉండడానికి అవకాశం ఉన్నది గనుక వారికి కూడా అవకాశం ఇయ్యడం సముచితమని నా అభిప్రాయం. ఇద్దరూ ఒక్కరే అయినప్పుడు సంశయానికే తావులేదు! కానప్పుడు, ఇతరులకు కూడా ఆ అవకాశాన్ని కల్పించడం న్యాయమని నాకుతోస్తోంది. వేదవిద్యలందు, భారతీయ నాగరకతా సంస్కృతులయందు ప్రమాణబుద్ధి, ఆదరాభిమానాలు ఉన్నవారందరు "ఒకటి" కావలసిన సమయం ఇది!

ఈ సిద్ధాంతగ్రంథంలో తృతీయభాగం రూప ప్రతిరూప రథయంత్ర ప్రకీర్ణాది శిల్పాల వివరణకు అంకితమైనది. దీనిలో - పంచమోన్మేష, షష్ఠోన్మేష, సప్తమోన్మేష, అష్టమోన్మేషాలు - ఉన్నాయి మిగిలిన భాగాలలో వలెనే దీనిలోను, ఆధారరహితాలయిన అభిప్రాయ వ్యక్తీకరణలు లేవు. ఉపపత్తులు లేని ఊహలుగాని, ఉదాహరణలు లేని ఉక్తులుగాని కానరావు, పరిశోధకుని సత్యసంధతకు మిగిలిన భాగాలు లాగే ఈ భాగం కూడా ఉత్తమోదాహరణం. పంచమోన్మేషంలో - "రూప ప్రతిరూప శిల్పములు", "రూపాలంకరణము - సువర్ణశిల్పము" అనేరెండు ఉపవిభాగాలున్నాయి. "రూపం రూపం ప్రతి రూపోబభూవ" అనే ఋగ్వేదోక్తితో ప్రారంభమైన ఈ ఉపవిభాగంలో - రూపకర్త - త్వష్ట, యక్ష - యక్షిణి శిల్పము, స్త్రీరూప లక్షణ సాదృశ్య సమీక్షణము మొదలైన శీర్షికలక్రింద రూప - ప్రతిరూపాలకు సంబంధించిన సమస్త విషయాలు సాధికారంగా వివరించడం జరిగింది ఈ ఉపవిభాగంలో ప్రత్యేకంగా పేర్కొఁదగిన విషయం - మృణ్మయ, దారుమయ, ఆయసీ ప్రతిమలకు

సంబంధించిన పాండిత్య స్ఫోరక వివరణ, యక్షిసదృశ రూపలావణ్యవతులను గూర్చి వ్రాస్తూ ఆచార్య సత్యనారాయణగారు - దివ్యాంగన గంగ, బంగారుబొమ్మ తపతి, ఉత్తమసౌందర్యోపేత సీత, దర్శనీయాంగి దమయంతి, అసదృశరూపలావణ్యవతి ద్రౌపది. సౌందర్యరాశి ఊర్వశి, త్రిలోకసుందరి తిలోత్తమల భాషారూప చిత్రాలను రచించి రసిక పఠితలముందుంచారు. ఆయా సౌందర్యరాశులను గూర్చి వ్రాసేటప్పుడు సంస్కృతాంధ్ర భారతాలలోని వర్ణనలను తులనాత్మకంగా పరిశీలించారు.వీటిలో "అసదృశ రూపలావణ్యవతి" అయిన ద్రౌపదిని - "సర్వానవద్యాంగి సైరంధ్రి"గా "అమరవర్ణిని కృష్ణ"గా వివరించిన భాగాలు అసదృశాలుగా ఉన్నాయి. ఆయాజ్ఞసేని వైశిష్ట్యాన్ని వ్యాస భారతంలోని వర్ణనతో - ఆంధ్రభారతంలోని భాగంతో - వివరించి, ఆమె "కౌరవ సంహారార్థము" అవతారమెత్తిన "సాక్షాత్తు దుర్గాదేవియే" అని స్థాపించడం పండితహృదయాహ్లాది! దీనిలో "యక్షపూజ" విశిష్టమైన అంశం. క్రీస్తుపూర్వం నాల్గవ శతాబ్దినాటికే ఇది ఉన్నదనీ, భారతీయ జానపదులలో "యక్షపూజ" అత్యంత ప్రాచీనకాలం నుండి ఉన్నదనీ దానికి తార్కాణం "మదురై" జిల్లాలో లభించిన యక్షశిలా విగ్రహాలే అని వ్రాసి ఆంధ్రభారతంలో ధర్మరాజునకెదుట సాక్షాత్కరించిన భయంకరాకారుని యక్షుని (అరణ్య పర్వంలో) ఉనికిని మనం ఊహించుకోవడానికి అవకాశం యిచ్చారు.

"రూపాలంకరణము - సువర్ణశిల్పము" అనే ఉపభాగంలో, భారతీయ నాగరకతా సంస్కృతులలో ఆభరణాలకున్న విశిష్టస్థానాన్ని వివరించారు. ఈ ఉపభాగంలోనే అథర్వణ వేదంలోని హిరణ్యసూక్తాన్ని ఇచ్చి వివరణాత్మకంగా దాని తాత్పర్యం తెలియజేయడం సర్వోపయోగి. ఆభరణాలు - ఐశ్వర్య ప్రదాలు, ఆనందహేతువులు గనుకనే - లోపాముద్రాది విశిష్టపుణ్యసతులు వాటిని కోరినట్లుగా ఉన్నవిషయాన్ని రచయిత తెలియజేశారు. కరభూషణాలు, కర్ణకుండలాలు వర్ణితాలైన భారత భాగాలను చూపిస్తూ వాటి నిర్మాణంలో ఆనాడు వాడిన "శంఖం" మొదలైన వస్తువులను గూర్చి వ్రాశారు. మణికుండలాలలో మహ మహిమాన్వితాలు ఉండేవని వ్రాస్తూ ఉదంకోపాఖ్యానాన్ని ఉదాహరించారు. హిరణ్యాభరణాలను ధరించేటప్పుడు హిరణ్యసూక్త (శుక్ల యజుర్వేదం) పఠనం ఆవశ్యక మని వ్రాస్తూ మహా విద్వాంసులైన బ్రహ్మశ్రీ వడ్డెపాటి నిరంజనశాస్త్రి (1877-1937) గారి "విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము" ను ఆధారంగా చూపించారు. చాలామంది ఆభరణప్రియులకు తెలియని అనేక విషయాలు ఈ సందర్భంలో వెల్లడించి, వారి విజ్ఞానాభివృద్ధికి తోడ్పడ్డారు. "హిరణ్యభూషణధారణము పురుషప్రకారము" అనె శీర్షిక క్రింద పురుషులు ధరించే ఆభరణాదులగూర్చి వ్రాస్తూ అనేక నూతన విషయాలను తెలియజేశారు. ఈ సందర్భంలో "హిరణ్యాగ్నుల సంబంధము"అనే శీర్షిక క్రింద వ్రాసిన

విశేషాంశాలు సర్వులు గ్రహింపవలసినవి కేశాద్యలంకరణ శిల్పాన్నిగురించి, ప్రసాధనాలంకృతులను గూర్చి వ్రాసిన భాగాలలో, దివ్యవస్త్రాలను గూర్చి వ్రాసిన భాగాలలో అనేక నూతనాంశాలను ఆవిష్కరించారు. వీటితో ముఖ్యంగా "చిత్రవస్త్రములు, కంబలాజినములు, వీరోచిత వస్త్రాలంకారము" పేర్కొన దగినవి నైపథ్య కర్మకౌశలంలో స్కాందపురాణంలోనుండి శ్లోకాలను ఉద్ధరించి చూపుతూ "రూప ప్రతిరూపములకేకాక రూపాలంకరణ సాధనములకు గూడ విశ్వకర్మయే కర్త" అని స్థాపించారు. ఈ సందర్భంలో శ్రీనాథుని శ్లోకాను వాదాలను కాశీఖండం నుండి ఇచ్చి సంస్కృతం తెలియనివారికి సాయపడినారు. ఉన్మేషాంతంలో "రూప ప్రతిరూప శిల్ప సమీక్షణము" చేస్తూ "శిల్పకళాకారు లెల్లను విశ్వకర్మ వంశీయులో వారివద్ద శిల్పకళల నభ్యసించినవారో యై యుందురనుట నిర్వివాదాంశము" అని వ్రాసముగించారు

ఈ భాగంలోని షష్ఠోన్మేషంలో - "రథశిల్పము, జలయానములు - నౌకా శిల్పము, విమాన శిల్పములు" అనే అంశాల వివరణ సాగింది. ఈ ఉన్మేషాన్ని, సప్తమోన్మేషాన్నికలిపి యుద్ధ తంత్రానికి సంబంధించిన ఉన్మేషాలుగా - స్థూలంగా - గ్రహించవచ్చును. షష్ఠోన్మేషంలో - 'రథశిల్పము' అనే ఉపవిభాగంలో - చతుర్విధ రథాలు, షడ్విధ రథాలు, సప్తవిధ రథాలు వర్ణితాలు. వీటితోబాటు మహాదేవుని, మహేంద్రుని, శ్రీకృష్ణుని, అర్జునుని, రాధేయుని, ధర్మజుని, బలిచక్రవర్తి రథాలను డా॥ సత్యనారాయణగారు విపులంగా వర్ణిస్తూ దేనికున్న వైశిష్ట్యాన్ని దానికి స్థాపిస్తూవచ్చారు. ఈరథాలన్నీ యానానికి సంబంధించినవే. కాని, దేని ప్రత్యేకత దానికి ఉంది. అయినా వీటికి చతుర్విధ రథాలలోని కొన్నింటితో పోలికేలేదు. ఈ నాల్గింటిలో నాలుగోదయిన "వాహమయ రథము" మాత్రమే యానానికి సంబంధించినది ఇది మనకందరికి తెలిసిన రథవిశేషం. మిగిలినవాటిలో - "ఛందోమయ రథము, దేవమయ రథము" అనేవి ఉన్నాయి. "సోఽబ్రవీత్ ప్రజాపతిః ఛందాగ్ంసి రథోమే భవతి" తాను ఛందోమయ రథారూఢుడనని చెప్పుకొన్నాడన్నమాట! "ఛందస్సులే నాకు రథమగుగాక" అని. ఇంక, దేవమయ రథమున్నది. "వైశ్యదేవోరథః" - వైశ్వదేవము రథము. సమస్తదేవతలు ఈ రథములో నిలుస్తారుగనుక, వైశ్య దేవం దేమమయ రథంగా భావించబడింది. ఇంక మూడోరథం - దేహమయ రథము. దేహాన్ని రథంతో పోల్చడం మనకు కొంతప రిచితమైన విషయం. ఇంక షడ్విధ రథాలున్నాయి. దేవ, మనుష్యభేదాలున్నా ఇవికూడా యానానికి సంబంధించినవే దేవరథాలు ఇంద్రాది దేవతలకు సంబంధించినవి. మిగిలిన పంచవిధ మనుష్యరథాలు - పుష్పరథ, సాంగ్రామికరథ, పారియాణికరథ, పరపురాభియాన, వైనయిక రథములు - పట్టాభిషేకాది సమయాలకు, యుద్ధాదులకు సంబంధించిన రథాలు. ఈ విభజన చూపడంతో తృప్తిపడక,

పండిత సత్యానారాయణగారు అయా రథ విశేషాలు మహాభారతంలో ఏయే సన్నివేశాలలో, ఘట్టాలలో ఉపయోగించారో వివరించారు. ఇది పరిశోధక పరమేశ్వయులకుగాని సాధ్యపడే విషయం కాదు ఇంక సప్తవిధ రథాల లోని రథాలు కొలతలనుబట్టి ఏర్పడినవి ఇవి కూడా యానానికి సంబంధించినవే!

డా॥ సత్యనారాయణగారి సిద్ధాంత గ్రంథంలోని విశేషం - అవశ్యకమైనప్పుడు ప్రకరణానుసారంగా వేద మంత్రాలను ఇయ్యడం. ఈ భాగంలోని "రథపూజ, రథోత్పాదన మంత్రములు" ఇలాంటివే "యమేనదత్తా" అనే కృష్ణ యజుర్వేదంలోని మంత్రాన్ని ఈ సందర్భంలో ఇచ్చారు ఇదిగాక రథ శిల్పానికి సంబంధించిన పారిభాషిక పదాలను - సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల భాషలలో ఇచ్చారు ఈ ఉప విభాగాంతంలో "కురుక్షేత్ర సంగ్రామము; రథసంఖ్య" అనే శీర్షిక క్రింద భారతీయసైన్య విభాగాన్ని పట్టిక రూపంలో ఇచ్చారు. అక్షౌహిణి సంఖ్యలో కూడా ఇచ్చి, *ఎ ఎల్. భాషమ్ (A. L. Basham - గొప్ప ఐతిహాసిక పరిశోధకుడు) దీనిని అతిశయోక్తి అన్నా, "ఇందులో దశాంశమో, శతాంశమోయయిన యుండియుండకుండునా?" అన్నారు. ఇది సత్య మన వచ్చును. డా॥ సత్యానారాయణగారు ప్రతి విషయాన్ని ఎంత సూక్ష్మంగా పరిశీలిస్తారో ఈ పట్టిక తెలుపుతుంది.

"జలయానములు : నౌకాశిల్పము" అనే ఉప విభాగంలో ప్రాచీన భారతీయులలో జలయానాది నిర్మాణ కుశలత ఎంతగా అభివృద్ధి పొందిందో ఋగ్వేద మంత్రాల ద్వారా రచయిత నిరూపించారు. ఈ మంత్రాలకు శ్రీ దయానంద సరస్వతి భాష్యాన్ని గ్రహించడంలోనే డా॥ శోభిరాలవారి విజ్ఞత ఉన్నది అధునికులైన శ్రీ దయానంద సరస్వతి, సనాతన భాష్యకారులకంటె ఇలాంటి విషయాల వివరణలో విశేషార్థులు అనడం సత్యదూరం కాదు ఇదే విధంగా "అశ్వి" శబ్దార్థ వివరణలోను, "యంత్రయుక్తమైన నావ" విషయ వివరణంలోను "వేదోంకా యథార్థ స్వరూప్" మొదలైన హిందీ గ్రంథాలలోని విశదీకరణలను గ్రహించి ఆ కాలం నాటి భారతీయుల వైశిష్ట్యాన్ని వెలికితీశారు. ఈ సందర్భంలోనే "నౌకా నిర్మాణము : హరప్పా శిల్పులు" అనే శీర్షిక క్రింద ఆనాటి శిల్పులు నిర్మించిన నౌకాశ్రయావశేషాలను గూర్చి వ్రాసి వారి నిర్మాణ కుశలతను ఆధునికులు ఎలా మెచ్చుకొంటున్నారో తెలియజేశారు.

---

* ఎ. ఎల్. బాషమ్ (A L Basham - చరిత్రాచార్యులు "The wonder that was India" అనే ఉద్గ్రంథాన్ని రచించారు. నేను బాగా ఎరుగుదును మేమిద్దరం కలిసి అమెరికాలోని "విస్కాన్ సిన్ విశ్వవిద్యాలయం"లో పనిచేశాము ఇప్పుడు కీర్తిశేషులు.

"విమాన శిల్పము" ఉపవిభాగంలో విమానాదులనుగూర్చి భరద్వాజ మహర్షి వాక్యాలను, నారాయణాచార్యుల వాక్యాలను ఎత్తిచూపించారు. వేద మంత్రాలలో విమాన విద్యా రహస్యాలు నిక్షిప్తమై ఉన్నాయని శ్రీ దయానంద సరస్వతి నిరూపించినట్లు తెలిపారు. ఈ భాగం రచించడానికి శ్రీ దయానంద సరస్వతి వ్రాసిన ఋగ్వేద భాష్యం రచయితకు చాలాతోడ్పడింది: విమానాలను గూర్చి వ్రాసిన ఈ భాగంలోనే - దేవవిమానాలు, వసురాజు విమానము, పుష్పక విమానము, దాని విశేషములు, నగరాకార విమానము; సౌభకము మొదలైన వాటిని గూర్చి కూడా వ్రాశారు. ఆంధ్ర భారత భాగవతాలనుండి ఎన్నో ఉదాహరణ పద్యాలనిచ్చి తమ వాక్యాలకు, డా॥ సత్యనారాయణగారు పుష్టి తెచ్చుకొన్నారు. "వెలుగు చూచిన విమానశాస్త్రములు" అనే శీర్షిక క్రింద - భారతీయులు, పాశ్చాత్యులు ప్రాచీన భారతీయ విమాన శాస్త్రాన్నిగురించి చెప్పిన అనేకాంశాలను వివరించి, విషయానికి ఆధునికతను సంతరించారు. "రథశిల్ప సమీక్షణము"ను ఔచిత్య పురస్కృతంగా రుద్రానువాకంలోని "నమస్తక్షభ్యో రథకారేభ్యశ్చవో నమః" అని ముగించారు.

షష్ఠోన్మేషంలో చెప్పకవిడిచిన "యంత్ర శిల్పము" సప్తమోన్మేషంలో చోటుచేసుకొంది ఈ ఉన్మేషంలో ప్రముఖంగా ఆయుధాలనుగురించి వివరించడము జరిగినా "కాలచక్రము, ద్వాదశారచక్రము, యంత్రచక్రము" మొదలైన వాటివివరణ, ధనుర్విద్య నేర్చుకొనేటప్పుడు ఇచ్చే శిక్షణకు సంబంధించిన "కృత్రిమంబయిన భాసము, లోహవరాహము. మత్స్యయంత్రము" మొదలైన వాటి వర్ణన కనబడతాయి. "రణయజ్ఞము; ఆయుధశిల్పము" అనే శీర్షిక క్రింద యుద్ధాన్ని యజ్ఞంతో పోల్చి తిక్కనాదులు చేసిన వర్ణనలు, వ్యాసుని వర్ణనలు వివరిస్తూ ఆయుధాల నన్నింటిని శిల్పులే సిద్ధంచేసిన వారని వివరించారు. "దేవాసుర సంగ్రామము, దేవతా ప్రముఖుల ప్రహరణములు, సుదర్శన చక్రము, స్కందశక్తి" మొదలైన వాటిని సంస్కృతాంధ్ర భారతాలసాయంతో వివరించారు. వీటిలో సుదర్శన చక్రాన్ని, స్కందశక్తిని విశ్వకర్మ నిర్మించినట్లు తెలిపారు. శస్త్రాస్త్ర శిల్పాన్ని వివరిస్తూ వాటి వైశిష్ట్యాన్ని తెలియజేశారు. "స్కందావారములు, శిల్పులు - శిబిరములు" అను వాటిని గురించి వ్రాస్తూ శిబిరాలలో శిల్పులు నిర్వహించే కార్యాలు, వారి వేతనాలు మొదలైన వివరాలను ఇంగ్లీషు పరిభాషతో కూడా పట్టిక రూపంలో చూపి మనకు ఆయా విషయాలు బోధపరిచారు. హలముఖాయుధాల విశేషాలను వర్ణనాత్మకంగా వివరించారు. తరువాత శక్త్యాయుధ వజ్రాయుధాలను వివరిస్తూ, శక్త్యాయుధాన్ని విశ్వేశ్వరుని కోసం విశ్వకర్మ "నియమనిష్ఠలతో నతిప్రయత్న పూర్వకముగా" నిర్మించినట్లును, వజ్రాయుధాన్ని దధీచి అస్థులనుండి త్వష్టప్రజాపతి నిర్మించినట్లును

మూలశ్లోకాలను, పద్యాలను యథోచితంగా ఉదాహరిస్తూ డా॥ సత్యనారాయణ గారు వివరించారు. ఇంక, విష్ణుమూర్తి గదయైన కౌమోదకిని విష్ణువు చేతులలో హతుడైన గదాసురుని అస్థులతో విశ్వకర్మ నిర్మించినట్లు తెలియజేశారు. భీముని గదను సంస్కృతాంధ్ర భారతాల ననుసరించి వర్ణించారు. "ఖడ్గోత్పత్తి ప్రభావములు" వివరించునప్పుడు బ్రహ్మకావించిన సృష్టిని వివరించారు. "శత చంద్రాసి చర్మములు" వివరించునప్పుడు వివిధ ఖేటకములను శిల్పులెట్లు నిర్మించెడివారో తెలియజేశారు. వర్మం అంటే కవచమని మనకు తెలుసును. కాని దానికి మర్మాలను అచ్ఛాదించేదని ఋగ్వేదంలో "మర్మాణి తే వర్మాణి ఛాదయామి" అనే ప్రయోగం ఉందని ఎందరికి తెలుసును? ఇది డాక్టరు శోభిరాలవారి పాండిత్యగరిమ! కవచధారణ విధినిగురించి, హిరణ్మయ శిర స్త్రాణాలనుగురించి వివరించారు. ధనుస్సుల దగ్గరికి వచ్చేటప్పటికి - "చిత్రవిచిత్ర చాపములు, గాండీవము, కర్ణుని విజయచాపము" అనే శీర్షికలక్రింద ధనుస్సులను గూర్చి మనం తెలుసుకోవలసినదంతా తెలియజెప్పారు. ఇంక బాణాల ప్రస్తావన వచ్చినప్పుడు - "కంకపత్రములు; కాంచన పుంఖములు, కనకలిప్త బాణములు, బహుప్రకార బాణములు, శబ్దభేది బాణములు" అనే వివిధశీర్షికల క్రింద విభజించి వాటి విశిష్టతలను వివరించారు. దివ్యాస్త్రములు; దివ్యబాణములు, త్వష్టృనామక దివ్యాస్త్రములు, పాశుపతాస్త్రము, ఆగ్నేయ వారుణాస్త్రములు, పర్జన్యాస్త్రము, ప్రస్వాపాస్త్రము; మోహనాస్త్రము, బ్రహ్మశిరోనామకాస్త్రము, బ్రహ్మాస్త్రము మొదలైన అస్త్రాలపేర్లలో కొన్నింటిని మనం విన్నాముగాని వాటి కలరూపు తెలియదు. విజ్ఞానసర్వస్వ మనదగిన "శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము"లో డా॥ సత్యనారాయణ గారు సమస్త వివరణలతో ఆయా అస్త్రాలను మనకు సాక్షాత్కరింప జేశారు "యంత్ర శిల్ప సమీక్ష"లో భారతకాలం నాటికే భారతీయుల సాంకేతిక శిల్ప విజ్ఞాన వికాసాలు ఎంతటి ఔన్నత్యాన్ని పొందాయో వివరిస్తూ తమ అభిప్రాయాలకు బలంగా, డి. ఎన్. శుక్ల మొదలైన పరిశోధక విద్వాంసులు వ్రాసిన గ్రంథాలనుండి ఆయా విషయభాగాలను ఉటంకించారు

"శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము" లోని మూడో భాగంలోని అష్టమోన్మేషంలో "పంచ శిల్పములు - ప్రకీర్ణ శిల్పములు" అనే శీర్షిక క్రింద విశ్వకర్మ పుత్రులుగా ప్రసిద్ధి పొందిన - మను, మయ, త్వష్ట, శిల్పి, దైవజ్ఞ (విశ్వజ్ఞ)లను వారు క్రమంగా "అయోదారు తామ్ర శిలా సువర్ణ శిల్పములను" ఏ విధంగా లోకంలో ప్రవర్తిల్ల జెశారో నేటికి తద్వంశీయులై ఆయా శిల్పాదులను ఎలా పరిరక్షిస్తూ వస్తున్నారో విశదీకరించారు. ఈ ప్రకరణంలో "తక్షణము, దారు శిల్పము, తామ్ర శిల్పము దంత శిల్పము, కల్పవృక్ష కామధేన్వాది నానావిధ శిల్పములు" చర్చింపబడ్డాయి. మానవుల మనుగడకు

అత్యంతావశ్యకాలైన సమస్తవస్తుజాతం శిల్పి నిర్మితం అనడంలో అతిశయోక్తి లేదని సర్వులకు తెలిసిన విషయమే. కాని, ఆయా వస్తుజాతాన్ని పంచభూతాల సాయంతో శిల్పులు ఏవిధంగా సృష్టించారో మనకు తెలియదు. ఆ సమస్త విషయాలను సోదాహరణంగా సాధికారంగా డా॥ సత్యనారాయణగారు ఈ ఉన్మేషంలో ఉద్ఘాటించారు. వ్యాసభారతంలో వీరిని "ధీరు"లని వ్యవహరించారు. "ఈ ధీరులు శిల్పులే - రథకారులైన ఋభువులు బ్రాహ్మణులు" అని వ్రాస్తూ దానికి ఆధారంగా "ధీరాసో హి ష్ఠా కవయోవిపశ్చిత స్తాన్వ ఏనా బ్రహ్మణో వేదయామసి" అనే ఋగ్వేద ఋక్కును (IV - 4 - 20) చూపించారు. "సువర్ణ శిల్పము" ప్రపంచంలో విస్తరింపజేసినవాడు విశ్వకర్మ పంచపుత్రులలో ఐదవ వాడైన దైవజ్ఞుడు అని వివరించారు. ఈయనను "విశ్వజ్ఞ" అనడం కూడా ఉంది. ఈ శీర్షిక క్రింద మణి ముద్రికలను గూర్చి వ్రాస్తూ "నవ రత్నాంగుళీయక రచనావిధానము"ను మనోహరంగా రమణీయంగా వివరించారు. వాస్తు జ్యోతిష విద్యా ప్రవీణులైన, "విశ్వజ్ఞ" బిరుద విభూషితులైన డా॥ శోభిరాల సత్యనారాయణగారు ఆయాగ్రహాల ఆనుకూల్యం కోసం నవరత్న ముద్రికల్ని ఏవిధంగా నిర్మించాలో పట్టిక (యంత్రం) ద్వారా ప్రత్యక్షంగా చూపించారు. ఈ సందర్భంలో మరాఠీ భాషలోని "గురు చరిత్ర"లో ఈ విషయం ఏవిధంగా ప్రస్తుతించబడిందో వివరించి వారి బహుగ్రంథ పరిశీలనా పటిమను వ్యక్తం చేసుకొన్నారు. ఇది ప్రకీర్ణ శిల్పానికి ప్రాముఖ్యమిచ్చిన భాగం కనుక దీనిలో - పూర్ణ కుంభములు, రుక్మ పాత్రలు, దంత శిల్పము, ఛత్ర చామరములు మొదలైన వాటి వివరణ చోటుచేసుకొన్నది. గాంధర్వ విద్యకు, నృత్య కళకు కూడా శిల్పుల అవశ్యకం ఎంతైనా ఉన్నది గనుక - ఆయా కళాకారులు తమ ప్రదర్శనలలో వినియోగించుకొనే వాద్యాది పరికరాలు, వీణాది తంత్రీయుక్త వాద్య యంత్రములు సృష్టించువారు వారే గనుక - శిల్పి బ్రహ్మల వైశిష్ట్యాన్ని ఋగ్వేదాదులనుండి ఆధారాలనిస్తూ వివరించారు. ఈ కళల కన్నింటికి - సర్వవిద్యలకు - మూలకారణమైన వాగ్దేవిని గూర్చి ఈ సందర్భంలోనే వివరించారు. ఇంతటితో తనివితీరక డా॥ సత్యనారాయణగారు - కల్పవృక్షాన్ని కామధేనువును కూడా గ్రహించి వివరించారు. కల్పవృక్షాన్ని గూర్చి వ్రాస్తూ "సకల సంకల్పములకు మూలము మనస్సే, సంకల్పబలమున కోరికలు సిద్ధించును. కావున కల్పవృక్షము మనస్సునకు ప్రతీక" అని శాస్త్రీయమైన సమన్వయం ఇచ్చారు. "నందినియా ? శిల్పకళానందినియా ?" అనే శీర్షిక క్రింద వ్రాస్తూ - "వసిష్ఠుని హోమధేనువు నందిని కశ్యప సంతానమనిచెప్పం బడినది కశ్యపుఁడు శిల్పాచార్యుఁడు, కావున నందినిని కశ్యపకృత కళా యంత్రమని చెప్పవచ్చును" అని వివరించారు. "ద్యూతకళ, అక్షక్రీడ, అష్ట శోభనములు, వివాహ మండప విశేషములు, స్వస్తికము" అనే విషయాలను

కూడా వివరించి మనలను విభ్రాంతులను చేశారు. "ప్రకీర్ణ శిల్ప సమీక్ష"ను "శిల్పము లేనిదే జీవితము లేదు, శిల్పములేని లోకములేదు. "శిల్పం వినా నహి త్రిషు లోకేషు విద్యతే" అని చెప్పి తమ సిద్ధాంత గ్రంథంలోని తృతీయ భాగాన్ని ఆచార్య డా॥ శోభిరాల సత్యనారాయణ గారు ముగించారు. కాని, మనమంతా చతుర్థ భాగమైన "శిల్ప భారతము - శిల్పాచార్యులు"ఎప్పుడు వెలువడుతుందా అని ఎదురు చూస్తున్నామని వారు గ్రహించాలి.

ముగింపులో ఒక్క మాట చెప్పవలసిఉంది. ఇంత ఉద్గ్రంథాన్ని మనకిచ్చినా - "దీనిలో ఇదిలేదు, అదిలేదు" అనేవారు; "ఇది ఇలా ఉండాలి అది అలా ఉండాలి" అనేవారు ఉంటే వారికి చెప్పవలసినది - "తృషితా జాహ్నవీ తీరే కూపం వాంఛంతి దుర్భగాః" అని.

ఇతి శివమ్.

19–9–1994
సికింద్రాబాదు

కొత్తపల్లి వీరభద్రరావు

—* *—
*

# A MONUMENTAL WORK

"Andhra Mahabharata Silpakala Darsanamu" of Dr. Sobhirala is a **Manumental work** which will last for a long time for edification of future generations of not only Shilpis – but also students of Indian Cultute. It treats not only the art of shilpa or architecture and sculpture of Andhra Mahabharata – but also the whole literature on silpa.

..... A neglected subject is resurrected by the author and he deserves all our praise.

H.No 568, 43rd Cross
Ist Main 8th Block,
Jayanagar,
Bangalore – 560 082

**Nebha Chandrasekharacharya**
Former Gourava Sabhapathi.
VISWABRAHMANA DHAMAPEETAM

Avadhani Sekhara
**Dr. Bethavolu Ramabrahmam**
M. A., Ph. D.
Reader, School of Literature,
Telugu University.

Rajahmundry Campus,
BOMMURU

Dt. 12 9-94

# ఆశ్చర్యజనకమైన కృషి

## అభివాదయే

"శ్రీ మదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము" అనే పిహెచ్. డి. సిద్ధాంతగ్రంథంలో ఇది తృతీయ భాగం. పండితకవి శ్రీ శోభిరాల సత్యనారాయణ గారి అమోఘకృషికి ఈ దర్శనం ఒక నిదర్శనం. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారు ఈ కృషికి మెచ్చి శ్రీ సత్యనారాయణగారికి డాక్టరేట్ పట్టా ఇవ్వడంతోపాటు ఈ సిద్ధాంతనిబంధనకు బంగారు పతకం బహూకరించారు.

దీనిలో ప్రథమ భాగాన్ని 1987 జూన్‌లోనూ, ద్వితీయ భాగాన్ని 1990 జూన్‌లో ప్రచురించి ఆంధ్ర పాఠకలోకానికి అందించిన రచయిత ఇప్పుడు తృతీయ భాగాన్ని 1994 జూన్‌లో అందిస్తున్నారు. గ్రంథ రచన ఒక మహాయజ్ఞమైతే ప్రచురణ మరో యజ్ఞం. మొత్తం గ్రంథాన్ని ముద్రించి అందించడానికి సప్తవర్ష ప్రణాళిక అవసరమైంది. ఇటీవల వస్తున్న సిద్ధాంత గ్రంథాలతో పోలిస్తే, వాసిలోనూ రాశిలోనూ కూడా ఇది బృహద్ గ్రంథం.

వాస్తు శిల్పం, యాన శిల్పం, యంత్ర శిల్పం, యజ్ఞ శిల్పం, పూర్త శిల్పం, రూప ప్రతిరూప శిల్పం, యుద్ధ శిల్పం ఇత్యాదిగా భారతీయుల శిల్పకళా కౌశలం బహువిధాల విస్తరిల్లింది. మహాకావ్య నిర్మాణంలో కథా సన్నివేశాలనుబట్టి అన్నిరకాల శిల్పాలూ అవసరమవుతూ ఉంటాయి. కవి

ఆ రంగంలో కృషిచేసీ లోకాన్నిచూసీ యథావసరంగా వీటి ప్రస్తావన చేస్తూ ఉంటాడు. పైగా మన పురాణేతిహాసాలు విజ్ఞాన సర్వస్వాలాయె. అందుచేత దేని విషయం వచ్చినప్పుడు దాని లోతుల్ని అందించడం మనవారి సంప్రదాయం. ఒక్కొక్కసారి శాస్త్రగ్రంథాలు కాలగర్భంలో కలిసిపోయినా ఆ రంగంలో మన ప్రాచీనుల కృషిని ఈ ప్రస్తావనలు తెలియజెబుతూ ఉంటాయి. వీటిని పరిశోధించి ఒక చోటికి చేరిస్తే ఆయా వైజ్ఞానిక రంగాలలో భారతీయులు ఎంతటి అభివృద్ధిని సాధించారో అవగాహనకు వస్తుంది. వర్తమానంలో జరుగుతున్న కృషికీ, భవిష్యత్తులో జరగబోయే కృషికీ ఇది భూమికగా నిలుస్తుంది. కొత్త దారులను చూపిస్తుంది. అయితే విజ్ఞానశాస్త్రమూ, సాహిత్యమూ పూర్తిగా విడాకులు పుచ్చేసుకున్న నేటికాలంలో ఇది అత్యాశయే అయినా మన ప్రాచీనుల ఘనతను తెలుసుకొని కనీసం సాహిత్యపరులయినా కొంచెం సేపు దర్పంగా రొమ్ము విరుచుకోడానికి ఇది పనికి వస్తుంది.

శీర్షిక ఆంధ్ర మహాభారతానికే సీమితమైనా శ్రీ సత్యనారాయణగారు వ్యాసభారతాన్నికూడా దుళ్ళగొట్టారు. అవసరమైనచోట వాల్మీకాన్ని అందుకున్నారు. వేదవేదాంగాలనూ వాటిపై వచ్చిన వ్యాఖ్యలనూ సద్వినియోగం చేసుకున్నారు. సంబంధితాంశాలపై ఇతరత్ర జరిగిన పరిశోధనల ఫలితాలను సంయమనంతో ఒజ్జబంతిగా ఉపయోగించుకున్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే మహాభారతంలో ప్రస్తావనకు వచ్చిన సర్వ శిల్పకళా విషయాలనూ సాధారంగా సాధికారికంగా క్రోడీకరించి ఒక చోటికి చేర్చారు. ఇది అశ్చర్యజనకమైన కృషి.

ఈ తృతీయ భాగంలో రూప ప్రతిరూప-రథ-యంత్ర-ప్రకీర్ణాది శిల్ప విశేషాలు చోటుచేసుకున్నాయి. యంత్రశక్తితో కదిలే నౌకలూ జలాంతర్గాములూ విమానాలూ కేవలం కవులు చేసిన ఊహాలు కావనీ శాస్త్రీయమైన ఆధారాలు ఉన్నాయని వీరు చూపించారు. సూర్యకిరణాలలో ఏడు రంగులు (విబ్జియోర్) ఉన్నాయనే ఆధునిక విజ్ఞాన విషయాన్ని "సప్తాశ్వ రథ సమారూఢమ్" అనే వర్ణనతో సమర్థిస్తే అది హరికథ అనుకోవచ్చు. అలాకాదే, కాశ్యపకిరణాలూ (కాస్మిక్ రేస్) పింజలి దర్పణాలూ (రాడార్ లాంటివి) అసత్యాలనీ ఎవ్వరూ కొట్టిపారెయ్యలేరు మీటనొక్కితే కదిలే విమానాలు అభూత కల్పన కానేరవు. ఆ సుధ నిర్మాణ శిల్పమూ అపురూపమైనదే.

సహేతుకంగా వీరు క్రోడీకరించిన ఈ విజ్ఞాన విశేషాలను తెలుసుకున్న మీదట - అంతటి మహానాగరికత ఏమైపోయింది? ఎలా నాశనమైపోయింది? అనే ప్రశ్నలు ఉదయించి కొండంత దిగులు ముంచుకువస్తుంది. మెట్ట వేదాంతంతో అన్నింటా నీరసపడిపోయిన మనమా ఆ జాతికి వారసులం అనిపిస్తుంది. విస్తృతపరధిలో కాలచక్రగమనాన్ని పరికిస్తే, "కాలో హి సర్వస్య భక్షకః" అనే సూక్తిని నెమరువేసుకుంటే, బహుశ ఇప్పుడు వైజ్ఞానికంగా పురోగమిస్తున్న దేశాలూ, జాతులూ కూడా భవిష్యత్తులో మనలాగే అయిపోతాయేమో! వేదాంతధోరణి లేదు కాబట్టి మనకన్నా నాశనమైపోతాయేమో! అని కూడా అనిపిస్తుంది. ఏమో రేపటి గురించి ఎవరు ఏమి చెబుతారు!-

ఒకటిమాత్రం నిజం - ఇది ఈ రంగంలో జరిగిన ప్రాథమిక కృషి, మౌలిక కృషి ఈ భిత్తికమీద నిలబడి ఒక్కొక్క ఉన్మేషంమీదా ప్రత్యేక కృషి జరగాలి. ఇతర పురాణాలలో, కావ్యాలలో, శాస్త్రగ్రంథాలలో సంబంధిత శిల్ప విజ్ఞాన విశేషాలు ఏమేమి ఉన్నాయో, కాలక్రమాన మార్పులు ఎలా ఎలా వచ్చాయో, ఏ ఏ జాతుల మేధాశక్తి ఎలా సంకలితమయ్యిందో, చారిత్రిక సాంస్కృతిక నాగరకతా వికాసం ఎలా జరిగిందో నిర్ధారించే పరిశోధనలు జరగాలి. దానికి డా॥ శోభిరాల సత్యనారాయణ గారి ఈ కృషి మూలధనం. ఇంత విలువైన మూలధనాన్ని శ్రమకోర్చి సమకూర్చిన మాన్యులు శ్రీ సత్యనారాయణగారిని అభినందించడం కాదు వర్తమాన - భవిష్యత్తరాల పరిశోధకుల పక్షాన జిజ్ఞాసువుల పక్షాన కృతజ్ఞతలు చెబుతూ సవినయంగా అభివందిస్తున్నాను.

భవదీయుడు

బేతవోలు రామబ్రహ్మం

"A Research work Par-excellence"

**Dr. V. KESARI HANUMAN**
M.A. (Phil). M.Ed., Ph.D.
Principal, Gandhian School
President, Indian Educational and Cultural Academy
Director,
Chinmaya Spiritual Science Academy

Phone : Office & Res: 800943
7-1-954, Shanker Veedhi
SECUNDERABAD
500 003
A.P., INDIA
Date 25th Sep. '94

# A MESSAGE

*My Dear Dr. Sobhirala Satyanarayana Garu,*

Hari Om : Salutations.

I was very much impressed by your illuminating lecture given on the 19th Sep '94 at the Annual function of Vishvabramana Dharma Peetam on the subject of "Silpa Kala Darshnam" your excellent research work. I have gone through the book 'Srimadandhra Mahabharata Silpa Kala Darshanam' vol III which was presented to me after its release by Prof : Pervaram Jagannadham, the Vice-Chancellor of Telugu University.

Indeed it's an amazing and glorious research work done by you in the field of sculptural art and science relating to ancient India. Your research work reveals how great were our Indian artisans who perpectuated the art their sculpture for all times to come.

I wish the government and private institutions connected with the promotion of ancient Indian sculptural science should recommend these books in the concerned schools, colleges and libraries as text books and reference books as they are very extra-ordinary works.

May God give you a long, healthy and prosperous life for the service of mankind I wish I get a chance to meet you again for interaction on the subject of your research works.

Hari Om :

Yours sincerely,
(Sd.) **Dr. V. Kesari Hanuman**

# శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము

## తృతీయ భాగము

## అనుక్రమణిక

పంచమోన్మేషము

షష్ఠోన్మేషము

సప్తమోన్మేషము

## అష్టమోన్మేషము



# శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము

## పంచమోన్మేషము

## రూప ప్రతిరూప శిల్పములు

రూపం రూపం ప్రతిరూపో బభూవ
తదస్య రూపం ప్రతిచక్షణాయ
ఇంద్రో మాయాభిః పురు రూప ఈయతే
యుక్తా హ్యస్య హరయః శతాదశ॥

—ఋగ్వేద 6-47-18

రూపము లన్నిటికి మూలరూపము - ప్రతిరూపము - పరమేశ్వరుఁడే ఎల్లయెడల వానిరూపమే కాంచనగును.

ఇంద్రుఁడు తన మాయచేత నానావిధరూపములను ధరించి సంచరించుచున్నాఁడు. ఆయన హరులు (గుఱ్ఱములు) తన రథమునకు వేయి మారులు జోడింపఁబడినవి. అనఁగా ఆయన చాతుర్యము బహుధా వ్యక్తమగుచున్నది.

ఇట ఇంద్రుఁడన సృష్టికర్తయే. —ఇంద్రో వై త్వష్టా. [1]

ఇంద్రుఁడు శిల్పాధిపతి యగు త్వష్టృదేవుని వంటి వాఁడు. కావున శిల్పీంద్రుఁడు భావనాలోకమున విహరించుచు తన శిల్పకళా చాతుర్యముచేత ననేక రూప ప్రతిరూపములను సృష్టించుచున్నాఁడనియుఁ జెప్పవచ్చును. ఇది లౌకికార్థము.

---

1. ఐతరేయ బ్రాహ్మణము. 6.10

విశ్వా రూపాణి ప్రతిముంచతే కవిః —(ఋ 5-81-2)*
అను మంత్రము కూడ నీ యర్థమునే స్ఫురింపఁజేయుచున్నది.

కవి యనఁగా సృష్టికర్త; శిల్పి.

సృష్టికర్త నానారూపములు వెలువరించుచున్నాఁడు. రూపకర్త యగు శిల్పి నానావిధరూప ప్రతిరూపములు నిర్మించుచున్నాఁడు.

రూప[1] మనఁగా ఆకృతి. Form, Figure, appearance.

ప్రతిరూప[2] మనఁగా ఒకానొక ఆకృతికి ప్రతికృతి; ప్రతిమ; సమాన రూపము గలది. Picthre, an inage, a Likeness.

రూప మన సౌందర్యము.

రూపం... సౌందర్యే స్వభావే చ. —[వైజయంతి]

ఋగ్వేదము నందు రూప శబ్దమునకు పర్యాయ పదముగా శిల్ప శబ్దము ఉపయోగింపఁబడినది-

దేవీ దివో దుహితరా సుశిల్పే
ఉషా సా నక్తా సదతాం ని యోనౌ॥ —ఋగ్వేద. 0-70-6

[సుందర రూపములు గల ఆకాశపుత్రికలు - ఉషానిశలు - యథా స్థానములం దుందురు గాక]**

సుశిల్పే సుందరరూపే - అని సాయణుఁడు.

కావున రూపము = సౌందర్యము = శిల్పము.

రూపమేవ తచ్ఛిల్పమ్.

---

* 'యో విశ్వస్య ప్రతిమానం బభూవ' —ఋ. 2-12-9

1. రూపము = ఆకారము సౌందర్యము, శుక్లపీతాది వర్ణము, సహజస్థితి, చక్షురింద్రియ గోచరము, ప్రతిబింబము. [శబ్దార్థచంద్రిక]

2, ప్రతిచ్ఛాయా ప్రతికృతిః ప్రతిమా ప్రతియాతనా
ప్రతిచ్ఛందః ప్రతినిధి ర్వేరం చ ప్రతిరూపకమ్. —వైజయంతి

** 1. "Let the two divine daughters of heaven formed beautifully, Dawn and Night, sit their native seats." — Sri Aurobindo.

. 'Skilful Godessen' — Griffith.

మఱియొక మంత్రమున శిల్పశబ్దమునకు కళాకౌశలమను నర్థము చెప్పఁబడినది.

సుశిల్పే బృహతీ మహీ పవమానో వృషణ్వతి
నక్తోషాసా దర్శితే॥ —ఋగ్వేద 9-5-6

[రాత్రియు, ఉషఃకాలమును పరమాత్మ నుపాసించుటకు తగిన కాలములు. సుందరకళాకౌశలాది విద్యానుసంధానమునకు తగిన సమయములు]*

ఒక రూపమునకు సమానాకృతిని-ప్రతిరూపమును-నిర్మించుట శిల్పము. ఆ ప్రతికృతిని మనోహరముగా నిర్మించుట కళ.

శిల్ప సౌందర్యముల పరమప్రయోజన మానందము. కావుననే విశ్వము నందలి వస్తువులన్నియు నందముగా నుండవలె నని వేదర్షులు భావించినారు.

విశ్వా వామాని ధీమహి॥ —ఋగ్వేద 5-82-6**

శిల్ప సుందరమైన వస్తువు ఒకానొక చమత్కారవిశేషముచే హృదయ స్పందనము కలిగించి ఆనందదాయక మగును. ఆనందానుభూతి వలన రససిద్ధి కలుగును. అది వ్యక్తిగత సంస్కారమును బట్టియుండును.

భౌతిక పదార్థముల ద్వారమున సౌందర్య సాధనచేయుటయే శిల్పకళల ప్రధానాశయము.[1]

ప్రతిమాశిల్పమునకు మూలము రూపశిల్పము.

సమస్త రూపములకు శిల్పములకు అధిపతి త్వష్టృదేవుఁడని వేదము లుద్ఘోషించుచున్నవి.

---

* సుశిల్పే - సుందర్ సుందర్ కళాకౌశలాది హిద్యాఓం కే
అనుసంధాన్ కర్నే యోగ్య హై —దయానంద

** "May we obtain all things beautiful"
— Here the power of goodness is contemplated to lead to the power of beauty.
— A. C. Bose : The call the Vedas. p-170

1. "Art is primary concerned with the cultivation of beauty through physical medium".
— V. S. Agarwala : Studies in Indian Art. p-9

# రూపకర్త త్వష్ట

త్వష్టా రూపాణి హి ప్రభుః॥ —ఋగ్వేద 1-188-9*

త్వష్టయన దేవశిల్పి విశ్వకర్మ; అశేషశిల్పకల్పనాచార్యుఁడు ఇట త్వష్ట యన సకలజగములు నిర్మించువాఁడని దయానంద సరస్వతి తెలిపినాఁడు.[1]

త్వష్టా రూపాణా మధిపతిః॥

అని కృష్ణయజుర్వేదమును [3-4-5 1]

త్వష్టాధిరాజో రూపాణామ్॥

అని మహాభారతమును [ఆశ్వమేధిక-43-9]

త్వష్టకు రూపశిల్పములపై గల యాధిపత్యమును చాటి చెప్పుచున్నవి.

మహాభారతటీకాకారుఁడు త్వష్ట యన ప్రకాశింపఁ జేయువాఁడు - సూర్యుఁడని యర్థము చెప్పినాడు.

కాని త్వష్ట మాతృ గర్భమునందలి శిశువునకు కరచరణాద్యవయవ యుక్తమగు రూపమును గల్పించు రూపకర్త యని ఋగ్వేదమే చెప్పుచున్నది.

విష్ణుర్యోనిం కల్పయతు త్వష్టా రూపాణి పింశతు॥

—ఋగ్వేద 10-184-1**

పింశ్ - [పింశతి-తే] ధాతువునకు రూపొందించు - అని అర్థము.
to shape, fashion, form

---

* Tvastar the Lord hath made all forms.
— Griffith : The Hymns of Rigveda.

Tvastar : The artificer of Gods, the divine artisan the most skilful worker, versed in all wonderful and admirable contrivances — Griffith

1. "త్వష్టా = సబ్ జగత్‌కీ నిర్మాణ్ కర్నేవాలా" —దయానంద

** "May Vishnu form and mould the womb,
May Tvastar duly shape the forms".
— Griffith : The Hymns of the Rigvede II. p-614

పోల్చు :- అధర్వవేద 5-25-5

త్వష్టా - విశ్వకర్మా ఈశ్వర్ - క్షేమంకర్‌దాస్ త్రివేది
- రూప్ రచ్‌నేవాలా - శ్రీరామశర్మా ఆచార్య
- త్వష్ట బ్రహ్మ - విద్వాన్ విశ్వం

త్వష్టయే రూపనిర్మాణకర్త యని మఱియొక వేదమంత్రము వక్కాణించు చున్నది.

అయం యథా న ఆభువ స్త్వష్టా రూపేణ తక్ష్యా
అస్య క్రత్వా యశస్వతః ॥ ఋగ్వేద. 8-102-8*

త్వష్ట యన దేవశిల్పి యనియే పండితుల అభిప్రాయము.

కాని, త్వక్ష్ణోతి తనూకరోతీతి త్వష్టా యను వ్యుత్పత్త్యర్థమును గ్రహించి దయానంద సరస్వతి యీ మంత్రార్థము నిట్లు వివరించినారు.

[నేర్పరి యైన దారుశిల్పి దార్వాది ఘనపదార్థములను చెక్కి వివేకముతో వివిధరూపములు నిర్మించునట్లు జ్ఞానపూర్ణుఁడైన పరమేశ్వరుఁడు మనకు వివిధాకృతుల నొసఁగుచున్నాఁడు. చిత్రవిచిత్రములైన ఆ జగత్ప్రభువు కృతు లన్నియు సార్థకములు.] 1

త్వష్ట దేవశిల్పి యైనను మానవశిల్పి యైనను సామాన్య దారుశిల్పి యైనను రూపనిష్పాదనకర్త గానే ప్రసిద్ధుఁడు. అతఁడే ఆద్యశిల్పకళాకారుఁడు. శిల్పకళాకారుల కాదర్శప్రాయుఁడు.

---

* Cf :- The Hymns of the Rigveda — Griffith
"That through this famed one's power, he may stand by us,
Even as Tvastar comes unto the forms that may be shaped."
R. V. 8. 81-8
Tvastar : The Divine Artificer.

1. చూడు :- దయానంద సరస్వతి : ఋగ్వేద భాషాభాష్యము. పు. 255
త్వష్టా = కాష్ఠకార్; తక్ష్యా = ఘడానే యా రచనేయోగ్య
భావార్థ :- జైసే కి ఏక్ బఢయీ వివేకపూర్ణ రీతిసే అప్‌నీ రచనా కర్తా హై
ఐసే హీ పరమాత్మాకీ సృష్టికే సభీ అంగ్ ఉస్‌కే వివేక్ కే పరిచాయక్ హై
వే సభీ సప్రియోజక్ హై॥
త్వక్ష్ - (త్వక్షతి, త్వష్ట) To Pare, hew, Peel
త్వష్టృ - m. I. a. earpenter, builder, workman
2. Visvakarman, the architect of the Gods
తక్ష్ - To fashion, Shape, form
—V. S. Apte. S.E.D.

# యక్ష - యక్షి [యక్షిణి] శిల్పము

అద్వితీయ సౌందర్యమూర్తి యగు స్త్రీ కనిపించినపుడు అట్టి యందగత్తె లీ లోకమునందు కానిపించుట లేదు. కావున నామె మానవేతరజాతి స్త్రీయై యుండు నని భావించుట మానవనైజముగా నున్నది.

మానవేతర జాతులలో యక్షజాతి యొకటి.

విద్యాధరోఽప్సరో యక్షరక్షో గంధర్వ కిన్నరాః
పిశాచో గుహ్యక స్సిద్ధో భూతో అమీ దేవయోనయః॥ —అమరము

విద్యాధరాది దశవిధజాతులు దేవయోనులు. అనగా దేవతలకుఁ బుట్టినవారు. వీరిలో యక్షులు కుబేరానుచరులు.

యక్ష స్త్రీలు పరమ సౌందర్యవతులను భావము ప్రాచీనకాలము నుండియు నున్నది.

కావుననే భారతీయశిల్పులు తమశిల్పములందు యక్ష కాంతలకు స్థానము గల్పించినారు.

శ్రీదేవి సౌందర్యరసాధిదేవత - జగన్మాతగా భావింపఁబడినది. శ్రీదేవి ప్రతిరూపమే సిరిమాయక్షి. శ్రీయక్షి.

అందగత్తెలమ చంద్రముఖి యనుట కవిలోక సామాన్య విషయము. యక్షి గా భావింపఁబడిన చంద్రరూపమే చదాయక్షి. [చంద్రా యక్షి].

చూడ నింపైన రూపము గల యక్షియే సుదశనా యక్షి. [సుదర్శనయక్షి][1]

సాంచి, భారహుత్, మధుర, అమరావతి మున్నగు శిల్పకళాక్షేత్రములలో లభ్యమైన యక్షి విగ్రహములు యక్షజాతి స్త్రీలు సౌందర్యనిధానములను సాహిత్య సంప్రదాయమును జ్ఞప్తి కెలయించుచున్నవి.[2]

మహాభారతకావ్యకర్తలు రూపలావణ్యవతులయిన నారీమణుల నెందఱనో యక్షకాంతలతో పోల్చినారు. వారిలో కొందఱనైన దర్శింతము.

---

1. Cf :- V S. Agrawala : Studies in Indian Art. p. 19
"Sudarsaua Yakshi I.e. the Yakshi of the beautiful from Members of the strong literacy traditions believe that Yakshis were considered to be paragons of beauty.

2. Ibid. p.87

## యక్షి సదృశ రూపలావణ్యవతులు
## దివ్యాంగన గంగ

దివ్యరూపా హి సా దేవీ గంగా త్రిపథగామినీ
మానుషం విగ్రహం కృత్వా శ్రీమంతం వరవర్ణినీ॥

శంతనుఁ డొక్కనాఁడు గంగా పులినతలంబున

**తరళాయతలోచన నత్యురుకుచఁ దేజోభిరామ**
**నుత్తమ దివ్యాంబరమాల్యమణిమయాలంకరణోజ్జ్వల వేష**
**నొక్క కన్యకఁ గనియన్.** —[**నన్నయ్య ఆది. 4-144**]

మూలమువం దామె సౌందర్య మిట్లు వర్ణింపఁబడినది.

**జాజ్వలమానాం వపుషీం సాక్షచ్ఛ్రియ మివాపరామ్**
**సర్వానవద్యాం సుదతీం దివ్యాభరణభూషితామ్**
**సూక్ష్మాంబరధరా మేకాం పద్మోదరసమప్రభాం ॥**

**—వ్యా. భా. ఆది. 93-27-28**

ఆ కన్యక సూక్ష్మాంబరధారణి యగుటచే నామె శరీరసౌష్ఠవము - సౌందర్యము - ప్రస్ఫుట మగుచున్నది. దివ్యాభరణభూషిత యగుటచే నా యంద మినుమడించు చున్నది. సాక్షాత్తు లక్ష్మీదేవి వలె నున్న యామెను శంతనుఁడు తనివితీఱ చూచినాడు.

కని మునికన్యయో దనుజకన్యకయో భుజగేంద్రకన్యయో
యనిమిషకన్యయో యిది వియచ్చరకన్యకయో యపూర్వ మీ
వనమున కిట్టు లేకతమ వచ్చునె మానవకన్య యంచు న
య్యనఘుఁడు దానిఁ జిత్తమున నాదటవోవక చూచెఁ బ్రీతితోన్.[1]

సర్వాన వద్యాంగి యైన యా దివ్యాంగన గంగ.

తన కిష్టమయిన మార్గమునఁ బ్రవర్తించుటకు శంతనుండొడంబడుటచే గంగ మనుష్యస్త్రీ రూపధారిణియై వానికిష్టోపభోగంబులు సలుపుచుండె.[2]

నదీమతల్లియైన గంగాదేవికి మనుష్యస్త్రీరూపము గల్పింపబడినది.

---

1. నన్నయ్య ఆది. 4-145 = వ్యా.భా ఆది. 93-31-32
2. నన్నయ్య ఆది. 4-150 = వ్యా భా. ఆది. 99-8

# బంగారుబొమ్మ తపతి

గిరిపృష్ఠే తు సా యస్మిన్ స్థితా స్వసితలోచనా
విభ్రాజమానా శుశుభే ప్రతిమేవ హిరణ్మయీ॥ —వ్యా.భా 171-27

సంవరణుం డొక్కనాఁడు మృగయావినోదార్థంబయి వనంబునఁ బరిభ్రమించుచు... నొక్కపర్వతవనోద్దేశంబున

కనియె నొకకన్యఁ గోమలిఁ గనకప్రభ నిజశరీరకాంతి నుపాంతం
బున వృక్షలతావలిఁ గాంచనమయముగఁ జేయుచున్న చంద్రనిభాస్యన్.

—నన్నయ్య ఆది. 7-70-71

సర్వాభరణభూషితయై వెలుఁగులు గ్రుమ్మరించుచు గిరిశిఖరమునందు బంగారుబొమ్మ వలె నిలుచుండి యున్న సురకన్య సూర్యసుత తపతి.

ఆదిత్యునకుఁ బుత్త్రి యనఁగా విశ్వకర్మకు దౌహిత్రి.

దేవతాయక్షరాక్షసస్త్రీలు గాని గంధర్వాప్సరఃకాంతలు గాని సౌందర్యమునందు సర్వానవద్యాంగి యైన తపతికి సరిగారు.

న దేవీ నాసురీ చైవ న యక్షీ న చ రాక్షసీ
నాప్సరా న చ గాంధర్వీ తథా రూపేణ కాచన॥

—వ్యా.భా ఆది. 170-8

అట్టి యసదృశ రూపలావణ్యవతిని గాంచిన సంవరుణుఁ డనిమిషలోచనుండయి మనమున నిట్లని వితర్కించె.

శంభుండు లావణ్యసద్గుణసముదాయ
మింద యమ్మగ సంగ్రహించె నొక్కొ
దీని యంగంబులఁ బొందిన యివ్విభూషణ
శ్రీ యేమి పుణ్యంబుఁ జేసె నొక్కొ
యమరకన్య యొక్కొ యక్షకన్యక యొక్కొ
సిద్ధకన్య యొక్కొ శ్రీ సమృద్ధి
సర్వలక్షణప్రశస్తాంగి యిది దివ్య
కన్య యగు ననంతకాంతి పేర్మి. —నన్నయ ఆది. 7-73

ఇట శంభుఁ డన బ్రహ్మ.

అస్యా నూనం విశాలాక్ష్యాః స దేవాసురమానుషామ్
లోకం నిర్మథ్య ధాత్రేదం రూపమావిష్కృతం కృతమ్॥
వ్యా. భా. ఆది. 170-32

బ్రహ్మదేవుఁడు దేవదానవమానవజనోపేతంబయిన లోకమునందలి సౌందర్యసింధువును మథించి యీ విశాలాక్షి మనోహరరూపము నావిష్కరించినాఁడు.

నెఱికురులున్ విలోలసితనేత్రయుగంబును నొప్పులొల్కు వా
తెఱయును దీని యాననముతెల్వి కరంబు మనోహరంబు నా
యెఱిగిన యంతనుండి సతి నిట్టి లతాల్పతాంగిఁ జూచి యే
నెఱుఁగ సురేంద్రకన్యయునిట్టిరె రూపవిలాససంపదన్॥

అని వితర్కించుచు...... తద్రూపామృతపానంబున సంవరణుం డనిమేషత్వంబునం బొందినాఁడు. —[నన్నయ ఆది. 7-70, 71]

మూలమునందు తపతి 'స్వసితలోచన' యని యున్నది. [ఆది. 171-27] స్వసితలోచన యనఁగా చక్కని నల్లని [తెల్లనివికాని] కన్నులు గలది. అట్లే స్వసితాయతలోచన [ఆది. 170-27] అనియు[1] వర్ణింపఁబడినది.

కాని నన్నయ యేలనో తపతి ధవళాయతేక్షణ [ఆది. 7-63] యనుచున్నాఁడు.

నన్నయ చెప్పలేదు కాని వ్యాసభారతమునందు తపతి పీనాయతశ్రోణి (అది 171.2) విపులశ్రోణి (ఆది. 171-6). వరారోహ (ఆది. 171-15) యనియు. రంభోరు (ఆది. 170-36) అనియు వర్ణింపఁబడినది.

'వక్రాలకంబులు వలుఁదపిఱుందులు' స్త్రీలకు సౌందర్యద్యోతకములు. పద్మబాంధవుని పట్టి యైన తపతి పద్మేందుప్రతిమానన (ఆది. 171-11) పద్మపత్రాక్షి (ఆది. 170-41), కమలపత్రాక్షి (ఆది. 171-12), కమలగర్భాభ (ఆది. 171-9) యనియు చారుసర్వానవద్యాంగి (ఆది. 171-11) కిన్నరోద్గీతభాషిణి (ఆది. 171-4) యనియు విశేషముగా వర్ణింపఁబడినది.

కథాకథనమునం దందందు ప్రయోగింపఁబడిన పదబంధముల నన్నింటి నొక్కచోఁజేర్పఁగా సిద్ధించిన రూపమిది. ఇది పద్మినీజాతిస్త్రీలక్షణమే.

---

1. స్వసితాయతలోచన = చక్కని నల్లని విశాలములైన కన్నులు గలది.

## ఉత్తమసౌందర్యోపేత సీత

విదేహరాజో జనకః సీతా తస్యాత్మజా విభో
యాం చకార స్వయం త్వష్టా రామస్య మహిషీం ప్రియామ్॥
—వ్యా. భా. వన. 274-9*

జనకాత్మజయు రామచంద్రుని ప్రియురాలును నగు సీతాదేవిని త్వష్టృప్రజాపతి స్వయముగా తన సంకల్పబలము చేత సృజించినాఁడని మహాభారతము చెప్పుచున్నది. అనఁగా సీత అయోనిజ యని యర్థము.

ఈ విషయమునే వాల్మీకిరామాయణము భంగ్యంతరముగా చెప్పినది.

త్వాం కృత్వోపరతో మన్యే రూపకర్తా చ విశ్వకృత్
న హి రూపోపమాహ్యన్యా తవాస్తి శుభదర్శనే॥
—వా. రా. సుందర. 20-13

రూపకర్త యన త్వష్ట; విశ్వకృత్ అనఁగా విశ్వకర్మ.

"నిన్ను సృష్టించిన పిమ్మట రూపకర్త యగు విశ్వకర్మ తన మూర్తినిర్మాణకార్యక్రమమును విరమించికొనినాఁడు కావుననే నీ రూపమున కెన యగు సుందరాంగు లెవ్వరు లేరు" అని రావణుఁడు సీతాదేవి సౌందర్యమును ప్రశంసించినాఁడు.

సీతాదేవి యంత సౌంద్యవతి కావుననే రావణుఁడు

'అనిమిష యక్ష రాక్షస వియచ్చర కిన్నర పన్నగామరాం
గనలఁ గరంబు చిత్తమునఁగైకొనకే ననురాగలీలమై
నిను మది నావరింతు'¹ ననుచున్నాఁడు.

అశోకవనమున నున్న సీతను జూచివచ్చిన హనుమంతుఁడు '...పుణ్యమూర్తి నుత్తమసౌందర్య నవనతాస్య నార్తయైన దాని గని విదేహతనయగా నెఱింగితి'² నని రామునితోఁజెప్పినాఁడు.

రూపకర్త యగు త్వష్టృదేవునిచే సృష్టింపఁబడిన సీత యుత్తమసౌందర్యవతి యగుటలో నాశ్చర్య మేమున్నది ?

* త్వష్టా ప్రజాపతిః స్వయమేవ సంకల్పేన చకార
న తు మైథున ద్వారా అయోనిజా మిత్యర్థః॥ —నీలకంఠ

1. ఎఱ్ఱన. భార. అరణ్య. 6-405 2. ఎఱ్ఱన. భార. అరణ్య. 7-20

# దర్శనీయాంగి దమయంతి

దమయంతి పరమసౌందర్యవతి. అట్టి రూపవతి దేవతలయందుఁ గాని యక్షకాంతల యందుఁ గాని లేదు.

అతీవరూపసంపన్నా శ్రీరివాయతలోచనా
న దేవషు న యక్షేషు తాదృగ్ రూపవతీ క్వచిత్
మానుషేష్వపి చాన్యేషు దృష్టపూర్వాథవా శ్రుతా॥

—వ్యా. వన. 53 13

'సురసిద్ధవిద్యాధరకన్యకల కంటె దమయంతియు సుందరి' యని నారదుఁ డింద్రునకుఁ జెప్పినాఁడు. —నన్నయ. అరణ్య. 2-81

సరోవరస్నాతయు నర్ధవస్త్రసంవీతయు నయిన విదర్భరాజసుతను జూచిన కిరాతుఁడు కామదగ్ధుఁడైనాడు

రజనికరాననఁ బీనపయోధర రాజితరాజసుతన్ విలస
ద్గజపతిగామినిఁ జంపకగంధిఁ బ్రకాశితకాంతిసమన్వితఁ బం
కజదళలోచనఁ జూచి కిరాతుఁడు కామనిశాతశరాహతుఁడై
నిజహృదయం బెఱిఁగించె లతాంగి కనింద్యచరిత్రికు వేడుకతోన్॥

—నన్నయ అరణ్య. 2-90

దమయంతి, 'పూర్ణచంద్రనిభానన', 'పీనశ్రోణిపయోధర', 'అరాళపక్ష్మ నయన', 'మధురభాషిణి' యని మూలమునందు వర్ణింపఁబడినది. —వన. 63-52

ఇది పద్మినీజాతి స్త్రీ లక్షణము.

సర్వానవద్యాంగి యైన దమయంతి జూచిన సార్థవాహులలోఁ గొందఱుఁ నీవె వేల్పు వగుద ని కేలుమొగిచి మ్రొక్కిరి.

వద సత్యం వనస్యాస్య పర్వతస్యాథవా దిశః
దేవతా త్వం హి కల్యాణి త్వాం వయం శరణంగతాః॥
యక్షీ వా రాక్షసీ వా త్వముతాహోఽసి వరాంగనా
సర్వదా కురు నః స్వస్తి రక్ష వాస్మా ననిందితే॥

—వ్యా.భా. వన. 64-119-20

దమయంతి భ్రూమధ్యమున విభ్రాత్సర్థముగా విధాతృనిర్మితంబై పద్మము వలె ప్రకాశించు నొక పుట్టుమచ్చ యున్నది. ఆమెను గుర్తించుటకది యొక చిహ్నము.

## అసదృశరూపలావణ్యవతి ద్రౌపది

శారదోత్పలపత్రాక్ష్యా శారదోత్పలగంధయా
శారదోత్పలసేవిన్యా రూపేణ శ్రీ సమానయా

—వ్యా భా సభా.55-34

ధర్మరాజాదులతో హస్తినకువచ్చిన ద్రుపదరాజనందన గాంధారికి మ్రొక్కిన నక్కోమలింజూచి గాంధారి కోడండ్రెల్లను విస్మితలయి.

అఖిలలావణ్యపుంజంబు నబ్జభవుడు
మెలఁతగా దీనియందు నిర్మించె నొక్కొ-
కాని నాఁడిట్టి కాంతి యే కాంత లందు
నేల లేదని సామర్షహృదయ లయిరి.

—నన్నయ. సభా. 2-160

పాండవుల వనవాససమయమునం దొకనాడు పాంచాలి నిజదేహకాంతు లతో వనభూమిని వెలుఁగఁజేయుచు తృణబిందు నాశ్రమద్వారమునందు తేఁజిగురాకునుబోలె నొప్పు కెంగేలు కదంబ శాఖ తుదిఁ గీల్కొనఁ జేసి నిలిచి యున్న సైంధవుఁడామె సౌందర్యమును జూచి కందర్పదర్పగోచరుఁడయి నిజ సఖుండయిన కోటికాస్యునితో నిట్లనియె.

ఇన్నలినాక్షి యెవ్వతయొ యివ్విపినంబున నేకతంబ యి
ట్లున్న నిమిత్త మేమియొ సురోత్తమకన్యయొ యక్షకాంతయో
పన్నగభామయో మనుజభామిని కామి నిజంబ యిట్లు చె
ల్వొన్నదియే మహీతలమునుగ్మలు లెవ్వరియందు నారయన్.[1]

జయద్రథుఁడు పంపగా కోటికాస్యుఁడు గ్రక్కున పాంచాలి పాలికింజని ప్రయణసుభగంబుగా "నీవి వ్వనదేవతవొ ?
సురేశ్వరుని తోడ నలిగి ధరిత్రికి నరుగుదెంచిన శచీదేవివో
హరి యురస్థలిఁ దొరంగి కేలిఁ గ్రుమ్మరు పద్మగేహవో"[2]

తెలుపుమని యడగినాఁడు.

---

1 ఎఱ్ఱన – ఆరణ్య 6-147 = వ్యా భా వన. 164 10

2 ఎఱ్ఱన – ఆరణ్య 6-151 = వ్యా భా. వన. 265-2

"అతీవ రూపేణ సమన్వితా త్వం నచాప్యరణ్యేషు బిభేషి కింను
దేవీ ను యక్షీ యది దానవీ వా వరాప్సరా దైత్యవరాంగనా వా"

సర్వాన వద్యాంగి సైరంధ్రి

సైరంధ్రివేషమున నున్న ద్రుపదరాజనందన తనను జేరి నిల్వఁగా సుదేష్ణ, 'యాపాదమస్తకము తద్రూపము వీక్షించుచు కుతూహల మడర' సైరంధ్రితో నిట్లనుచున్నది.

'నీవు బహువాసవాసీ జనముల నాజ్ఞాపింపఁగల రాణివలె నున్నావు. కాని దాసి వలె లేవు. నీ వంటి రూపవతులు సైరంధ్రులు కాఁజాలరు.[1]

సురగరుడోరగ విద్యాధర కిన్నర యక్షసిద్ధ తరుణులలో
నీ వరయఁగ నొక్కతి వగుది
పురికింజనుదేరఁ గతముఁ బొంకక చెపుమా.[2]

సుదేష్ణ యిట్లు సంశయించుటకు కారణమేమనఁగా సైరంధ్రిరూపమునందు ఉత్తమనారీలక్షణములే కాక రాజకన్యాలక్షణములును కనిపించుచున్నది.

నోచ్చగుల్ఫా సంహతోరు స్త్రిగంభీరా షడున్నతా
రక్తా పంచసు రక్తేషు హంసగద్గదభాషిణీ॥ (10)*

---

1. వ్యా. భా. విరాట. 9-9

నైవ రూపా భవంత్యేవ యథా వదసి భామిని
ప్రేషయంతీ వై దాసీర్దాసీంశ్చ వివిధాన్ బహూన్॥

2. తిక్కన, విరాట. 1-134 = వ్యా.భా. విరాట. 9-14-16

కా త్వం బ్రూహి యథా భద్రే నాపి దాసీ కథంచన
యక్షీ వా యది వా దేవీ గంధర్వీ యది వాప్సరాః॥

ఇంద్రాణీ వా వారుణీ వా త్వం త్వష్టుర్ధాతుః ప్రజాపతేః
దేవ్యో దేవేషు విఖ్యాతాస్తాసాం త్వం కతమా శుభే॥

* [నోచ్చౌ న బహిర్గతౌ గూఢౌ ఇత్యర్థః నోచ్చౌ గుల్ఫౌ పాదగ్రంధీ యస్యాః సా
తథా త్రిగంభీరా త్రిషు శబ్ద బుద్ధి నాభీషు గహనా॥
షడున్నతా పట్సు నాసికాక్షిద్వయ శ్రోత్రనఖస్తన కృకాటికాసు ఉత్తానా॥
పంచసు స్థానేషు పాదపాణితలనేత్రాంతోష్ఠజిహ్వానఖేషు
ఏతాన్యేవ సంజ్ఞయా పంచరక్తాని తేషు రక్తా॥
హంసవత్ గద్గదం కించిత్ మధురం వా భాషతే సా
హంస గద్గదం భాషిణీ॥] —నీలకంఠ. చిత్రశాలాప్రతి.

సుకేశీ సుస్తనీ శ్యామా పీనశ్రోణిపయోధరా
తేన తేనైవసంపన్నా కాశ్మీరీవ తురంగమీ॥ (11)
అరాళ పక్ష్మనయనా బింబోష్ఠీ తనుమధ్యమా
కంబు గ్రీవా గూఢశిరా పూర్ణచంద్రనిభాననా॥ (12)
శారదోత్పల పత్రాక్ష్యా శారదోత్పలగంధయా
శారదోత్పల సేవిన్యా రూపేణ సదృశీ శ్రియా॥ (13)

—వ్యా. భా. విరాట. 9-11-13

నిగూఢగుల్ఫాదులు రాజకన్యాలక్షణములు.

యస్యా రక్తతలౌ పాదావున్నతాగ్రౌ తలస్పృశే
నిగూఢ గుల్ఫౌ సిహతౌ సా స్యాన్నృపతి సమ్మతా॥
నద్యావర్తాభనాభిశ్చ తనురోమా సురూపిణీ
సుదంతా సుముఖీ భూయాద్ రాజ పత్న్యతికోమలా॥

—ప్రహ్లాదసాముద్రిక శాస్త్రము

ఈ వర్ణనమునందు మఱియొక విశేషమున్నది.

దేవతాస్త్రీలను పాదాది శిరోఽంతముగా వర్ణించుట సంప్రదాయము — ఇట ద్రౌపది గుల్ఫాది ముఖాంతముగా క్రిందినుండి మీఁదికి వర్ణింపబడుట చేత నామె యొక దేవతాస్త్రీ యను సూచన యున్నది

చీలమండ లెత్తుగాలేకుండుట, తొడలు నొండొరు నొరసకొని యుండుట; శబ్దము, బుద్ధి, నాభి యను మూఁడును లోతుగా నుండుట; ముక్కు, కన్నులు, చెవులు, గోళ్లు, స్తనములు, పెడతల యను నాఱును ఎత్తుగానుండుట; పాదపాణితలములు (అఱచేతులు - అఱకాళ్ళు), కనుఁగొనలు, పెదవులు, నాసిక, అను నీ యేదను ఎఱ్ఱగా నుండుట ఇత్యాదులు శుభలక్షణములు.

అనేక శుభలక్షణములు గల మానిని సైరంధ్రిగానుండుట వింతగానున్నది

* తేన తేన లక్షణేన మంద గతి త్యాదినా॥ (11)
అరాలే వక్రే కృష్ణేవా పక్ష్మణీ యయో స్తాదృశీ నయనే యస్యాః సా
తథాకంబు గ్రీవా శంఖవద్ రేఖాత్రియాంకితగ్రీవా
గూఢ శిరా గుప్తనాడికా॥ (12) —నీలకంఠ.

అమరవర్ణిని కృష్ణ

కులపవిత్రి సితేతరోత్పల కోమలామలవర్ణ యు
త్పల సుగంధి లసన్మహోత్పలపత్రినేత్రి మదాలికుం
తల విభాసిని దివ్యతేజము దాల్చి యొక్క కుమారి త
జ్జ్వలనకుండమునందుఁ బుట్టెఁ బ్రసన్నమూర్తి ముదంబుతోన్॥

—నన్నయ్య ఆది. 7-20

ద్రౌపది జన్మవృత్తాంత విశిష్టతను దెలుపుటకు నన్నయి తరల వృత్తము నెంచికొనినాఁడు.

నన్నయ చెప్పని రహస్యములు కొన్ని మూలమునందున్నవి.

కౌరవ సంహారార్థము సాక్షాత్తు దుర్గాదేవియే ద్రుపద రాజపుత్త్రికగా జన్మించిన దనియు, నామె కృష్ణ యను నామముతో వ్యవహరింపఁబడుననియు నశరీరవాణి పలికినట్లు వ్యాసభారతమునందున వర్ణింపఁబడినది.

కుమారీచాపి పాంచాలీ వేదీమధ్యాత్ సముత్థితా
సుభగా దర్శనీయాంగీ స్వసితాయతలోచనా॥

శ్యామా పద్మపలాశాక్షీ నీలకుంచితమూర్ధజా
తామ్రతుంగనఖీ సుభ్రూ శ్చారుపీనపయోధరా॥

మానుషం విగ్రహం కృత్వా సాక్షాదమరవర్ణినీ
నీలోత్పలసమోగంధో యస్యాః క్రోశాత్ ప్రధావతి॥

యా బిభర్తి పరం రూపం యస్య నాస్త్యుపమా భువి
దేవదానవయక్షాణా మీప్సితాం దేవరూపిణీమ్॥

తాం చాపి జాతాం సుశ్రోణీం వాగువాచాశరీరిణీ
సర్వయోషిద్వరా కృష్ణా నినీషుః క్షత్రియాన్ క్షయమ్
సురకార్యమియం కాలే కరిష్యతి సుమధ్యమా॥

—వ్యా.భా. ఆది. 166-44-49

ద్రుపదనందన స్వయంవరమునకు వచ్చిన రాజులు పర్వతరాజ కన్య వివాహమునకు వచ్చిన దేవగణముల వలె నున్నారు. ద్రౌపది ఉమాదేవి వలె నున్నది.

చకాశిరే పర్వతరాజకన్యా ముమాం యథా దేవగణాః సమేతాః

—వ్యా భా. ఆది. 187-4

సకలలావణ్యవతి యైన ద్రౌపదిని చూడఁగలుగుటయే యొక భాగ్యముగా భావింపఁబడినది.

"...కృష్ణ నసితోత్పలశ్యామలామలాంగి
మెఱపునుం బోలెను వఱలునుత్పలగంధి[1]
బంధుర తను సౌరభంబు గలుగుదాని ద్రుపదరాజతనయ
దదీయ స్వయంవరోత్సవంబు నపుడు సూడఁగనినవారు
దృష్టిగనిన ఫలంబెల్లఁగనినవారు పరమ కౌతుకమున.
—నన్నయ. ఆ౧. 7-180

అయోనిజయు నగ్నికుండసముద్భవయు నగణ్యపుణ్య లావణ్యగుణ సమన్వితయు దేవరూపిణియు నైన ద్రౌపది సౌందర్యమునం దొక విలక్షణత్వ మున్నది.

నైవ హ్రస్వా న మహతీ న కృష్ణా నాతిలోహిణీ
నీలకుంచితకేశీ చ తయా దీవ్యా మహం త్వయా॥
శారదోత్పలపత్రాక్ష్యా శారదోత్పలగంధయా
శారదోత్పలసేవిన్యా రూపేణ శ్రీ సమానయా॥
—వ్యా. భా. సభా 67-34-35

ద్రౌపది యంతపొడగరి కాక, పొట్టిదియుఁగాక కుదురుగానుండును· ఆమె యంతనలుపు గాక, యెఱ్ఱని యెఱుపుగాక చామనచాయగా నుండును· ఆమె తలవెండ్రుకలు నల్లగా వంకరలు తిరిగియుండును.

ఆమె శరత్కాలోత్పల దళసదృశములయిన కన్నులు శారదోత్పల సమానశరీరగంధము గలిగి, శారదాంబుజముతో సేవింపఁబడు శ్రీదేవి వంటి రూపముగలది. అట్టి పాంచాలిని పణముగా నొడ్డుచున్నానని ధర్మరాజు శకునితోఁ బలికినాడు. అది యొక దురదృష్టము.

---

1. ఉత్పలము - కలువ, నల్లగలువ, ఒక జలపుష్పము.

A blue lotus, any lotus or water lily. —V. S. Aple S. E. D.

* ఇట ఉత్పలమనఁగా కమలమను నర్థము గ్రిహింపబడినది.

"ఉస్‌కే నేత్ర శరద్ ఋతు కే ప్రఫుల్ల కమలదళ్ కే సమాన సుందర ఏవం విశాల హై ఉస్‌కే శరీర్ సే శారదీయ కమల్ సే సమాన సుగంధ ఫైలీ రహతీ హై వహ్ శరద్ ఋతు కే కమలోంకా సేవన్ కరీ హై తథా రూప్ మే సాక్షాత్ లక్ష్మీ కే సమాన్ హై." ....శ్రీ మహాభారత్. పు 892 - గీతాప్రెస్

ద్రౌపది యక్షకాంతను దలపించుచున్నది.

తన్వీ శ్యామా శిఖరదశనా పక్వ బింబాధరోష్ఠీ
మధ్యే క్షామా చకితహరిణీ ప్రేక్షణా నిమ్ననాభిః
శ్రోణీభారా దలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్ర స్యా ద్యువతి విషయే సృష్టిరాద్యేవ ధాతుః ॥
—కాళిదాసు, మేఘదూతం, శ్లో. 79

సర్వలక్షణలక్షితాంగులయిన తపతీ దమయంతుల వలె ద్రౌపదియు పద్మినీ జాతి స్త్రీ యే.

స్వేదబిందు యుక్తమయిన ఆమె ముఖము పద్మము వలెను మల్లె పూవు వలెను పరిమళించుచుండును.

ఆభాతి పద్మవత్ వక్త్రం స స్వేదం మల్లికేవ చ
వేదీమధ్యా దీర్ఘకేశీ తామ్రాస్యానాతిలోమశా॥
—వ్యా. భా. వన. 65-38

పద్మినీజాతి స్త్రీ లక్షణములు

భవతి కమలనేత్రా నాసికా క్షుద్రరంధ్రా
అవిరలకుచయుగ్మా చారుకేశీ కృశాంగీ
మృదువచన సుశీలా గీతవాద్యానురక్తా
సకలతను సువేశా పద్మినీ పద్మగంధా.
—(రతిమంజరి) - V.S. Aple. SED. P. 315

వ్రజతి మృదుసలీలా రాజహంసీవ తన్వీ
త్రివళిలలితమధ్యా హంసవాణీ సువేషా
మృదుశుచిలఘుభుంక్తే మానినీ గాఢలజ్జా
ధవళకుసుమవాసో వల్లభా పద్మినీ స్యాత్,

శిల్పులు లోకమునందు తమకుఁ గనిపించు కాంతామణుల యంద చందములను శాస్త్రసమ్మతముగా మహాకవులు వర్ణించిన సౌందర్యలక్షణములను సంవదించి శిల్పాకృతులు చేయుదురు. అట్లే చిత్రకారులును.

మహాభారతమునందు వర్ణింపబడిన స్త్రీమూర్తులే యానాటి శిల్పాచార్యులు శిల్పించిన 'యక్షి' శిల్పాది కళాఖండములకు మూలరూపములై యుండవచ్చును.

## సౌందర్యరాశి ఊర్వశి

చంద్రోదయసమయమున నిలింపపతిపంపున సొంపార నూర్వశి యర్జున సంగమకాంక్షఁ జేసి చక్కఁగా నలంకరించుకొని మందగమనంబునఁ బురందర నందనుమందిరంబున కరుదెంచినది. —[నన్నయ అరణ్య. 2-851]

దేవతలకుసైతము మదనవికారము గలిగింపఁజాలు మత్తకాశిని ఊర్వశి శరీరసౌందర్యము వ్యాసభారతమునం దత్యంతమనోహరముగా వర్ణింపఁబడినది.

స్తనోద్వహన సంక్షోభా నమ్యమానా పదే పదే
త్రివలీదామచిత్రేణ మధ్యే నాతీవశోభినీ॥

అధో భూధరవిస్తీర్ణం నితంబోన్నతపీవరమ్
మన్మథాయసం శుభ్రం రసనాదామభూషితమ్॥

ఋషీణా మపి దివ్యానాం మనో వ్యాఘాతకారణమ్
సూక్ష్మాంబరధరం రేజే జఘనం నిరవద్యవత్॥

గూఢగుల్ఫధరౌ పాదౌ తామ్రాయత తలాంగులీ
కూర్మపృష్ఠోన్నతౌ చాపి శోభతే కింకిణీకిణౌ॥ —వన 46-18-12

ఈ వర్ణనము నందు పీనపయోధరములు, పృథునితంబములు; మధ్య భాగమునం దుదరముపై మూఁడు ముడతలు సూక్ష్మ వస్త్రాచ్ఛాదితమయిన జఘనము, గుల్ఫములు రక్తవర్ణములయిన పాదతలాంగుళులు, కూర్మ పృష్ఠముల వంటి మీగాళ్లు చోటుచేసికొన్నవి.

## కందర్పదర్పోద్దీపిక మేనక

అప్సరోగణములలో నగ్రగణ్యయైన మేనక యమరేశ్వరు నాజ్ఞతో విశ్వామిత్రు తపోవనము సొచ్చి, సఖులతోఁగలిసి పుష్పాపచయవ్యాజమున విహరించుచు,

అలసత యొప్పఁగాఁ దరుణి యమ్ముని వల్లభుఁ బ్రోలనున్న సం
మిలిత సుగంధబంధురసమీరవశంబునఁ దూలి బాలపై
వలువెడలన్ బయల్పడియె వర్ధకుచంబులు కక్షయుగ్మమున్
లలితకృశోదరంబుఁ దరళత్రివలీయుత రోమరాజియున్.

ఆ యనిమిషకాంత యొయ్యారములను జూచిన విశ్వామిత్రుఁడు చలించి దాని గవయందివిరె. —నన్నయ్య ఆది. 4-44

## త్రిలోకసుందరి తిలోత్తమ

సా ప్రయత్నేన మహతా నిర్మితా విశ్వకర్మణా
త్రిషు లోకేషు నారీణాం రూపేణాప్రతిమా భవత్.

—వ్యా. భా. ఆది. 210.25

విశ్వగురుండయిన బ్రహ్మ సుందోపసుందులను పరస్పర యుద్ధంబునఁ బంచత్వంబుఁ బొందింపవలయు నని విచారించి విశ్వకర్మను రావించి రూపలావణ్యవతి యగు నొక్క యువతిని సృజింపు మని పంచిన

త్రిలాణుమణికోటి సంఘటిత దివ్యదేహంబుతోఁ
దిలోత్తమ యనంగ నొక్క యువతీ లలామంబు ను
త్పలాక్షి సృజియించె సర్వగుణభాసిరూపక్రియా
కలావిదుఁడు విశ్వకర్మ తన కౌశలం బేర్పడన్.

—నన్నయ. ఆది. 8-102.3

మూలమునందు విశ్వకర్మ తిలోత్తమను నిర్మించిన విధానము విపులముగా నున్నది.

నిర్మమే యోషితం దివ్యాం చింతయిత్వా పునః పునః
త్రిషు లోకేషు యత్ కించిద్ భూతం స్థావరజంగమమ్
సమానయద్దర్శనీయం తత్ తదత్ర స విశ్వవిత్॥
కోటిశశ్చైవ రత్నాని తస్యా గాత్రే న్యవేశయత్
తాం రత్నసంఘాతమయీ మసృజద్ దేవరూపిణీమ్॥
సా ప్రయత్నేన మహతా నిర్మితా విశ్వకర్మణా
త్రిషు లోకేషు నారీణాం రూపేణాప్రతిమాభవత్॥
సా విగ్రహవతీవ శ్రీః కామరూపా వపుష్మతీ
జహార సర్వభూతానాం చక్షూంసి చ మనాంసి చ॥

—వ్యా భా. ఆది. 2.0

విశ్వజ్ఞుఁడయిన విశ్వకర్మ యనేకవిధములుగా యోజించి ముల్లోకము లందలి దర్శనీయ పదార్థముల సౌందర్యాంశములను తిలప్రమాణములయిన కోట్లకొలఁది రత్నశకలములను, దాని యంగములందు పొదిగి దేవరూపిణి యగు నొక స్త్రీ మూర్తి ని రత్నసంఘాతమయిగా నిర్మించినాఁడు. ఈవిధముగా మనోహరాకృతిని దాల్చిన యా త్రిలోకసుందరి కామరూపిణియై లక్ష్మీదేవి విగ్రహమువలె సకలజన నయనానందకరముగా నున్నది.

రూపనిర్మాణకర్త యగు విశ్వకర్మ కోట్లకొలఁది రత్నశకలములను శరీరమునందు పొదిగి తన కళాకౌశలముతో నద్భుతసౌందర్యవతిని నిర్మించినాఁడనుట వల్లను, అది శ్రీదేవి విగ్రహము వలె నున్నదనుట చేతను తిలోత్తమ యొక రత్నపాంచాలిక వలెఁ గనిపించుచున్నది.

తిలప్రమాణరత్నశకలములతో నిర్మింపఁబడినది కావున బ్రహ్మదేవుఁడా యువతికి తిలోత్తమ యని నామకరణము చేసినాఁడు.

తిలం తిలం సమానీయ రత్నానాం యద్ వినిర్మితా
తిలోత్తమేతి తత్ తస్యా నామ చక్రే పితామహః॥

—వ్యా. భా. ఆది. 210-18*

"తద్రూపసౌందర్య దర్శనలోలుఁడై యజుఁడు
నాలుగు దిక్కులందుఁ దనకుఁ గావించికొనియె ముఖంబులు
మఱి రెండు కన్నులఁజూచినంగాదు తృప్తి యని
నరేంద్రుఁడు సహస్రాక్షుఁడయ్యె,
నయ్యమరులు కామమోహాంధులైరి." —నన్నయ ఆది. 8-108**

విశ్వకర్మ రూపనిర్మాణకళాకౌశలమున కిదియొక తార్కాణము.

అరవిందసంభవుండా సుందరిం జూచి, సుందోపసుందు లను దైత్యు లిద్దఱు నీ కారణంబున నిహతు లగునట్లు చేయుమని పంచిన, సర్వమోహిని యైన తిలోత్తమ మెఱుఁగువలె వెలుఁగుచు మర్త్యలోకమునందలి వింధ్యాచల విపినభూముల కరుదెంచినది.

---

* పోల్చు – వ్యా. భా. ఆనుశాసనిక. 141-1

** భారతానుశాసనపర్వమునం దీ వృత్తాంతము మఱియొక విధముగా నున్నది

సుందోపసుందుల వినాశంబునకై "మయుండు లోకంబులం గల యొప్పులందెల్ల నుత్తమసారంబుల తిలప్రమాణంబులాహరించి యొక్క కామినిం గావించి తిలోత్తమ యను పేరికి నాకడకు దెచ్చిన నచ్చెలువ నాకుం బ్రదక్షిణంబుగా వచ్చునెడ నే నిది దేవకార్యంబు చేయనోవునాకో యను తలంపుతో నత్తరుణి తిరిగిన దిక్కుదిక్కున కొక్కొక్క మొగంబు దాల్చి దానిం బరీక్షించితి నాటఁగోలెఁ చతుర్ముఖుండనై యుండుదు" నని శివుఁడు పార్వతికిఁజెప్పెను.

మయుఁడును శిల్పాచార్యుడే. —తిక్కన. ఆనుశాసనిక. 4-425

# స్త్రీ రూపలక్షణసాదృశ్య సమీక్షణము

దేవకన్యలయినను, యక్షకాంతలయినను, అప్సరసలయినను మానవ భామినులయినను స్త్రీ రూప మొక్క విధముగనేయున్నది. కవులు స్త్రీ సౌందర్యమును వర్ణించునపుడు వివిధాంగములను ప్రకృతిసిద్ధమయిన వస్తుజాలముతో నుపమించుట యొక సంప్రదాయముగ నున్నది.

మహాభారతమునందు వర్ణింపఁబడిన స్త్రీల రూపలక్షణ సాదృశ్యములను కొన్నింటిని సమీక్షింతము.

శిరోజములు : 1) తుమ్మెదలతోను, 2) నెమలిపురితోను పోల్చఁబడినవి.

ద్రౌపది 'మదాలికుంతలవిభాసిని [నన్నయ. ఆది. 7-20]

'కలాపకుంతలవిభాసికేశ భారమ్మున నొప్పునది [నన్నయ. సభా. 2-247]

ముఖము : 1) చంద్రునితోను, 2) పద్మముతోను పోల్చఁబడినది.

పూర్ణేందువదన [నన్నయ. ఆది. 7-289] ఇందుముఖి [స. భా. 2-257]

పూర్ణచంద్రనిభానన [వ్యా. భా. విరాట. 9-10]

చంద్రుని వలె ఆహ్లాద కరమయిన ముఖము గలది.

వనజానన [నన్నయ. సభా. 2-216]

పద్మము వలె నందమై సుగంధము వెదజల్లు ముఖము గలది.

'అభాతి పద్మవత్ వక్త్రం' పద్మేంమ ప్రతిమానన [వ్యా భా. ఆది 171-11]

నేత్రములు : 1) కన్నులకు కలువరేకులతోను, 2) పద్మ పత్రములతోను, 3) లేడి కన్నులతోను పోలికలు చెప్పబడినవి.

ఉత్పలాక్షి (నల్లగిలువ రేకుల వలె నందమైన కన్నులుగలది).

మహోత్పల పత్రనేత్ర [ఆది. 7-20] మహోత్పలము - పద్మము

మహోత్పలదళ చారునేత్ర [సభా. 2-197]

కమలాక్షి [నన్నయ ఆది. 2-116] కమలాయతాక్షి [అరణ్య. 5-286]

పంకరుహదళాయతాక్షి [నన్నయ. ఆది. 7-79] తోయజ దళనేత్ర.

పద్మదళముల వలె విశాలములైన కన్నులుగలది.

మృగనేత్ర [అరణ్య 6-171] విభీతహరిణాక్షి [నన్నయ. సభా. 2-249]

కనుబొమలు : అరాళ పక్ష్మనయన. వంకరలైన కనుఱెప్పలు గలది.

ఓష్ఠములు : దొండపండుతో పోలిక చెప్పఁబడినది.[1]

బింబోష్ఠీ [వ్యా భా. విరాట. 9-12] దొండపండువలె ఎఱ్ఱని పెదవులు గలది.

దంతములు : పలువరుస ఒండొంటితోఁగలిసి యెడములేక చక్కగా మృదువుగా నుండవలెను.[2]

కంఠము : శంఖముతో పోల్పఁబడినది.

కంబుగ్రీవా [వ్యా.భా. విరాట. 9-12]

శంఖమునకు వలె మూఁడురేఖలుగల కంఠము గలది,

కుచములు : పెద్దవై బలిసినవై యుండుట సౌందర్యలక్షణము.

గంగ 'ఉత్తుంగపయోధరద్వితయి' [నన్నయ. ఆది. 4-135]

వల్గు కుచములు [నన్నయ. ఆది. 4-44]

అత్యురుకుచ [నన్నయ. ఆది. 4-144]

కర్కశస్తనములు [నన్నయ ఆది. 8-74]

పీనోన్నతకుచములు [నన్నయ. ఆరణ్య. 3-292]

పీనపయోధర [నన్నయ. ఆరణ్య. 2-90]

నడుము : సన్నగా నుండవలెను. యజ్ఞవేదిక మధ్యభాగముతో పోల్పఁబడినది.

తనుమధ్య [నన్నయ. సభా. 2-116] వేదీమధ్యా [వ్యా.భా. సభా. 65]

'వేదివిలగ్నమధ్యా' యజ్ఞవేదిక మధ్యభాగమువలె సన్నని నడుముగలది.

వళులు : పొట్టపై మూఁడు రేఖలుండుట శుభలక్షణము.[2]

'లలితకృశోదరంబు తరళత్రివళీయుతరోమరాజియున్.

—[నన్నయ. ఆది. 4-44]

నాభి : పొక్కిలి లోతుగా నుండవలెను.

నీచతర నాభి [నన్నయ. ఆరణ్య. 2-334]

జఘనము : బండిచక్రముతో పోల్పబడినది.

పృథు జఘన చక్ర [నన్నయ ఆరణ్య 2-334]

---

1. పూర్ణ చంద్రముఖీకన్యా బాలసూర్య సమప్రభా
విశాలనేత్రా బింబోష్ఠీ సా కన్యా లభతే సుఖమ్. —గరుడపురాణ 64-14

2. లలాటే చైవ గళే చైవ మధ్యే చైవ వళిత్రయం
స్త్రీ పుంసయో రిదం జ్ఞేయం మహాభాగ్యైక సూచకమ్ —సాముద్రికశాస్త్రము

నితంబములు : పిఱుఁదులు ఎత్తుగా బలిసి యుండవలెను.
ఉన్నతములైన కొండలతో సాదృశ్యము చెప్పబడినది.
అథోభూధర విస్తీర్ణం నితంబోన్నతపీవరమ్. [వ్యా. భా. వన. 46-9]
పీనాయతశ్రోణి [వ్యా. భా. ఆది. 171-2] విపులశ్రోణి [ఆది. 171-6]
బలిసిన విశాలములయిన నితంబములు గలది.
వరారోహ [ఆది. 171-15] వలుద పిఱుందులు [నన్నయ. ఆది. 8-74]

ఊరువులు : అరటిబోదెలతో పోలిక చెప్పఁబడినది.
రంభోరు [నన్నయ. సభా. 2-249] వ్యా.భా ఆది. 170-36. అరటి బోదెల వలె నున్నని తొడలుగలది. అవి యొండొరు నొరసికొనునట్లుండవలెను.
సంహతోరు [వ్యా.భా. విరాట 9-10]

గుల్ఫములు : చీలమండలు ఎత్తుగా నుండరాదు. గూఢముగ నుండవలెను.
నోచ్చగుల్ఫా [వ్యా.భా. విరాట. 9-10]

పాణిపాదతలములు ; రక్తవర్ణము కలిగియుండవలయును.
లేత చిగురుటాకులతోను, ఎఱ్ఱని కమలదళములతోను పోలికచెప్పబడినది
లేఁజిగురాకువోలె నొప్పు కెంగేలు [ఎఱ్ఱన. అరణ్య. 6-148]
'అరుణసరోరుహ దళ మృదులంబులైన యుత్తరుణి చరణతలంబులు' [ఎఱ్ఱన. అరణ్య. 3-291] పల్లవతామ్రపాదతలములు. [అరణ్య. 3-298]

నఖములు : ఎఱ్ఱగానుండవలెను. తామ్రతుంగనఖీ. [వ్యా.భా.]

గమనము : మందమందముగా నుండవలెను. ఏనుఁగు నడకతో పోలిక.
కమనీయ గజరాజ గమన [నన్నయ. ఆది. 7-189] గజరాజఖేల గమన [నన్నయ. అరణ్య. 3-316] కరిరాజగమన [ఎఱ్ఱన. అరణ్య. 6-153]

శరీరచ్ఛాయ : నల్లగలువలతో పోలిక చెప్పబడినది.
ద్రౌపది సితేతరోత్పల కోమలామల వర్ణ. [నన్నయ. ఆది. 7-20]
అసితోత్పల శ్యామలాంగి [నన్నయ. ఆది. 7-120]

తనూసౌరభము : నల్లగలువల పరిమళముతో పోల్చఁబడినది.
ఉత్పలగంధి [నన్నయ. ఆది. 7-20]
నీలోత్పలసమగంధి, శారదోత్పల గంధి [వ్యా. భా. సభా.]

శరీరకాంతి : పద్మగర్భకాంతితో సాదృశ్యము చెప్పఁబడినది.
కమలగర్భాభ [వ్యా భా. ఆది. 172-9]

తపతి 'సు వి భ క్తా న వ ద్యాం గి' యని వ్యాసభారతము వర్ణించుచున్నది. —[ఆది. 170-9]

తపతి శరీరాంగములన్నియు చక్కగా విభజింపఁబడి, లోపరహితములై శిల్పశాస్త్ర సమ్మతముగా నిర్మింపఁబడిన విగ్రహము వలె నున్నదని యర్థము.

ఇది శి ల్ప దృ ష్టి

తపతి సర్వలక్షణ ప్రశస్తాంగి యని నన్నయ వ్రాసినాడు.

సౌందర్య దిదృక్షువులయిన కవులు - శిల్పులు ఒక స్త్రీ రూపమునుగాని పురుష రూపమును గాని వీక్షించినప్పుడు, ఆ యా శరీరాంగములందలి వంపు సొంపులు లోపాలోపములును వారికి దృష్టిగోచర మగుచుండును.

"దేవ మనుష్యాది భేదములతో నుండు స్త్రీ పురుషులలో గాని తిర్యక్కులగు పశుపక్ష్యాదులలో గాని ఏయే యంగము లెంతెంత ప్రమాణములో నుండ వలయునో, అంతంత ప్రమాణములో నవి యున్నప్పుడే అంద చందములకు నెలవులై అవి ప్రకాశింపఁ గలవు. తలకుఁ దగిన శరీరము. శరీరమునకుఁ దగిన చేతులు, కాళ్లు, పొట్ట మొదలగు నంగములు, ఆ యంగములకుఁ దగిన వ్రేళ్లు మొదలగు నుపాంగములు, అట్లే ముఖ ప్రమాణమునకుఁదగిన ముక్కు చెవులు, కన్నులు, పెదవులు. గడ్డము, చెక్కిళ్లు మున్నగునవి యున్నప్పుడే స్త్రీ పురుషులు చక్కని వారనిపించుకొందురు"*

ఒక్కొక రూపమొక్కొక కంటి కింపుగానుండును. అన్యుల కట్లుగాదు. దృష్టిభేదమును బట్టియు రుచిభేదమును బట్టియు సౌందర్యాభివ్యక్తి మాఱుచుండును.

దివ్యదృష్టిగల శిల్పర్షు లీ విషయము లన్నింటిని క్రోడీకరించి శిల్ప జనోపయుక్తముగా తమతమ గ్రంథము లందు నిక్షేపించినారు.

విగ్రహము యొక్క నిడివిని తొమ్మిది భాగములుగా విభజించి యే ..గము నందే యే యవయవము లెంతెంత ప్రమాణములో నుండవలయునో ..ల్పశాస్త్రములు నిర్దేశించుచున్నవి.

---

* చూడు :- డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు : లేపాక్షి పుట. 104-5

ప్రతిమాకారకులకు తాలమానము ముఖ్యము.
తాల మన పదిరెండు మానాంగులములు.

ద్వాదశాంగుల విస్తారా స్తాల ఇత్యభిధీయతే. —విష్ణుధర్మోత్తర. 35-12

విగ్రహము యొక్క పొడవును బట్టి నవతాలాదిభేదము లేర్పడు చున్నవి. వీనిలో నవతాలము ప్రధానమైనది.

నవతాల ప్రమాణస్తు దేవదానవ కిన్నరాః —మత్స్య. 257-16

నవతాల మనఁగా విగ్రహము పొడవు 9x12=108 అం. దశతాలమన 10x12=120అం; సప్తతాల మన 7x12=84అం. అష్టతాల మన 8x12=96అం.

ఈ కొలతల ప్రయోజనమును శుక్రాచార్యుఁడిట్లు చెప్పినాఁడు.

వామనీ సప్తతాలా స్యా దష్టతాలా తు మానుషీ
నవతాలా స్మృతా దైవీ రాక్షసీ దశతాలికా॥ —శుక్రనీతి. 4-410

శుక్రనీతి ననుసరించి వివిధతాలములలో నిర్మింపఁబడు విగ్రహముల కొలత లీ క్రింది పట్టికలోఁ జూపఁబడినవి.*

| క్రమ సంఖ్య | విగ్రహ శరీరాంగ విభజనము | నవతాల పద్ధతి | అష్టతాల పద్ధతి | సప్తతాల పద్ధతి | దశతాల పద్ధతి |
|---|---|---|---|---|---|
| | | మానాంగుళములలో | | | |
| 1 | ముఖము (1 తాలము) | | | | |
| | లలాటము భ్రూమధ్యమునుండి కేశపర్యంతము | 4 | 12 | 12 | 13 |
| | నాసిక | 4 | | | |
| | నాసికనుండి చిబుకమువఱకు | 4 | | | |
| 2 | గ్రీవము | 4 | 4 | 3 | 5 |
| 3 | కంఠమునుండి స్తనమధ్యమువఱకు | 12 | 10 | 9 | 13 |
| 4 | హృదయమునుండి నాభివఱకు | 12 | 10 | 9 | 13 |
| 5 | నాభినుండి మర్మస్థలమూలమువఱకు | 12 | 10 | 9 | 13 |
| 6 | ఊరువులు [మర్మస్థల మూలము నుండి మోకాళ్లవఱకు] | 24 | 21 | 18 | 26 |
| 7 | జానువులు | 4 | 4 | 3 | 5 |
| 8 | మోకాళ్లనుండి చీలమండలవఱకు | 24 | 21 | 18 | 26 |
| 9 | గుల్ఫమునుండి పాదాంతము | 4 | 4 | 3 | 6 |
| | మొత్తము పొడవు | 108 | 96 | 84 | 120 |

* Cf :- The Sukra Niti: Tr. by Benoy Kumar Sarma p.p. 170-181

దేవతా ప్రతిమలను నవతాల పద్ధతి ననుసరించి నిర్మింప వలయు నని శుక్రాచార్యుఁడు నిర్దేశించినాఁడు.

స్త్రీ విగ్రహములు నిర్మించునపుడు తక్కిన కొలతలెట్లున్నను వక్షోజముల యెత్తు-లావు ఐదంగులములుండవలయు ననియు కటిప్రదేశము కైవారము 38 అంగులములుండవలయు ననియు శుక్రాచార్యుఁడు సూచించినాఁడు.[1]

మయబ్రహ్మయు నవతాల ముత్తమమైనదని వివిధావయవముల కొలతల నొసఁగినాఁడు.[2]

ఉత్తమే నవతాలే తు మస్తకం చతురంగులమ్
ముఖం ద్వాదశమానేన స్యాద్ గ్రీవా చతురంగులమ్॥

ఆగ్రీవస్తన మధ్యం వై ద్వాదశాంగుల మాయతమ్
స్తనాంతరాది నాభ్యంతం తావదాయత ముచ్యతే॥

ఆనాభిమేహనాంతం చ తావదేవాయతం భవేత్
ఆజానుగుల్ఫ పర్యంతం చతుర్వింశతి మానకమ్॥

జంఘయోరున్నమానస్తు గుల్ఫశ్చ చతురంగులమ్
ఉచ్యతే నవతాలేఽస్మిన్ నష్టోత్తర శతాంగులమ్॥ –[మయమతము]

మూర్తి నిర్మాణకళ యందు ముఖనిర్మాణము ముఖ్యమైనది.

ముఖమానేన కర్తవ్యా సర్వావయవకల్పనా॥ —మత్స్య. 258-1

ముఖము యొక్క పొడవెంతయుండునో దాని వెడల్పంతియే యుండ వలయుననియు, అది యొక తాల ప్రమాణమనియు [12 మానాంగులములు] మయుఁడు చెప్పినాఁడు.

యత్ కించిత్ కాయకాయామం విభజ్య నవభాగతః
ఏకతాలం ముఖం కుర్యాద్ విస్తారం చ తథైవ చ.

---

1. Cf :- The Sukra Niti : Tr. by Pror. Benoy Kumar Sarma.
"The height and thickness of the breasts of Women is five angulas.
The Circumference of the waist of women is two angulas in addition to three Talas."

2 చూడు : వాస్తునారాయణీము : వాద్రేవు సూర్యనారాయణమూర్తి

శిల్పాచార్యులు కొందఱు తాలమానమందు మానాంగులమునకు బదులు మాత్రాంగులమును [దేహాంగులమును] పాటించుచున్నారు.

ఈ పద్ధతి అతి ప్రాచీనకాలము నుండియున్నది.

స్వైరంగులై ప్రమాణైర్ ద్వాదశ విస్తీర్ణ మాయతం చ॥
—బృహత్సంహిత. 57-4

ప్రతిమా నిర్మాణముచేయు శిల్పాచార్యుని యొక్కగాని చేయించు యజమాని యొక్కగాని కుడి చేతి నడిమివ్రేలి నడిమి కనుపు పరిమాణమును మాత్రాంగులమందురు. దీనినే దేహాంగులమనియు నందురు.[1]

పూర్వకాలమున శిల్పాచార్యు లెక్కువగా దేహాంగులము ప్రమాణముగా దేవతా విగ్రహములు నిర్మించియుందురు.

ఎవరే తాలమానముల ననుసరించినను విగ్రహము యొక్క నిడివికిఁ దగిన లావు-వెడల్పు లున్నపుడే యది యందముగా నుండును. ఆ కొలతలును శాస్త్రములందుఁ జెప్పబడినవి.

## ప్రతిరూప శిల్పము

లోకమునందలి యొకానొక రూపమును బోలినరూపమును గల్పించుట ప్రతిరూపశిల్పము.

పూజార్థము దేవాలయములందు ప్రతిష్ఠింపఁబడు దేవతామూర్తులను నిర్మించుటకే ప్రతిమాలక్షణము లుపయోగపడును గాని భిన్న భిన్న మానవాకృతుల ప్రతిరూపములు గల్పించుట కుపకరింపవు.

మూలరూపము యొక్క కొలతలు తీసికొని, వాని ననుసరించి గాని లేదా యొకానొక రూపము నేకాగ్రచిత్తముతో పరిశీలించి మనఃఫలకము మీఁద ముద్రించికొని, యా మూలరూపమునందు కొట్టవచ్చినట్లు కనఁబడు విశేషాంశములకు ప్రాధాన్యము నొసఁగి, ఇంచుమించుగా దానితో సమానమగు రూపమును మృణ్మయాదులతో కల్పింపవచ్చును.

లేదా యొకానొక వ్యక్తి యొక్క వేషధారణాదులు ప్రాతిపదికగా సదృశరూపులకు వేషములు వేయవచ్చును. నటకులు నాటకములందు రామాదులవేషములు ధరించి ప్రజలను మెప్పించుచున్నారు గదా.

ఇవి యన్నియు ప్రతిరూపకకారకుల కృత్యములే.

---

1 చూడు :- డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు : లేపాక్షి.

## ద్రోణాచార్యుని మృణ్మయ ప్రతిమ

మహాభారతకాలమున దేవతాప్రతిమలే కాక మహాపురుషుల విగ్రహములు కూడ మృత్తికతోఁ జేసికొని యారాధించు పద్ధతి యున్నట్లు ఏకలవ్యవృత్తాంతము వలనఁ దెలియుచున్నది.

విలువిద్య యందును... గదాకార్ముక ప్రాసాసితోమర కుంత శక్త్యాది వివిధాయుధంబుల యందును గుమారుల నందఱ జితశ్రములం జేయుచున్న ద్రోణాచార్యుల మహాప్రసిద్ధి విని హిరణ్యధ్వజుం డను నెఱుకురాజు కొడు కేకలవ్యుం డను వాఁడు ధనుర్విద్యాగ్రహణార్థియై వచ్చిన వాని నిషాదపుత్త్రుండని శిష్యుంగాఁ జేకొనకున్న, వాఁడును ద్రోణుననుజ్ఞ వడసి చని వనంబులోన

వినయమున ద్రోణురూపు మన్నున సమర్చి
దాని కతిభక్తితోడఁ బ్రదక్షిణంబుఁ
జేసి మ్రొక్కుచు సంతతాభ్యాస శక్తి
నస్త్ర విద్యా రహస్యంబు లర్థిఁ బడసె. *

ఆచార్యుఁడు శుక్లాంబరాభరణమాల్యాను లేపన యజ్ఞోపవీత పలిత కేశ శ్మశ్రుశోభితదేహుఁడు.[1]

యజ్ఞోపవీతధారణము బ్రాహ్మణలక్షణము. నెరసిన వెండ్రుకలు, మీసములు వార్ధక్య లక్షణములు. తక్కినవి యానుషంగికములు.

ఏకలవ్యుఁడు భారద్వాజు నత్యంత సమీపవర్తియై చూచి యుండుటచే నాతని రూపమును తన మనఃఫలకము పయి చిత్రించికొనినాఁడు.

కావున నేకలవ్యుఁడు మట్టితో యజ్ఞోపవీతధారియైన యొక వృద్ధ బ్రాహ్మణ రూపమును గల్పింపఁ గలిగినాఁడు. ఆ మట్టి బొమ్మ కవసరమైన తావుల సున్నము పూసి శుభ్రవర్ణము కల్పింపవచ్చును. అప్పుడది ద్రోణునకు పూర్ణ ప్రతిరూప మగును. ఏకాగ్రచిత్తముతో దానిని పూజించి యస్త్రవిద్యా రహస్యములు తెలిసికొనినాఁడు.

---

* నన్నయ. ఆది. 5-231-2 = వ్యా. భా. ఆది. 132-31

స తు ద్రోణస్య శిరసా పాదౌ గృహ్య పరంతప
అరణ్య మనుసంప్రాప్య కృత్వా ద్రోణం మహీమయమ్.

1 నన్నయ. ఆది 6-9 = వ్యా. భా. ఆ. 133-19

# దారుమయ ప్రతిమలు

యథా దారుమయీ యోషా నరవీర సమాహితా
ఈరయత్యంగమంగాని తథా రాజన్నిమాః ప్రజాః ॥

—వ్యా భా వన. 30-23*

సూత్రధారప్రేరితమై కొయ్యబొమ్మ తన యంగములను కదలించునట్లు ఈశ్వరప్రేరితులైన ప్రజలు తమ తమ కరచరణాద్యవయవములు గదలించుచు వివిధచేష్టలు చేయుచున్నారని చెప్పుట వలన మహాభారత కాలమున సూత్రధారులు, శిల్పులు, ప్రజల వినోదార్థము కొయ్యతో బొమ్మలు చేసి, వానికి పాత్రోచితమయిన వేషములు వేసి, త్రాళ్లుగట్టి యాడించుచుండెడి వారని తెలియుచున్నది.

ఈ దేశమునందు ప్రసిద్ధికెక్కిన తోలుబొమ్మలాటల కిదియే మూలము కావచ్చును.

బాలికలు బొమ్మలకు వస్త్రాద్యలంకారములు చేసి, బొమ్మలపెండిండ్లు మొదలగు బొమ్మలాటలాడుకొను చుండెడివారు,

ఉత్తరకుమారునకు సారథిగా నరుఁగుచున్న బృహన్నలను జూచి యుత్తరయుఁ జెలులు నిట్లనిరి.

"కురువీరుల గెలిచి తదంబరములతోఁ జిత్రవర్ణభాసురములుగాఁ
దర మెఱఁగి లోచనోత్సవకరములుగా బొమ్మపొత్తికలకుం దెండీ."

—తిక్కన. విరాట. 4-47

బృహన్నలే ఆనయథా వాసాంసి రుచిరాణి చ
పాంచాలికార్థం చిత్రాణి సూక్ష్మాణి వివిధాని చ॥

—వ్యా. భా. విరాట. 37-29

పాంచాలిక యన వస్త్రదంతకాష్ఠాదులచే చేయఁబడిన నరమృగాది రూపము; బొమ్మ. [శబ్దరత్నాకరము]

పాంచాలరాజపుత్రిక యైన యుత్తర బొమ్మలకొలువులో విలువైన దంతపాంచాలికలే యుండవచ్చును.

కొయ్యవి గాని కొమ్మువి గాని యీ యాటబొమ్మలను చేయువారు శిల్పులే.

---

* పోల్చు : అనీశ్వరోఽయం పురుషో భవా భవే
సూత్రప్రోతా దారుమయీవ యోషా॥ —[వ్యా.భా. ఉద్యోగ. 39-1]

## ఆయసీ ప్రతిమలు

ఆయసీప్రతిమా హ్యేషా త్వయా నిష్పాదితా విభో.

—వ్యా. భా. స్త్రీపర్వ. 12-23

మహాభారతకాలమున శిల్పులు లోహమయవిగ్రహములు చేయుచున్నట్లు తెలియుచున్నది.

భీమప్రతిరూపము

"త్రికాలవేదియైన కృష్ణుఁ డయోమయంబుగా భీమ ప్రతిరూపంబు సేయించి, సంగ్రహించి నిగూఢప్రకారంబునం దత్ప్రదేశంబునకుఁ దెప్పించిన వాఁడు గావున గ్రక్కున నయ్యనుపరూప జగదీశ్వరుఁ జేర నిలిపిన నది భీమసేనుండకాఁ దలఁచి,

కోపంబుత్కటమై యారూపము నిరుగేలఁబట్టి రూఢత ఘోరా
టోపం బెసకమెసఁగ నా భూపతి వెసఁగౌగిలించి పొలుపఱ విఱిచెన్"

—తిక్కన. స్త్రీ. 1-129-30

ఇది మూలానుసరణమే.

**తం గృహీత్వైవ పాణిభ్యాం భీమసేన మయస్మయమ్**
**బభంజ బలవాన్ రాజా మన్యమానో వృకోదరమ్॥** —స్త్రీ. 12-17

మూలమునం దింకను భీమమాయసమ్ [స్త్రీ. 12-15] ఆయసీప్రతిమా [స్త్రీ. 12-23] ప్రతిమా కారితాఽఽయసీ [స్త్రీ. 12-27] అను ప్రయోగములున్నవి.

తిక్కనయు వీని నిట్లు తెనిగించినాఁడు.

గంధవహనందన ప్రతిరూపము[స్త్రీ. 1-132] ఇనుపరూపు[స్త్రీ 1-120, 133] రూపము [స్త్రీ. 1-130] ప్రతిమ [స్త్రీ. 1-132]

ఆయసాంగన

"...గురుతల్పగుం డనిలప్రతప్తమైన
యాయసాంగనాంగమాలింగనము చేసి యైన...
చచ్చి యఘమునిస్తరించు" నని చెప్పఁబడినది. —తిక్కన శాంతి 1-307*

దీనిని బట్టి యానాటి శిల్పులకు ఇనుముతో స్త్రీ పురుషుల ప్రతిమలు చేయు పద్ధతులు తెలియునని చెప్పవచ్చును.

---

* వ్యా. భా. శాంతి. 35-20 గురుతల్పీ శిలాం తప్తా మాయసీ మభిసంవిశేత్.

## రామలక్ష్మణప్రతిరూపములు

అఖిలమాయాకుశలుండైన దశముఖుఁడు మాయఁ బ్రయోగించి రామలక్ష్మణప్రతిరూపంబు లనేకంబు లుత్పాదించుటయు నయ్యన్నయుఁ దమ్ముండును వెఱఁగు పడియుఁ జిడిముడిపడక యమ్మాయారూపంబుల నన్నింటివి దునిమి నట్లు వర్ణింపఁబడినది. —ఎఱ్ఱన. అరణ్య. 7 147

ఈ వర్ణనము మూలానుసరణమే.

కృత్వా రామస్య రూపాణి లక్ష్మణస్య చ భారత
అభిదుద్రావ రామం చ లక్ష్మణం చ దశాననః.........

జఘ్నే మాన్ రాక్షసాన్ పాపా నాత్మనః ప్రతిరూపకాన్[1]
జఘాన రామస్తాంశ్చాన్యా నాత్మనః ప్రతిరూపకాన్.
—వ్యా. భా వన. 291-8-11

రావణుఁడు వేసగాండ్రచేత రామలక్ష్మణుల వేషములు వేయించి వారిని హింసించుచున్నట్లు మాయఁ గల్పించినాడు.

రాముడు తన వేషములు ధరించిన రాక్షసులను తదితర శత్రువులను సంహరించినాఁడు.[2]

ఇట ప్రతిరూప మన ఒక రూపమును బోలిన కృత్రిమరూప మనియు ప్రతి రూపకు లనఁగా ఛద్మ వేషధారులనియు ప్రతిరూపకకారకులన ఆహార్యాదులతో సదృశరూపములు గల్పించు రూపశిల్పు లనియు జెప్పవలెను.

మాయ యన శిల్ప మే.

---

1 ప్రతిరూపమ్ : The counterpart of any real form ,an image, likeness, representation (Mbh) —Monier williams

ప్రతిరూపకము : ఒకదాని వలెనే కల్పింపఁబడినది. [సూ.ని.]

ప్రతిరూపకకారకులు : ఆహార్యాదులతో సదృశరూపములు కల్పించువారు రూపశిల్పులు.

2 భారత ! దశానన్ నే శ్రీరామ్ ఔర్ లక్ష్మణ్ కే భీ బహుత్ సే రూపధారణ్ కర్ కే శ్రీరామ్ ఔర్ లక్ష్మణ్ పర్ ధావా కియా......
'భగవన్ ఆప్ నే హీ సమాన్ ఆకార్ వాలే ఇన్ పాపీ రాక్షసోంకో మార్ డాలియే'
తబ్ శ్రీరామ్ నే రావణ్ కీ మాయా నే నిర్మిత అప్నే హీ సమాన్ రూప్ ధారణ్ కర్నే వాలే ఉన్ సబ్ కో తథా అన్య రాక్షసోంకో భీ మార్ డాలా.
—[హిందీఅనువాదము - గోరఖ్ పూరు ప్రతి]

రాముని రూపము ధరించువాఁడును, వేషముగట్టించు రూపశిల్పియు రాముని రూపమెట్లుండునో తెలిసికొని యుండవలెను.

భరతుఁడు రామాయనార్థము చిత్రకూటశైలమున కరిగి యందు

కనియన్ గోమలనీలమేఘసుభగాకారున్ జటావల్కలా
జినధారున్ సితభూతిభూషితుని రాజీవాక్షుఁ గల్యాణకీ
ర్తనుఁ గాకుత్స్థకులప్రదీపకుని సీతాలక్ష్మణోపేతు స
న్మునిలోకార్చితు సత్కృపాభరణు రామున్ రాజచూడామణిన్.[1]

"అభినవ పద్మదళాక్షు అక్షీణవిస్తృ... క్షు
ఆజానుదీర్ఘబాహు మధురస్మితానను మదగజగమను
ఆరూఢయౌవను నభిరూపతేజు ...రామభద్రు" కులపవిత్రుఁ
బెద్దకొడుకుఁ గనుంగొనె రాజవరుఁడు కరము రాగమెసఁగ.[2]

రాముఁడు (1) నీలమేఘమువంటి వర్ణము (2) కమలములవంటి కన్నులు (3) విశాలమయిన వక్షస్థలము (4) మందగమనము గలవాఁడు (5) ఆజానుబాహుఁడు (6) జడలు, నారచీరలు కృష్ణాజినము ధరించినవాఁడు (7) తెల్లని విభూతిపెట్టుకొనినవాఁడు. రామ ప్రతిరూపమునందీ లక్షణము లన్నియు ప్రతిబింబింపవలెను.

## వసుదేవుని ప్రతిరూపము

సౌంభకముతో ద్వారకపయి దండెత్తి యాదవులతో యుద్ధము చేయు నపుడు మాయావి యగు సాల్వుఁడు ప్రదర్శించిన మాయలలో వసుదేవుని ప్రతిరూపము గల్పించుట యొకటి.

"పుణ్యకర్మంబులు వొలిసిన నుర్వికి నేతెంచువట్టి యయాతి వోలె
భూషణదీప్తులు వొలియుంగ వివృతకేశాంబరుండయి సౌభకంబు వలనఁ
బఱతెంచు వసుదేవుఁ బాపనిశాచరబల పీడ్యమాను దవ్వులన కాంచి
యత్యంతమోహాశోకాంధుఁడ" నయితి నని శ్రీకృష్ణుఁడే చెప్పినాఁడు.

—[నన్నయ అరణ్య 1-19]

తస్య రూపం ప్రపతతః పితుర్మమ నరాధిప. [వ్యా.భా. వన. 22-7]

అసురులు వేషధారణాది శిల్పకళలందును ప్రావీణ్యముగలవారే.

1 ఎఱ్ఱన. అరణ్య 6-306; 2 ఎఱ్ఱన. అరణ్య 6-295

## పార్థుని ప్రతిరూపము

మాయచేతఁగాక మంత్రముతోఁగూడ ప్రతిరూపము లుత్పాదింపఁబడిన యుదంత మొకటి భారతమునం దున్నది.

అర్జునుఁడు త్రిగర్తసేనలపై త్వష్ట్ర నామ కాస్త్రము ను ప్రయోగింపగా తత్ప్రభావమున శత్రువులకు తన రూప మనేకరూపములుగాఁ దోఁచుటచే వారు చిత్తవిభ్రాంతితో నొండొరూం బొడిచికొని చచ్చిరి.

> అథాస్త్ర మరిసంఘఘ్నం త్వాష్ట్ర మభ్యస్య దర్జునః
> తతో రూపసహస్రాణి ప్రాదురాసన్ పృథక్ పృథక్
> ఆత్మనః ప్రతిరూపై స్తై ర్నానారూపై ర్విమోహితః
> అన్యోన్యా నర్జునం మత్వా స్వమాత్మానం చ జఘ్నిరే.
> —వ్యా. భా. ద్రోణ. 19-11, 12

## ప్రతిరూపకకారకులు

భేదోపాయముతో పరరాష్ట్రపీడనము చేయు రాజు నిప్పుపెట్టు వారి చేతను విషప్రయోగముచేయు వారి చేతను, ప్రతిరూపములు చేయు శిల్పుల చేతను ప్రయోగములు చేయింపవలె నని భారతము చెప్పుచున్నది.

> అగ్నిదై ర్గరదై శ్చైవ ప్రతిరూపకకారకైః॥ —శాంతి. 69-49*

ఈ విధముగా ప్రతిరూపక కారకులు రాజునకు తోడ్పడుచున్నారు.

> 'అరులకడ నిజ భూమియం దనుజ తనుజ బాంధవామాత్య
> మిత్రులపాల వేష ధరుల వేగులఁబెట్టి ధరణీపునకు వలయు
> నొండొరు నెఱుఁగని వారిఁగాగ' —తిక్కన. శాంతి. 2-279

## కృతక రూపములు

కృతక రూపములు ప్రతిరూపములకంటె భిన్నమైనవి. ఇవి అసహజములు.

మాన్యులయిన మహనీయులు భిన్నభిన్న కారణములతో తమతమ ప్రయోజనములు సాధించుకొనుట కవసరమయిన మాఱు వేషములు వేయుచుండిరి.

---

* ప్రతిరూపకం ప్రతిమా తత్కారకైః తద్వారా కర్మకారకై కౌలికైః॥ —నీలకంఠ

'అగ్ లగానే వాలే, జహర్ దేనే వాలే, ఛద్మవేశధారీ లోగోం ద్వారాభీ
శత్రుకో హాని పహుంచానా' —హిందీ అనువాదము - గీతాప్రెస్

### కృత్రిమనారీరూపము

ఈ కృతకరూపధారణ విద్యకు మూలపురుషుఁడు విష్ణువే.

పురుషోత్తముఁ డొక స్త్రీరూపము ధరించి యసురులను వంచించి యమృతము గొనితెచ్చి దేవతల కిచ్చినాఁడు.

నారాయణుండు కృత్రిమ నారీరూపమునఁ
దన్మనంబుల కతి మోహాంధకారుఁడై
యమరారులచేఁ గ్రిమ్మఱంగ నమృతము గొనియెన్॥

—నన్నయ. ఆది. 2-17

తతో నారాయణం మాయాం మోహినీం సముపాశ్రితః
స్త్రీరూప మద్భుతం కృత్వా దానవానభిసంశ్రితః॥

ఇది వి ష్ణు మా య. —వ్యా. భా. ఆది. 18-40

### అర్జునుని వనితావేషము

అర్జునుఁ డూర్వశీశాపవశమున వచ్చిన పేడితనమును వనితారూపమును ధరించి యజ్ఞాతవాసముచేయుటకై 'వేషధారియైన విష్ణుండుఁబోలె' విరటుకొలువునకు వచ్చినాఁడు. వాని రూపమును గాంచిన మత్స్యభూపతి విస్మయమంది తన యొద్దనున్నవారితో నిట్లనుచున్నాఁడుః

వనితావేషము గల్గియున్న యది చెల్వం బాడుచందంబు గా
దు నిరూపింప మహానుభావతయు నిర్దోషత్వమున్ రాజసం
బును శోభిల్లెడు నెవ్వఁడే నొక జగత్పూజ్యుండు గ్రీడార్థ మ
ట్లొనరం దాల్చిన రూపు గావలయు మీ రూహింపుఁడా యట్లగున్.

—తిక్కన విరాట. 1-231

### యతివేషము

తిలోత్తమ కంటె రూపవతి యైన సుభద్రను జూచు వేడుకతో నర్జునుఁడు కృ త క య తి వే ష ము ధరించి ద్వారకా పురి కరిగెను.

రైవతకాద్రికందరము నందున్న వానికి పరిచర్యసేయుచున్న సుభద్ర వాని యం దర్జునుని పోలిక లున్నట్లు పసిగట్టి ఏఁడు విజయుఁ డొక్కొ యనుచు సంశయోపేతచిత్తయైనది. —నన్నయ ఆది. 8-185

## కృతకభూసురవేషము

పురందరుం డొక్కనాఁడు బ్రాహ్మణరూపంబునం జని[1] కర్ణుని కవచకుండలము లర్థింపఁగా నాతఁడు సంశయింపక యా కృతకభూసురునికి[2] తన సహజకవచకుండలముల నర్పించినాఁడు.

ఇది ఇంద్రుని మాయ.

## త్రిదండివేషధారి రావణుఁడు

దశాననుఁడు సన్న్యాసివేషము ధరించి సీతాదేవి వద్దకు వచ్చినాఁడు.

> కమనీయంబగు జన్నిదంబు శిఖయున్ గౌపీనమున్ ధాతు వ
> స్త్రము దండంబును గుండియుం గుశపవిత్రంబున్ వృద్ధభా
> వము సంధిల్లఁ ద్రిదండివేషధరుఁడై వచ్చెన్ బధిశాంతి దే
> హమునం దోఁపఁగ సీత యున్నెడకు మాయాదక్షుఁ డక్షీణతన్॥
>
> —ఎఱ్ఱన. అరణ్య. 6-336

> రావణస్తు యతిర్భూత్వా ముండ కుండీ త్రిదండధృక్॥
>
> —వ్యా. భా. వన. 278-17

అజ్ఞాతవాసకాలమున పాండవులు మాఱువేసములు వేసికొని విరాటరాజు కొలువునం దున్నారు.

## ధర్మజుని సన్న్యాసిరూపము

ధర్మజుఁడు యమధర్మరాజును ప్రార్థింపఁగా, "తదనుగ్రహమునఁ బాండవాగ్రజునికి సన్న్యాసి రూపం బలవడి ధాతు పట దండ కమండలు కలితమూర్తి యయ్యె" —తిక్కన విరాట. 1-184

ఆ యమ ధర్మరాజు ననుగ్రహము వల్లనే తక్కినవారల వేషముల "కనుగుణములగు నంబరాభరణ మాల్యాద్యుపకరణంబులు సన్నిహితంబులయినవి".

ఈ యుపకరణములతో భీమసేనాదులు ఎవరికిఁ దగిన మాఱువేసములు వారే వేసికొని విరాటు కొలువునఁకుబోయిరి.

---

1 ఎఱ్ఱన. అరణ్య. 7-357 = వ్యా. భా. వన. 289-25
త మింద్రో బ్రాహ్మణో భూత్వా భిక్షాం దేహీత్యుపస్థితః

2 ఎఱ్ఱన. అరణ్య. 7-366 = వ్యా. భా. వన. 290-1
దేవరాజ మనుప్రాప్తం బ్రాహ్మణచ్ఛద్మనావృతమ్॥

## చిత్రశిల్పము

చిత్రకార ఇవా౽లేఖ్యం కృత్వా స్థాపితవా నసి.

—వ్యా.భా. ఉద్యోగ 148-23

మహాభారతకాలమున మంచి మంచి చిత్రములు గీయగల చిత్రకారు లున్నట్లు తెలియుచున్నది.

చిత్ర మన లిఖితరూపము. ఆలేఖ్య మన ప్రయత్నపూర్వకముగా రచింపఁబడిన చిత్రము. చిత్తరువు.

చిత్రం లిఖితరూపం స్యా దాలేఖ్యం తు ప్రయత్నతః
నిర్మితోత్తమ చిత్రమ్........ ఇతి శబ్దార్ణవే.

ద్రుపదమహారాజు తనపుత్రికయైన శిఖండికి తక్కిన విద్యలతో పాటు శిల్పలేఖ్యములు నేర్పించినాఁడు.

చకారయత్నం ద్రుపదః సుతాయాః సర్వకర్మసు
తతో లేఖ్యాదిషు తథా శిల్పేషు చ పరంతప॥ —ఉద్యోగ. 191-1

ఉయిన సత్యవంతుఁడు చిత్రలేఖనప్రియుఁడు.

సత్యంబు పలుకుట సత్యవంతుండన నొప్పు మఱియు
చిత్రాశ్వుఁ డనఁగ నామాంతరంబు నన్నరనాథసుతునకుఁ గలదు.

—ఎఱ్ఱన. అరణ్య. 7-181

సత్యవంతునకు చిన్ననాటనుండియు నశ్వములన్న మక్కువ యెక్కువ కావున నతఁడు మట్టితో గుఱ్ఱపుబొమ్మలు చేయుచుండెడి వాఁడు. చిత్రశిల్పాభ్యాస సమయమున అశ్వచిత్రములను గీయుచుండు వాఁడు. కనుక చిత్రాశ్వుఁడను పేరువచ్చినది.

బాలస్యాస్యః ప్రియాశ్చాస్య కరోత్యశ్వాంశ్చ మృణ్మయాన్
చిత్రేఽపి విలిఖత్యశ్వాం శ్చిత్రాశ్వ ఇతి చోచ్యతే॥

—వ్యా. భా. వన. 294-13

ఈ యుదంతములను బట్టి మహాభారతకాలమున శ్రీమంతుల గృహముల లోను, రాజ ప్రాసాదము ల లోను బాలబాలికలు చిత్రలేఖనాది శిల్ప విద్యల నభ్యసించుచుండి రనియు, విద్యార్థుల కాయా విద్యలు నేర్పఁగల శిల్పాచార్యు లుండి రనియు విశదమగుచున్నది.

## చిత్రోపమలు

మహాభారతమునందు పెక్కుచోట్ల చిత్ర శిల్పోపమానములు గనిపించుచున్నవి.

సురచాపచిత్ర గగన స్ఫురణం బురుడించునట్లు భూవనిత నిరం
తర చిత్రితయై యొప్పెను సురుచిరనవతృణ శిలీంధ్ర సురగోపములన్.
—నన్నయ ఆరణ్య. 4-139

భూదేవి అందమయిన క్రొత్తగడ్డిమొక్కలు, పుట్టగొడుగులు, మిణుగురు పురుగులు మొదలయిన వానిచే చిత్రింపఁబడి, ఇంద్రధనుస్సు నందలి నానా వర్ణములచే చిత్రముగఁదోఁచు నాకాశమువలె నున్నదని నన్నయ వర్ణించినాఁడు

భీముఁడు హిడింబాసురుని చిత్రవధ చేసినాఁడు.
ఆ చిత్రవధను జూచిన ప్రజలు చిత్రీయమాణచిత్తులయిరి.
—నన్నయ, ఆది. 6-219

ధర్మజుఁడు కమలాకరతీరమునఁ బడిన భీమార్జునయములను జూచి,

"విస్మయపరీత స్వాంతుఁడై కొంతసేపు నరేంద్రోత్తముఁడుండెఁ
జిత్రమున రూపుంబోలెఁ దానచ్చటన్." —[ఎఱ్ఱన. ఆరణ్య. 7-40]

ఏకవస్త్ర యగు ద్రౌపదిని సభకీడ్చుకొని వచ్చి, నొంచు దుశ్శాసనుఁ జూచుచుఁ బతుల సంభ్రములై తగు చేష్టలేక చిత్రముల యాకృతి నుండిరి.
—తిక్కన. ఉద్యోగ. 3-111

ధర్మజుఁడు పాదచారియై భీష్మునియొద్దకు పోయినపుడు, అజాతశత్రు వెనుక నప్పు డరిగిన వారలు పలుకులుడిగి వెఱఁగుపడి చిత్రరూపులచందంబై చూచుచుండిరి. —తిక్కన. భీష్మ. 1-155

శ్రీకృష్ణుఁడు చక్రముధరించి భీష్మునిమీఁద కుఱికి నప్పుడు పులిఁబొడగన్న లేళ్ళగమివోలె సుయోధను నగ్రసైనికుల్ దలఁకి కలంగి నివ్వెఱఁగు దన్కిన చేష్టలుదక్కి చిత్రరూపుల క్రియ నుండిరి. —తిక్కన. భీష్మ. 2-157

వ్యాసభారతము నందు ఆలేఖ్య శబ్దము కూడ ప్రయోగింపబడినది.

నిశ్చేష్టం స్తబ్ధనయనం యథాలేఖ్య గతం తథా॥ —అను. 41-3

---

లేఖ్యమ్ - A painted figure
లేఖ్యగత - A painted, drawn in picture
ఆలేఖ్యమ్ - A painting or picture

V. S. Apte
S.E.D.

## పటచిత్రములు : కుడ్యచిత్రములు

మహాభారతకాలమున చిత్రకారులు పట చిత్రములు, కుడ్య చిత్రములు రచించు చుండెడివారు.

### పటచిత్రములు

రథగజసంకులమయిన రణరంగము నందలి కురు పాండవులు పట చిత్రములందలి రూపములె యున్నారు.

కురు పాండవ సేనే తే హస్త్యశ్వరథసంకులే
శుశుభా తే తదేఽతీవ పటచిత్రి గతే ఇవ. —వ్యా.భా. భీష్మ. 44-15

వీరశయనస్థానంబు నందున్న భీష్ముని జూడవచ్చిన ధర్మరాజాదులు పటచిత్ర గత రూపులైరి.

అభూన్ముహూర్తం స్తిమితం సర్వం తద్రాజమండలం
తూష్ణీం భూత తతస్తస్మిన్ పటే చిత్రమివార్పితం॥
—వ్యా. భా. అను. 166-1

మహారథులయిన ద్రౌపదేయులు ధ్వజాగ్రము లందు ధర్మానిలేంద్రా శ్వినుల ప్రతిమ లునవి. ఇవి పట చిత్రములే.

ధర్మ మారుతశక్రాణా మశ్వినోః ప్రతిమాస్తథా
ధారయంతో ధ్వజాగ్రేషు ద్రౌపదేయా మహారథాః॥
—వ్యా. భా. ద్రోణ. 40-18

### కుడ్య చిత్రములు

విష్ణుమాయను దోఁచు నీ విష్టపములు
భిత్తి చిత్రంబు విధమున ఫేనభంగి. —[తిక్కన. శాంతి. 5-612]

విష్ణుమాయ వలన నీలోకము లన్నియు కుడ్యచిత్రములవలె గోచరించు చుండును.

...దామోదరధనంజయులు నిజశిబిరంబు సొత్తెంచిన నది

"చిట్లిన చిత్రరూపంబులు గల కుడ్యంబునుంబోలె వివర్ణాకారులైన జనుల వలనం బాడఱి" యున్నట్లు వర్ణింపఁబడినది.
—తిక్కన. ద్రోణ. 2-227

ఈ వర్ణముల వలన మహాభారతకాలమునాటికి లోకమునందు పటచిత్రములు కుడ్య చిత్రములు నున్నట్లు రూఢియగుచున్నది.

## పుణ్యదేవత - జర

ఇచ్చుకు వచ్చు పూజనల నెంతయు సంతసమంది తొల్లి నా
కిచ్చె మునీశ్వరుండు దయ నిత్తనయున్ మఱియిప్డు నెమ్మితో
నిచ్చితి నీవు రాక్షసివి యిక్కులమెల్లను నుద్ధరింపగా
వచ్చిన పుణ్యదేవతవు వారిరుహాయత చారులోచనా.

అని దాని నతిప్రీతింబూజించి కొడుకు నెత్తికొని దేవీద్వయంబునకు నిచ్చి జర యను రాక్షసిచేత సంధింపఁబడిన వాఁడు గావున జరాసంధుండను పేరిడి పురం బష్టశోభనంబు సేయించుచుం గొడుకు నతి గారాబంబునం బెంచెను.

—[నన్నయ, సభా. 1-153-154]

జర యను రాక్షసి పూర్వము స్వయంభువుని చే సృష్టింపబడిన గృహదేవతగా ప్రసిద్ధిఁగాంచినది.

'గృహకుడ్యములపై నా రూపమును సపుత్రకముగా చిత్రించి పూజించు వారిని నేను రక్షింతు' నని జరయే చెప్పినది.

జరానామాస్మి భద్రంతే రాక్షసీ కామరూపిణీ
తవ వేశ్మని రాజేంద్ర పూజితా న్యవసం సుఖమ్॥

గృహే గృహే మనుష్యాణాం నిత్యం తిష్ఠామి రాక్షసీ
గృహదేవీతి నామ్నావై పురా సృష్టా స్వయంభువా

దానవానాం వినాశాయ స్థాపితా దివ్యరూపిణీ
యో మాం భక్త్యా లిఖేత్ కుడ్యే[1] సపుత్రాం యౌవనాన్వితామ్

గృహే తస్య భవేద్ వృద్ధి రన్యథా క్షయమాప్నుయాత్
త్వ ద్గృహే తిష్ఠమానా తు పూజితాహం సదావిభో॥

—వ్యా. భా సభా. అ. 18-1-5

ఈ యుదంతము వలన మహాభారతకాలమున ప్రజలు జరాది గృహ దేవతల రూపములను గృహకుడ్యములపై లిఖించికొని పూజించుచుండిరనియు నా కాలమున కుడ్యచిత్రములను రచించు చిత్రకారు లున్నారనియుఁ దెలియుచున్నది.

---

1. "He that with devotion painted on the walls (of his house) a likeness of myself indeed with youth and in the midst of children must have prosperity in his abode." — Mbh P.C. Roy.

# యక్ష పూజ

యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః
—వ్యా. భా. భీష్మ. 41.4

సాత్త్విక స్వభావముగల మనుజులు దేవతలను పూజింతు రనియు రాజసగుణము గలవారు యక్షరాక్షసులను పూజింతు రనియు భారతము చెప్పుచున్నది.

భారతదేశమున జానపదులతో యక్షపూజ యత్యంత ప్రాచీనకాలము నుండియు నున్నదని తెలుపుటకు మధురజిల్లా యందుపలబ్ధమైన కీ॥ పూ॥ నాల్గవశతాబ్ది నాటి యక్షశిలా విగ్రహములు సాక్ష్యముగా నిలిచియున్నది. *

యక్షరూపము

నేను బకమును గాను యక్షవరుఁడ నని యక్షుఁడు భయంకరాకారుఁడు ధర్మరాజు నెదుర నిలిచెను.

నిలిచెన్ దాళసమున్నితాంగుఁడు మహానిర్ఘోష సంతర్జి తా
ఖిల భూతప్రకరుండు దీర్ఘవిపులగ్రీవుండు దంష్ట్రాసము
జ్జ్వల వక్త్రుండు విరూపలోచనుఁడు దీవ్రస్ఫారతేజోఘనుం
డలఘుం డా సరసీతటాగ్రమున నయ్యక్షుండు ఘోరాకృతిన్.
—ఎఱ్ఱన. అరణ్య. 7-419

ఇది మూలమునకు యథాతథానువాదముగ నున్నది.

విరూపాక్షం మహాకాయం యక్షం తాలసముచ్ఛ్రియమ్
జ్వలనార్క ప్రతీకాశ మధృష్యం పర్వతోపమమ్
వృక్షమాశ్రిత్య[1] తిష్ఠతం దదర్శ భరతర్షభః
మేఘగంభీరనాదేన తర్జయంతం మహాస్వనమ్॥—వ్యా. భా. వన. 313. 9

మహాభారతము నందలి యీ యక్షరూప వర్ణనమే శిల్పుల కుపకరించి యుండవచ్చును'

* Cf :- V. S Agrawala : The Heritage of Indian Art. — p. 12
"......It is generally agreed these are images of Yakshas, and Yakshinis, worshipped in very ancient times as deities of a widely spread folk cult which inspired much of the image worship of later day Buddhism, Jainism and Hinduism."

1 'సేతు మాశ్రిత్య' అను పాఠాంతరమునరియైన దని వి. ఎస్. అగ్రివాలా అభిప్రాయము.

## రూపాలంకరణము : సువర్ణ శిల్పము

భూషణానాం చ సర్వేషాం కర్తా శిల్పవతాం వరః ॥

—వ్యా.భా. ఆది. 68-29

శిల్పిశ్రేష్ఠుఁ డయిన విశ్వకర్మయే దేవతల కెల్లరకు నాభరణములు చేసి యిచ్చెడువాఁడు. "ఆ వి శ్వ క ర్మ...

నిఖిలదివ్యాభరణ శ్రీవిరచితపరితోషితదేవుఁడు" —నన్నయ. ఆది. 2-71

అలంకారార్థము స్వర్ణాభరణములు చేయుట యొకకళ.

భూషణయోజనము - వివిధాభరణముల నలంకరించుకొనుటయు - కళయే.

స్వర్ణాద్యలంకారకృతిః కలా లేపాది సత్కృతిః ॥ —శుక్రనీతి[1]

దీనినే స్వర్ణశిల్ప మనియు సువర్ణాదులతో నాభరణములు చేయు శిల్పకారులను స్వర్ణకారు లనియు, హిరణ్యకారు లనియు ననుచున్నారు.

హిరణ్యకారులకు మూలపురుషుఁడు వి శ్వ క ర్మ యే.

దేవదానవులు క్షీరాబ్ధిని మథింపఁగా
త్రిభువనవంద్యయగు శ్రీదేవి యుద్భవించినది.

ఆ శ్రీదేవికి దేవశిల్పి యగు విశ్వకర్మ భూషణములు చేసి యిచ్చినట్లు బ్రహ్మాండపురాణము నందుఁ జెప్పఁబడినది.

ఉత్థితా పద్మహస్తా శ్రీ స్తస్మాత్ క్షీరమహార్ణవాత్
భూషణాని చ సర్వాణి విశ్వకర్మా సమర్పయత్॥

—బ్రహ్మాండ. 3-4-1౯. శ్లో. 76-81*

అట్లే సమస్తదేవతాతేజః పుంజములతో ప్రభవించిన దుర్గాదేవి విశ్వకర్మ యొసఁగిన యాభరణములను ధరించి ప్రకాశించుచున్నట్లు వర్ణింపఁబడినది.

తతః సముత్థితా కాచిద్దుర్గా నామ యశస్వినీ
సమస్త దేవ తేజోభిర్నిర్మితా విశ్వరూపిణీ....
విశ్వకర్మప్రదత్తాని భూషణాని చ బిభ్రతీ॥

బ్రహ్మాండ. 3-4-29. శ్లో. 80-84

---

1. "The making of Ornaments with gold and other metals is an art as well as enameleing of metals".

* చూడు :- డా॥ శోభిరాల సత్యనారాయణ -
శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము. ద్వితీయభాగ, పుట. 209-10

# సువర్ణరత్నాభరణధారణము

రత్నానా ముత్తమం రత్నం భూషణానాం తథైవ చ
పవిత్రం చ పవిత్రాణాం మంగలానాం చ మంగలమ్
యత్ సువర్ణం స భగవానగ్నిరీశః ప్రజాపతిః ॥

—వ్యా. భా. అనుశాసన. 85-85-88

అగ్నీశప్రజాపతి స్వరూపమయిన సువర్ణము రత్నములలో శ్రేష్ఠమైనది; భూషణములలో సువర్ణభూషణము శ్రేష్ఠమయినది; పవిత్రవస్తువులో పరమ పవిత్రమైనది. మంగళకరద్రవ్యములలో నత్యంత శుభప్రద మయినది.

దృశానో రుక్మ ఉర్వ్యా వ్యద్యౌ దుర్మర్ష మాయుః శ్రియే
రుచానః ॥ —ఋగ్వేద. 10-45-8*

చూడఁదగిన మేలిమిబంగారముతోఁ జేయఁబడిన ఫలకాకారమగు నాభరణము కాంతిచే మిక్కిలి ప్రకాశించుచున్నది. ఆయుష్యమును లక్ష్మిని గోరువాఁడు దానిని ధరింపవలయును.

బ్రహ్మనుండి అగ్ని పుట్టినది. సువర్ణ మగ్నినుండి పుట్టినది.[1]

"అగ్నేః ప్రజాతం"-అను సూక్తముతో ఆగ్నేయాఖ్య మయిన మహాశాంతి కర్మముచేసి, హిరణ్యనిర్మితకుండలాదికము నభిమంత్రించి ధరించినచో నగ్నిభయము తొలఁగు ననియు, సకలార్థసిద్ధి కలుగు ననియు చెప్పఁబడినది.[2]

---

*పోల్చు : కృష్ణయజుర్వేద తైత్తిరీయసంహిత. 4-1-10 (పుట. 1847)
—(ఆనందాశ్రమ సంస్కృత గ్రంథావళి 42)

దృశానో దర్శనీయరూపో రుక్మః సువర్ణనిర్మితః ఫలకాకార ఆభరణవిశేషః
ఉర్వ్యా మహత్యా దీప్త్యా వ్యద్యౌద్ విద్యోతతే స్మ కిం కుర్వన్
దుర్మర్ష మతిరస్కార్య మాయు ర్జీవనం శ్రియే శ్రియఃతుం
రుచానో వాంఛన్॥ —సాయణ.

1 బ్రహ్మణో హి ప్రభూతోఽరగ్ని రగ్నేరపి చ కాంచనమ్॥ —భారత అను. 85-151

2. Cf :- Bloomfield : Hymns from the Atharva Veda. p. p. 666-69
According to this, he who is afraid of fire, or who desires every thing in general, performs the great rite of consecration for Agni, and puts on ear-rings and so forth, made of gold.

# హిరణ్యసూక్తము

ఋషి : అథర్వ దేవతా : అగ్ని; హిరణ్యమ్.

అగ్నేః ప్రజాతః పరియద్ధిరణ్య మమృతం దధ్రే అధిమర్త్యేషు
య ఏనద్ వేద స ఇదే నమర్హాతి జరామృత్యుర్భవతి యో బిభర్తి॥ 1

యద్ధిరణ్యం సూర్యేణ సువర్ణం ప్రజావంతో మనవః పూర్వ ఈషిరే
తత్త్వా చంద్రం వర్చసా సంసృజత్యాయుష్మాన్ భవతి యో బిభర్తి॥ 2

ఆయుషేత్వా వర్చసే త్వౌజ సే చ బలాయ చ
యథా హిరణ్యతేజసా విభాసాసి జనాన్ అను॥ 3

యద్ వేద రాజా వరుణో వేద దేవో బృహస్పతిః
ఇంద్రో యద్ వృత్రహా వేద తత్ తే ఆయుష్యం భువత్ తత్తే వర్చస్యంభువత్॥ 4
—అథర్వ. 19-26

అగ్ని నుండి యుత్పన్నమై అమృతరూపము గలిగి మర్త్యులందు వ్యాపించు హిరణ్యమును దాని స్వరూపస్వభావములను తెలిసికొనిన వాఁడే దానిని ధరింపనర్హుఁడు. సువర్ణము నాభరణరూపమున ధరించిన మనుష్యుఁడు వార్ధక్యము నందు మృత్యువును బొందును. అనఁగా దీర్ఘాయుష్మంతుఁడగును. 1

ఏ సువర్ణమును సూర్యపుత్త్రుఁడైన మనువు ధరించినాఁడో - ఆ సువర్ణము నాకు దేహకాంతి నొసఁగుగాక ! అట్టి సువర్ణమును ధరించివాఁ డాయుష్మంతుఁ డగుచున్నాఁడు. 2

ఓ మానవుఁడా ! ఆయుర్దాయము కొఱకు, తేజస్సుకొఱకు ఓజోబలముల కొఱకు హిరణ్యాభరణములు ధరించు నీవు సువర్ణకాంతితో తేజస్వివై జనులలో వెలుఁగొందుదువు గాక. 3

ఏ హిరణ్యశక్తిని - మృత్యునాశకగుణమును - వరుణుఁ డెఱుగునో. బృహస్పతి యెఱుగునో. ఇంద్రుఁడెఱుగునో ఆ హిరణ్యము నీకు ఆయుర్వృద్ధి యిచ్చుఁగాక। వర్చస్సు నొసఁగుగాక. 4

## ఆభరణము లైశ్వర్యప్రదములు

స్త్రియో యత్ర చ పూజ్యంతే రమంతే తత్ర దేవతాః॥
అపూజితాశ్చయత్రైతాః సర్వాస్తత్రాఽఫలాక్రియా॥
—వ్యా. భా. అనుశాసన 46-56*

స్త్రీ లెచటపూజింపఁబడుదురో యచట దేవతలానందింతురు. అనఁగా ఏ కులము నందు స్త్రీలు పూజింపఁబడుదురో ఆకులము వారి పై దేవతలు దయఁగలిగి యుందురు. స్త్రీల కాదరణము లేని యింటఁ జేయు కార్యములు నిష్ఫలములగును.

స్త్రీలను పూజించుటయెట్టు?

తమ మేలుగోరెడి తండ్రులు, సోదరులు, మామలు, బావలు మున్నగు వారు స్త్రీలకు సువర్ణాభరణాద్యలంకృతు లొసఁగి వారిని సంతసిల్లఁజేయ వలయును.

పితృభిర్ భ్రాతృభి శ్చాపి శ్వశురై రథ దేవరైః
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణ మీప్సుభిః॥
—వ్యా. భా. అను. 46-2**

ఏలయన లక్ష్మి దేవి, భూషణలందును, భూషణాలంకృత లయిన పతివ్రతాస్త్రీల యందును నివసించును.

వసామి నారీసు పతివ్రతాసు కల్యాణశీలాసు విభూషణాసు
యానాసు కన్యాసు విభూషణేషు యజ్ఞేషు మేఘేషు చ వృష్టిమత్సు॥

అని శ్రీదేవి రుక్మిణితోఁ జెప్పినది. —వ్యా భా. అనుశాసనిక. 11-14

స్త్రీలకు భూషణాదులొసఁగుట కల్యాణప్రదము. భూషణాలంకృత లయిన స్త్రీలయందు లక్ష్మి నివసించును.

స్త్రీలు గృహలక్ష్ము లని చెప్పబడినది. సౌభాగ్యవతులయిన పుణ్యస్త్రీలు గృహమునకు వన్నెదెచ్చువారు; కాపున వారిని సర్వదా రక్షింపవలయును.

పూజనీయా మహాభాగాః పుణ్యాశ్చ గృహదీప్తయః
స్త్రియః శ్రియో గృహస్యోక్తా స్తస్మాత్ రక్ష్యా విశేషతః॥
—వ్యా. భా. ఉద్యోగ 38-11

---

* పోల్చు :- యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః॥ —మనుస్మృ 3-56

** పోల్చు :- మనుధర్మశాస్త్రము. 3-55 (వావిళ్లప్రతి. పు. 111)

# మంగళాలంకృతులు

పసుపుం గుంకుమ కజ్జలంబు నునుగూర్పాసంబు తాంబూలమున్
గుసుమంబుల్ కబరీభరంబు చెవియాకుల్ మంగళాలంకృతుల్
విసువొక్కింతయులేక తాల్పవలయున్ పీనిన్ సదా కాలమున్
ససిఁ దక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకునై నాళీకపత్రాక్షికిన్.

అని బృహస్పతి లోపాముద్రకు చెప్పినాడు. —శ్రీనాథ. కాశీఖండ. 2-79

భర్త దీర్ఘాయుష్మంతుఁడు గావలయు నని కోరు స్త్రీలు నిత్యము కరకంకణములు కర్ణభూషలు మొదలగు నాభరణములు తప్పక ధరింపవలె ననియు, వాని నెన్నడును విడువరాదనియు స్కాందపురాణము చెప్పుచున్నది.

కేశసంస్కారకం చైవ కర కర్ణాది భూషణమ్
భర్తు రాయుష్య మిచ్ఛంతీ దూరయే న్న పతివ్రతా ॥ *

—స్కంద. 3-2-7-29

కరకంకణాది మంగళాభరణములు సౌభాగ్యదములే కాక సంతాన ప్రదము లనియు వైదికార్య నారీమణులు భావించిరి.

దేవమాత యగు అదితి సంతానార్థ మొక కంకణము ధరించినది.

యం పరిహస్త మభిభ రదితిః పుత్రకామ్యా
త్వష్టా తమస్యా ఆ బధ్నాద్ యథా పుత్రం జనాదితి ॥

—అథర్వ. 6-81-3**

పుత్రసంతానమును గోరుచు దేవమాత యగు అదితి ధరించిన ఈ కంకణమును దేవశిల్పి యగు త్వష్ట పుత్రప్రాప్తి నాకాంక్షించుచు నీ యింతి చేతికిఁ గట్టు గాక. [త్వష్టా - విశ్వకర్మా వా శిల్పీ పరమాత్మా]

---

* Dr. A B L. Awasti : Studies in Skanda Purana -Part I p. 313
"Turmeric, Safran, Vermilion, Collyrium, Bodice, bettles and other auspious ornaments and decorations like coiffure, as well as ornaments worn on on the hands a nd and ears are not to be separated from the body by women desirous of their husbands' health and happiness."

** Cf :- Bloomfield : Hymns of the Adharva Veda.
"This bracelet that Aditi wore when she desired a son Tvastar shall fasten upon this woman intending that she shall beget a son."

# లోపాముద్ర - అలంకారప్రీతి

ఇచ్ఛామి త్వాం స్రగ్విణం చ భూషణైశ్చ విభూషితమ్
ఉపసర్తుం యథా కామం దివ్యాభరణభూషితా ॥

—వ్యా.భా. వన. 97-18

అగస్త్యుఁడు విదర్భరాజపుత్త్రికయైన లోపాముద్రను విధ్యుక్తంబుగా వివాహమాడి దాని దివ్యాంబరాభరణంబు లపనయించి వల్కలాజినధారిణిం జేసి ధర్మచారిణిం దోడ్కొని చని గంగా ద్వారంబునం దపంబు సేయుచు నొక్కనాఁడు.

నీచతర నాభిఁ జపలవిలోచన బృథుజఘనచక్ర లోపాముద్రన్
జూచి మునీంద్రుడు మన్మథగోచరుఁడై దానిఁ బ్రీతిఁ గూడఁగదివిరెన్.

—నన్నయ ఆరణ్య 2.333-4

లోపాముద్రయు నమ్ముని యభిప్రాయం బెఱిఁగి లజ్జించియు తన కోరిక నిట్లు వెల్లడించినది.

పతి పత్నిఁ బ్రజార్థముగా ధృతిఁబడయుట యెందుఁ గలయదియ యైనను న
న్నతి రుచిరాంబర భూషాన్వితఁజేసి మనః ప్రియంబు నిర్మింపుదయన్.

మునినాథ నీవు నసులేపనమాల్యవిభూషణప్రసన్నుఁడవై నా
కొనరింపు మపత్యోత్పాదన మీ ఋతువాసరములు తప్పకయుండన్.

—నన్నయ. ఆరణ్య. 2-356-7

లోపాముద్ర అలంకారప్రియ. ప్రియంభావుక.

తనకు తన జనకునింట గల శయ్యవంటి శయ్యకాలయును.[1]

తన కిష్టమయిన వస్త్రాభరణములతో భర్త తన్నలరింప వలయును. భర్తయు మాల్యాభరణములు ధరించి ప్రసన్నుఁడై యుండవలయును. అట్లుండుట తన కిష్టము.

స్వర్ణాభరణధారణము వలన దంపతులకానందముకలుగు ననియు ఆనందోత్సాహములతో యథేచ్ఛగా విహరించిన దంపతులకు సత్సంతానము కలుగుననియు కామశాస్త్ర రహస్యములను శృంగారోజ్జ్వల వేష భూషణాలంకారా వశ్యకమును లోపాముద్ర తన భర్తకుఁజెప్పి యొప్పించినది.

ఆనందాద్ధేవ ఖల్విమాని భూతాని జాయంతే.

1 వ్యా. భా. వన. 07-17-18

మహాభారతకాలమున స్త్రీలు సంగమార్థము పురుషులను జేరునపుడు వివిధాభరణములతో నలంకరించుకొనుచుండిరి.

పరాశర మునీంద్రుతో సమాగమమునకు ముందు సత్యవతి తత్ప్రభావంబున ననేక దివ్యాభరణభూషిత యైనది. —నన్నయ ఆ. 3-41

సత్యవతి కృష్ణద్వైపాయను నియోగించి యంబిక కడకుఁ బంపినపుడా ధవళేక్షణ చక్కఁగా నలంకరించుకొని వాని రాకను ప్రతీక్షించుచు విమల శయన తలమున నున్నది.

శయనే సా చ కౌసల్యా శుచిస్మితా హ్యలంకృతా ॥

—ఆది. 105-48

సత్యవతి కృష్ణద్వైపాయనుని రెండవ పర్యాయము పంపినపుడు అంబిక తన దాసి ననేకభూషణాలంకృతఁజేసి తన శయనతలమున నుండఁబంచినది.

—నన్నయ. ఆది. 4-258

తతః స్వైర్ భూషణైర్దాసీ భూషయిత్వాప్సరోపమామ్ ॥

—వ్యా.భా. ఆది. 105-24

కామరూపధరయయిన హిడింబ యను రాక్షసి భీమసేనుని జూచి మనోభవాగ్ని సంజాతవదనయై

వితత బహురత్న రుచి శోభిత భూషణములు వెలుంగ
బెడఁగగు నవపుష్పిత జంగమలతక్రియ నున్నతకుచ చనుదెంచెఁ
బవన నందను డాయన్॥ —నన్నయ. ఆది. 6-189-90

ఊర్వశి యర్జున సంగమకాంక్షఁజేసి చంద్రికాధవళదుకూలంబు గట్టి మృగమద కర్పూరకుంకుమోన్మిశ్రిత సుగంధం బలంది వివిధ సురభికుసుమ విస్తరంబులు ముడిచి మణిమయాలంకృతయై...... పురందర నందను మందిరంబున కరుగుదెంచినది. —నన్నయ. అరణ్య. 2-355

మాల్యాభరణములు ధరించి యంగరాగమలఁదుకొని సుగంధద్రవ్యములతో సువాసితయై ప్రాణవల్లభుని సేవింపవలయునని ద్రౌపది సత్యభామకుఁ జెప్పినది.

మహార్హ మాల్యాభరణాంగరాగా
భర్తార మారాధయ పుణ్యగంధా ॥ —వ్యా. భా. వన 134-22

# కరభూషణములు

## కంకణములు

కంకణం కరభూషణమ్ : మౌక్తికాదులతో గూడిన కడియము

కంకణము ; ముత్తెములు పగడములు లోనగు వానిఁ జేర్చి గ్రువ్వఁబడిన చేసరము (శ. ర.)

ఊర్వశి కంకణ ఝణఝణాత్కారంబుల... మదనాజ్ఞా ఘోషంబునుం బోలె మ్రోగుచుండ నర్జునుకడ కరిగినది. —నన్నయ. అరణ్య. 3-358

ఋశ్యశృంగుని ప్రబోధించిన వేశ్యాపుత్రి సువర్ణ కంకణములు ధరించినది.

పాణ్యోశ్చ తత్వత్ స్వనవ న్నిబద్ధౌ
కలాపకా వక్షమాలా యథేయమ్ ॥ —వ్యా. భా వన. 112-5

ఇట కలాపకములనఁగా కంణములని నీలకంఠుఁడు వివరించినాడు.[1]

## హేమభద్రికలు

మాయాద్యూతము నందు ధర్మరాజుచే పణముగా నొడ్డఁబడిన లక్షమంది తరుణపరిచారికలు స్వర్ణమయము లయిన మంగళాభరణములు, శంఖవలయములు (సంకుగాజులు) కేయూరములు, బంగారు కంటెలు మున్నగు నాభరణములతో చక్కగా నలంకరించికొనియున్నారు.

శతం దాసీ సహస్రాణి తరుణ్యో హేమభద్రికాః
కంబుకేయూరధారిణ్యో నిష్కకంఠ్యః స్వలంకృతాః ॥ —వ్యా.భా సభా. 61-8*

భద్రికా - శుభకరమైనది. తాయెత్తు. An amulet 'హేమభద్రికాః' బంగారుతాయెతులు ధరించిన స్త్రీలు.

---

1 కలాపకౌ భూషణవిశేషౌ స్వార్థే కః కంకణౌ విత్యర్థః ॥ —నీలకంఠ. చిత్రశాలాప్రతి

"ఇసీ ప్రకార్ మేరీ హాథోంకీ కలాఇయోం మే మేరీ ఇస్ రుద్రాక్ష మాలాకీ భాంతి ఉన్‌నీ దో కలాపక (కంగన్) బాంధ్‌రఖే థే ఉన్ సేభీ బడీ మధుర ధ్వనీ హోతీరహ్‌థీ థీ ॥" —హిందీ అనువాదము. గోరఖ్‌పూర్ ప్రతి.

* "మేరేపాస్ ఏక్‌లాఖ్ తరుణీ దాసియోఁ హై జో సువర్ణమయ మాంగలిక అభూషణ్ కరీ హై జిన్‌కో హాథోం మే శంఖ్ కీ చుడియాఁ బాహోంమే భుజబంద్ కంఠోం మే నిష్కోంకాహార్ తథా అన్య అంగోంమే సుందర్ అభూషణ్ హై॥" —హిందీ అనువాదము, గోరఖ్‌పూర్ ప్రతి.

శంఖనిర్మితవలయములు : "కంబు కేయూరధారిణ్యః..."

కంబువు - శంఖము, కడియము, సంకుగాజులు (సూ.ని.)
A conch shell, A bracelet (V.S. Apte. S.E.D.)

కేయూర మన సందికడియము, దండకడియము.

కంబుకేయూరధారిణు లనగా ముత్తైపుజిప్పలతోను (గవ్వలతోను) జేయఁబడిన సందికడియములు ధరించిన వారనియుఁ జెప్పవచ్చును.

ఈ రాత్రి నాకు స్వామినివై నాతోఁ గడిపి నన్నలరించినచో నీకు స్వర్ణ హారములు, శంఖనిర్మితవలయములు (సంకుగాజులు) బంగారు చెవికమ్మలు మొదల గు నాభరణము లొసఁగెదని కీచకుఁడు సైరంధ్రిని వశపఱచుకొనఁ జూచినాఁడు.

సువర్ణమాలాః కంబూశ్చ కుండలే పరిహాటకే....
ఆహరామి చ వస్త్రాణి కౌశికాన్యజనాని చ॥ —వ్యా. భా. విరాట. 16-2

అర్జునుఁడు బృహన్నలవేషము వేసికొని,

'సంకుల బాహులయంద మెడల' విరటుకొలువున కరిగినట్లు
తిక్కన వర్ణించినాఁడు. —విరాట. 1-228

సంకు - 1 శంఖము. 2 శంఖవలయము. 3 సంకు అనుపూస (శ. ర) అనఁగా అర్జునుఁడు శంఖనిర్మితవలయములను దండికడియములుగా తన బాహువుల నలంకరించికొన్నాఁ డని యర్థము.

మూలమునం దిట్లున్నది.

దీర్ఘే చ కంబూపరి హాటకే శుభే॥ —విరాట. 11-2*

ఇటు కంబువులన శంఖనిర్మిత వలయములు.

మహాభారతకాలమున స్త్రీలు శుభప్రదములయిన శంఖ నిర్మిత వలయముల నెక్కువగా ధరించుచున్నట్లు తెలియుచున్నది.

---

1 "హాథ్ మే శంఖ్ కీ చుడియాఁ పహన్ కర్ ఉన్ కే ఊపర్
సోనే కే సుందర్ కంగన్ ధారణ్ కర్ లియే॥ —మహాభారత హిందీ అనువాద.

2. "The Jewellery termed Kumbha and Kurira was worn exclusively by women The latter shell bangles finely carved and inlaid with gold came to be known and Kumbu."
[B K. Chaturvedi : Jewellary of India, P]

## నూపురములు

కంకణముల వలె పాద నూపురములు మంగళప్రదములే. నూపురములన కాలియందియలు. మంజీరములు, హంసకములు.

అత్యంత ప్రాచీనకాలమునుండియు భారతనారీమణులు చేతులకు గాజులతోపాటు కాళ్ళకు కడియములు - అందెలు - ధరించుచున్నారు.

సీతాదేవి కేయూరములు నూపురములు ధరించినది.

**నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే**
**నూపురేత్వభిజానామి నిత్యం పాదాభివందనాత్ ॥**

**అని లక్ష్మణుఁడు రామునితోనన్నాఁడు.** —వా. రా. కిష్కింధ 6-23

సుభద్ర 'రణన్మణినూపురంబులు'[1] సమధ్వని నొప్పఁగ భక్తి పాదచారిణియయి కృతకయతివేషమున నున్న పార్థుని కడ కరిగినది.

ఊర్వశియు, మణిమయమంజీర ఝుళంఝుళ నాదంబులను[2]... మదనాజ్ఞాఘోషంబునుం బోలె మ్రోగుచుండ నర్జునుని కడకరుదెంచినది.

ఉత్తర నర్తనశాలకేగునపుడు చిరుగజ్జెలుగల యందియలు ధరించినది.

'అందియల మొరపంబున కరుగుదెంచి ప్రోదిరాయంచ రయమునఁ బోవు...' నని తిక్కన వర్ణించినాడు. —విరాట. 4-23

## కర్ణకుండలములు

మహాభారతమున స్త్రీలు మణికుండలములు ధరించుచుండిరి.

విరాటరాట్ పుత్త్రిక ఉత్తత ముత్యాలకమ్మలు పెట్టుకొనినది.

'కర్ణభూషణమౌక్తిక ప్రభాడోలన మీక్షణదీప్తుల నినుమడింప'
నాట్యమందిరమున కేగినది. —తిక్కన. విరాట. 4-26

ఉత్తర వివాహసమయమున సర్వాంగ సుందరులయిన స్త్రీలు మణి కుండలములు ధరించివచ్చిరి.

**ఆజగ్ముః చారుసర్వాంగ్యః సుమృష్టమణికుండలాః ॥**

—వ్యా. భా విరాట 72-39

ఇట మణికుండలము లనగా ముత్యాలకమ్మ లనికాని మరకతాదిరత్న స్థగితములయిన సువర్ణకుండలము లని కాని చెప్పవచ్చును.

---

1 నన్నయ. ఆది. 8-178 2 నన్నయ అరణ్య. 2-358

# పవడంపుజొత్తులా ?
# ప్రాకారవప్రకుండలములా ?

అథాపరోఽదృశ్యత రూపసంపదా
స్త్రీణా మలంకారధరో బృహత్ పుమాన్
ప్రాకార వప్రే ప్రతిముచ్య కుండలే
దీర్ఘే చ కంబూపరి హాటకే శుభే ॥ —వ్యా. భా. విరాట. 11-1*

కొన్ని దాక్షిణాత్య ప్రతులలో 'ప్రాకారవప్రే' యనుచోట 'ప్రవాళ చిత్రే' యను పాఠాంతరమున్నది.

తిక్కన కీ ప్రతి లభ్యమైనది కాఁబోలు.

"పవడంపు జొత్తులఁ జెవులు రూపడగంగ...
విరటు కొలువు సేర నరుఁడు వచ్చె"

నని తిక్కన వర్ణించినాఁడు. —తిక్కన విరాట. 1-228

పగడాల యొత్తిదనమున చెవులయంద మతిశయించిన దని చెప్పుటచే పవడంపుజొత్తులన పగడములు పొదిగిన బంగారుకమ్మ లని తెలియవచ్చును.

సంశోధిత మహాభారత ప్రతి స్వీకరించిన 'ప్రాకారవప్రే' యను పాఠమే సరియైన దని పండిత వాసుదేవ్ అగ్రవాలా అభిప్రాయ పడినాఁడు.

'ప్రాకారవప్రే' యను సమాసము 'కుండలే' యను పదమునకు విశేషణము గావున బృహన్నల ధరించిన కుండలములు ప్రాకారవప్రసదృశాకృతి గల వని నిరూపించినాడు.[1]

---

* ప్రాకారవప్రే స్థితైః తత్సమీపే వా స్థితో అదృశ్యత దృష్టః
ప్రతిముచ్య పరిధాయ దీర్ఘే కుండలే తాటంకే
కంబూనాం శంఖానాముపరి కంబూపరి హాటకే కనక మయవలయే చ
వరిముచ్య ॥ —నీలకంఠ. చిత్రశాలాప్రతి. పుట. 17

1. Cf :- V.S· Agrawala : Stukies iu Art. p. 95

"It is shown that the term **Prakāravapra** as the qualifying epithet of **Kundala** was used in a technical sense as the name of a particular kind of ear-ornament (Kandala). Illustrations of Pnkaravaprakundala have been given from Bharhut."

[Quoted by A.D. Prasalkar in Studies in Epics and Puranas of India. p. 132]

ప్రాచీన శిల్పకళానిలయములయిన భారహుత్ సాంచి మున్నగు చోట్ల లభ్యమైన యక్ష-యక్షిణి విగ్రహముల కర్ణాభరణములను పరిశీలించినచో ప్రాకారవప్రకుండలము లెట్లుండునో తెలియగలదు.

శిల్పులా విగ్రహముల చెవి తమ్మెలకు ముందుభాగమున చతుర్దశ పుష్పఫలకములు - వానినానుకొని యుద్వృత్తాకారభాగములు రెండేసి వంపులుగా వెనుకకు త్రిప్పఁబడినట్లుగా కర్ణభూష లమర్చినారు. ఈ విధమైన కర్ణభూషావిశేషమునకే ప్రాకార వప్ర కుండలము లనిపేరు.

ఇట్టి శిల్పములను బట్టి తచ్ఛిల్పరచనాకాలమునను - అనఁగా అశోకుని కాలమునకు [అందాజుగా క్రీ॥పూ॥ 272 నుండి 232 వఱకు] తత్పూర్వ కాలము నను భారతదేశమునందు స్త్రీ-పురుషు లిట్టి ప్రాకర వప్రకుండలములు ధరించు చుండి రని చెప్పవచ్చును.

బనారసు విశ్వవిద్యాలయ వాస్తుశిల్పశాఖాధ్యక్షుఁడు, పరిశోధకాగ్రేసుఁడు నైన ఆచార్య వాసుదేవశరణ అగ్రవాలా చేసిన యీ వివరణము[1] మిక్కిలి సమంజసముగా నున్నది.

అర్జునుఁడు బృహన్నల వేషము వేసినపుడు ధరించిన తాటంకములు స్వర్ణమయములే.

భూషణం త్వమలంకార్షైః కుండలైః పరిహాటకైః ॥
—వ్యా. భా. విరాట 10-26

కావున మహాభారతకాలమున హిరణ్యకారు లిట్టి స్వర్ణకుండలములు నిర్మించుచున్నారనియు, హిరణ్యకారులవలె ప్రతిమాకారులను తాము నిర్మించు విగ్రహములకు ఆభరణాద్యలంకారము లమర్చుచున్నా రనియు విదితమగుచున్నది

* ప్రాకార మనఁగా గుడి, కోట మున్నగు వానిచుట్టు నుండు ఎత్తైనకోట వప్ర మనగా ప్రాకారమూలము. ఈ కుండలములతో పునాకారము ప్రాకార మనియు వృత్తాకారము వప్రమనియు తెలియువలయును. పూర్వకాలమున కొన్ని పురప్రాకారములు చతుర్దశ కుసుమావళి గల శిల్పములతో నలంకరింపఁబడియుండుటయు గమనింపఁదగినది.

1 వి. యస్. అగ్రవాలా : స్టడీస్ ఆఫ్ ఇండియన్ ఆర్టు. పుట 95

# మహిమాన్వితములైన మణికుండలములు

స్యందతే హి దివా రుక్మం రాత్రౌ చ ద్విజసత్తమ ॥

అయుదం కుండు గురుహితకార్య ధురంధరుండయి గురుపత్నీ నియోగంబునం బౌష్యుండను రాజు దేవి కుండలములం[1] బ్రతిగ్రహించి వచ్చుచుండగా, మాయాదక్షుఁడగు తక్షకుఁ డా మణికుండలములు[2] హరించి పాతాళలోకమున కరిగెను.

ఉదంకుండును వానితోడన తగిలి యురగలోకమున కరిగి నాగపతులను స్తుతియించి వానిని తిరిగి సంపాదించికొని వచ్చి గురుపత్ని కిచ్చెను. గురుపత్నియు సంతసిల్లి తదానీతరత్నకుండల భూషితయై[3] బ్రాహ్మణులం బూజించి నిజసంకల్పిత మహోత్సవం బొనరించెను.

ఆ గురుపత్ని యొనరించినది పుణ్యక వ్రతము[4]

ఉదంకున కీ మణికుండలముల నొసఁగుచు, సౌదాస నరేంద్రుని భార్య మదయంతి వాని మహిమ నిట్లుగ్గడించినది.

**సురలు గంధర్వులు నురగులు నికుండలములకు బెక్కుపాయముల వేచి**
**తిరుగుదు; రెంగిలి పొరసిన, నేమఱి నీవు నిద్రించిన నేలవిడిన నపహరింతురు;**
**భక్తి నర్చించి యివి తాల్ప నాకలి నీరువ ట్టగ్నిభయము**
**విషవికారము భూతబేతాళబాధలు పొరయవు, వినుము**
**బాలురకునైనఁ బెద్దవారికి నైనఁ బెట్టిన నయ్యయి కొలఁది నమరియుండుఁ**
**గురియుఁ బసిఁడి;**
**వీని నప్రమత్తవృత్తిమైఁ గైకొని చనుమయ్య గురులు నిన్ను నభినుతింప.**

—తిక్కన. అశ్వమేధ. 3-97*

ఇవి విశిష్టరత్నమహాకుండలములు —[ „ 3-09]

---

1 నన్నయ. ఆది. 1-93
2 నన్నయ. ఆది. 1-102
3 నన్నయ. ఆది. 1-115
4. వ్యా. భా. ఆది. 3.99

* వ్యా. భా. అశ్వమేధ 58-22-28

ఇమే హి దివ్యే మణికుండలే......
స్యందతే హి దివా రుక్మం రాత్రౌ చ ద్విజసత్తమ
నక్తం నక్షత్ర తారాణాం మాక్షిప్య వర్తతే॥

కంటెలు : కాసులపేరులు

కంటె - కంఠికా చక్రాకారమున నుండు కంఠాభరణము (సూ. ని.) ఇది కుత్తుకచుట్టునది.

కాసులపేరు లన బంగారునాణెములతోఁ జేయబడిన హారములు.

ధర్మజుని దాసీజనము బంగారుకంటెలు ధరించి యున్నారు.

.........నిష్కకంఠ్యః స్వలంకృతాః ॥ —వ్యా.భా. సభా. 62-9*

బ్రాహ్మణవేషము ధరించి వచ్చిన యింద్రునితో కర్ణుఁడు, వలసినచో బంగారు కంటెలు ధరించిన యువతుల నొసఁగుదు నన్నాఁడు.

హిరణ్యకంఠీః ప్రమదా గ్రామాన్ వా —వ్యా.భా. వన. 310-2

ఋశ్యశృంగుని వశపఱచుకొనుట కరిగిన వేశ్యాపుత్రి 'ఆ ధా ర రూ ప' యను కంఠాభరణము ధరించినది.

ఆధార రూపా[1] పునరస్య కంఠే విభ్రాజతే విద్యుదివాంతరిక్షే॥

—వ్యా.భా వన 112-3

సుభద్రార్జునుల వివాహానంతరము కృష్ణుఁడు రమ్య భూషణాలంకృత స్త్రీ సహస్రంబు నిచ్చినట్లు నన్నయ వర్ణించినాఁడు. [నన్నయ. ఆది. 8-221]

ఈ దాసీస్త్రీలు నూఱుకాసులు గల పేరులు ధరించినట్లు మూలము నందున్నది.

సువర్ణశతకంఠీనా[2] మరోమాణాం స్వలంకృతామ్
పరిచర్యాసు దక్షాణాం ప్రదదౌ పుష్కరేక్షణః ॥ —ఆది. 221-50

సువర్ణమాలలు

దుష్యంతుఁడు తనను పెండ్లాడినచో సువర్ణమాలలు, హేమకుండలములు మంచిముత్యములు మొదలగునవి యిత్తు నని శకుంతలతో నన్నాఁడు.

సువర్ణమాలాం వాసాంసి కుండలే పరిహాటకే ॥—వ్యా. భా. ఆది 15-48

విరాటరాజపుత్త్రిక ఉత్తర కాంచనమాల ధరించినట్లు వర్ణింపఁబడినది.

సా ప్రాద్రవత్ కాంచనమాల్యధారిణీ ॥ —వ్యా. భా. విరాట 31-7
కి మాగమః కాంచనమాల్యధారిణీ ॥ —విరాట 37-5

---

* నిష్కకంఠ్యః కంఠికా కంఠ్యః ॥ —దేవబోధ

1 ఆధార రూపా ఆలవాల సదృశీ కంఠాభరణవిశేషః ॥ —నీలకంఠ.
—ఆశ్చర్యరూపా యని పాఠాంతరము.

2 సువర్ణమణిశతం కంఠే యా సా తాసామ్ ॥ —నీలకంఠ.

## కాంచికలాపము : కటికలాపము

మేఖల, కాంచి, సప్తకి, రశనా, సారసవము - అనునవి పర్యాయ పదములు.

స్త్రీ కట్యాం మేఖలా కాంచీ సప్తకీ రశనా తథాక్లీబే సారసవంచ... —[అమరం]

మేఖలకు 8 సరములు; కాంచికి 1 సరము; సప్తకికి 7 సరములు; రశనకు 16 సరములు; సారసవమునకు 3 సరములు నుండును.

క్వణదణు కింకిణీకలిత కాంచన కాంచి కలాపమున్ రణ
న్మణికల నూపురంబులు సమధ్వని నొప్పఁగ భక్తిఁ బాద చా
రిణియయి కన్యకాజనపరీత సుభద్రి త దద్రిపూజన
ప్రణతులు సేసె నిందరిసుతుఁ బార్థు నిజేశ్వరుగాఁ దలంచుచున్.
—నన్నయ ఆది. 8-178

కాంచి యనఁగా ఒంటిపేటగల ఆడుదాని మొలనూలు. [శ. ర.]

కలాపమనఁగా భూషణము [శ. ర.]

సుభద్ర ధరించిన మొలనూలు (కాంచి) బంగారుతోఁ జేయఁబడినది. దానికి చిన్నచిన్న గజ్జెలున్నవి.

ఊర్వశి... మణిమయాలంకృతయై... కటికలాప కింకిణీ క్రేకారంబులును మదనాజ్ఞా వాద్యఘోషంబునుం బోలె మ్రోయుచుండ మందగమనంబునఁ బురందరనందన మందిరంబునకుఁ బోయినది.-నన్నయ, అరణ్య.2-358

కటికలాప మనఁగా కటి పై ధరించు నాభరణము. (శ. ర.)

ఇట కలాపమనగా ఇరువదియైదు పేటలు గల స్త్రీల యొడ్డాణము ఈ యొడ్డాణమునకును చిఱుగజ్జెలున్నవి.

మూలమునందు 'రసనాదామభూషితమ్' అనియున్నది.[వ్యా.భా.వన.46-10]

రసనాదామ మనఁగా పదునాఱుపేటలు గల కటిసూత్రము.

ఋశ్యశృంగుని ప్రబోధింపఁబోయిన వేశ్యాపుత్రి బృహత్కటిభారమునం దొక్క కనకపట్టము వెలుగుచున్నది. —[నన్నయ. అరణ్య. 3-104]

మూలము నందిచ్చట 'హిరణ్మయీమేఖలా' అనియున్నది. —[వన. 112-4]

ఉత్తర మణిఖచితమయిన కటిసూత్రము ధరించినది.

తన్వీ శుభాంగీ మణిచిత్రమేఖలా
మత్స్య రాజోదుహితా శ్రియా వృతా॥ —వ్యా. భా. విరాట. 37-2

## హిరణ్యాభరణధారణమంత్రము

సమస్త హిరణ్యాభరణ ధారణ సమయములందు వేదోక్తమయిన యీ క్రింది హిరణ్యసూక్తము పఠింపవలయును.[1]

### హిరణ్యసూక్తము
(శుక్ల యజుర్వేదోక్తము)

**దక్ష ఋషిః హిరణ్యంతేజో దేవతా ॥**

ఆయుష్యం వర్చస్యమ్ రాయస్పోషమౌద్భిదమ్
యం హిరణ్యం వర్చస్వజ్ జైత్రాయా విశతాద్ మామ్॥ (50)

న తద్ రజాంసి న పిశాచాస్తరంతి దేవానా మోజః ప్రథమజం హ్యేతత్
యో బిభర్తి దాక్షాయణం హిరణ్యం స దేవేషు కృణుతే॥
దీర్ఘమాయుః స మనుష్యేషు కృణుతే దీర్ఘమాయుః ॥ * (51)

యదా బధ్నన్ దాక్షాయణా హిరణ్యమ్ శతానీకాయ సుమనస్యమానాః ॥
తన్మ ఆ బధ్నామి శతశారదాయాయుష్మాన్ జరదష్టి ర్యథాసమ్ ॥ (52)
—యజుర్వేద [వా. సం.] 34-50-52

దీర్ఘాయువును, వర్చస్సు, ఐశ్వర్యమును, పుష్టిని ఒసఁగు హిరణ్యమును నేను విజయప్రాప్తికై ధరించుచున్నాను. (50)

ఈ హిరణ్యము మొదట దేవతల నుండి యుత్పన్నమైనది. తేజోవంతమయినది. కావున హిరణ్యాభరణములను ధరించిన వారి నుండి రాక్షసపిశాచములు తొలఁగి పోవుచున్నవి. ఈ హిరణ్యము దరించుట వలన దేవతలెట్లు దీర్ఘాయుష్మంతులగుచున్నారో మనుష్యులు నట్లే దీర్ఘాయుష్మంతులగుచున్నారు. (51)

చతురులును విజ్ఞానవంతులును, మంచిమనస్సు గలవారును శతానీకము కొఱకు అనఁగా బలవృద్ధి కొఱకు ఏ సువర్ణాభరణములు ధరించుచున్నారో అట్టి సువర్ణాభరణములను నేను ధరించుచున్నాను. నాకు పూర్ణ జీవితమును దీర్ఘాయువును గలుగుగాక. (52)

---

1 చూడు :- వడ్డెపాటి నిరంజనశాస్త్రి : విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము.

* పోల్చు :- ఋగ్వేద. ఖిల, 10-128-8; అథర్వ. 1-35-2

## హిరణ్యభూషణధారణము : పురుష ప్రకారము

ఆయుష్య మితి సూక్తేన మణిం కంఠే ప్రతిముచ్య
ఉష్ణీషం కృత్వా....॥ —ఆశ్వలాయన గృహ్యసూత్రములు

ఇట మణి యన బంగారుపూస. A Strungup bead of gold.

వేదాధ్యయనానంతరము సమావర్తనమునందు స్నాతకుఁడు ఆయుష్య మను పదముతో నారంభమగు హిరణ్యసూక్తమును పఠించుచు మణిని - బంగారుపూసను - ధరింపవలెను. [1]

స్నాతక వ్రతమునందలి భూషణధారణ మను కర్మయందు స్నాతకుఁడు హిరణ్య సూక్తమును పఠించుచు నూతనాలంకారములు ధరింపవలె నని ప్రయోగ పారిజాతమునందుఁ జెప్పఁబడినది. [2]

భూషణై శ్చాయుష్యం వర్చస్యమితి సూక్తంపఠన్ భూషయేత్.

ఈ సూక్తమునకు ఋషులు సానగాదులు.

సువర్ణాభరణము వలన తేజోబలాయుర్వృద్ధులే కాక పురుషులకు వీర్య పుష్టియు (ఓజస్సు) గలుగు నని అథర్వవేదీయ హిరణ్యసూక్తము[అథర్వ. 1-35] వలనఁ దెలియుచున్నది.

ఈ సూక్తమునకు ఋషి అథర్వుఁడు; దేవత హిరణ్యము. సర్వ సంపత్కర్మలలో దీనికి వినియోగము.

ఈ హిరణ్యసూక్తము పఠించుచు పురోహితుఁడు ప్రతిదినము రాజున కాభరణములొసఁగ వలెను. [3]

అపాం తేజో జ్యోతి రోజో బలం చ వనస్పతీనా ముత వీర్యాణి
ఇంద్ర ఇవేంద్రియాణ్యధి ధారయామో
అస్మిన్ తద్ దక్షమాణో బిభరద్ధిరణ్యమ్. —అథర్వ. 1-35-3

---

1. Cf : V. M. Apte : Rigveda Mantras in their Ritual Setting in the Grihya Sutras. p.p 37-35
"In the Samavarta ceremony he (i.e. Snataka) puts a mani (a strung up bead of gold) round his neck with the hymn 'Ayushyam' and having arranged his head-dress etc......"

2. చూడు :- నిరంజనశాస్త్రి : విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమము పు. 118
"ఆయుష్యమితి సూక్తస్య సానగాదయః ఋషయః ।
హిరణ్యం దేవతా । అలంకారధారణే వినియోగః ॥"

3. చూడు :- విద్వాన్ విశ్వం : తెలుగు అథర్వవేదసంహిత, 1-35

ఈ మంత్రమునకు భావార్థము :

ఉదకము లందలి తేజస్సు, అగ్న్యాది జ్యోతులందలి ఓజస్సు, బలమును, ఓషధులందలి వీర్యపుష్టికరగుణములన్ను, ఈ హిరణ్యమును ధరించు పురుషునియం దావహిల్లఁజేయుచున్నాము. ఐశ్వర్యాది గుణసంపన్నుఁ డయిన యిందు్రనివలె వర్ధిల్లుటకై యీ వర్ధమాన పురుషుఁడీ హిరణ్యమును ధరించుగాక.

ఓజస్సన వీర్యపుష్టి - Viritity, the generative faculty.

## హిరణ్యాగ్నులసంబంధము

హిరణ్య శబ్దమునకు సువర్ణ మ[illegible] రేతస్సనియు నర్థములు.
హిరణ్యం రేతసి ద్రవ్యే శాతకు [illegible]రాటయోః॥ —మేదినీకోశం
అగ్ని హిరణ్యరేతసుఁడు.[1] [illegible]ణ్యకర్త.[2]

"వహ్ని హిరణ్యాత్మక రేతోమూర్తియై హిరణ్యరేతుఁడనఁబడు...... అవ్విధంబున రూపవంతంబైనది కావున సువర్ణంబు జాతరూపనామకంబై పరఁగు" నని వసిష్ఠుఁడు పరశురామునికి సువర్ణ మహిమను దెలిపెను.

—తిక్కన ఆనుశాసనిక. 3-151

[illegible]ణ్యము హిరణ్యమూర్తియైన కార్తికేయునకు [illegible]యిమయినది. నాశరహితమయినది.

తస్మాత్ సువర్ణం మంగల్య మక్షయ్య ముత్తమమ్
సహజం కార్తికేయస్య వహ్నేస్తేజః పరం మతమ్ ॥

—వ్యా.భా అను 86.33

సువర్ణమగ్నికి రేతో రూపము. అగ్ని రేతో సువర్ణస్యాత్॥ -అగ్నిపురణము

"అగ్ని మూలం బలం పుంసాం రేతో మూలంతు జీవితమ్" అను వైద్యశాస్త్రోక్తి ప్రకారము అగ్నితేజమయిన హిరణ్యమును ధరించుట వలన పురుషులకు జఠరాగ్ని హెచ్చి, బలమును, రేతోవృద్ధియు దాని వలన నాయుర్వృద్ధియుఁ గలుగు నని చెప్పఁబడినది.[3]

కావున అత్యంత ప్రాచీనకాలమునుండియు పురుషులు సువర్ణాభరణములు ధరించుచుండిరి.

---

1. హిరణ్యరేతాః సప్తార్చిః వసురేతా హుతాశనః॥ —వైజయంతీ
2. "కుమారసూ స్త్వం భగవాన్ రుద్రగర్భో హిరణ్యకృత్॥" —వ్యా.భా. సభా. 21-41
3. చూడు : నిరంజనశాస్త్రి : విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమము. పుట. 110

అగ్ని ర్బ్రహ్మా పశుపతిః శర్వో రుద్రః ప్రజాపతిః
అగ్నే రపత్యమేతద్ వై సువర్ణమితి ధారణా ॥

—వ్యా. భా. అను 85-147

మహాభారతకాలమున స్త్రీలవలె పురుషులును కరభూషణములు, కుండలములు, కేయూరములు, కంటెలు, కాసుల పేరులు ధరించుచుండిరి.

## కరభూషణములు

ధర్మరాజుతో జూదమాడు నపుడు దుర్యోధనుఁడు ముందుగా 'తన చేతి యనర్ఘరత్నకటకము' నొడ్డినాఁడు. —నన్నయ. సభా. 2-175

కటకం వలయోఽస్త్రియమ్. కడియము పేళ్లు, (అమరము)
కడియ మనఁగా వలయాకారముగా నుండు హస్తభూషావిశేషము. (సూ.ని.)
రత్నకటకములన రత్నఖచిత సువర్ణకటకములు.

ఘటోత్కచుఁడు కరభూషణములు, భుజకీర్తులు ధరించినాఁడు.

తథైవ హస్తాభరణౌ మహామాయాంగదే తథా॥ —వ్యా. భా. ద్రోణ 175-8

యక్షుఁడు బంగారుమురుగులు ధరించినట్లు తెలియుచున్నది.

నీత్వా మాసాన్ కనకవలయభ్రంశ రిక్త ప్రకోష్ఠః ॥

—కాళిదాసు - పూర్వమేఘ. 2

## కుండలములు

ద్రౌపదీ స్వయంవరమునకు వచ్చిన రాజులు చెవిపోఁగులతో నలంకరించికొని యుండిరి. అట్లే పాండవులును.

తేఽలంకృతాః కుండలినో యువానః పరస్పర్ధమానా నరేంద్రాః ॥

—వ్యా. భా. ఆది . 186

తతస్తు తే కౌరవరాజపుత్రాః విభూషితాః కుండలినో యువానః ॥

—వ్యా. భా. ఆది. 197-9

దమయంతీ స్వయంవరమునకు వచ్చిన భూపాలు రెల్లరు మణికుండలములు ధరించిరి.

సురభి స్రగ్ధరాః సర్వే ప్రమృష్ట మణికుండలాః ॥ —వ్యా. భా. వన. 57-4

ఘటోత్కచుఁడు కుండలములు హిరణ్యమాలయు ధరించినాడు.

కుండలే బాలసూర్యాభే మాలాం హేమమయీం శుభామ్ ॥

—వ్యా. భా. ద్రోణ. 16-2

కంఠాభరణములు

అఖిలదేవసేనాధిపత్యంబునం దభిషిక్తుండైన కుమారుని వీక్షించుటకు వచ్చిన మహాదేవుఁడు మహాసేనుం గనుంగొని యతనికి విశ్వకర్మ నిర్మితంబును హేమమయంబును నయిన పుష్పమాలిక నొసంగె నని మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ జెప్పినాఁడు. —ఎఱ్ఱన. అరణ్య. 5-224

అశ్వమేధయాగదీక్షితుఁడైన ధర్మరాజు బంగరుగొలుసులు, బంగరుకంటె ధరించినాఁడు.

హేమకూలీ రుక్మకంఠః ప్రదీప్త ఇవ పావకః ॥

—వ్యా. భా. అశ్వమేధ 724*

పాండురాజు కాసులపేరు ధరించినాఁడు.

తతః చూడామణిం నిష్కమంగదే కుండలాని చ॥

—వ్యా. భా. ఆది. 119-38

నిష్కమన కాసులపేరు. 'నిష్కగ్రైవేయకమ్' —నీలకంఠ.

A golden ornament for the neck or breasts [V.S. Apte : S.E.D ]

నిష్కమన వక్షస్థలాభరణమని హిందీ టీకాకారుడు వ్రాసినాఁడు.

రాక్షస వీరులును సువర్ణాభరణములు ధరించుచుండిరి.

సువర్ణ నిష్కహారములు, కుండలములు, అంగదములు ధరించిన కాలేయదైత్యులు నిహతులై పుష్పితపలాశవృక్షముల వలె నున్నట్లు వర్ణింపఁబడినది.

తే హేమనిష్కాభరణాః కుండలాంగదధారిణః
నిహతో బహ్వశోభంత పుష్పితా ఇవ కింశుకాః ॥

—వ్యా. భా. వన. 105-15

వృత్రాసురుఁడు కాంచనమాల్యధారి.

స శక్రవజ్రాభిహతః పపాత
మహాసురః కాంచన మాల్యధారీ ॥ —వ్యా. భా. వన. 101-15

* Cf :- B.K. Chaturvedi : The Jewellery of India. p. 27
"During this Age 'NISKA and RUKMA used to mean pendants to ornamenat chains and necklace respectively. It is because of pendant's form that Niska came to be known as name of currency prevelant of that period in sansckrit. And possibly Rukma is persian RAQUM (amount of money).

# కేయూర హారములు

కేయూరములు : కేయూర మంగదం భూషా దోర్మూలే. —వైజయంతి

కేయూర మన దండకడియము; సందికడియము.
కేయూరాంగదములు సమానార్థకములే, భుజకీర్తులు.
Armlet Worn on the upper arm by both the sexes.

దుర్గాదేవి కేయూరాంగదధారిణి॥ —వ్యా.భా. విరాట. 6-8

ఇంద్రుడు కిరీటమును ఎఱ్ఱని యంగదములు ధరించినాడు.

బిభ్రద్ వపురవిర్దేశ్యా కిరీటీ లోహితాంగదః ॥ —వ్యా భా. సభా. 7-1

కౌరవ శిబిరమునందలి నరేంద్రులు చందనాగురుచర్చితము లయిన తమ భుజములకు కాంచనాంగదములు ధరించియుండిరి.

కాంచనాంగద దీప్తైశ్చ చందనాగురుభూషితాన్ ॥ —ఉద్యోగ. 153-19

క్రీ॥పూ॥ 3వ శతాబ్దికి చెందినదిగా భావింపబడుచున్న పటనా యక్ష విగ్రహము హస్తకంకణములు, కేయూరములు ధరించియున్నది. కావున భారతదేశమునందు ప్రాచీనకాలమున నుండియే స్త్రీ పురుషులు కేయూరాది భూషణములు ధరించుచుండి రని తెలియుచున్నది.[1]

## హారములు

అంగరాజ్యమున కభిషిక్తుడయిన కర్ణుడు, 'మణిమకుట కేయూర హారాదిశోభితుడై' యొప్పెనని నన్నయ వర్ణించినాడు.[2]

సుభద్రా వివాహమునకు వచ్చిన యనిమిషప్రభుడు నిజాత్మజు "ననుపమ కేయూరహారాది భూషణాభిశోభితుఁజేసి" యానందించి నాడు.[3]

హారము = నూట యెనిమిది పేటలుగల ముత్యాలపేరు. (శ.ర.)

1. Cf. : Miss Nileswari Desai : Ancient Indian Society, Relegion and Mythology as depicted in Markandeya Purana
"The Yaksha statue from PATANA of about the third centart B. C shows that both bracelets and armlets were used in thay period."

2) నన్నయ. ఆది 6-97 —వ్యా. భా. ఆది. 135-38

సమకుటహారకేయూరైః సహస్తాభరణాంగదైః
రాజ లింగై స్తథాఽన్యైః భూషణో భూషణైః శుభైః ॥

3) నన్నయ ఆది. 8-195

## ముత్యాలహారములు

మహాభారతకాలమున స్త్రీ పురుషులు ముత్యాలహారములు ధరించుచుండిరి.

ముత్యాలసరములను స్త్రీలు మెడలో ధరించినను అవి వారి స్తనములపై నర్తించుచు స్తనములకు శోభఁ గూర్చుచుండును

ఊర్వశి నడచునపుడు హారములు [ముత్యాలదండలు] ధరించుటచే మనోహరములైన యామె కుచము లెగసిపడుచున్నవని వ్యాసుడు వర్ణించినాఁడు.

దివ్యాంగరాగౌ సుముఖౌ దివ్యచందన చర్చితౌ
గచ్ఛంత్యా హారరుచిరౌ స్తనౌ తస్యా వవల్గతుః ॥

—వ్యా. భా. వన. 46-8

శిల్పులు ముత్యములకు బెజ్జములు వేసి వానిని సువర్ణరజతాది సూత్రములతో నేకీకృతము చేసి పెక్కుపేటలతో హారములు చేయుదురు. ఈ హారములకు మధ్యభాగమున మణిగణ స్థగితములయిన సువర్ణపదకము లుండును.

ముత్యములు ఏనుఁగుకుంభస్థలము, మేఘము, పందికోర, శంఖము, మత్స్యశిఖ, పాముపడగ, ముత్తెపుఁజిప్ప, చెఱకు, బొంగు వెదురు - వీనియందు పుట్టును. ముత్తెపుఁజిప్పలందు పుట్టినవే తరచుగా వాడఁబడును. (శ.ర.)

ముత్తెపుఁజిప్పలు శృంగళము, రావణము, తామ్రపర్ణి యని మూఁడు విధములు.

శృంగళ మను ముత్తెపుఁ జిప్పలయందుఁబుట్టు ముత్యములు ఎఱ్ఱని రంగులో నుండును. రావణశుక్తి యందు జనించు ముత్తెములు బంగారు రంగు వంటి మిసిమిగలవై శాస్త్రానుకూల లక్షణములతో నొప్పారుచుండును.

శృంగళపు శుక్తి ముత్యము రంగుగఁ గెంజాయనమరు; రావణశుక్తిన్
బొంగారు మౌక్తికంబులు బంగారమువన్నె శాస్త్రపద్ధతి నమరున్.[1]

శంఖములలో జనించు ముత్యము పావురము (గువ్వ) గ్రుడ్డువలె మెఱయుచుండును. అది మంత్రసాధనపరులకు మాత్రమే లభ్యమగు ననియు నితరులకు దుర్లభ మనియుఁ జెప్పఁబడినది.

1. 2. చూడు :- భైరవకవి. రత్నపరీక్ష [అగస్త్యకృతము]
—వావిళ్ల రామస్వామి ఎండ్ సన్స్.

వరశంఖ జనితమౌక్తిక మరయఁ గపోతాండభాతి నత్యుజ్జ్వలమై
పరగునది మంత్రసాధన పరులకుఁదక్కంగ దుర్లభం బితరులకున్॥
—భైరవకవి, రత్నపరీక్ష.

మహాభారతకాలపు జనులు సముద్ర గర్భమునం దుద్భవిల్లిన ముత్యములు ప్రశస్తము లని భావించుచుండిరి.

ధర్మరాజు శకునితో జూదమాడుచు, "సాగరావర్త సంభవంబులయిన పరార్థ్యమణిహారంబు" లొడ్డినాఁడు. —నన్నయ. సభా. 2-175

అయం బహుధనో రాజన్ సాగరావర్త సంభవః
మణిర్ హారోత్తరః శ్రీమాన్ కనకోత్తమ భూషణః ॥
—వ్యా.భా. సభా. 60-8

ఇట మణిహార మనఁగా ముత్యాలహారమే.[1]

శంతను మహారాజు కీర్తి దిక్కాంతామణుల కంఠముల నలకరించిన ముక్తాహారముల వలె వెలుఁగు చున్నదని నన్నయ వర్ణించినాడు.

తన కాజ్ఞావశవర్తులై మహి సమస్త క్షత్రవంశేశు లె
ల్లను భక్తిం బని సేయుచుండఁగ విశాలంబైన సత్కీర్తి ది
గ్వనితా మౌక్తికదామ లీల వెలుఁగన్ వారాశిపర్యంత భూ
జన రక్షాపరుఁ డయ్యె శంతనుడు రాజద్రాజధర్మస్థితిన్॥ —ఆది. 4-163

ఇట్లు వర్ణించుట వలన ముత్యాలహారముల ప్రాశస్త్యము చెప్పకయే చెప్పినట్లయినది.

ముక్తాహారము శరీరమునకు చల్లఁదనమును మనస్సున కాహ్లాదమును గలిగించు వస్తువులలో నొక్కటిగా భావింపఁబడినది.

పుత్ర గాత్ర స్పర్శ యంతకంటె హృద్యమయినది, అది వేఱు విషయము.

విపరీత ప్రతిభాషలేమిటికి నుర్వీనాథ ! యీ పుత్రగా
త్రపరిష్వంగ సుఖంబు సేకొనుము; ముక్తాహార కర్పూరసాం
ద్రపరాగప్రసరంబుఁ జందనముఁ జంద్ర జ్యోత్స్నయున్ బుత్రగా
త్రపరిష్వంగము నట్లు జీవులకు హృద్యంబే కడున్ శీతమే॥

అని శకుంతల దుష్యంతు నర్థించినది. —నన్నయ. ఆది 4-91

---

1. "This excelent wreath of pearls produced by ocean by churning it, So beautiful and deckee with pure gold. — P. C Roy

## మణిమయాభరణములు

ఉ. భూతితో మణిమయాభరణద్యుతు లొప్పఁగా శత
శచీసమేతుఁ డయి కాంచన చారువిమాన మాలికా
గ ముల్ గొలువఁగా గొలువుండు వరాప్సరోంగనా
యత టాక్ష కుసుమార్చిత సుందర వక్త్రచంద్రుఁడై॥

—నన్నయ. సభా. 1-64

వైదికయుగము రము రత్నము విరివిగా లభించు చుండుట
వా కాలపు జ సువర్ణరత్నాభరణములు ధరించుచుండిరి.
రికి కావలసిన సు రత్నముల కొఱకు భూదేవిని ప్రార్థించుచుండిరి.

నిధిం బిభ్రతీ బహుధా గుహా వసూ
మణిం హిరణ్యం పృథివీం దదాతు మే॥

[నిధి నిక్షేపములతో నిండియున్న వసుంధర మాకు వాసస్థానములు మణులు బంగారము ప్రసాదించుగాక. —పృథివీ సూక్తము. అథర్వ. 12-1-44

భూమికి రత్నగర్భ యనిపేరు. [రత్నగర్భా కాశ్యపీ భూః ॥–[వైజయంతి]

ఈ పృథివియందు శుభ ప్రదములయిన రత్నము లెన్నియున్నవో అవి యన్నియు నీకు ప్రాప్తించుఁగాక! నీవు నూఱేండ్లు సుఖముగా నుందువు గాక యని కుంతీదేవి గుణవతియైన కోడలి నాశీర్వదించినది.

పృథివ్యాం యాని రత్నాని గుణవంతి గుణాన్వితే
తాన్యాప్నుహి త్వం కల్యాణి సుఖినీ శరదాం శతమ్॥ —వ్యా. భా. ఆది. 198-11

వివాహసమయమున పాండవులేవురు రత్నభూషణములు ధరించిరి.[1]

పాండవులేవురకుఁ బాంచాలిం బరమోత్సవంబున వివాహంబు సేయించి ద్రుపదుండయ్యేవురకు వేఱువేఱ యనర్ఘ మణిఖచితంబు లయిన యాభరణంబుల నిచ్చెను.[2]

వాసుదేవుఁడు సంతసిల్లి వారేవురకు, వజ్ర వైడూర్య మరకత మౌక్తిక విభూషణములు...... పుత్తెంచెను.[3]

---

1 నన్నయ. ఆది. 7-284; 2 నన్నయ ఆది 8-2
3 నన్నయ. ఆది. 8-7 —వ్యా. భా. ఆది 198-13
"వైడూర్యమణి చిత్రాణి హైమాన్యాభరణాని చ"

## మణిభూషణములు : మహావిష్ణువు

శంఖ చక్రగదాధరు శార్ఙ్గిఁ బుండరీకసన్నిభాక్షుఁ

గిరీటకుండలాభిరాము శ్రీవత్ససంశోభితవక్షుఁ

గౌస్తుభోజ్జ్వలుఁ గలలోనఁ గను నతండు. —తిక్కన, అనుశాసనిక. 4-379

### కౌస్తుభమణి

సముద్రమథనావసరంబున క్షీరసముద్రము నందుద్భవిల్లి, "నిజప్రభాపటల పర్యుదస్త ప్రభాకర గభస్తి విస్తరంబయిన కౌస్తుభంబును నారాయణు వక్షస్థలంబున విలసిల్లె" —నన్నయ ఆది. 2-11*

ఆది నిర్మలము నిర్గుణమునయిన విశ్వాత్మ రూపమనియు, దానిని శుద్ధ క్షేత్రజ్ఞ స్వరూపమునకు సంకేతముగా శ్రీహరి ధరించు చున్నాఁ డనియు విష్ణుపురాణము వివరించు చున్నది.[1]

ఆత్మాన మస్య జగతో నిర్లేప మగుణామలమ్
బిభర్తిం కౌస్తుభమణిస్వరూపం భగవాన్ హరిః ॥

—విష్ణు. 1-22-68

కౌస్తుభము పద్మరాగరత్న మని భాగవత మహాపురాణము చెప్పుచున్నది.

కౌస్తుభాఖ్య మభూద్ రత్నం పద్మరాగో మహోదధేః
తస్మిన్ హరిః స్పృహాం చక్రే వక్షోఽలంకరణే మణౌ॥

—వ్యాస. భాగ. 8-8-5

### పంచరత్నమాల

పంచరూపా తు యా మాలా వైజయంతీ గదాభృతః
సా భూతహేతుసంఘాతా భూతమాలా చ వై ద్విజ॥ —విష్ణు. 1-22-72

గదాధరుఁడు ధరించిన వైజయంతీమాల ముక్తామాణిక్య మరకతేంద్ర నీల హీరకాది పంచరత్నయుక్తమనియు, వ్యాఖ్యాతలు వివరించినారు.[2]

---

*వ్యా. భా. ఆది. 18-26 — కౌస్తుభస్తు మణిర్దివ్యం ఉత్పన్నఘృతసంభవః
మరీచి వికచః శ్రీమాన్ నారాయణ ఉరోగతః

1. 2. చూడు : శ్రీ విష్ణుపురాణ - హిందీ అనువాదసహితము
అనువాదకులు : శ్రీమునిలాల్ గుప్త. —గీతాప్రెస్.

## మకుటములు : మణికిరీటములు

అరిది తపోవిభూతి నమరారుల బాధలు వొందకుండఁగా
సురగుల నెల్లఁగాచిన మహోరగ నాయకుఁ దానమత్సురా
సుర మకుటాగ్రరత్నరుచిశోభిత పాదున కద్రినందనే
శ్వరునకు భూషణంబయిన వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

అని యుదంకుఁడు నాగరాజును స్తుతించినాఁడు. [నన్నయ. ఆది 1-1/5]

పరమేశ్వరుఁడు దేవదానవులు పాదాభివందనము చేయఁగా వారి కిరీటము లందలి మణులకాంతులచే శోభిల్లు పాదములు గలవాఁడని వర్ణించఁ బడినది.

మకుట మనగా రాజులు తలనుదాల్చు భూషణ విశేషము. (సూ. ని.)

మౌళిః కోటీర ఉష్ణీషం కిరీటం మకుటాఽస్త్రియమ్". —(వైజయంతి)

కుమారస్వామి సువర్ణరత్న కిరీటము ధరించినాఁడు.
"ఆలోహితాంబరు హారకుండల కర్ణుఁ గనకరత్నోజ్జ్వల ఘన కిరీటుఁ"
గని కమలాలయ రాగిల్లనది. —ఎఱ్ఱన, అరణ్య. 5-221

మహేంద్రుఁడు, సురాసుర కిరీటతటఘటితరత్న ప్రభా భాసురపదుఁడు.[1]

కృష్ణద్వైపాయనుఁడు దివ్యదృష్టి యిచ్చి చూపి నపుడు పాండవులు "చారుమణి ప్రభాపటల జాల విచిత్ర కిరీటమాలికా భారములన్ సముద్యదిన పావకవర్ణములన్..." వెలుఁగుచుఁ గన్పించిరి.[2]

ధర్మజుని పాదాబ్జయుగము,
"పర నరేంద్ర మకుట పద్మ రాగద్యుతి" నరుణమగు చుండెడిది.[3]

ధర్మరాజు, "నడదీవియలు సేసె నగరికి మాణిక్య మకుటముల్ పూనిన మనుజపతుల" —తిక్కన. విరాట 5-320

ఘటోత్కచుండు ధరించిన కిరీటము సువర్ణమయమై చిత్ర విచిత్ర రూపములతో తోరణాకృతి గలిగియున్నది.

తస్య హేమమయం చిత్రం బహురూపక శోభితమ్
తోరణప్రతిమం శుభ్రం కిరీటం మూర్ధ్న్యశోభత॥—వ్యా. భా. ద్రోణ. 175-10

---

1. నన్నయ. అరణ్య. 1-345
2. నన్నయ. ఆది. 7-278 = వ్యా భా. ఆది. 198-33
తతో దివ్యాన్ హేమకిరీట మాలినః
3. నన్నయ అరణ్య. 1-212

## కిరీటి కిరీటము

సుభద్రార్జునుల వివాహమునకు వచ్చి

అనిమిషప్రభుఁడు నిజాత్మజు ననఘుఁ నర్జును బ్రీతితో నభిషిక్తుఁ జేసి మనుజేంద్రుఁ గాంచనమణిమయోత్తుంగ మకుట విభూషణుఁ జేసి యానందించినాఁడు. —నన్నయ. ఆది. 8-195

అర్జునుఁ డమరావతి కరిగి యందమరేంద్రు నాచార్యుంగా వరించి యస్త్రవిద్య నేర్చినంత సంతోసిల్లి సురేంద్రుడు నివాతకవచులు నీ చేత నిహతులగుదురని తన తొడిగిన యద్దివ్యభూషణంబుల నమ్మణికిరీటంబున నన్ను విభూషితుం జేసి నాఁడని యర్జునుఁడు ధర్మజునకుఁ జెప్పినాఁడు.
—నన్నయ. అరణ్య. 4-56

ఇంద్రదత్తమయిన యమ్మణికిరీటమును ధరించుటచేత "రవి యుద యించినట్లు సమరంబున నాతల మీఁదఁ గాంతిమూర్తి వెలుఁగుచుండు" ననియు దాని వలన జనులు నన్ను కిరీటి యని పిలుచుచుందురనియు నర్జునుఁ డుత్తరునకుఁ దెలిపినాఁడు.[1]

దిక్పతులచేతనైనఁ జెడని 'యట్టి బహురత్నస్ఫితరశ్మి చ్ఛటాస్ఫురితం బైన కిరీటమును' కర్ణుఁడు ఛేదించినాఁడు.[2]

సురపతి తపంబుసేసినఁ బరమేష్ఠి ప్రియంబుఁబొంది బహుమాన పుర
స్సరముగ నిచ్చిన యది యక్కిరీట మరిభీషణత్వ కీర్తిదము నృపా![3]

అది ముక్తా వజ్ర ఖచిత సువర్ణ కిరీట మని మూలమునందు వర్ణింపఁ బడినది.

దివాకరేందుజ్వలన ప్రభత్విషం
సువర్ణముక్తా మణి వజ్ర భూషితమ్
పురందరార్థం తపసా ప్రయత్నతః
స్వయం కృతం యద్విభునా స్వయంభువా॥ —వ్యా. భా. కర్ణ. 91-38

స్వయంభువు అనఁగా బ్రహ్మ. ఇట శిల్పిబ్రహ్మ యగు విశ్వకర్మ యని చెప్పవచ్చును. దేవతలకు భూషణములు రచించి యిచ్చునది శిల్పప్రజాపతి యగు విశ్వకర్మయే కదా!

---

1. తిక్కన. విరాట. 4-143 2. తిక్కన. కర్ణ. 3-321 3. తిక్కన. కర్ణ. 3-332

# చూడామణి

చూడామణిః శిరోరత్నం స్వస్తికస్తు త్రికోణకః ॥ —వైజయంతి

చూడామణి యన అలంకారార్థము తల యందుంచు కొనెడు రత్నము (శ ర.)
A Jewel worn by men and women on the top of the head.
Monier Williams

రత్నమునకు రంధ్రమువేసి, దానిని సూత్రబద్ధము చేసి తలకుఁ గట్టు కొన వచ్చును. లేదా రత్నమును సువర్ణాదిలోహఫలకములందు స్థగితముగ చేసికొని తలపై ధరింపవచ్చును. ఈ ఫలకములు స్వస్తికాకారముగా గాని త్రికోణాకృతిగా గాని యుండును.

పాండురాజు చూడామణిని ధరించినాఁడు.

**తతః చూడామణిం నిష్కమంగదే కుండలాని చ॥**—వ్యా. భా. ఆది. 123-28

మహాభారతయుద్ధము నందు పాల్గొనిన యుద్ధవీరులు కొందఱు చూడామణులను ధరించిరి.

బద్ధచూడామణివరైః శిరోభిశ్చ సకుండలైః —వ్యా. భా. కర్ణ. 20-40

చూడామణీన్ నరేంద్రాణాం విచిత్రాః కాంచనస్రజాః ॥ —కర్ణ. 20-41

అశ్వత్థామ చూడామణి యద్భుత మయినది.

ఆ మహనీయరత్నమును శిరమున ధరించినచో...... "నాగభయంబుఁ దస్కరభయమును దానవభయము దేవభయమును బొరయవు; బాధింప దాకలి తృష నిద్ర రోగంబు దీని కతన". —తిక్కన. సౌప్తిక. 2-77

ఇంతటి ప్రభావముగల తన శిరోమణిని గత్యంతరము లేక పాండవుల కిచ్చి అశ్వత్థామ తపోవనమున కేగినాఁడు.

ఈ మణి '<u>పద్మరాగ రత్న</u>' మని తిక్కన తెలిపినాఁడు. —సౌప్తిక. 2-98

తుదకా చూడామణి ధర్మరాజు శిరము నలంకరించినది.

'నీకుఁ గార్యసిద్ధి యయ్యెడు మరుగు' మని తన <u>శిరో భూషణంబయిన</u> యీ రత్నంబు మీకు నభిజ్ఞానార్థంబుగా నాచేతి కిచ్చిన దని హనుమంతుడు... అమ్మహామణి రాజ చూడామణికి సమర్పించెను. —ఎఱ్ఱన. భార. అరణ్య. 7-92

ఈ విధముగా పూర్వకాలమున స్త్రీ పురుషులు రత్నములను శిరోభూషణములుగా ధరించుచుండిరి.

## సింగారములు : సిగబంతులు

చారు సువర్ణహాసి నవ చంపకభూషయు. సిందువార ము
క్తా రమణీయయున్ వకుళదామవతంసయు నై యపూర్వశృం
గార విలాసలీల యొసఁగన్ దన ముంగటనున్న మాద్రి నం
భోరుహనేత్రిఁ జూచి కురుపుంగవుఁ డంగజరాగమత్తుఁడై.

మాద్రిని గవసినాఁడు. —నన్నయ. ఆది. 5-141

మాద్రి సంపెగపూతే బంగారునగలుగా, వావిలిపూవులే ముత్యాల సరములుగా పొగడపూదండయే శిరోభూషణముగా ధరించినది

వతంసము = అవతంసము = సిగబంతి; శిరోభూషణము.
An ornament worn on the head.

మేనక కొప్పుపెట్టుకొని యందు పువ్వులు తుఱుముకొన్నది.

చల్లని దక్షిణమారుత మల్లన వీతెంచెఁ దగిలి యా లలనా ధ
మ్మిల్ల కుసుమాంగరాగసముల్లసన సుగంధి యగుచు మునివరుమీఁదన్.
—నన్నయ ఆది. 4-40

ధమ్మిల్లము = కొప్పు; లోపల పువ్వులు తుఱిమికొని పైని ముత్తెములు లోనగు వానిచే నలంకరింపఁబడిన కేశకలాపము. (సూ. ని.)

ఊర్వశి కేశపాశము నందు కెందమ్మిపూగుత్తులు ముడిచికొన్నది.

మృదు కుంచితదీర్ఘేణ కుముదోత్కరధారిణా
కేశహస్తేన లలనా జగామాథ విరాజతే॥ —వ్యా. భా. వన. 46-6

ఋశ్యశృంగుని జేరవచ్చిన వేశ్యాపుత్రి 'కమ్మని జడలతో' నున్నట్లు నన్నయ వర్ణించినాఁడు. —అరణ్య. 3-103

ఆమె శిరోజములకు సుగంధతైలము రాచికొని, నడిమిపాపట దీసి తలదువ్వుకొని తన దీర్ఘకేశములను బంగారుతీగలతోఁ గలిపి జడ నల్లుకొన్నట్లు వ్యాసభారతమునందు వర్ణింపఁబడినది.

నీలాః ప్రసన్నాశ్చ జటాః సుగంధాః హిరణ్యరజ్జుగ్రథితాః సుదీర్ఘాః
సుసంయతాశ్చాపి జటావిషక్తా ద్వైధీకృతా నాతిసమా లలాటే॥
—వ్యా. భా. వన. 112-2, 9

ఈ వర్ణనములను బట్టి మహాభారతకాలమునం దిట్టి కేశాలంకరణ పద్ధతులున్నట్లు తెలియుచున్నది.

# కేశాద్యలంకరణశిల్పము

సాఽహం బ్రువాణో సైరంధ్రీ కుశలా కేశకర్మణి.

—వ్యా. భా. విరాట. 3.18*

సైరంధ్రీవేషము ధరించి మత్స్యరాజమహిషిని సేవింతు నని ద్రౌపది ధర్మజునకుఁ దెలిపినది.

సైరంధ్రి యన శిల్పకారిణి. గంధకారిక[1] గట్టువాలు[2]
సైరంధ్రి = పరగృహమందుండి స్త్రీలకు శృంగారాదులు చేయునట్టి పతివ్రత. (శ. ర.)

కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి తనవున నలదుదు ననువు గాఁగ
మృగమదపంకంబు మృదువుగా సారించి తిలకంబు వెట్టుదుఁ జెలువు మిగులఁ
బువ్వులు బహువిధంబులఁగట్టి ముడికొక్కభంగిగా నెత్తులువట్టి యిత్తు
హారముల్ మెఱయనొయ్యారంబుగా గ్రుచ్చి యందంబు వింతగా నలవరింతు
వివిధ శిల్పములఁబ్రవీణనై మఱియును వలయు పనులవెంట మెలఁగ నేర్తు
మత్స్యరాజమహిషి మనమున మక్కువ నెలకొనంగ నిట్లుఁ గొలువనేర్తు.

—తిక్కన విరాట. 1-107

సైరంధ్రి వేషమున రాచనగరు చేరిన ద్రౌపది సుదేష్ణతో నిట్లనుచున్నది.

కలపములు గూర్ప బహువిధతిలకంబులు వెట్ట వింతతెరువులఁ బలు పు
వ్వులు గట్టి కట్టి పోడ్వఁగఁ దల ముడువఁగ సరులుగ్రువ్వఁ దద్దయునేర్తున్.

—తిక్కన. విరాట. 1-320

కేశాన్ జనామ్యహం పింషే సాధువిలేపనమ్
మల్లికోత్పల పద్మనాం చంపకానాం తథా శుభే
గ్రథయిష్యే విచిత్రాశ్చ స్రజాః పరమశోభనాః ॥

—వ్యా. భా. విరాట 9-18,19

ఇట్లు నమ్మఁబలికి ద్రౌపది సుదేష్ణకొలువులో సైరంధ్రిగాఁ జేరినది.

* సైరంధ్రీ పరవేశ్మ స్థా శిల్పకృత్ స్వవశాస్త్రియమ్. (నీలకంఠ)
"జో శిల్పకర్మోం ద్వారా జీవన్ నిర్వాహకరీ హై"

1. తిక్కన. విరాట. 1-294
2. తిక్కన. విరాట. 1-298

# పరిసాధనాలంకృతులు

ప్రసాధన మన వస్త్రాద్యలంకారము.

చతుష్షష్టి కళలలో నిదియొకటి.

వస్త్రాలంకరణసాధనం స్త్రీపుంసాశ్చ కలా స్మృతా॥ —శుక్రనీతి

మహాభారత కాలమున స్త్రీ పురుషులు సాధారణముగా అంతరీయము [కట్టుపంచె] ఉత్తరీయము [పయిపంచె] అను రెండు వస్త్రములు ధరించుచుండిరి.

స్త్రీలు కట్టుపుట్టమును మొలకు చుట్టుకొని దాని రెండు చెఱగులను నడుమునం దొకచోట ముడివేసికొనుచుండిరి. ఈ ముడికే నీవి [పోకముడి] యనిపేరు. నీవి యన స్త్రీల కట్టుపుట్ట మనియు రూఢ్యర్థమేర్పడినది.[1]

ఉత్తరీయమును పైటగను మేలిముసుంగుగను ఉపయోగించుచుండిరి. ఈ యంతరీయోత్తరీయములు గాక స్త్రీలు స్తనపరిధానములను ధరించుచుండిరి.

పురుషులు కొందఱు పరిధానోత్తరీయములు కాక తలపాగలు చుట్టుకొనుచుండిరి.

క్షత్రియులు విలువైన పలుచని వస్త్రములను, బ్రాహ్మణులు మునులు అజనవల్కలమును ధరించుచుండిరి.

వివాహది శుభకార్యములందు స్త్రీ పురుషులు గంధమాల్యానులేపనములతోను దివ్యాంబరాభరణములతోను చక్కగా నలంకరించుకొను చుండిరి.

ద్రుపదరాజతనయ "అధిక విదగ్ధ పుణ్యాంగనా విరచిత లలిత ప్రసాధనాలంకృతాంగి" యై వివాహవేదిక కడకు వచ్చినది.[2]

ఇట వధువునకు మంగళస్నానములు చేయించుట, అంగరాగ మలదుట, తిలకము దిద్దుట, కేశాలంకరణము, పసుపుకుంకుమలతో పారాణి పెట్టుట, పాణితలములపై స్వస్తికాది మంగళ చిహ్నములు రచించుట, నూతన వస్త్రములు ధరింపఁజేయుట. గంధమాల్యములు, కర కంకణములు, కర్ణభూషలు మున్నగు హిరణ్యాభరణములతో నలంకరించుట యనునవి ప్రసాధనాలంకృతులతో ప్రధానాంశములు.

---

1. A cloth round a woman's waist or more properly the ends of the cloth tied into a knot in front, the knot of the wearing garment. [V. S. Apte, SE, D]

2. నన్నయ ఆది. 7-284

# దివ్య వస్త్రములు : దివ్య భూషణములు

రాజసూయ యాగదీక్షితుండైన ధర్మరాజునకు సామంతులు 'దివ్యాంబరాభరణభూషితంబులయిన యోషిత్ సహస్రంబులను' సమర్పించిరి. —నన్నయ. సభా. 2-113

దుర్యోధనుండు మయసభ యందుఁ గ్రుమ్మరుచు స్ఫటిక దీప్తిజాల పరివృతంబైన జలాశయంబు స్థలంబుగా వగచి కట్టినపుట్టంబు దడియం జొచ్చి క్రుమ్మఱిన,

దానినెఱిఁగి ధర్మతనయుండు ధృతరాష్ట్రునాత్మజునకుఁ గింకరాళిచేత
దివ్య వస్త్రములను దివ్యభూషణములు నిచ్చిపుచ్చెఁ బ్రీతి యేర్పడంగ.
—నన్నయ. ఆది 2-87*

జూదమునం దోడిపోయిన పాండవులు చిత్రమయిన కవచములను, మెఱయుచున్న దివ్యవస్త్రములను పరిత్యజించి మృగచర్మములు ధరించినారు.

చిత్రాః సన్నాహానవముచ్య పార్థా వాసాంసి దివ్యాని చ భానుమంతి
వివాస్యంతాః రురుచర్మాణి సర్వే యథా గ్లహం సౌబలస్యాభ్యుపేతాః॥
—వ్యా. భా. సభా. 777

దివ్య వస్త్రములన సన్నని వస్త్రములు.

రురుచర్మము = నల్లచారలు గల దుప్పి చర్మము

రాజసూయమునకు వచ్చిన చోళ పాండ్యరాజులు శ్రేష్ఠమయిన రత్నములు, బంగారము, సన్నని వలువలు తెచ్చియిచ్చిరి.

మణి రత్నాని భాస్వంతి కాంచనమ్ సూక్ష్మవస్త్రకమ్॥
—వ్యా భా. సభా. 52-35

దివ్యకాంతయైన గంగయు,[1] స్వర్వేశ్యయైన యూర్వశియు[2] సూక్ష్మ వస్త్రములను ధరించిరి.

రాక్షసాంగనయైన హిడింబ మనుష్యరూపధారిణియై సూక్ష్మాంబరములు గట్టినది.[3]

---

* వాసాంసి చ శుభాన్యస్మై ప్రదదౌ రాజశాసనాత్॥ —[వ్యా. భా. సభా 47-7]

1. వ్యా. భా. ఆది. 97-28 2. —వ్యా. భా. వన 46-8

3. వ్యా. భా. ఆది. 152-18 సర్వాభరణ సంయుక్తాం సుసూక్ష్మాంబర వాససమ్.

## రంగురంగుల వస్త్రములు

దుశ్శాసనుఁడు నిండు సభలో ఏకవస్త్రపరిధాన యైన ద్రౌపది కట్టిన పుట్టం బొలుచునప్పుడు మున్నపనీతమైన తద్వస్త్రంబునట్టి వలువ లలితాంగి జఘనమండలమునఁబాయక యొప్పుచుండెను. —నన్నయ. సభా. 2-321*

ఒలువఁబడిన వలువలవంటివే కాక శ్రీకృష్ణుని మహిమ చేత వివిధ వర్ణవస్త్రములు ప్రాదుర్భవించిన వని మూలమునందు వర్ణింపఁబడినది.

నానారాగవిరాగాణి వసనాన్యథవై ప్రభో
ప్రాదుర్భవంతి శతశో ధర్మస్యపరిపాలనాత్॥ —వ్యా.భా. సభా. 68-48

## పట్టు వస్త్రములు

వివాహసమయమున ద్రౌపది పట్టుపుట్టము గట్టినది.

కృష్ణా చ క్షౌమసంవీతా కృతకౌతుకమంగళా॥ —వ్యా. భా. ఆది 198-3

సుభద్ర ఎఱ్ఱని పట్టు వస్త్రము గట్టినది.

సుభద్రాం త్వరమాణస్య రక్తకౌశేయవాసినీమ్॥వ్యా భా.ఆది. 220-19

నీకు పట్టు పుట్టములు, మృగచర్మములు తెప్పింతు నని కీచఁకుడు ద్రౌపదితో నన్నాడు.

ఆహరంతు చ వస్త్రాణి కౌశికాన్యజినాని చ॥ —వ్యా.భా. విరాట. 16-2

శ్రీకృష్ణుఁడు 'పీతకౌశేయ సంవీతమూర్తి'. —తిక్కన. శాంతి. 2-3

బలరాముఁడు నీలవస్త్రధారి.

కేశవస్యాగ్రజో వాపి నీలవాసా మహోత్కటః॥ వ్యా.భా వన. 16-18

అశ్వమేధ యాగదీక్షితుఁ డయిన ధర్మరాజు,
'సంవృత క్షౌమ కృష్ణాజినుఁడు' —తిక్కన. అశ్వమేధ 4. 2

రాజేంద్రా! పూర్వ మొకప్పుడు పరిశుభ్రమయిన పట్టు పుట్టములు గట్టిన నిన్నిపుడు నారచీరలతోఁ జూడవలసివచ్చిన దని ద్రౌపది ధర్మరాజు ననునయించినది.

యా త్వాహం కౌశికైర్వస్త్రైః శుభ్రై రాచ్ఛాదితం పురా
దృష్టవత్యస్మి రాజేంద్ర సా త్వాం పశ్యామి చీరిణమ్॥
—వ్యా. భా. వన. 27-14

* వ్యా. భా. సభా. 68-46-47

## చిత్ర వస్త్రములు

దదౌ చ మాల్యాని సుగంధవంతి
చిత్రాణి వాసాంసి చ భానుమంతి॥ —వ్యా. భా. వన. 111-15

ఋశ్యశృంగుఁడు వేశ్యాపుత్రి "యిచ్చిన దివ్య గంధమాల్యంబులును... విచిత్ర వస్త్రంబులును" గ్రహించెను.* —నన్నయ. అరణ్య. 3-100

"ఆ ఋషికుమారు కట్టిన చీరలు మృదులములు విచిత్రములు" నని స్త్రీపురుషభేద మెఱుఁగని ఋశ్యశృంగుఁడు తండ్రికిఁ జెప్పినాఁడు.
—నన్నయ అరణ్య. 3-104

రాజసూయమునందు ధర్మరాజునకు వైఢూర్యాది మణులు సమర్పించిన సింహళ దేశరాజులు [నల్లనిమేనులు ఎఱ్ఱనికనులు గలవారు] మణిఖచితములయిన వస్త్రములు ధరించియుండిరి.

సంవృతా మణిచీరైస్తు శ్యామాస్తామ్రాంతలోచనాః ॥
—వ్యా భా. సభా. 52-36

రాయబారార్థము వాసుదేవుఁడు వచ్చునంతకు వృకస్థలమున కృష్ణార్థము వివిధ గంధమాల్యంబులు సంపాదింపను, మణిభూషణ చిత్రాంబరములు సమకట్టను దుర్యోధనుడు నేర్పరులగు తత్‌జ్ఞులను నియమించి నట్లు తిక్కన వర్ణించినాఁడు. —ఉద్యోగ. 3-155

మూలమునందు 'సూక్ష్మవసనము' లని యున్నది.

వాసుదేవుఁడు ద్రౌపదిని పాండవు లేవురు వివాహమగుట విని సంతసిల్లి వారేవురకు...... నానాదేశ విచిత్ర వస్త్రంబులును ఋత్తెంచె నని నన్నయ వ్రాసినాఁడు —నన్నయ. ఆది. 8-7

విలువయిన వలువలే కాక సుఖస్పర్శగల మృదువైన కంబలాజినములు పంపినట్లు మూలము నందు వర్ణింపఁబడినది.

వాసాంసి చ మహార్హాణి నానాదేశ్యాని మాధవః
కంబలాజిన రత్నాని స్పర్శయంతి శుభాని చ॥
—వ్యా. భా. ఆది 198-14

---

* విచిత్ర వస్త్రము లనఁగా వివిధవర్ణములతో కుసుమాదు లద్దిన వస్త్రములు.

## కంబలాజినములు

యజ్ఞదీక్షితుఁడైన ధర్మాత్మజునకు గౌడకాంభోజ పతు లనేకప్రకార
వర్ణ కంబళములు శుకవర్ణవాహనివహములుఁ దెచ్చియిచ్చిరి నెమ్మితోడ,
—నన్నయ సభా. 2-109

కాంభోజరాజు మేషరోమములతోను, బిలముల యందుండు మూషికాది జంతువుల రోమములతోను బిడాల రోమములతోను నేయఁబడిన బంగారు జరీ గల శ్రేష్ఠమయిన ప్రావారములు [దుప్పటములు] అజినములు, సమర్పించి నట్లు మూలమునందు వర్ణింపఁబడినది.

ఔర్ణాన్ బైలాన్ వార్షదంశాన్ జాతరూప పరిష్కృతాన్॥
ప్రావారాజిన ముఖ్యాంశ్చ కాంభోజః ప్రపదూ బహూన్॥ —సభా. 51-3*

భరుకచ్ఛ దేశవాసులు బ్రాహ్మణులు ధరింపఁదగిన రాంకవాజినములు తెచ్చిరి.

శూద్రాన్ విప్రోత్త మార్హాణి రాంకవాణ్యజినాని చ[1]
బలిం చ కృత్స్న మాదాయ భరుకచ్ఛ నివాసినః ॥ —వ్యా. భాః సభా 51-10

రాంకవ మనఁగా 'రంకువు' మృగరోమములవలన నేయఁబడిన సాలువు లోనగునది. సాలువు = సన్నని వస్త్రము.

A wollen cloth made of deer's hair, a wollen garment
2 A blanket —[VSAPTE. S E. D.]

రంకువు = తెల్లని వెండ్రుకలును మెత్తని తోలును గల యిఱ్ఱి.

శ్రీకృష్ణునకు కావలసినన్ని చీనా దేశపు మృగచర్మములను బహూకరింతు నని దుర్యోధనుఁ డనుచున్నాఁడు.

అజినానాం సహస్రాణి చీనదేశోద్భవాని చ॥ —వ్యా. భా. ఉద్యోగ. 86-9

---

* ఔర్ణాన్ మేషరోమజాన్, బైలాన్ బిలవాసమూషికాది రోమజాన్
వార్షదంశాన్ బిడాల రోమజాన్ (made of cat's hair)
జాతరూప పరిష్కృతాన్ = సువర్ణరచనాలంకృతాన్॥ —దేవబోధ. టీక.
ప్రావారము = కంబళము = ఉత్తరీయము.
An upper garment, a cloak or mantle [S.E.D.]

1. పోల్చు : వ్యా. భా. ఆది. 189-41
బ్రాహ్మణైస్తు ప్రతిచ్ఛన్నో రౌరవాజినవాసిభిః ॥

## వీరోచిత వస్త్రాలంకారములు

విరటుఁడు సుశర్మ మీఁద యుద్ధము సేయఁబోవునపుడు "తానును యోధ వీరోచిత ప్రకారంబున సింగారంబుసత్వరంబుగాఁ చేసికొని" వెడలెను.

—తిక్కన. విరాట. 3-144

యుద్ధ వీరు లెల్లరు రక్త వర్ణాంబరములు ధరించుచుండిరి.

రక్తాంబరాః సర్వే సర్వే రక్త విభూషణాః ॥ —వ్యా. భా. ద్రోణ.

ఉత్తరకుమారుఁడు యుద్ధరంగమునుండి పాఱిపోవు చుండగా బీభత్సుఁడు, "లంబకేశభారుండును నాందోళిత రక్తాంబరయుగళుండు నను నగుచు" నతని వెంటఁ బరతెంచెను. —తిక్కన. విరాట. 4-73

పరిధానోత్తరీయములనేకాక వీరపురుషులు కొందఱు రంగురంగుల తలపాగలును ధరించుచుండిరి.

"రారాజు ద్రోణతనయుండుఁ జుట్టిన తలచుట్లు నల్లనియవి
సూతపుత్త్రుని శిరోంబరంబు పచ్చనియది
కుంభసంభవ కృపాచార్యుల యుష్ణీషవములు వెల్లలు"

—తిక్కన. విరాట. 5-210*

ఈ వర్ణనముల వలనఁ దెలియదగు నంశము లివి :

సాధారణముగా స్త్రీ పురుషులు స్నానాంతరము శుభ్రమయిన వస్త్రయుగ్మము ధరించుచుండిరి.

బ్రాహ్మణులు రాంకవాజినములు [తెల్లనివి] మునులు, ముని కన్యలు నార చీరలు మృగ చర్మములు [వల్కలాజినములు] ధరించుచుండిరి.

రాజపురుషులు సన్నని ఉన్నివస్త్రములు, వివిధ జంతు రోమములతో నేయఁబడిన వర్ణ కంబళములు మృదువయిన మృగ చర్మములు, పట్టు వస్త్రములు ప్రావారము లనఁబడు జలతారు దుప్పటములు ధరించుచుండిరి.

స్త్రీలు సన్నని నూలు వస్త్రములు, పట్టు చీరలు, అద్దకపు చీరలు [చిత్ర వస్త్రములు] నానావర్ణ వస్త్రములు, మేలిముసుగులు ధరించుచుండిరి.

మహాభారత కాలమునాటికి తాంతవ శిల్పమభివృద్ధి చెందినది.

---

* వ్యా. భా. విరాట. 66-7

## నైపథ్యకర్మకౌశలము

వస్త్రాభరణాద్యలంకారము పురుషులకొక ఠీవిని గూర్చి నూతనోత్తేజమును గలిగించును. స్త్రీలకు సౌభాగ్యహేతువు.

వ్రతము పెంపొ ? మంత్రౌషధ వైభవంబొ
సరస నైపథ్య కర్మ కౌశలమొ ?
చతుర విభ్రమోల్లాస రేఖయొ ? వెలఁది
నీ విశేష సౌభాగ్యహేతువు చెపుమ నాకు.

అని సత్యభామ ద్రౌపది నడిగినది. —ఎఱ్ఱన. ఆరణ్య. 5-29

కైసేత యందు నేర్పుకావలయును. అప్పుడే యది రాణించును.

లోకము నందలి మానవులు ధరించు వస్త్రాభరణాద్య లంకారములను జూచి ప్రతిమాకారులు తాము నిర్మించు దేవతాది విగ్రహములకు శిల్పాలంకృతులుచేసి వాని కొక శాశ్వతత్వము గల్పింతురు.

ఒకా నొకప్పుడు రూపకర్తలే తమ యుపజ్ఞాబలముతో విగ్రహములకు నూతనాలంకారములు కల్పింపవచ్చును. హిరణ్యకారులు వానిని గ్రహించి సువర్ణముతో నూతనాభరణములు చేయుదురు.

శిల్పాచార్యులు నిర్మించి ప్రతిష్ఠించిన దేవతా విగ్రహములకు భక్తజనులు అభిషేకములు గావించి, చందనచర్చలుచేసి, గంధమాల్యముల తోను శుభ్ర వస్త్రయుగ్మముతోను సువర్ణరత్నాభరణములతోను విశేషాలంకార ములు చేసి పూజించి తాము భుజించు రుచిరాన్నపానములను నైవేద్యముపెట్టి దానిని భగవత్ప్రసాదముగా నారగింతురు.

భక్తజను లీవిధముగా తమ కనుభోక్తవ్యములయిన 'చారు విభూషణాహార విహారశయ్యాసనాది భోగములను' ఇష్ట దేవతా ప్రీత్యర్థము సమర్పించి సంతృప్తి చెందుచుందురు. అట్లొనర్చిన వారికి సకలైశ్వర్యములు, ఆయు రారోగ్యములు కలుగు నని విశ్వసింతురు.

మహాభారతకాలమునుండి నేటివఱకు భారత దేశమునందీ సంప్రదాయ మనుసరింపఁబడుచున్నది.

దేవతా విగ్రహములు నిర్మించు శిల్పాచార్యులు, అలంకరణార్థమా విగ్రహములకు రత్నఖచిత సువర్ణాభరణములు, కిరీటములు చేయు సువర్ణకారులు తదితర ప్రసాధన సాధనములు సమకూర్చు శిల్పకళాకారులు ధన్యజీవులు. ఈ శిల్పులు విశ్వకర్మలే.

రూప ప్రతిరూపములకేకాక రూపాలంకరణ సాధనములకు గూడ విశ్వకర్మయే కర్త యని స్కాందపురాణము చెప్పుచున్నది.

త్వం సువర్ణాదిధాతునాం దారుణా దృషదామపి
మణీనా మపి రత్నానాం పుష్పాణా మపి వాససామ్॥
సర్వాసై పథ్యరచనాః సర్వ హేమ్నశ్చ సంస్కృతీ
సర్వం జ్ఞాస్యసి కర్తుత్వం ద్వితీయ ఇవ పద్మభూః॥

—స్కంద. కాశీఖండ. అ. 86-70-71

ఈ శ్లోకములను శ్రీనాథ మహాకవి యిట్లు అనిగించినాఁడు.

త్వష్టృ ప్రజాపతికొడుకు విశ్వకర్మ...... కాశికరిగి శివలింగంబుఁ బ్రతిష్ఠించి పరమనిష్ఠఁ బెద్దకాలంబు తపంబాచరింపఁ బ్రత్యక్షంబై విరూపాక్షుం డనుగ్రహింప సర్వధాతువులకు సర్వదారువులకు, సర్వశిలలకు స్వరమణులకు సర్వరత్నంబులకు సర్వపుష్పంబులకు సర్వవస్త్రంబులకు, సర్వ సుగంధంబులకు దాన కర్తయగు నట్లుగా వరంబు వపడిసి గురుజనంబుల యాజ్ఞ చెల్లించి విశ్వోపకారపరుండయ్యె.

అతని పేర కాశి విశ్వకర్మేశ్వరుఁడు విశ్వాభీష్టఫలప్రదుండయి యున్నవాడు.

—శ్రీనాథ. కాశీఖండము. 7-41

విశ్వోపకారకుండైన విశ్వకర్మ రూపాలంకరణ శిల్పమున నిత్యనూతన రీతులు వెలయించుటకుఁ దగిన కల్పనాశక్తిని శిల్పులకు ప్రసాదించుఁగాక!

సకలకళలకు తల్లియయిన సరస్వతీ స్తోత్రముతో నీ యున్మేషము ముగించుచున్నాను.

అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ శారద చంద్రచంద్రికా
డంబరచారుమూర్తి ప్రకటస్ఫుట భూషణ రత్నదీపికా
చుంబిత దిగ్విభాగ శ్రుతిసూక్త వివిక్త నిజప్రభావ భా
వాంబర వీథి విశ్రుత విహారి ననున్ గృపఁజూడు భారతీ॥

## రూప ప్రతిరూప శిల్ప సమీక్షణము

ఈ యున్మేషము నందు ప్రతిమా శిల్పమునకు మూలమైన రూప శిల్పమును గూర్చియు రూపాలంకరణ శిల్పమును గూర్చియు వివరించితిని.

మహాభారతమున యక్ష సదృశకాంతలుగాను సర్వలక్షణ లక్షితాంగులు గాను వర్ణింపఁబడిన సౌందర్యవతుల రూప రేఖా విలాసములు సాముద్రిక శాస్త్రానుసారముగ నున్నవి.

ప్రతిమాకారులీ యుత్తమ సౌందర్య లక్షణములను తాళప్రమాణాది శిల్ప శాస్త్రోపదిష్ట లక్షణములతో సంపదించి దేవతాది విగ్రహములు నిర్మింతురు.

మానవాకృతులను నిర్మించు ప్రతిరూపకకారకులు రూపసాదృశ్యమును సాధించుటకు ప్రయత్నింతురు. అట్లే చిత్రకారులును.

మహభారతకాలమున శిల్పులు మట్టితోను, కఱ్ఱతోను, ఇనుముతోను, బంగారముతోను ప్రతిమలు చేయుచుండిరి. ఈ శిల్పులు విశ్వకర్మలే,

మృణ్మయ ప్రతిమలు కూడ విశ్వకర్మ వంశజు లయిన సూత్రధారులు [దారు శిల్పులు] చేయుచుండిరి. వారి రూప నిర్మాణక్రియ తక్షకుల పని వలనే యుండును,

చిత్రకారులు పట చిత్రములు కుడ్యచిత్రములు రచించుచుండిరి.

వైదికార్యుల వలె మహాభారతకాలీనజనులు సౌందర్యారాధకులు.

అలంకార ప్రియులయిన స్త్రీ పురుషులు సువర్ణరత్నాభరణాదులతో తమ దేహముల నలంకరించుకొను చుండిరి.

వస్త్రాభరణాద్యలంకారము నాగరికలక్షణము.

హిరణ్యాభరణము లైశ్వర్యప్రదము లనియు నాయుర్వృద్ధి కరము లనియు విశ్వసించుచుండిరి. శంఖములు, శంఖముక్తామణులు శుభ ప్రదము లని భావించి, శంఖవలయములు ముక్తాహారములు ధరించుచుండిరి.

మహాభారతకాలమున జనుల యభిరుచుల కనుగుణముగా సువర్ణ రత్నాభరణములు చేయగల సువర్ణకారులెక్కువగా నున్నట్లు తెలియుచున్నది.

శిల్పకళాకారు లెల్లరు విశ్వకర్మవంశీయులో వారి వద్ద శిల్పకళల నభ్యసించినవారో యైయుందురనుట నిర్వివాదాంశము.

# శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము

## షష్ఠోన్మేషము

## రథ శిల్పము

తక్షన్ రథం సువృతం విద్మనాపసః
తక్షన్ హరీ ఇంద్రవాహా వృషణ్వసూ॥

—ఋగ్వేద. 1-111-1*

శిల్పకళాచతురు లయిన ఋభువులు పరమైశ్వర్యప్రదుఁ డయిన యింద్రుని కొఱకు గుండ్రని చక్రములుగల రథమును నిర్మించిరి. ఆ యింద్ర రథమును లాగుటకు గుఱ్ఱములను చేసిరి. అవి కీలు గుఱ్ఱములే కాని సామాన్యాశ్వములు కావు.

రథం యే చక్రుః సువృతం సుచేతసః॥ —ఋగ్వేద, 4-36-1

రథ శబ్దము వలన భూ జలాంతరిక్షయానములు సూచింపఁబడుచున్నవని స్వామి దయానంద సరస్వతి వివరించినాడు.

---

* విద్మనాపసః = అతి చతురులయిన శిల్పులు.

Cf : Ralph T. H. Grifith : The Hymns of tne Rigveda —1-111-1
Working with skill they wrought the lightly rolling car
They wrought the Bys, who bear Indra and bring
great gifts.

నిరుక్తము నందు రథశబ్ద మిట్లు నిర్వచింపఁ బడినది.

**రథో రంహతే ర్గతి కర్మణి స్థిరతేర్వాస్యాద్**
**విపరీతస్య రమమాణోఽస్మిన్తిష్ఠ తీతి వా రపతేర్వా రసతేర్వా॥**

—యాస్క. నిరుక్త. 9.61

1. గమనార్థకమగు రంహధాతువుతో రథశబ్ద మేర్పడును - మనుష్యుఁడు రథ సహాయమున నిటునటు వెళ్ళును,

2. స్థిర శబ్దమునగల యక్షరములను విపరీతము చేసిన రస్థి రస్థ రథము - అని క్రమముగ నేర్పడుచున్నవి. మానవుఁడు రథముమీఁద స్థిరముగాఁ గూర్చుండఁ గలఁడని భావము.

3. రప్+స్థా+ఠ=రథము; దీని మీఁద నానందముగా గూర్చుండనగును.

4. శబ్దార్థకమగు రపధాతువు వలనగాని, రసధాతువు వలనగాని రథశబ్దము సిద్ధించును. నడచునపుడు ధ్వనియగునుగావున రథమనఁబడును.

దేని వలన రమణము - ఆనందము - ప్రాప్తించునో యదియు రథమని చెప్పఁబడును. ఈ కారణమువలననె రథమున కర్థము - ఆనందదాయక జ్ఞానము - తేజస్సు నని చెప్పఁబడినది.*

రథశబ్దమున కేవిధముగ నర్థము చెప్పినను గతిశీలతయే దాని ప్రధాన లక్షణము.

రథ శిల్పము రెండు విధములు.

వాజపేయాది యజ్ఞము లందుపయోగింపఁబడు రథములు దేవమయ రథములు. దేవశిల్పములు. వేద మంత్రములతో శాస్త్రోక్తముగాఁ జేయఁబడు జైత్ర రథములును దేవశిల్పములే.

మహాభారతమునం దంతటను జైత్ర రథ శల్పనాది వర్ణనములున్నవి. వీనిని రచించువారు రథకార బ్రాహ్మణులు.

మంత్ర రహితముఁగాజేయబఁడు శకటాదులు మానుష శిల్పములు వీనిని శిల్పోపజీవను లెవ్వరైనను జేయవచ్చును.

మహాభారతము నందు వీని ప్రసక్తి మెండుగనే యున్నది.

---

* చూడు :- దయానంద సరస్వతి : ఋగ్వేదాది భాష్యభూమికా.
తెలుగు అనువాదము. పండిత గోపదేవ్.

# చతుర్విధ రథములు

ఛందోమయ రథము, దేవమయరథము, దేహమయ రథము, వాహమయ రథము నని రథములు నాలుగు విధములు.

## 1. ఛందోమయరథము

సోఽబ్రవీత్ ప్రజాపతిః ఛందాగ్ంసి రథో మే భవతి॥

—తై. బ్రా. అ. 1, ప్ర. 5

ఛందస్సులు నాకు రథ మగుగాక యని ప్రజాపతి పలికెను.

ఛందోమయ రథమునకు

| | |
|---|---|
| చక్రములు | - గాయత్రీ జగతీ ఛందస్సులు |
| దండములు | - ఉష్ణిక్కు త్రిష్టుప్పు లను ఛందస్సులు |
| వాహనములు | - అనుష్టుప్పు పంక్తులను ఛందస్సులు |
| మధ్యప్రదేశము | - బృహతీ అను ఛందస్సు. |

ఛందోమయ రథమునకు కర్త ప్రజాపతి. 'ప్రజాపతి ర్విశ్వకర్మా' యను యజుర్వాక్యము వలన ఆ ప్రజాపతి విశ్వకర్మ యే.[1]

దేవతలకు మంత్రములే రథములు.

స నో హిరణ్యరథం దంసనావాన్త్స నః
సనితా సనయే నోఽదాత్॥ —ఋగ్వేద. 1-30-16

[మననుండి హిరణ్యరథమును స్వీకరించిన చిత్రకర్ముడగు నింద్రుడు తిరిగి దానిని పరిగ్రహించుటకు మనకు దారి చూపుగాక.]

ఇట ఇంద్రుని కొసంగబడిన హిరణ్యరథము స్తోత్రము.
మనము కోరు హిరణ్యరథము సంపత్సమృద్ధి [2]

అగ్నయే బ్రహ్మ ఋభవ స్తతక్షుః॥ —ఋగ్వేద. 10-80-7

[మేధావులగు ఋభువులు అగ్నికొఱకు స్తోత్రమును రచించిరి.]

---

1. చూడు :- నిరంజనశాస్త్రి : విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము. —పు. 29

2. The car of Gold given to Indhra is the hymn
Tht car of Gold prayed for is abundant wealth —Griffith
"The chariot (ratha) was the symbol of the means of communication or communion" — Jeenine Miller - The Vedsa

2. దేవమయ రథము

వైశ్వదేవము రథము. 'వైశ్వదేవో రథః'

సమస్త దేవతలు నీ రథమునందు నిల్తురు గాన వైశ్వదేవము దేవమయ రథముగా భావింపఁబడుచున్నది.

రథ చక్రం ప్రవర్తయతి. మనుష్యరథేనైవ దేవరథం
ప్రత్యవరోహతి. —తైత్తిరీయ బ్రాహ్మణము. అ. 1-1-6

వాజపేయ యజ్ఞము నందు గార్హపత్యాగ్నినుండి యాహవనీయము వఱకు ప్రవర్తింపఁబడుచున్న రథము మనుష్యరథముయ్యు దేవరథము వలెనే పర్యవసితమగుచున్నది.[1]

దివ్యమయిన సూర్యరథము కూడ దేవమయ రథమే.

తవ దివ్యం రథం యాంత మనుయాంతి వరార్థినః
సిద్ధ చారణ గంధర్వా యక్ష గుహ్యకపన్నగాః
త్రయ స్త్రింశచ్చ వై దేవా స్తథా వైమానికాగణాః

అని యుధిష్ఠిరుఁడు సూర్యుని స్తోత్రము చేసినాఁడు.

—వ్యా. భా. వన 3-40,41

[సిద్ధ చారణ గంధర్వయక్షగుహ్యక పన్నగాదులు, త్రయస్త్రింశ ద్దేవతలు వైమానికగణములు నీ దివ్యరథము వెంబడి తిరుగుచున్నారు]

ఈ రథము బ్రహ్మచే నిర్మింపఁబడినది.

స తస్య బ్రహ్మణా సృష్టో రథో హ్యర్థవశేన చ॥

—బ్రహ్మాండపురాణ. 1-2-22-64*

త్రిపురహరుఁడగు మహేశ్వరుని రథమును దేవమయ రథమే.

ఆరుహ్య రథం దివ్యం సర్వదేవమయః శివః
త్రిపురస్య వధార్థాయ స్థాణుః ప్రహరతాం వరః ॥

—వ్యా భా. ద్రోణ, 203-77**

ఈ రథ నిర్మాత విశ్వకర్మ.

1. నిరంజనశాస్త్రి : విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము. పు. 270

* పోల్చు : మత్స్య పురాణము. అ. 124-41

** పోల్చు : పద్మ పురాణము. సృష్టిఖండ అ. 50-4-7

## 3. దేహమయ రథము

అరదము దేహ మింద్రియము లశ్వము లాత్ముఁడు సూతుఁడప్పుహా
తురగచయంబు ధైర్యమను తోరపుఁ బగ్గములన్ దృఢంబుగా
నురవడిఁ బోకయుండ వెరవొప్పఁగఁ బట్టిన వాఁడు నేమపుం
దెరువున నేగు నప్పరమధీరుఁడు సువ్వో యుదారుఁ డయ్యోడన్॥

—ఎఱ్ఱన. ఆరణ్య. 5-91

ధర్మ వ్యాధోపాఖ్యానము నందలి యీ పద్యము మూలానుసరణమే.

**రథం శరీరం పురుషస్య దృష్ట మాత్మా నియం తేంద్రియాణ్యాహురశ్వాన్**
**తై రప్రమత్తః కుశలీ సదశ్వై ర్దాంతైః సుఖం యాతి రథీవ ధీరః ॥**

**—వ్యా. భా. వన. 21-23***

ఇట్టి మనుష్యశరీరరూపంబయిన రథ వర్ణనము మహాభాగవతమునందు విపులీకరింపఁబడి యున్నది.[1]

శరీర రథ నిర్మాత రూపకర్త యగు త్వష్ట.

## 4. వాహమయ రథము

వాహమయరథ మనఁగా నశ్వములు, వృషభములు మున్నగు వానితో లాగఁబడు తేరు లేక బండి. అది సర్వజనోపయుక్త మైనది.

పరమేశ్వరుఁడు ప్రథమరథికుఁడు కావునఁ దద్రథనిర్మాత విశ్వకర్మ ప్రథమ రథకారుఁడు.

లోకములో శిల్పులెల్లరు విశ్వకర్మాదుల ననుసరించి యే రథ నిర్మాణము చేయుచుందురు.

మహాభారతమునందు వివిధరథములు, శకటములు, నౌకలు యాన విమానములు మనోహరముగా వర్ణింపఁబడి యున్నవి,

---

* చూడు : కఠోపనిషత్తు. 1-2-3-13

ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ తు
బుద్ధిస్తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవ చ॥

1 చూడు : ఆంధ్ర భాగవతము. 7-464 = వ్యాస. భాగ. 7-15-41

## షడ్విధ రథములు

కౌటిల్యుఁడు తన యర్థశాస్త్రము నందు నాఱు విధములగు రథములను పేర్కొనినాఁడు.

> దేవరథ పుష్యరథ సాంగ్రామిక పారియాణిక పరపురాభి యానిక వైనయికాంశ్చ స్థాన్ కారయేత్॥
>
> —కౌటిల్యః అర్థశాస్త్ర. 2-38

దేవరథము దేవయాత్రల యందును, పుష్యరథము మాంగలిక యాత్రలందును సాంగ్రామికము యుద్ధములందును, పారియాణికము పరిభ్రమణములకు, పరపురాభియానము శత్రుదుర్గ విధ్వంసనాది కార్యములకు వైనయిక మశ్వ శిక్షార్థము నుపయోగింపఁడును.

మహాభారతమునం దీ షడ్విధ రథములకు ననేకోదాహరణములు గనిపించుచున్నవి.

1. దేవ రథము : ఇంద్రాది దేవతల రథములు, మహేశ్వరుని రథము.
2. పుష్య రథము : 'అథో భగవతా పుష్యరథస్య
   స్వస్తి వాచనాని సుష్టు సంభావితాని॥'
   —వ్యా భా. వన. 197-6
   పట్టాభిషేక సమయములం దుపయోగింపఁబడునవి. పుష్యరథములు.
3. సాంగ్రామిక రథము (జైత్ర రథములు) : భారత సంగ్రామమునందు 3,93,660 జైత్రరథము లుపయోగింపఁ బడినవి.
4. పారియాణిక రథములు : 'సర్వాయుధ సనాథంబైన రథం బెక్కి గజపురంబున కభిముఖంబుగా విజయ ప్రయాణంబు సేయు' మని భీముఁడు ధర్మరాజునకుఁ జెప్పినాడు.
   —ఎఱ్ఱన. అరణ్య. 1-252
5. పరపురాభియానము : సాల్వుఁడు నిజసేనాసంక్షోభం బుడిచి సర్వాయుధ సనాథంబైన రథం బెక్కి యాదవకుమారవాహినిపై నెత్తెను.
   — ఎఱ్ఱన. అరణ్య 1-163
6. వైనయిక రథము : కుమారాస్త్రవిద్యా ప్రదర్శన రంగమున 'రథారూఢ పరికరఁ బ్రకటించువాఁడు' గలఁడు.

# సప్తవిధ రథములు

ప్రమాణమును బట్టి రథములు ఏడు విధములు.

దశపురుషో ద్వాదశాంతరో రథః

తస్మా ద్దేకాంతరావరా ఆషడంతరా దితి సప్తరథాః ॥ —అర్థశాస్త్ర. *

దశ పురుష ప్రమాణమెత్తును ద్వాదశ పురుష ప్రమాణము వెడల్పును గల రథము శ్రేష్ఠమైనది. తక్కిన యాఱు రథముల యెత్తులో మార్పుండదు కాని వెడల్పులో ద్వాదశ పురుషప్రమాణమునుండి షట్పురుష ప్రమాణము వఱకు ఒక్కొక్క పురుష ప్రమాణము తగ్గుచుండును.

ఈ సూత్రము ననుసరించి నిర్మింపఁబడిన సప్తవిధ రథములు కొలతలు [ఎత్తు-వెడల్పు] అడుగులలో నిట్లుండును.

1) 80 × 96 అ. (2) 80 × 88 అ. (3) 80 × 80 అ. (4) 80 × 72 అ. (5) 80 × 64 అ. (6) 80 × 56 అ. (7) 80 × 48 అ.

పురుష ప్రమాణ మనఁగా 96 అంగుళములని వ్యాఖ్యాతలు వివరించినారు.[1]

## రథాధ్యక్షుఁడు

రథాధ్యక్షుఁడీ ప్రకారము రథములు నిర్మింపఁగలిగి యుండవలెను.

అశ్వాధ్యక్షేణ రథాధ్యక్షో వ్యాఖ్యాతః స రథకర్మాన్
తాన్ కారయేత్॥ కౌటిల్య. అర్ధశాస్త్ర, 2-33*

రథకర్మయనఁగా రథములు చేయుపని కావున రథాధ్యక్షుఁడు రథకారుఁడై యుండవలెను.

నూతన రథనిర్మాణము జీర్ణ రథములను చక్కజేయుట వానిపని.

మహాభారతకాలమునాటికి 'రథ సూత్రములు' పాటింపఁబడు చున్నవి.

కచ్చిత్ సూత్రాణి సర్వాణి గృహ్ణాసి భరతర్షభ
హస్తి సూత్రాశ్వసూత్రాణి రథ సూత్రాణి వా విభో॥

—వ్యా. భా. సభా. 5-121

---

* చూడు :- కౌటిల్య : అర్ధశాస్త్ర - శ్రీ భారతీయయోగి హిందీ అనువాద సహితము. పు 244-5

1. చూడు :- అర్ధశాస్త్ర : ఆంగ్లానువాదము - డా॥ శ్యామశాస్త్రి.

## చాతుర్వర్ణ్యోచిత రథములు

మహాభారతకాలమున బ్రహ్మ రాజన్యవైశ్యశూద్రాదు లుపయోగించు రథములు వేఱు వేఱుగా నుండెడివి.

"ద్రుపదుండు ధృష్టద్యుమ్నుం జూచి చాతుర్వర్ణ్యోచితంబులయిన రథంబులఁ గొనిపోయి వారలం దోడ్కొని రమ్మని పంచిన వాఁడును నాక్షణంబు పాండవుల పాలికివచ్చి యీ రథంబు లెక్కి మారాజు నొద్దకు రండనిన నాక్షణంబ పాండవులు రాజయోగ్యంబులయి రత్నాం చితంబు లయిన కాంచన రథంబు లెక్కి కుంతి దేవిని ద్రౌపదిని నొక్కరథం బెక్కించి తోడ్కొని ధృష్టద్యుమ్నుతో ద్రుపదరాజ నివేశంబున కరుదెంచిరి" —నన్నయ ఆది. 7-235

మూలమునందు పాండవు లెక్కివచ్చిన రాజయోగ్యములయిన రథముల పయి బంగారు పద్మములు చిత్రింపఁబడియున్నట్లు వర్ణింపఁబడినది.

ఇమే రథాః కాంచన పద్మ చిత్రాః
సదశ్వయుక్తా వసుధాధిపార్హాః॥ —వ్యా. భా. ఆది. 194-2

కుంతిదేవియు ద్రౌపదియు నొక పల్లకీ యెక్కి వచ్చిరి.

ఆస్థాయ యానాని మహాంతి తాని
కుంతీ చ కృష్ణా చ సహైకయానే॥ —వ్యా. భా. ఆది. 194-3

యాన మనఁగా పల్లకి. ఈ యానము విశాలమైనది. స్త్రీ జనోచితమైనది. దీనికే యలంకారములు నున్నట్లు లేదు.

దమయంతి సుబాహుపురమునుండి విదర్భ కేగిన యానము విమానము వలె నున్నట్లు వర్ణింపఁబడినది.

"దమయంతి నతిస్నేహంబున సుబాహు జనని సుత ప్రేషితజనంబుతో సువర్ణ మణిమయ విమానోపమాన యానంబున నునిచి పుచ్చినది.
—నన్నయ అరణ్య. 2-152

* వ్యా. భా. వన. 69-23

ప్రస్థాపయామ్ రాజమాతా శ్రీమతీం వరవాహనా
యానేన భరతశ్రేష్ఠ స్వన్నపాన పరిచ్ఛదామ్॥

## రత్నకాంచన రథశిబికలు

ద్రౌపది వివాహానంతరము ద్రుపదమహారాజు పాండవుల కేపురకు వేఱువేఱ నూఱేసి కాంచన రథంబులను అగ్నిసాక్షికముగా నిచ్చెను.

—నన్నయ. ఆది 8-7

ఆ రథములు సువర్ణమాలలతో నలంకరింపఁబడియున్న వనియు, ఒక్కొక్క రథము బంగారు కళ్లెములుగల నాలుగేసి గుఱ్ఱములతో నొప్పుచున్న దనియు మూలమునందు వర్ణింపఁబడినది.

కృతే వివాహే ద్రుపదో ధనం దదౌ
మహారథేభ్యో బహురూపముత్తమమ్
శతం రథానాం వరహేమమాలినాం
చతుర్యుజాం హేమఖలీన మాలినామ్॥ —వ్యా. భా. ఆది. 195-15

వాసుదేవుఁడు "......రథ రత్నశిబికా విలాసినీ నివహంబులుం బుత్తెంచెను."

—నన్నయ్య. ఆది. 8-7

ఈ రథములు గజదంతమయములు, శుభ్ర వస్త్రములుతోను సువర్ణమాలలతోను అలంకరింపఁబడినవి.

రథాంశ్చ దాంతాన్ సౌవర్ణైః శుభ్రైః పట్టై రలంకృతాన్॥

—వ్యా. భా. ఆది. 198-17

శిబికలు వజ్రవైడూర్యాది మణులతో నలకరింపఁబడినవి.

శయనాసన యానాని వివిధాని మహాంతి చ
వజ్రవైడూర్య చిత్రాణి శతశో భాజనాని చ॥ —వ్యా.భా. ఆది. 198-15

ద్వారకాపురవాసులయిన యాదవకుమారులు రైవతకోత్సవమునకు బంగరు శిబికలలో నరిగిరి.

యానై ర్హాటక చిత్రైశ్చ చంచూర్యంతే స్మ సర్వశః ॥—వ్యా.భా. ఆది. 218-5

సుభద్రార్జునుల వివాహానంతరము కృష్ణుఁడు, "తురగసారథి సహితంబైన రథసహస్రంబును... కాంచన శిబికా సహస్రంబు" అరణముగా నిచ్చెను.

—నన్నయ. ఆది. 8-221

మహాభారతకాలమున ప్రయాణసాధనములయిన రథములను పల్లకీలను సువర్ణరత్నాది మాలికలతో చక్కగా నలంకరించు కొనుచుండిరని తెలియుచున్నది.

## మహాదేవుని దివ్యరథము

రథం తే కల్పయిష్యామో దేవేశ్వర సువర్చసమ్
తత్రైవ బుద్ధ్యా విహితం విశ్వకర్మకృతం శుభమ్॥
—వ్యా.భా. కర్ణ. 34-17

అప్పుడద్దేవునకు విభవం బెసఁగ బురహననంబునకయి యభిషేకంబు సేసి, త్వష్ట నవలోకించి,

'మహాదేవునకు దివ్యరథంబును దగియెడు సాధనంబులను గల్పింపు' మనవుడు తపః ప్రభావ మహనీయుండగు విశ్వకర్మ యవహితుండై,

సామర్థ్య మొప్ప విశ్వంభరా చక్రంబు రథముగఁజేసి
చంద్రమూని మస్తకరుచిఁ జక్రంబులుగాఁ బెట్టి వారిధి నక్షమొనర్చి
హిమావనీధరంబున వింధ్యనగంబున నస్తాచలంబున నుదయశైలమున
బెఱపుటవయవంబులు దీర్చి
యగ్నుల మూటఁ ద్రివేణుక రచనఁ గావించి
మేరు పర్వతమున నాతపత్రంబుఁ గల్పించి
హరులు వేదములు శరాసనంబు వత్సరంబు
శరము వాసుదేవుండునుగాగ సంఘటించె గౌరవమున.
—తిక్కన. కర్ణ. 1-281-2

ఈ వర్ణనమున చక్రములు అక్షము, త్రివేణుక, ఆతపత్రము, హరులు, శరాసనము, శరము పేర్కొనబడినవి.

మూలము నందు ఉపాదండము, యుగము, కూబరము, అపస్కరము, పరిష్కరము, అనుకర్ష వరూథములు, త్రివేణువు, బంధురము, ధ్వజయష్టి ఇత్యాది రథావయవములు పేర్కొనఁబడినవి [1]

మహాభారతము నందలి మహాదేవుని దివ్యరథవర్ణనము సమగ్రముగను సర్వాంగ సుందరముగను నున్నది.

ఈ వర్ణనము వలన రథమునం దేయే యంగములుండునో తెలియ వచ్చును.

1. వ్యా.భా. కర్ణ - త్రిపురవధోపాఖ్యానము. అ. 35. 17-57

# మాయామయమయిన మహేంద్రుని దివ్యరథము

దశవాజి సహస్రాణాం హరీణాం వాతరంహసామ్
వహంతి యం నేత్ర ముషం దివ్యం మాయామయంరథమ్॥
—వ్యా. భా. వన. 42-27*

ఇంద్రుఁడు దేవతల కధిపతి. దేవరాజు రథము దివ్యమయినది. మాయామయ మయినది. మాయ యనగా శిల్పము. కావున నది శిల్పకళా చమత్కృతులతో నిండినదని చెప్పవచ్చును.

ఇంద్ర రథ వర్ణనము భారతారణ్య పర్వమునందు పలుతావులనున్నది. అందు మొదట మఘవునానతిపై నరుని నాకలోకమునకుఁ గొనిపోవుటకుఁ మాతలి దివినుండి భువికి దిగుచున్నప్పటి రథవర్ణనము.

వారిద మార్గంబు వలన మహానీలవైజయంతీ విభవంబు వెలయ
నాబద్ధ వివిధరత్నావళి ప్రభఁజేసి రమ్యమై రోదోంతరంబు వెలుఁగ
నురునేమి రవమున నుర్వరాధరదరీ ముఖములు ప్రతిశబ్ద ముఖరితంబు
లగుచుండ నానావిధాయుధంబులు దాల్చి యశన విద్యుత్సహస్రాభిశోభి
తాభ్ర సదృశమై మహాజవాశ్వాయుత వాహ్యమానమైన వరరథంబు
మఘవునాజ్ఞఁజేసి మాతలియుక్తమై యింద్రతనయుఁ డున్నయెడకు వచ్చె॥
—నన్నయ. అరణ్య. 1-34

ఈ వర్ణనము నందు మూలభిన్నమయిన యొక క్రమమును పాటించి నన్నయ తన కవితాశిల్పమును బ్రదర్శించినాఁడు.

మొట్టమొదట దూరమునుండి వచ్చుచున్న రథముపై నుండి ధ్వజము కంటఁబడినది.

తత్రాపశ్యన్ మహానీలం వైజయంతం మహాప్రభం
ధ్వజ మిందీవరశ్యామం వంశం కనకభూషితమ్॥

ఇంద్రధ్వజము పేరు వైజయంతము.[1] —వ్యా. భా. వన 42-8

---

* పోల్చు :- వ్యా. భా. వన. 168-32

అథాఽపశ్యం హరియుక్తం రథ మైంద్రముపస్థితమ్
దివ్యం మాయామయం పుణ్యం యత్తం మాతలినా నృప.

1. 'వైజయంతం నామ్నా దేవేంద్రధ్వజమ్.' —నీలకంఠ

ఏమ్ముట రథాకృతి స్థూలముగ పొడకట్టినది.

రథమునం దందందు పొదగఁబడిన రత్నముల కాంతులతో ఆకాశ మధ్యభాగము వెలుఁగుచున్నది.

తరువాత రథచక్ర ధ్వని వినిపించినవి. ఆ ధ్వని కొండగుహలందు ప్రతిధ్వనించు చున్నది.

రథము సమీపగతమయినపు డందలి వివిధాయుధములు గన్పించినవి. అప్పు డది సహస్రాశని విద్యుత్కాంతులతో నిండిన మేఘమువలె నున్నది.

అది సాంగ్రామిక రథము.

ఆ రథమునం దసిశక్తి గదా ప్రాసాశని భాండగోళక వాయుస్ఫోటాది మహాయుధములున్నట్లు మూలమునందు వర్ణింపఁబడినది.

> అసయః శక్తయో భీమా గదాశ్చోగ్ర ప్రదర్శనాః
> దివ్యప్రభావాః ప్రాసాశ్చ విద్యుతశ్చ మహాప్రభాః॥ 4
> తథైవాశనయశ్చైవ చక్రయుక్తా స్తులాగుడాః
> వాయుస్ఫోటాః సనిర్ఘాతా మహామేఘ స్వనాస్తథాః॥ 5

—వ్యా.భా. వన. 42-4-5*

మఱియొక విశేష మేమనఁగా నాస్యందనమునకు మహాకాయములతోను మండుచున్న ముఖములతోను భయంకరముగా నున్న నాగములు వ్రేలాడు చున్నట్లు కల్పింపఁబడినది.

> తత్ర నాగా మహాకాయా జ్వలితాస్యాః సుదారుణాః
> సితాభ్రకూట ప్రతిమాః సంహతాశ్చ తథోపలాః॥

—వ్యా భా. వన. 42-6

అర్జునుఁ డింద్రలోకమునుండి భూలోకమునకు వచ్చునప్పు డాతఁ డెక్కిన రథము చలించుచున్న మెఱపుఁదీఁగలగమి వలె మిఱుమిట్లు గొలుపుచున్నది.

---

* తులాగుడాః భాండగోళకాః భాండాని తు 'నాలబంధూక్' ఇత్యాది మ్లేచ్ఛ భాషయా ప్రసిద్ధాని ఆగ్నేయౌషధ బలేన పాషాణ గోలకాది విక్షేప పాత్రాణి॥
వాయుస్ఫోటాః వేగవశాద్ వాయుం జనయంతః
సనిర్ఘాతా అశనిధ్వనియుక్తాశ్చ మహామేఘస్వనాః ॥ 5 ॥ —నీలకంఠ.

అంబర మాత్మదీప్తి నివహంబున నొప్పఁగ మాతలి ప్రయు
క్తంబయి దివ్యకాంచనరథంబుఁ జలచ్చపలాంశుపుంజర
మ్యంబగు దాని నెక్కి ధృతిమందరుఁ డింద్రసుతుండు నాకలో
కంబున నుండి వచ్చెఁ బ్రవికాశితతేజుఁ డినప్రకాశుఁడై ॥

— నన్నయ అరణ్య. 4-40

మహేంద్రుడు నివాతకవచులను నిహతము చేయుట కర్జును నియోగించి "పదివేల హంస మయూరవర్ణ మాననీయ హయంబులం బూనిన రథంబు మాతలిప్రయుక్తంబయిన దాని నెక్కఁబంచెను.[1]

ఇది సహస్రాక్షుని మాయామయమైన దివ్యరథము.

"ఈ రథమెక్కి తొల్లి యమరేంద్రుఁ డనేక సహస్రదే
వారుల వృత్ర శంబర బలాదుల నుద్ధతులన్ జయించెను.[2]

## ఇంద్ర రథ నిర్మాతలు

ఇంద్రునికి రథమును దానిని లాగుటకు హయులను నిర్మించిన రథకారులు ఋభువు లని ఋగ్వేదము చెప్పుచున్నది.

ఇంద్ర రథ నిర్మాతలు భృగువులని వేరొక మంత్రము తెలుపుచున్నది.

ఏ వేదింద్రాయ వృషభాయ వృష్ణో
బ్రహ్మ కర్మ భృగవో న రథమ్॥ —ఋగ్వేద. 4-16-20 *

[వృషభ సదృశ బలిష్ఠుఁడు వీర్యవంతుఁడు నయిన యింద్రునికొఱకు భృగువులు రథమును నిర్మించినట్లు మేము ఇంద్రునికొఱకు స్తోత్రమును చేసితిమి ]

భృగువులు ప్రతిభావంతులయిన దారుశిల్పులు.

రథకార బ్రాహ్మణు లయిన ఋభువులు, భృగువులు, దేవరాజునకు వేల్వేలు రథములు నిర్మించి యుందురు.

---

1. నన్నయ అరణ్య. 4-59  2. నన్నయ. అరణ్య. 4-58

* " Now as the Bhrigus wrought a car for Indra the strong, the Mighty, we our prayer has fashioned."
Bhrigus are spendid carpenters according to Sayana.
"జైసే శిల్పీ జన్ విద్యాకే సాథ్ పదార్థోంకే సంయోగ్ పే
విమానాది కీ రచనా కర్కే ధనవాన్ హోకర్
మిత్రోంకా సత్కార్ కర్తే హై" దయానంద. ఋగ్వేద భాషాభాష్య

## శ్రీకృష్ణుని దివ్యకాంచన రథము

రథేన కాంచనాంగేన కల్పితేన యథావిధి
శైబ్య సుగ్రీవ యుక్తేన కింకిణీజాలమాలినా॥

—వ్యా. భా. ఆది. 119-3

కాంచనాంగము అనఁగా సువర్ణమయధ్వజాదులని నీలకంఠుఁడు వివరించినాఁడు.[1]

శ్రీకృష్ణుని రథము సువర్ణమయాంగములతో శాస్త్రప్రకారము కల్పింపఁబడినది.

నారాయణుండును నిజారంభంబు సఫలంబగుటకు సంతసిల్లి సంప్రాప్త మనోరథుండయిన యప్పార్థుం గౌగలించుకొని యక్షయ బాణ తూణీర బాణాసన సనాథుండయి పవనజవన హయంబులం బూన్చిన కాంచన రథం బెక్కి సుభద్రం దోడ్కొని యింద్రప్రస్థపురంబున కరుగు మని పంచెను.

—నన్నయ ఆది. 8-197

శ్రీకృష్ణుఁడు గరుడధ్వజుఁడు. కావున నాతని తేరు పయి రత్నఖచిత సువర్ణమయ ధ్వజ మెగురుచుండును.

అవిలజవాశ్వయుక్తమయి హాటకరత్న విచిత్ర తార్క్ష్యకే
తనమయి మేఘనాదమయి దారుకసారథియైన దివ్యకాం
చన రథమెక్కి యా క్షణమ సాత్వతకుంజరుఁ డేగె భక్తి నా
తని నరిగెన్ యుధిష్ఠిరుఁడు తమ్ములుఁ దారును బాదచారులై॥

—నన్నయ. సభా. 2-84

ధర్మజుని రాజసూయానంతరము శ్రీకృష్ణుఁడు ద్వారకాపురి కరుఁగ నున్నప్పటి రథవర్ణన మిది.

శ్రీకృష్ణుని రథము మేఘవర్ణము గలిగి సుందరశిల్ప కల్పనములతో నొప్పుచున్న దని మూలమునందు వర్ణింపఁ బడినది

తతో మేఘవపుః ప్రఖ్యో స్యందనం చ సుకల్పితమ్
యోజయిత్వా మహాబాహూ ర్దారుకః సముపస్థితః॥

—వ్యా. భా. వన. 45-60

సుకల్పితమనఁగా శోభనకల్పిత మని యర్థము.[2]

---

1 'కాంచనాంగేన సువర్ణమయ ధ్వజాదిమతా' —నీలకంఠ

2 "The car of exellent design" —P.C. Roy, Mbhsabk. P. 126

శ్రీకృష్ణుఁడు సత్యభామా సమేతుఁడయి కామ్యక వనమందున్న పాండవుల యొద్దకు వచ్చినప్పటి రథము రత్నకాంతులతో రమణీయముగ నున్నది.

శైబ్య సుగ్రీవాది జవనాశ్వయుక్తమై యాబద్ధనూత్న రత్నాంశు పటల
భాసితంబై చారుపతగ పతాకావిభూషితగగనమై పొలుపు మిగుల
దివ్యరథంబున దేవకీసుతుఁడు ప్రియంబున సత్యభామాన్వితముగఁ
దరళ సౌదామనీ దామ సముజ్జ్వల ధారాధరోత్సంగతలమునందు
శచియుఁదాను వెలుఁగ శతమన్యుఁడునుబోలె నరుగుదెంచె ఘనరథాంగనేమి
విపుల ఘోష తాండవిత బర్హి శబ్ద శబ్దాయమానవిభాగుఁడగుచు॥

—ఎఱ్ఱన. అరణ్య. 4-152

కృష్ణ రథ వాహములు రెండని కొన్నిచోట్లను, నాలుగని కొన్నిచోట్లను చెప్పఁబడినది.

రాయబారార్థము హస్తినకేగఁ దలంచి కృష్ణుడు, దారుకుంజూచి తేరు పూన్ప నియోగించిన నతండును "మణిగణ ప్రభాపటల జటిలం బగు నరదంబు వన్నిశైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబు లనం బరగు తురంగంబులం బూన్చి గరుడధ్వజంబెత్తి తెచ్చెను." —తిక్కన. ఉద్యోగ. 3-131

వ్యాసభారతమునందలి శ్రీకృష్ణ రథ వర్ణనము శిల్పసుందరముగ నున్నది.

తం దీప్త మివ కాలాగ్ని మాకాశగ మివాశుగమ్
సూర్య చంద్ర ప్రకాశాభ్యాం చక్రాభ్యాం సమలంకృతమ్॥
అర్ధచంద్రైశ్చ చంద్రైశ్చ మత్స్యైః స్సమృగపక్షిభిః
పుష్పైశ్చ వివిధై శ్చిత్రం మణిరత్నైశ్చ సర్వశః ॥
తరుణాదిత్యసంకాశం బృహంతం చారుదర్శనమ్
మణిహేమ విచిత్రాంగం సుధ్వజం సుపతాకినమ్॥

—ఉద్యోగ. 83. 15-17

ఆ రథము కాలాగ్నివలె దీప్తిమంతము, విమానము వలె శీఘ్రగామి. రథచక్రములు సూర్య చంద్రులవలె శోభిల్లుచున్నవి.

రథమంతయు మణిమయములైన అర్ధచంద్ర పూర్ణచంద్రాకృతులతోను, మీనమృగ పక్ష్యాదులతోను వివిధపుష్పములతోను చిత్రింపబడి యున్నది.

విశాలమైన ఆ రథము వివిధాంగములు సువర్ణమణిఖచితములై తరుణసూర్యుని వలె వెలుఁగుచు కనులకింపు గొలుపుచున్నది.

శ్రీకృష్ణుని తేరు 'రత్నరుచులపెల్లున నుదితార్కుని బోలి వెలుఁగు చుండె' నని తిక్కన వర్ణించినాఁడు.[1] —తిక్కన శాంతి. 2-18

రథావయవములు మరకతాది నానామణిగణములతో నలంకరింపఁ బడినట్లు వ్యాసభారతమునందు వర్ణింపబడినది.

స సాత్యకే రాశువచో విశమ్య రథోత్తమం కాంచనభూషితాంగం
మసారగల్వర్కమయై ర్విటంకై ర్విభూషితం హేమనిబద్ధచక్రమ్॥
దివాకరాంశు ప్రభ మాశుగామినం విచిత్రనానామణి భూషితాంతరమ్
నవోదితం సూర్య మివప్రతాపినం విచిత్రతార్క్ష్య ధ్వజినంపతాకినమ్॥
—వ్యా. భా. శాంతి. 46. 33-34*

కృష్ణుని రథము స్వర్ణమయములైన రథాంగములతోను మరకత చంద్ర కాంత సూర్యకాంతాది మణిమయములయిన గువ్వగుళ్లతోను హేమమయ చక్రములతోను నానావిధమణులతో విచిత్రముగా నలంకరింపఁబడిన రథమధ్య ముతోను చిత్రమయిన గరుడకేతనముతోను మనోహరముగానున్నది.

ఈ విధముగా చిత్రవిచిత్ర శిల్పకల్పనా విశిష్టమయిన శ్రీ కృష్ణుని రథమును నిర్మించిన శిల్పియెవఁడు ?

భారతమునం దొక సూచన మాత్రమున్నది.

విశ్వకర్మకృతా దివ్యా రత్నధాతు విభూషితా
ఉచ్ఛ్రితేవ రథే మాయా ధ్వజయష్టి రదృశ్యత॥
—వ్యా. భా. సౌప్తిక. 3-4

రథావయవములతో ప్రధానమయిన ధ్వజయష్టి విశ్వకర్మచే రత్నధాతు మయముగా జేయఁబడినది ధ్వజనిర్మాతయే రథ నిర్మాతయు నగును.

అదియునుగాక శ్రీకృష్ణునకు ద్వారకాపురమును నిర్మించి యిచ్చిన వాఁడు విశ్వకర్మయేకదా! కావున శ్రీకృష్ణ రథనిర్మాత విశ్వకర్మయే యనుటలో సందేహము లేదు.

---

1. పోల్చు :- తిక్కన. సౌప్తిక. 2-83 "ప్రద్యోతితానేక రత్నశోభితము"

* మసారో మరకతమణిః గలశ్చంద్రకాంతః తన్మయైః
విభంగైః విస్తరైః విటంకై రితి పాఠే పక్ష్యుపవేశస్థానైః ॥ —నీలకంఠ
గల్వర్కః వైడూర్యమణి యని కొందఱు.

## అగ్నిదత్తమైన అర్జును దివ్యరథము

ససర్జ యం సుతపసా భౌమనో భువనప్రభుః ॥

అగ్నిదేవుని యభ్యర్థనపై వరుణుండు "...వివిధాయుధ భరితంబై సింహలాంగూలలాలిత గోలాంగూల ధ్వజవిరాజమానంబై మహాంబుధర ధ్వాన బంధురమై మనోవాయువేగ సితవాహ వాహ్యమానంబై రణితరమణీయ మణికింకిణీ కలాపాలాంకృతంబై, సకలదిగ్విజయాధిష్ఠానంబై, యొప్పుచున్న దివ్యరథంబు నర్జునున కిచ్చెను. —నన్నయ్య. ఆది. 8-254

ఈ దివ్యరథనిర్మాత యెవరో నన్నయ చెప్పలేదు.

ఆ రథనిర్మాత విశ్వకర్మ యని వ్యాసభారతము వలనఁ దెలియుచున్నది.

అనేక రత్నములతో మనోహరమై కాంతిమంతమై మహాఘోషముతో నొప్పు నారథమును ప్రజాపతియు, భువన ప్రభువు నయిన భౌమనుఁడు - విశ్వకర్మ - అధికతపశ్శక్తిచేత నిర్మించినాఁడనియు సూర్య సంకాశ ప్రకాశము గల దాని రూపమిట్లుండునని చెప్పశక్యము గాదనియు వర్ణింపఁబడినది.

భానుమంతం మహాఘోషం సర్వరత్నమనోహరమ్
ససర్జ యం సుతపసా భౌమనో భువనప్రభుః *
ప్రజాపతి రనిర్దేశ్యం యస్య రూపం రవే రివ॥
—వ్యా. భా. ఆది. 225-13, 14

విశ్వకర్మకృతమైన యీ దివ్యరథము ప్రశస్తమైనది.

ఈ రథ మప్రతిహతము సమీరజవోపేత హయసమేతము దీనిన్
భూరిబలుఁ డెక్కి సోముఁడు ధీరుండయి తొల్లి యెల్ల దిక్కుల నోడిచెన్.
—నన్నయ. ఆది 8-255

---

* భానుమంతం దీప్తిమంతం భౌమనో విశ్వకర్మా —నీలకంఠ

"సంపూర్ణజగత్ కే స్వామీ ప్రజాపతి విశ్వకర్మానే బడీ భారీ తపస్యాకే ద్వారా ఉస్ రథ్ కా నిర్మాణ్ కియాథా" —మహాభారత - హిందీ అనువాదసహితము గీతాప్రెస్ ప్రతి. పు. 641

"It had been created by Visvakarma, the architect of the universe and one of the lords of creation after severe ascotic meditation"
—P C Roy, Mbh Adi.

ఈ రథము క్రౌమ్మేఘములువలె దివ్యకాంతులతో ప్రకాశించుచున్నది.

నవమేఘప్రతీకాశం జ్వలంత మివ చ శ్రియా॥

—వ్యా. భా. ఆది 225-14

పుణ్యాత్ముఁడు విమానము నెక్కినట్లు పార్థుఁడా రథము నెక్కినాఁడు.

ఆరురోహ రథం పార్థో విమానం సుకృతీ యథా॥

—వ్యా.భా. ఆది. 225-19*

నాలుగు తెల్ల గుఱ్ఱములతో లాగబడు నా రథమంతయు హిరణ్మయమయి, సువర్ణరత్నకాంతులు వెదజల్లు చుండును.

హిరణ్మయం శ్వేతహయైశ్చతుర్భిః యదా యుక్తం స్యందనం మాఘవస్య
యదా రథం హేమమణిప్రకాశం శ్వేతాశ్వయుక్తం వానరకేతుముగ్రమ్॥

—వ్యా.భా. ఉద్యోగ. 48-50, 51

శ్వేతాశ్వయుక్తమయిన యర్జును రథము, శ్రేష్ఠమయిన జాంబూనద నామక స్వర్ణమయాలంకృతులతో నూఱేసి చిఱుగంటలు గల సహస్ర సూర్య సదృశ చక్రములతోను, జ్వాలామాలాంకృతమయిన యగ్నివలె ప్రకాశించు చున్నదని భీష్మపర్వము నందు వర్ణింపఁబడినది.

సహస్రసూర్యః శతకింకిణీకః పరార్ధ్యజాంబూనదహేమచిత్రిం
రథోఽర్జునస్యాగ్ని రివార్చిమాలీ విభ్రాజతే శ్వేతహయః సుచక్రః ॥

—వ్యా. భా భీష్మ 22-9

పరువిడునపుడు దాని యిరుసు సద్దుసేయ కుండునట్లు త్వష్ట యా రథమును నిర్మించినాఁడని కర్ణపర్వమునందు వర్ణింపఁబడినది. త్వష్ట యనఁగా విశ్వకర్మ.

త్వష్ట్రాకృతం వాహ మకూజనాక్షం
శుభం సమాస్థాయ కపిధ్వజం తం॥ —కర్ణ. 63-25

విశ్వకర్మ యింద్రు నానతిచే నర్జును రథమున నద్భుతమైన కేతువును గల్పించినాఁడు.

ఆదిత్యపథగః కేతుస్తస్యాద్భుత మనోరమః
శాసనాత్ పురుహూతస్య నిర్మితో విశ్వకర్మణా॥ —భీష్మ. 50-44

* పోల్చు : ఆరురోహ రథం శౌరి ర్విమాన మివ కామగమ్॥ —ఉద్యోగ. 83-21

## ధ్వజము - ధ్వజయష్టి

తాపనీయా సురుచిరా ధ్వజయష్టి రనుత్తమా
తస్యాంతు వానరో దివ్యం సింహశార్దూలకేతనః ॥*
దిధక్ష్య న్నివ తత్రిస్మ సంస్థితో మూర్ధ్న్యశోభత
ధ్వజే భూతాని తత్రాసన్ వివిదాని మహాంతి చ॥
నాదేన రిపుసైన్యానాం యేషాం సంజ్ఞా ప్రణశ్యతి॥

—వ్యా. భా. ఆది. 225-15, 16

భౌమమునిచే నిర్మింపఁబడిన యా రథము యొక్క ధ్వజయష్టి బంగారముతోఁ జేయఁబడినది. దాని శీర్షభాగమున సింహశార్దూల సదృశ భయంకర కాయముగల వానరమున్నది. ఆ కపిధ్వజము నాశ్రయించి యనేక భూతములున్నవి. వాని యఱపులకే శత్రుసైన్యము నశించుచున్నది.

అర్జును రథమునకు కపిధ్వజమును నిర్మించినవాఁడు విశ్వకర్మ యని తిక్కన తెలిపినాఁడు.

ఉత్తరునకు సారథిగానేగిన యర్జునుఁడు (బృహన్నల) మనమునం "దగ్నిదేవుని దలంచిన నతండును దన వరంబున మున్నకలిగి విశ్వకర్మ నిర్మితంబును మాయామయంబును వానరాకారంబును నగు మహోగ్ర కేతనంబును దదాశ్రితంబులై వికృతాభీలనానావిధభూతంబులనుం బుత్తెంచెను"

—తిక్కన. విరాట. 4-170

మూలమునం దిట్లున్నది.

దైవీం మాయాం రథేయుక్తాం విహితాం విశ్వకర్మణా
కాంచనం సింహలాంగూలం ధ్వజం వానరలక్షణమ్॥**

—వ్యా.భా. విరాట, 26-3

---

* సింహశార్దూలకేతనమ్ సింహశార్దూలవత్ భయానకః
కేతనః కాయో యస్య సః ॥ కేతనం లాంఛనం కాయో ఇతి విశ్వః॥ —నీలకంఠ

** దైవీం మాయా మిత్యద్భుతత్వం ధ్వజస్య దర్శితమ్
మాయామయ ఇవ ధ్వజోఽద్భుత ఇత్యర్థః ॥
విశ్వకర్మణా బ్రహ్మణా భౌమనేన వా కాంచనం కాంచనవర్ణం
సింహం హింస్రం లాంగూలం యస్య పుచ్ఛవిక్షేపణేనైవ బహూన్
హస్త్యాదీన్ పోథయంత మిత్యర్థః వానర లక్షణమ్ వానరస్వరూపమ్॥

—నీలకంఠ

భౌమనుఁ డింద్రునితో గలిసి యీరథమునకు విచిత్ర రూపములు గల్పించినాఁడనియు, త్వష్టప్రజాపతి ధ్వజమునకు రూపములు గల్పించి నాడనియు నీ రూపములన్నియు దైవమాయ వలన గలుగుచున్నవనియు భారతోద్యోగపర్వమునందు వర్ణింపఁబడినది.

సంజయుఁడు దుర్యోధనునితోఁ జెప్పుచున్నాడు.

భౌమన స్సహశక్రేణ బహుచిత్రం విశాంపతే
రూపాణి కల్పయామాస త్వష్టా ధాతా సదా విభో
ధ్వజే హి తస్మిన్ రూపాణి చక్రుస్తే దేవమాయయా
మహాధనాని దివ్యాని మహంతి చ లఘూని చ॥

—ఉద్యోగ 56-7, 8*

ఇట భౌమన - త్వష్ట - ధాత [ప్రజాపతి] శబ్దములు పర్యాయ వాచకములుగా గనిపించుచున్నవి. భౌమనుఁడనగా విశ్వకర్మ.

భౌమన కృతమయిన దివ్యమాయ వలననే యింద్రధ్వజమువలె నెత్తుగా ప్రకాశించుచున్న కపిధ్వజము పయి జయావహములయిన దివ్యభూతములు భయంకరముగా నున్నవి.

దివ్యా మాయా విహితా భౌమనేన సముచ్ఛ్రితా ఇంద్రకేతు ప్రకాశా
దివ్యాని భూతాని జయావహంతి దృశ్యంతి చైవాత్ర భయానకాని॥

—వ్యా. భా. ఉద్యోగ. 142-4

ఈ మాయ భౌమనకృతమని పునః పునరుద్ఘాటింపఁబడినది.

తథా హి మాయా విహితా భౌమనేన॥ —ఉద్యోగ. 56-10

తథా ధ్వజో విహితో భౌమనేన
బహ్వాకారం దృశ్యతే రూపమస్య॥ —ఉద్యోగ 56-11

నీలకంఠుఁడు భౌమనునకు విశ్వకర్మకు బ్రహ్మకు నభేదము చెప్పినాఁడు. బ్రహ్మ సృష్టికర్త - విశ్వకర్మ శిల్పసృష్టికర్త.

అర్జునుని దివ్యరథము దేవశిల్పియు నద్భుతశిల్పకళా సృష్టికర్తయు నగు విశ్వకర్మ చేత సృష్టింపఁబడిన దని స్పష్టమగుచున్నది.

* "ప్రజానాథ! విశ్వకర్మా త్వష్టా తథా ప్రజాపతినే ఇంద్రకే సాథ్ మిల్‌కర్ అర్జున్‌కే రథ్‌కే ధ్వజామే అనేకప్రకార్ కే రూపోంకీ రచ్‌నా కీ హై॥"
—భారతము హిందీ టీకాసహితము, గీతాప్రెస్

# భార్గవ దత్తమైన రాధేయుని రథము

వరూథినా మహతా సధ్వజేన సువర్ణముక్తామణిరత్నమాలినా
సదశ్వయుక్తేన రథేన కర్ణో మేఘస్వనేనార్క ఇవామితౌజాః ॥
—వ్యా. భా. ద్రోణ. 2-16

సూర్యుని వలె మహాతేజస్వియైన కర్ణుఁడు సువర్ణముక్తా మణిరత్న మాలికలతో నలంకరింపఁబడిన ధ్వజము, చక్కని గుఱ్ఱములు గలిగి మేఘ గంభీరధ్వని గల రథమునెక్కి గొప్పసైన్యముతో రణ రంగమునకు బయలుదేరినాఁడు.

రాధేయుఁడు తన సారథిం గనుగొని,

మణి గణోజ్జ్వలమైన మన యరదంబున జవనాశ్వములఁ బూన్చి చాపబాణ
ఖడ్గాది సాధనోత్కర మొడఁగూర్పుము రత్నధ్వజంబెత్తు రశ్మలడర
శంఖమృదంగనిస్వాదితూర్యముల్ సంఘటింపుము రభసమున ననుడు
వాఁ డట్ల చేయ దుర్వారగర్వోద్ధతి నగ్నిప్రభం బగు నా రథంబు
పటురయంబున నెక్కి భూపతికి మ్రొక్కి యాతఁ డెల్ల కౌరవులును నఖిలనృపులుఁ
దన్నుఁ గొనియాడఁ గర్ణుఁ డుత్సాహలీల నిజబలాభీలసుందరధ్వజములొప్ప.
—తిక్కన ద్రోణ. 1-38

రత్నమయమైన ఈ రథమును రాధేయునకిచ్చినవాఁడు భార్గవరాముఁడు.

వైయాఘ్రచర్మాబమకూజనాక్షం హేమత్రికోశం రజతత్రివేణుమ్
రథ ప్రబర్హం తురగప్రబర్హైర్ యుక్తం ప్రాదాన్మహ్యా మిమం హి రామః ॥
—వ్యా.భా. కర్ణ. 38-28

ఆ రథమునే కాక భర్గవరప్రసాదమున తనకు లభ్యమయిన సర్వ దివ్యాస్త్రముల నా రాముఁడు రాధేయునకుఁ బ్రీతచేతస్కుఁడై నయొఁగినాఁడు.[1]

"......రామ కృపాతిశయంబునఁ గనిన యీ రథమును
గార్ముకాది దారుణాస్త్రశస్త్రములును గలిమి
నే నతనిఁ దొదరి దివిజు లడ్డపడినఁ గూల్తు నెల్లభంగి"[2]
అని కర్ణుఁడు మానదర్పపు మాటలు పలికినాఁడు.

దీనిని బట్టి భృగుకులోత్పన్నులయిన భార్గవులు రథకారులే కాక శస్త్రాస్త్ర విద్యాగురువు లనియుఁ దెలియుచున్నది.

1. తిక్కన. కర్ణ. 1-307
2. తిక్కన. కర్ణ. 2-21

## ధర్మజుని రాజరథము

ధర్మరాజు జూదమునం దొడ్డియోడిన వానిలో 'జాతరూప వరూథంబులు'[1] గలవు. సామాన్యరథ శకటాదులే కాక ధర్మజుఁడు తన రాజరథమును గూడ నొడ్డినట్లు వ్యాసభారతమునందు గలదు.

> ఆయం సహస్రసమితో వైయాఘ్రః సుప్రతిష్ఠితః
> సుచక్రోపస్కరః శ్రీమాన్ కింకిణీజాలమండితః ॥
> సంహ్రాదనో రాజరథో య ఇహాస్మానుపావహత్
> జైత్రో రథవరః పుణ్యో మేఘసాగరనిస్వనః ॥
> అష్టౌ యం కురుదచ్ఛాయాః సదశ్వా రాష్ట్రసంమతాః ॥
>
> —వ్యా భా సభా. 4.6

ధర్మరాజొడ్డిన రాజరథము సహస్రరథ సమ్మితమయినది. పులితోలు గప్పఁబడిన యాసనముగలది. మంచి చక్రములు, ఉపస్కరములు గలది. కింకిణీజాలమండితమయిన యీ రథము లక్ష్మీప్రదమయినది. తెల్లగలువ వలె తెల్లనైన ఎనిమిది గుఱ్ఱములతో లాగబడు చుండుట యీ జైత్ర రథ విశేషము.

దీనిని బట్టి యీ రాజరథము సామాన్య రథముల కంటె భిన్నమయిన యాకృతి గలదనియు, దాని వివిధావయవములు (కూబరాదులు) మిక్కిలి పెద్దవి యనియుఁదెలియవచ్చును. ఇది పట్టాభిషిక్తులయిన రాజులు మాత్ర ముపయోగించు రథము.

ధార్తరాష్ట్రులతో యుద్ధమునకుఁ బోవునపుడు యుధిష్ఠిరుఁడెక్కిన రథ వర్ణనము చూడుడు -

> మహేంద్రయానప్రతిమం రథం తం సోపస్కరం హాటకరత్నచిత్రం
> యుధిష్ఠిరం కాంచనభాండయుక్తం సమాస్థితో నాగకులస్య మధ్యే
> సముచ్ఛ్రితం దంతశలాకమస్య సుపాండురం ఛత్రమతీవభాతి॥
>
> —వ్యా. భా. భీష్మ. 22.5, 6

గజ దంతశలాకలతోఁ జేయబడిన వెల్లగొడుగుతో నలంకరింపఁబడి మహేంద్రయానము వలె నున్న యీ రథము రాజరథమే.

---

1. నన్నయ్య. సభా. 2-177 ఇట వరూథ మనగా రథము.

నవమగు రథమున షోడశధవళహయములఁబూన్పఁ బనిచి ధరణిపుఁడు విదుం
డవిరళ సుధారథం బెక్కు-విధము దోపంగ నెక్కెఁ గురువంశనిధీ॥

—తిక్కన. శాంతి. 1-348

యుద్ధానంతరము కరిపురప్రవేశము చేయునపుడు ధర్మరాజు గోరథారూఢుఁ డయినట్లు వర్ణింపఁబడినది.

ఇది మూలానుసరణమే కాని వ్యాసభారతము నందు మఱికొన్ని విశేషము లున్నవి.

తతో నవం రథం శుభ్రం కంబలాజిన సంవృతమ్
యుక్తం షోడశభిర్ గోభిః పాండురైః శుభలక్షణైః ॥*
మంత్రై రభ్యర్చితం పుణ్యైః స్తూయమానశ్చ వందిభిః
ఆరురోహ రథం చైవ సోమోఽమృతమయం యథా॥

—శాంతి. 37-32-34

క్రొత్తగా నిర్మింపఁబడిన యెడ్లబండికి శుభలక్షణములు గల పదునాఱు [ఎనిమిది జతలు] తెల్లని యెడ్లను కట్టి యా రథమును వేద మంత్రములతో పూజించి, బట్టువాండ్రు స్తోత్రము చేయుచుండఁగా ధర్మరాజు రథము నెక్కినాఁడు.

ఐశ్వర్యమును కాంక్షించు రాజులు పురప్రవేశము చేయునపుడు గోరథమును, విజయలక్ష్మిని కాంక్షించు రాజులు రణరంగ ప్రవేశము చేయునపుడు అశ్వరథమును అధిరోహించుట సంప్రదాయసిద్ధముగ నున్న దని టీకాకారుఁడు వేదమంత్రముల నుటంకించినాఁడు.[1]

దీనిని బట్టి మహాభారతకాలమున రాజులు అశ్వరథములనె కాక యెడ్ల బండ్లను గూడ నుపయోగించుచున్నట్లు తెలియుచున్నది.

1. చూడు :- వ్యాసభారతము. వావిళ్ళ ప్రతి. తృతీయ సంపుటము.

సం గోభిరాంగిరసో నక్షమాణో భగ ఇవార్యమణం వినాయ
జనే మిత్రో న దంపతీ అనక్తి బృహస్పతే వాజయాశూన్ రివాజౌ॥

—ఋగ్వేద 10-68-1 — అథర్వ 20-16-2

అస్యార్థః హే బృహస్పతే బృహస్పతితుల్య హే పురోహిత ఆంగిరసో బృహస్పతిః గోభిః వృషైః రథ మిత్యర్థాత్ సంనక్షమాణః రథస్య సంనహనం కరిష్యన్ .... ....
ఏవ మైశ్వర్యలక్ష్మీం పరిణేష్యన్ గోరథేన నగరం ప్రవేశయేద్ రాజానాం
పురోహితః ఏవం జయలక్ష్మీం పరిణేషన్ అశ్వరథేన ఆజిం ప్రవేశయే దిత్యాహ॥

# బలి చక్రవర్తి రథము

నారాయణుఁడు కృత్రిమనారీరూపమున నసురులను వంచించి యమృతంబుగొని దేవతలకిచ్చి నంత దేవాహితు లమృతంబుఁ గానక యెంతయు నలిగి బలీంద్రుఁగూడి సంతనకట్టి, యంతంబు లేని రథాశ్వంబులను దంతుల నమితపదాతుల నొడఁగూర్చి యమరవరుల దాకిరి. —నన్నయ. ఆది 2-21

రాక్షసులకును రథము లెక్కువగనే యున్నవి. కాని రాక్షస నాయకుండగు బలీంద్రుని రథము వర్ణింపఁబడలేదు.

బలీంద్రుఁడు... అనల్ప విస్తీర్ణంబును సౌవర్ణ వృకధ్వజ విరాజితంబును నగు విశ్వకర్మ నిర్మిత మాణిక్య స్యందనం బధిరోహించి... కదలె"[1] నని హరివంశమునందు వర్ణింపఁ బడియున్నది.

ఈ వర్ణనము వలన బలిచక్రవర్తి వృకధ్వజుఁడనియు, నా వృకము (తోడేలు) స్వర్ణమయ మనియు నాతని రథము చాలవెడల్పు గల దనియు నది విశ్వకర్మ చేత మాణిక్యములతో నిర్మింపఁబడిన దనియు తెలియుచున్నది.

ఇట విశ్వకర్మ యన దానవవిశ్వకర్మ యగు మయుఁడని చెప్పవలెను.

కామగమనము నాకాశగమనమును గల బలిచక్రవర్తి రథము మయ విశ్వకర్మ కృతమని భాగవతము నందు వర్ణింపఁబడినది.

ఆరుద్రై కామగమై మయాసురకృతంబై లోకితాలోక్యమై
వర శస్త్రాస్త్రసమేతమై తరళమై వైహాయసంబై మహా
సుర యోధాన్వితమైన యానమున సంశోభిల్లెఁ బూర్ణేందు సు
స్థిర కాంతిన్ బలి చామరధ్వజచమూదీప్తస్థితిన్ ముందటన్.

—ఆంధ్ర భాగవతము. 8-330

ఈ వర్ణనము మూలానుసరణమే.

వైరోచనో బలిః సంఖ్యే సోఽసురాణాం చమూపతిః
యానం వైహాయసం నామ కామగం మయనిర్మితమ్॥

కావున బలిచక్రవర్తి రథము మయ నిర్మితమని స్పష్టమగుచున్నది.

---

1. ఎత్తాప్రెగడ : హరివంశము - ఉత్తరభాగము, 10-39

* వ్యాస భాగవత మహాపురాణము, స్కం. 8 అ. 10-16-17

## అసురవీరుల యరదములు

"అసురవరుం డరుణంబగు తన యరదం బెక్కి గృధ్రకేతనంబుగ్రాల నీలోన్నతంబయిన తన రూపంబున కనురూపంబైన దంష్ట్రా యుగళంబును బింగళోద్బద్ధ జటాకేశకలాపంబును భీషణంబులుగాఁ గనకభూషణంబుల కతంబునఁ దటిల్లతావికటంబగు నంబుదంబుకైవడి" గర్జుపయిం గవిసె నని తిక్కన వర్ణించినాఁడు. —తిక్కన, ద్రోణ. 5-267

ఈ యసురుఁడు భీమసేనుని కొడుకగు ఘటోత్కచుఁడు.

మూలమునం దీ ఘటోత్కచుని రథవర్ణన మిట్లున్నది,

కింకిణీశత నిర్ఘోషం రక్తధ్వజపతాకినమ్
ఋక్షచర్మావనద్ధాంగం నల్వమాత్రం మహారథమ్॥

సర్వాయుధవరోపేత మాస్థితో ధ్వజశాలినమ్
అష్టచక్రరథోపేతం మేఘగంభీరనిస్వనమ్॥

మత్తమాతంగ సంకాశా లోహితాక్షా విభీషణాః
కామవర్ణజవా యుక్తా బలవంతః శతం హయాః॥

—వ్యా. భా. ద్రోణ. 175-11-13

ఈ రథము నలుప్రక్కల నాలుగువందల హస్తముల ప్రమాణముగలది. ఎలుగుగొడ్డుతోలుతోఁ గప్పఁబడినది. ఎనిమిది చక్రములు గలది. మత్త గజములవంటి నూఱుగుఱ్ఱములతో లాగఁబడుచున్నది.

ఘటోత్కచునతోఁ బోరాడిన అలాయుధుని యరద మించుమించుగా నిట్లేయున్నది. అలాయుధుఁడు బకాసురుని తోడంబుట్టువు.

అరదము మొదలైన సకలపరికరములు రూపునేపుఁ బ్రాయంబును న
య్యిరువురు దనుజాధిపులకు సరియై యొప్పారెఁ జూడ జగతీనాథా.

—తిక్కన, ద్రోణ. 5-213

దీప్తమానేన వపుషా రథేనాదిత్యవర్చసా
తాదృశేనైవ రాజేంద్ర యాదృశేన ఘటోత్కచః॥
తస్యా ప్యతులనిర్ఘోషో బహుతోరణచిత్రితః
ఋక్షచర్మావనద్ధాంగో నల్వమాత్రో మహారథః॥

—వ్యా. భా. ద్రోణ 176-14-16

## రాజరాజు రత్నరథము

దుర్యోధనుఁడు... 'తమ్ములుం దగువారలుంబరివేష్టింప రమణీయ రత్నఖచితంబగు రథం బెక్కి మందమంద గమనంబున మందాకినీనందను మందిరంబు సేరె' నని తిక్కన వర్ణించినాఁడు. —భీష్మ. 3-169

రత్నఖచితమయిన రథ మనఁగా రథావయవము లన్నియు నానావిధ రత్నములతో తాపడము చేయఁబడినవని యర్థము.

## భీష్ముని రజతరథము

పరిధానంబును దేరు నశ్వములుఁ జాపంబుం బరిస్ఫీత వ
జ్ర రుచి వ్యాప్త సువర్ణతాళమయ చంచత్కేతువున్ వర్మమున్
గర మొప్పం దెలుపారు వెల్గొడుగుతో గంగాసుతుం డాసుధా
కరుడుంబోలె వెలింగె దర్పమెసఁగం గౌరవ్యసైన్యాబ్ధికిన్॥ —తిక్కన. భీష్మ. 1-86

భీష్ముని రథము వెండితో నిర్మింపఁబడినదనియు, నా రథాశ్వములు తెల్లని వనియు మూలము వలన దెలియుచున్నది.

శ్వేతోష్ణీషం శ్వేతహయం శ్వేతవర్మాణ మచ్యుతమ్
అపశ్యామ మహారాజ భీష్మం చంద్రమివోదితమ్
హేమతాల ధ్వజం భీష్మం రాజతే స్యందనే స్థితమ్॥* —వ్యా.భా. భీష్మ. 16-522-3

## ద్రోణాచార్యుని రుక్మరథము

అరుణాశ్వములు రుచిర రుక్మ రథంబుఁ బ్రదీప్తవేదికాధ్వజమును
నుద్ధురగాత్ర కలితసితభూసుర కంకటంబు శోభిల్లంగన్
చెలువొందు గురుని రాజులు కౌరవులు పొగడుచుండిరి. —తిక్కన. ద్రోణ '-54

గంధర్వనగరాకారముగ నున్న యస్త్రకళాచార్యుని యరదము శాస్త్ర ప్రకారము నిర్మింపఁబడినది. ఇట శాస్త్ర మన రథకృచ్ఛాస్త్రము.

ఖచర నగర కల్పం కల్పితం శాస్త్రదృష్ట్యా
చలదనిలపతాకం హ్లాదనం వల్గితాశ్వమ్
స్ఫటికవిమలకేతుం త్రాసనం శాస్త్రవాణాం
రథవరమధిరూఢః సంజహారారిసేనామ్॥ —వ్యా భా ద్రోణ. 7-54

---

* "భీష్మజీ చాందీ కే బనేహుఏ సుందర్ రథ్‌పర్ విరాజమాన్ థే"
—మహాభారత - హిందీ అనువాదము - గీతాప్రెస్

# కనక మణిమయ ధ్వజ పతాకలు

ధ్వజా బహువిధాకారా వ్యదృశ్యంత సముచ్ఛ్రితాః
స్వేషాం చైవ పరేషాం చ ద్యుతిమంతః సహస్రశః ॥

—వ్యా.భా. భీష్మ. 16-11

స్వపరసేనలయందు బహువిధాకారములు గల ధ్వజములు వేలకొలఁది ఎత్తుగా నెగురుచు దృష్టిగోచరమగుచున్నవని సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పినాఁడు. ఆ ధ్వజములన్నియు స్వర్ణమయములే.

తేషా మపి మహోత్సేధాః శోభయంతో రథోత్తమాన్
భ్రాజమానా వ్యరోచంత జాంబూనదమయా ధ్వజాః ॥*

—భీష్మ. 17-23

రాజులు, సేనాపతులు తమ వంశచిహ్నములయిన పతాకలను తమతమ వాహనములపై నెగురవేయుచుందురు.

దుర్యోధన సార్వభౌమునిది 'బహురత్నప్రభా విభాసితం బయిన భుజంగకేతనేము'.

—తిక్కన. భీష్మ. 1-95

మహాన్ దుర్యోధనస్యాసీన్ నాగో మణిమయోధ్వజః ॥ —వ్యా. భా. భీష్మ. 17.26

సర్వసైన్యాధ్యక్షుఁడయిన భీష్మునిది 'సువర్ణతాలమయ చంచత్కేతువు'.

వివిధసేనాపతులు నిజధ్వజపతాకలు తమ రథములపై శోభిల్లుచుండగా రణరంగమునకు వెడలిన తీరు తిక్కన మనోహరముగా వర్ణించినాఁడు.

కాంచనమయవేదికాకనత్కేత నోజ్జ్వలవిభ్రమంబొప్పఁ గలశజుండు
కనకగోవృషసాంద్రకాంతి కాంతధ్వజ విభవవిలాసంబు వెలయఁ గృపుఁడు
మణిసింహలాంగూల మహితకేతు ప్రభాస్ఫురణంబు మెఱయంగ గురుసుతుండు
రత్న శిలా రశ్మిరాజిత కదళికా మహిమశోభిల్లంగ మద్రవిభుఁడు
వెడలి తమతమ చతురంగవితతులెల్ల నుచితగతి నూల్కొనంగజేయుచుఁగడంగి
సంగరోత్సవసంభృతోత్సాహులగుచు నగుచుఁదగుమాటలాడుచు నడచిరెలమి॥

—తిక్కన భీష్మ. 1-87**

ఈ ధ్వజపతాకలను కనకమయములుగను రత్నమయములుగను నిర్మించి సపరణలుసేయువారు శిల్పకారులే.

---

* పోల్చు : వ్యా. భా. భీష్మ. 72-13
ధ్వజినో హేమచిత్రాంగా విచరంతో రణాజిరే

** పోల్చు : తిక్కన. విరాట. 1-162; తిక్కన, ద్రోణ. 3-233

## రథ పూజ

యుద్ధవీరులు రణరంగమునకు బయలుదేరుటకు మున్దు తమతమ రథములను పూజించుచుండిరి.

"......కృష్ణుఁడు రథంబు వన్ని జైత్రంబులగు మంత్రంబులు ప్రయోగించి యుజ్జ్వలంబు సేసిన యది బాలభానుఁడునుం బోలెఁ దేజోమయంబై వెలుగుచుండ సమర సన్నద్ధుఁడై ధనుర్బాణపాణియై యర్జునుండు విప్రాశీర్వాద నాదంబులతో నమ్మహనీయ స్యందనంబునకుఁ బ్రదక్షిణంబును బ్రణామంబునుం జేసి యారోహణం బొనరించి మేరు శిఖరంబునం బొలుచు భాస్కరుని భంగి శోభిల్లె. —తిక్కన. ద్రోణ. 3-19

తం తు లోకే వరం పుంసాం కిరీటీ హేమవర్మభృత్
చాపబాణధరో వాహం ప్రదక్షిణ మవర్తత....॥
జైత్రైః సాంగ్రామికై ర్మంత్రైః పూర్వమేవ రథోత్తమమ్
అభిమంత్రిత మర్చిష్మా నుదయం భాస్కరో యథా॥

—వ్యా.భా. ద్రోణ. 14-16

అట్లే కర్ణుఁడును రథపూజఁ గావించినాఁడు.

తన సారథి యగు శల్యుఁడు, "రయంబున దృఢసుందరం బగు స్యందనంబు సుకల్పితంబు సేసి తెచ్చి దీవించి యిచ్చిన నయ్యరదంబుఁ బూజింపఁ బురోహితుని నియమించి తదీయ మంగళవిధానానంతరంబు తాను నర్చించి కృతప్రదక్షిణుండై ప్రణమిల్లి భాస్కరోపస్థానం బాచరించి"...

మెఱుఁగు తోడి లలితమేఘంబు మీఁదికిఁబోయి వెలుఁగు భాను పోలుపుదోప
మద్రరాజసహితమహితమై యొప్పునత్తేరు కర్ణుఁడెక్కి తేజరిల్లె.

—తిక్కన. కర్ణ. 1-137

తతో జైత్రం రథవరం గంధర్వనగరోపమమ్
విధివత్ కల్పితం భద్రం జయేత్యుక్త్వా న్యవేదయత్॥
తం రథం రథినాం శ్రేష్ఠః కర్ణోఽభ్యర్చ్య యథావిధి॥
సంపాదితం బ్రహ్మ విదా పూర్వమేవ పురోధసా
కృత్వా ప్రదక్షిణం యత్నా దుపస్థాయ చ భాస్కరమ్॥

—వ్యా భా. కర్ణ 37-7-9

# రథోత్పాదన మంత్రములు

యమేన దత్త మిత్యస్య కోటిహోమ విచక్షణః
రథ ముత్పాదయే చ్ఛీఘ్రం సంగ్రామే విజయప్రదమ్॥
ఆ కృష్ణేతి తథైతస్య కర్మ వ్యాహృతివత్ భవేత్॥

—యజుర్విధానము*

'యమేనదత్త' మను మంత్రముతో కోటిహోమము చేసి రథము నుత్పాదించినచో నది విజయప్రదమగును. ఆ హోమమును - ఆ కృష్ణేతి మంత్రపూర్వకముగా నొనరించినచో నది ప్రణవపూర్వకమంత్రమువలె ఫల ప్రదమగును.

'యమేనదత్తా' మను మంత్రము :-

యమేన దత్తం త్రిత ఏన మాయున
గిందిర్యేణం ప్రథమా అధ్యతిష్ఠత్
గంధర్వో అస్య రశనా మగృభ్ణాత్
సూరాదశ్వం వసవో నిరతష్ట॥ —కృ. య. 4-6-7-2**

ఈ మంత్రము నందు యమ శబ్దమున కగ్ని యనియు త్రిత శబ్దమునకు వాయు వనియు విశేషార్థములు చెప్పఁబడినవి.

మఱియొక విశేషమేమనగా నీ మంత్రమునందు స్తుతింపఁబడిన అగ్ని, త్రితుఁడు, ఇంద్రుడు, గంధర్వుఁడు, వస్తువులు శిల్పాభిమాని దేవతలే.

---

* చూడు :- ఋగ్యజుస్సామాథర్వవిధానమ్ [ఆద్యాగ్నేయ మహాపురాణాంతర్గతమ్]
— ఖేమరాజ్ శ్రీకృష్ణదాస్ బొంబాయి

** అత్ర యమోఽగ్నిః అగ్ని ర్వావయమ ఇతి శ్రుత్యంతరాత్
త్రిషులోకేషు తాయతే విస్తార్యత ఇతి త్రితో వాయుః ॥
యమే నాగ్నినాదత్త మేన మశ్వం త్రితో వాయునాగ్రథా యోజితవాన్
తత ఇంద్రః ప్రథమః సర్వేషు దేవేషు మధ్యే ప్రథమం ప్రవృత్తం సన్నేవ మశ్వ మధ్య
మధితిష్ఠ దధిష్ఠితవాన్ యోగమంక్షే సంపాదయితు మభిమానం కృతవా నిత్యర్థః
గంధర్వః కశ్చిదస్యాశ్వస్య రశనాం బంధనహేతుం రజ్జు మగృభ్ణాత్ స్వీకృతవాన్॥
హే వసవో యూయం సూరా దాదిత్యా దిమ మశ్వం నిరతష్ట నిశ్శేషేణ ప్రకాశితవంతః॥
యస్యాశ్వస్యాగ్ని రానేతా, వాయు ర్యోజయితా. గంధర్వో రజ్జుగ్రహీతా,
సూర్యప్రకాశేన వసవః ప్రకాశయితార స్తాదృశోఽయ మశ్వ ఇతిస్తూయతే॥
——సాయణభాష్యము.

[చూడు :- కృష్ణయజుర్వేతసంహిత. పుట 2209 ఆనందాశ్రమ గ్రంథమాల - పూనా]

ఆ కృష్ణేన యను మంత్రపాఠమిది :-

ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశయ న్నమృతం మర్త్యం చ
హిరణ్యయేన సవితా రథేనాఽఽ దేవో యాతి భువనాని పశ్యన్॥

—శుక్లయజుర్వేద. 33-43* ఋగ్వేద. 1-352

ప్రాచీనకాలమునం దిట్టి వేదమంత్రములతో హోమములు చేసి రథకార బ్రాహ్మణులు జైత్రరథములను నిర్మించుచుండెడి వారని తెలియుచున్నది.

రాజు రథారోహణము చేయునపుడు పురోహితుఁడు 'విష్ణోః కర్మేతి' యను మంత్రమును పఠింపవలెను.

విష్ణోః కర్మేతి మంత్రశ్చ రథారోహణికః పరః

ఆ మంత్రపాఠమిది :-

విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే
ఇంద్రస్య యుజ్యః సఖా॥ —యజుర్వేద. 6-4; 13-33**

మహాభారతకాలమునం దీ సంప్రదాయములు పాటింపఁబడు చుండెడి వని తెలియుచున్నది.

---

* Cf :- The texts of the White Yajurveda
Tr. by. Ralph T. H. Griffith.

Throughout the Dusty firmament advancing laying to rest the immortal and the mortal Borne on his golden chariot he commeth Savitar, God, behold ng living creatures.

పోల్చు :- కృష్ణయజుర్వేద. 3-4-11
ఈ మంత్రము 'ఆ సత్యేన' యని కించిద్భేదముతో నున్నది.

సవితాఽఽదిత్యో హిరణ్యయేన రథేనాఽఽయాతి సువర్ణ నిర్మితం రథమారుహ్య ప్రతి దినం పూర్వస్యాందిశ్యాగచ్ఛతి కిం కుర్వన్. సత్యేన రజసాఽఽవర్తమానః అమోఘేన రజ్జునాత్మకేన మండలే నోదయాస్తమయోర్ భ్రామ్యన్నమృతం మర్త్యంచ నివేశయన్ దేవ శరీరం మనుష్య శరీరం స్వస్వకాలేప్రకాశేన తత్తల్లోకే వ్యవహారక్షమం కుర్వన్ భువనావిపశ్యన్ సర్వలోకానవలోకయన్॥ —సాయణ.

** Cf :- The Texts of the White Yajurveda. 6-4; 13-33.
Tr. R. T. H. Griffith.

"Look ye on Vishnu's works wherely the Frierd of Indra, close allied, Hath let his holy wayr be seen."

# రథ శిల్పము : కొన్ని పారిభాషికపదములు

| | | |
|---|---|---|
| 1 | రథము | : తేరు, బండి, ప్రయాణసాధనము |
| 2 | రథాంగము | : చక్రము, బండికల్లు [రథచరణము - రథపాదము] |
| 3 | నేమి | : బండికంటికమ్మి [ప్రథి] |
| 4 | అక్షము | : ఇరుసు, బండికన్ను |
| 5 | ఈషా | : నాగటి యేడికోల |
| 6 | నాభి | : బండికంటి నడిమితూము |
| 7 | యుగము | : బండి మొదలగువాని కాడి |
| 8 | కూబరము | : బండి నొగ |
| 9 | యుగంధరము | : బండి లోనగు వాని నొగ |
| 10 | త్రివేణువు<br>త్రివేణుక | బండి నొగ కట్లు<br>త్రివేణు ర్నామ రథముఖస్థో యుగాధారదండః యుగంధరః |
| 11 | అనుకర్షము | : నొగ చివర భూమిని అనక క్రిందనెత్తుగా సంతన పరచి యుండు మ్రాని తుండ; కోడిపీట. |
| 12 | రథోపస్థము | : ఆసనము |
| 13 | రథనీడము | : రథములోపల కూర్చుండుచోటు. |
| 14 | రథగుప్తి | : చక్రముల జొప్పించెడి నెమ్ములు; పులితోలులోనగు వానిచే నేర్పఱచఁబడిన మీది కప్పు - అనికొందఱు. |

1. A Carriage, Chariot, Car, Vehicle.
2. A Carriage axle.
3. The Circumberence, ring belly of a wheel.
4. A Carriage axle.
5. The pole of a Carriage.
6. The nave of the wheel of a chariot.
7. A yoke.
8. The pole or shaft of a Carriage.
9. The pole of a Carriage to which the yoke is fixed.
10. A part of a chariot.
11. The axle tree or bottom of a Carriage.
12. The seat of a chariot, the driving box.
13. The inner part or seat of a chariot.
14. A fence of wood or iron with which a chariot is provided as a protection from colision. [S.E.D.]

# కురుక్షేత్ర సంగ్రామము : రథ సంఖ్య

ఇరువది యొక్క వేయు నెనమన్నూట డెబ్బది రథంబులు నన్ని యేనుంగులు నఱువదేను వేలు నాఱు నూటపది గుఱ్ఱంబులు లక్షయుందొమ్మిది వేలున్ మున్నూట యేబండ్రు వీరభటులును గలయది యొక్క యక్షౌహిణి యయ్యె నట్టి యక్షౌహిణులు పదునెనిమిదింట సన్నద్ధులై కురుపాండవులు యుద్ధంబు సేసిరి. —నన్నయ. ఆది. 1-81

ఒక్క యక్షౌహిణిలో 21,870 రథములుండును. కావున నే డక్షౌహిణుల బలగముగల పాండవ పక్షమున 1,53 090 రథములును ఏకాదశాక్షౌహిణులు గల కౌరవ పక్షమునందు 2,40,570 రథములును గలవు. మొత్తముమీద కురుక్షేత్ర సంగ్రామమునందు 3,93,660 రథము లుపయోగింపఁబడినట్లు చెప్పఁడినది.

ఇది యతిశయోక్తి కావచ్చు నని ఎ. యల్. భాషమ్ అభిప్రాయ పడినాఁడు. కావచ్చును. కాని యిందులో దశాంశమో శతాంశమో యయిన యుండి యుండకుండునా ?

## భారతీయసైన్య విభాగము

| సేనానామము | రథములు | ఏనుగులు | గుఱ్ఱములు | కాల్బలము |
|---|---|---|---|---|
| పత్తి | 1 | 1 | 3 | 6 |
| సేనాముఖము | 3 | 3 | 9 | 15 |
| గుల్మము | 9 | 9 | 27 | 45 |
| గణము | 27 | 27 | 81 | 135 |
| వాహిని | 81 | 81 | 243 | 405 |
| పృతన | 243 | 243 | 729 | 1,215 |
| చమువు | 729 | 729 | 2187 | 3,645 |
| కనీకిని | 2187 | 2187 | 6561 | 10,935 |
| అక్షౌహిణి | 21870 | 21870 | 65610 | 10,09,350 |

చూడు :- నన్నయ ఆది 1-56

# జలయానములు : నౌకాశిల్పము

త్వష్ట్రే స్వాహా త్వష్ట్రే తురీపాయ స్వాహా
త్వష్ట్రే పురురూపాయ స్వాహా॥ —శుక్ల యజుర్వేద 22.20

వేదము లందు పెక్కుచోట్ల నౌకాయాన ప్రసక్తియున్నది.

సముద్రమునందు చిక్కుపడిపోయిన భుజ్యుఁడను రాజును అశ్వినీ కుమారులు నూఱు తెడ్లుగల నావలో మూఁడు దినములలో [మూడుఁ రేబవళ్లు] నింటికిఁ జేర్చినట్లు ఋగ్వేదము నందు వర్ణింపఁబడినది.

తిస్రః క్షపా స్త్రిరహాతివ్రజద్భిర్ నాసత్యా భుజ్యు మూహథుః పతంగైః
సముద్రస్య ధన్వన్నార్ద్రస్య పారే త్రిభీ రథైః శతపద్భిః షడశ్వైః॥

అనారంభణే తదవీరయేథా మనాస్థానే అగ్రభణే సముద్ర
య దశ్వినా ఊహధుర్ భుజ్యు మస్తం శతారిత్రాం నావ మాతస్థివాంసమ్॥
ఋగ్వేద. 1-116 4, 5*

ఈ ఋగ్వేదమంత్రములకు దయానంద సరస్వతి భాష్యమిట్లున్నది.

[నాసత్యా]ద్యు, పృథివి యనువాని వికారములయిన జలము అగ్ని వాయువు మున్నగునవి యన్నియు [భుజ్యుమూహథుః] నుత్తమసుఖాది భోగములను ధరించు నవి యై యున్నవి వానిమూలముననే భూయానములు జలయానములు నా యా స్థా న ములందు సంచరించును.

---

* Cf :- Griffith ; Hymns from Rigveda - Vol. I

Bhuju ye bore with winged things, Nasatyas, which for three nights, three days, full swiftly travelled.

To thə Sea's further shore. the s trand of Ocean in three Cars› hundred footed with six horses. (4)

Ye wroght that hero exploit in the Ocean which giveth no support, or hold, or station what time ye carried Bhuju to his dwelling borne in a ship with hundred oars, O Aswins (5)

"This" observes Wilson," is a rather unintellegible account of a seavoyage, althogh the words of text do not admit of any other rendering."

ఈ యానముల ద్వారమున [తిస్రః క్షపాస్త్రిరహా] మూడు రాత్రులు మూడు పవళ్లు. [అర్ద్రస్య] జలపూర్ణ సముద్రమున, [ధన్వనః] భూమిని, అంతరిక్షమును దాటి [అతివ్రజద్భిః] శీఘ్రముగ వెళ్లనగును.

ఆ యానములు [పంతగైః] తమ ప్రతిగమనమునందును వేగవంతములై యుండును. [త్రిభీరథైః] భూజలాంతరిక్ష యానముల నెక్కి పోవుట కవి సుందరమైన ముప్విధములగు సాధనములు [శతపద్భిః] వందలాది కాళ్లు గల వాని వలెనవి మిక్కిలి వేగముగ నడచును [షడశ్వైః] వానితో తీవ్ర గతి గలిగి యుండుటకు నారు యంత్రములుండును లేక వానిలో నగ్ని మున్నగువాని కారు స్థానము లుండును. —ఋగ్వేద 1-116-4

[అనారంభణే] ఓ మానవులార! పూర్వము చెప్పినట్లు మీరు అనారంభణ, ఆలంబనరహితమగు సముద్రమునందు ఆకాశమునందు కార్యనిర్వాహకములగు యానములను రచింపుడు. [తదవీరయేధామ్] ఆ యానములు పూర్వోక్తములగు 'అశ్వి' తోనే రాకపోకలకు వీలుగ సిద్ధించును. [అనాస్థానే] ఆలంబనము లేక దేనియం దెవడు నిలువ జాలడో [అగ్రభణే] దేని యందు చేతితో పట్టు కొనుటకును అధార మెందును లభింపదో, [సముద్రే] అట్టి పృథివి మీదను జలపూర్ణ సముద్రము మీదను. ఆకాశము నందును మీరు మీ ప్రయత్నములతో సాధించిన యానములతో రాకపోకలు జరుపుడు.

[య దశ్వినా ఊహథుః...] వాయ్వాది 'అశ్వి'తో నిర్మింపబడిన యానము శ్రేష్ఠభోగములను గలుగజేయును. [అస్తం] అశ్వుల వలన నడుపబడు యానము భూమి, జలాంతరిక్షములలో నన్ని కార్యములు సిద్ధింప జేయును. [శతారిత్రం] నౌకలు మున్నగు యానములలో వందలకొలది 'అరిత్ర' జలములోతును దెలిసికొనుటకు, ఆ యానముల నాపుటకు, వాయ్వాదుల వలన నేర్పడు విఘ్నములనుండి వానిని రక్షించుటకు నినుప లంగరులు మున్నగునవి యుంచుకొనవలెను. ఇట్టి యానముల వలన [ఆతస్థివాంసమ్] స్థిరభోగములను మానవులు పొందుదురు —ఋగ్వేద 1-116-5

దీనిని బట్టి యార్యులు నౌకా నిర్మాణమునందు నిపుణులని తెలియు చున్నది.

---

1 Cf :- D D. Kosambi : The Culture and Civilisation in Ancient India p-90

Ships with a hundred oars and voyages on water three days from the nearest land receive passing mention in the oldest Veda so that the Aryans knew how to manage boats."

# అశ్వి శబ్దార్థ వివరణము

"అథాతో ద్యుస్థానాదేవతా స్తాసా మశ్వినో ప్రథమా గామినౌ భవతోఽశ్వినౌ యద్ వ్యశ్నువాతే సర్వం రసేనాన్యో జ్యోతిషాఽన్యః ॥ అశ్వై రశ్వినా విత్యౌర్ణనాభః తత్ కా వశ్వినౌ? ద్యావా పృథివ్యావిత్యేకే, అహోరాత్రా విత్యేకే, సూర్యాచంద్రమసా విత్యేకే॥" నిరుక్త. అ. 12 ఖం. 1

తథాశ్వినౌ చాపి భర్తారా, జర్భరీ భర్తారా విత్యర్థః తుర్ఫరీతు హంతారౌ, ఉదన్యజే వేత్యుదకజే ఇవ రత్నసాముద్రే —నిరుక్తా. 13-50-5

ద్యు స్థానమునఁగల దేవతలలో అశ్వి దేవతలు ప్రథములు.

వాయువు, అగ్ని యను ఏ రెంటి నామము 'అశ్వి' పదార్థములు లన్నింటిలో ధనంజయరూపమున వాయువు, విద్యు ద్రూపమున నగ్నియు వ్యాపించి యున్నవి.

జలము, అగ్నియు, 'అశ్వి' యనఁబడును అగ్ని జ్యోతితో యుక్తమై, జలము రసయుక్తమై వ్యాప్తములై యున్నవి.

[అశ్వై] ఔర్ణనాభ నిరుక్తకారుని మతమున వేగాది గుణములతో గూడి యున్నందునను నగ్నిమున్నగునవి అశ్వి యనఁబడును

విమానాదులను సిద్ధముచేయఁగోరు వారు వాయుజలాగ్నులతో వానిని సిద్ధము చేయవలెనని ఔర్ణనాభచార్యుని మతము.

[ద్యావా పృథివ్యౌ] అగ్ని లేక సూర్యుడు, పృథివియు అశ్వి యనఁబడును అగ్ని తన ప్రకాశముతోను, పృథివి యన్న రసముతోను అన్నింటిలో వ్యాప్తమై యున్నది రెండును వేగవంతములు కూడ.

పృథివికి సంబంధించిన కొయ్య, యినుము మున్నగు వస్తువులతో నిర్మింపఁబడిన యంత్రములను నడుపుట వలన నానావిధములగు వేగాది గుణములు వాహనములందును, నితర కృత్రిమపదార్థము లందును ఉత్పన్నము చేయవచ్చును. విద్వాంసులలో ననేకుల యభిప్రాయ మిట్లున్నది.

[అహోరాత్రౌ] రాత్రింబవళ్లు అశ్వి యనఁబడును. పగలు తన ప్రకాశముతోను, రాత్రి తన మంచుతోను నన్నిటను వ్యాప్తములైయున్నవి. ఇవి రెండును వేగవంతములు కూడ. వీని వలనను పదార్థములతో సంయోగ వియోగము లేర్పడి వేగాది గుణములకు కారణము లగును. అందువలననే శరీరము ఓషధులు మున్నగు వానియందు వృద్ధి క్షయములు కలుగుచున్నది.

ఇట్లే, శిల్ప విద్యలలో నిపుణులైన విద్వాంసుల యభిప్రాయములో, [సూర్యాచంద్రమసా] సూర్యచంద్రులు అశ్వి యనఁబడుచున్నవి.

సూర్యుఁడు తన కాంతితోను చంద్రుఁడు తన యాహ్లాదరసము తోను నన్నింటను వ్యాప్తులగుచున్నారు, వా రిరువురును వేగము గలవారు కూడ. సూర్యచంద్రుల యాకర్షణాది గుణముల వలన విశ్వము నందలి పృథివ్యాది పదార్థములలో సంయోగ వియోగములు, వృద్ధి క్షయములు మున్నగు శ్రేష్ఠ గుణము లుత్పన్నము లగుచున్నవి.

[తథాశ్వి...] 'జర్భరీ తుర్ఫరీ' అను నవియు అశ్వి యనఁబడును [జర్భరీ] విమానాది యానములను ధరించునది. [తుర్ఫరీ] యంత్రము మూలమున విమానము లందు గతి కల్పించును.

ఇట్లే వాయువు అగ్ని జలము పృథివి మున్నగు వస్తువులను యుక్తితో వాడుకొనుట వలన విమానాదుల ధారణ పోషణములు జరుగును. వానితో వేగాది గుణము లుత్పన్నములగును గుఱ్ఱములు ఎద్దులు కొరడాతో కొట్టిన వేగముగ నడుచునట్లు యంత్రనైపుణ్యము వలన ధారణయు, వాయ్వాదులను యంత్రము మూలమున ప్రేరేపించుట వలన సర్వ విధము లగు శిల్ప విద్యలు సిద్ధించును.

[ఉదన్యాజే] నిరుక్తమున నీ యశ్వి ఉదన్యాజ మనియు చెప్పఁడినది. ఉదన్యాజ మన సముద్రములోని రత్నము. ఈ యగ్ని మున్నగునవి 'అశ్వి' సముద్ర రత్నములు. అగ్ని వాయువు జలము మున్నగు వానిని సరిగా ప్రయోగించుట వలన సముద్రమున సుఖపూర్వకముగ ప్రయాణింపవచ్చు నని యభిప్రాయము.

పైనఁ జూపిన ప్రమాణములన్నింటిని బట్టి వాయువు, అగ్ని, జలము. పృథివి యను వీని వలన నేర్పడిన సాధనములలో ముప్విధములగు యంత్రములను యానములను జేయవలె నని సిద్ధమగుచున్నది.

[ఏతైః ప్రమాణై రేతత్ సిద్ధ్యతి :- వాయుజలాగ్ని పృథివీ వికార కళాకౌశల సాధనేన త్రివిధ యానం రచనీయ మితి] *

---

* చూడు :- దయానంద సరస్వతి వేదతత్త్వ ప్రకాశము - నౌవిమాన విద్యా విషయః

—అనువాదం పండిత గోపదేవ్

# ఉడుప ప్లవములు

బద్ధోడుపే పరిక్షిప్య గంగాయాం సమవాసృజన్॥

—వ్యా. భా. 104-39 (చిత్రశాల)

ఉడుప మన తెప్పకొయ్య; తెప్పమ్రాను.

'దీర్ఘతమునకు నలిగి ప్రద్వేషిణి యిమ్ముదుకని యెటయేనియుం గొని పొండని తన కొడుకులం బంచిన వారును నయ్యౌచథ్యు నతివృద్ధు జాత్యంధు నింధనంబుల బంధించి మోహాంధులయి గంగలో విడిచిన నమ్మునియుఁ బ్రవాహవేగంబునఁ బెక్కుదినంబులు గడపి చనియె' నని నన్నయ్య వర్ణించినాడు.

—నన్నయ. ఆది. 4-231

ఇట్లు తెప్పకొయ్యపై గంగానది యందు బహుదూరము పయనించిన దీర్ఘతమమునియే జలయానమునకు నౌకానిర్మాణమునకు మార్గదర్శకుఁడైనాఁడు.

ఋగ్వేదమునందు మామతేయుఁడయిన దీర్ఘతముఁడు జలసారథిగా ప్రశంసింపఁబడినాఁడు.

దీర్ఘతమా మామతేయో జుజుర్వాన్ దశమే యుగే
అపామర్థం యతీనాం బ్రహ్మా భవతి సారథిః ॥ —ఋగ్వేద. 1-158-6*

యయాతి మహారాజు... ద్రుహ్యు వంశంబున వా రుడుపప్లవ సంతార్యం బైన దేశంబునకు రాజులుగా శాపంబిచ్చె. —నన్నయ. ఆది. 3-194

మూలమునం దిట్లున్నది.

యత్రాశ్వరథ ముఖ్యానామశ్వానాం స్యాద్ గతం న చ....
ఉడుపప్లవ సంతారో యత్రి నిత్యం భవిష్యతి
అరాజో భోజ శబ్దం త్వం తత్ర ప్రాప్స్యసి సాన్వయః ॥

—వ్యా. భా. ఆది. 84-21-22

నీవును నీవంశమువారును రథాది ప్రయాణసాధనములపై చరించుటకు వీలుగాక కేవలము తెప్పమ్రానులపయి సంచరించుటకు వీలగు నట్టి దేశమునకు రాజులయి భోజ శబ్దమునఁ బిలువఁబడుదురుగాక యని యయాతి ద్రుహ్యునకు శాపంబిచ్చినాఁడు.

---

*Cf. : D D. Kosambi : The culture and civilisation of Ancient India P-90

"A tag verse in the Rigveda makes Dirghatamas, brahmin son of Uchathya and Mamata, a river pilot in his old age"

# ప్రథమ నౌకానిర్మాత : వైవస్వత మనువు

నౌశ్చ కారయితవ్యా తే దృఢా యుక్తవటారకా
తత్ర సప్తర్షిభిః సార్ధమారుహేథా మహామునే॥

—వ్యా. భా. వన 187-31

ఆది మత్స్యము తనకుపకారము చేసిన మనువునకు ప్రత్యుపకారముచేయ నెంచి, "నీవు దృఢరజ్జుబంధనంబును సకలధనధాన్యసహితంబునుగా నొక్క పేరోడఁగావించి సప్తముని సహితుండవై దాని నెక్కి సముద్రంబు దఱిసి నన్నుం దలంచునది యేనును ఘనశృంగశోభితంబయిన రూపంబునఁ బొడసూపి మీకు మే లొనరించెద నని యమ్మత్స్యంబు చనియె వైవస్వతుండును దదుక్త ప్రకారంబున నోడ నిర్మించి సకల బీజంబుల సంగ్రహించి సప్తముని సహితంబుగాఁ గృతారోహణుండై పయోధిఁ దఱియం దొడంగె నంత.

మతి వైవస్వతుచేఁ దలంపఁబడి యమ్మత్స్యంబుతోతెంచె నా
యత శృంగోన్నతమూర్తి నాతఁడు దదాజ్ఞాయత్తుఁడై తచ్ఛిరో
గత శృంగాగ్రమునన్ దగిల్చె నతిదీర్ఘంబైన పాశంబు న
ద్భుత వేగంబున నోడ నీడ్చె నది యంభోరాశిమధ్యంబునన్॥[1]

ప్రళయకాలమున 'లోకంబెల్ల నేకార్ణవంబైన నమ్మత్స్యంబు దజ్జలాంతరంబున ననేక సహస్రవర్షంబు లయ్యోడం దిరుగుచు బదంపడి యప్పెనువెల్లి యల్లనల్లఁ దిగిచిపోవం దొడంగు నెడం దుహినగిరిశృంగ సమీపంబున నయ్యోడ నిలిపి' వారితోడ.

'ఈ నగంబు శృంగంబున నిపుడు మీరు
కట్టుఁడియోడ' ననఁగా వారట్లు చేసిరి.[2]

అందువలన నా మహాద్రిశృంగమునకు నౌబంధన మను పేరు వచ్చినది.

ఈ వర్ణనము వలన ప్రథమ నౌకానిర్మాత వైవస్వతమను వని తెలియుచున్నది.

జలయానమునందు పడవలకు త్రాళ్లుగట్టి లాగుచు ప్రయాణము నాపవలసినప్పుడా రజ్జువుల నెద్దేని శంకువునకు గట్టుట సాధారణముగ నున్నది. అనంతరకాలమున ఓడకు లంగరు వేయుట మున్నగుపద్ధతులు వచ్చినవి.

1. ఎఱ్ఱన. అరణ్య. 4-225-6 2. ఎఱ్ఱన. అరణ్య. 4-230-1

## ఓడలు : ఓడరేవులు

మహాభారత కాలమున జనులు నదులను దాటుటకు పడవల నుపయోగించు చుండిరి.

స్త్రీలు సైతము పడవలు నడపుచుండిరి. యమునానది ఓడరేవులో మత్స్యగంధి పడవ నడుపుచుండెను.

అంబుజముఖి యక్కన్య ప్రియంబొనరంగ మత్స్యగంధి యనంగా ధర్మా
ర్థంబుగఁదన తండ్రిని యోగంబున నయ్యమున నోడ గడపుచు నుండెన్.

"...పరాశరుఁడన్ మునీంద్రుఁ డయ్యతివఁ దలోదరిన్ గనియె నా
యమునానది యోడరేవునన్" —నన్నయ. ఆది. 3-34-6

అంగరాజగు రోమపాదుఁడు, "విదగ్ధ వేశ్యాంగవలం బిలువంబంచి మీ నేర్చు విధంబుల ఋష్యశృంగుం బ్రబోధించి యిటఁ దోడ్కొని రండని పంచిన,

ఆ వేశ్యాజను లధికరసావహభక్ష్యములు విలసదనులేపన మా
ల్యావళులుఁగొనుచు నరిగిరి నావాశ్రమమునకు నమరనారుల లీలన్॥
—నన్నయ ఆరణ్య. 3-94-5

మూలమునం దిట్లున్నది.

సా తు నావ్యాశ్రిమం చక్రే రాజకార్యార్థ సిద్ధయే
నానాపుష్పఫలై ర్వృక్షై: కృత్రిమై రుపశోభితై:
నానా గుల్మలతోపేతై: స్వాదుకామ ఫలప్రదై:॥
అతీవ రమణీయం తదతీవ చ మనోహరమ్
చక్రే నావ్యాశ్రిమం రమ్య మద్భుతోపమదర్శనమ్॥
—వ్యా.భా. వన. 111-1-3*

రాజాజ్ఞను శిరసావహించి వారముఖ్య రాజ కార్యార్థమై యొక నావ యందు కృత్రిమ తరులతా గుల్మములు నమర్చి దాని నొక రమణీయాశ్రమ ముగా నొనర్చి విభాండకముని యాశ్రమ సమీపమునఁ గల నది యందుంచినది. తరువాత వేశ్యాపుత్రి ఋశ్యశృంగు నాకర్షించి యా నావలో నతని నంగ దేశ మునకుఁ గొనిపోయినది.

---

* నావ్యా శ్రిమం నావా తాక్య మాశ్రమమ్॥ —నీలకంఠ.

# యంత్రయుక్తమైన నావ

తతో వాతసహాం నావం యంత్రయుక్తాం పతాకినీం॥

—వ్యా భా. ఆది. 141 5*

లాక్షాగృహదహనానంతరము పాండవులును భాగీరథి లంఘించి దక్షిణాభిముఖులయి యరిగి[1] నట్లు నన్నయ వ్రాసినాఁడు కాని వారెట్లు గంగానదిని దాటిరో నన్నయ చెప్పలేదు.

విదురునిచేఁ బంపఁబడిన చారుఁడొకఁడు భాగీరథీ తీరమున పాండవులకొక నావను జూపి, యంత్ర పతాకయుక్తమై పెనుగాడ్పులకు సైతము తట్టుకొనఁగల యీ నావ విశ్వాసపాత్రులైన శిల్పులచే నిర్మింపఁబడిన దనియు (విస్రంభిభిః కృతామ్) నిందులో సుఖముగా జలయానము చేయవచ్చునని యుఁజెప్పి వారిని గంగా నదిని దాటించి నట్లు వ్యాసభారతమునందు వర్ణింపఁ బడినది.

తతః ప్రవాసితో విద్వాన్ విదురేణ నరస్తదా
పార్థానాం దర్శయామాస మనోమారుతగామినీమ్॥ 4
సర్వవాత సహాం నావం యంత్రయుక్తాం పతాకినీమ్
శివే భాగీరథీ తీరే నరై ర్విస్రంభిభిః కృతామ్॥ **
ఇయం వారిపథే యుక్తా నౌ రప్సు సుఖగామినీమ్॥ 10

—వ్యా భా.ఆది 149-4-10

*"యంత్రిం మహత్యపి వాతే జలాశయే నౌకాత్మకం లోహ లాంగలమయం సాముద్రిక ప్రసిద్ధమ్ ఏవం పతాకినీ నౌ ర్వాయునా వేగేన ఊహ్యమానా న చోర్మిభిః పూరయితుం శక్యా అతి ఉక్తం పతాకినీ మూర్మిక్షమా మితి॥ —నీలకంఠ

1. నన్నయ. ఆది. 6-171

** "ఉన్‌సే పాండవోం కో ఏక్ ఐసీ నావ్ దిఖ్‌లాయీ జో ఏక్ విశ్వస్త కారీగర్ కీ బనాయీ హుయీ థీ"

—చతుర్వేదీ ద్వారకాప్రసాద్‌శర్మ : హిందీ మహాభారతము పు. 510

2. "Sent by Vidura unto them he (the person sent by Vidura) showed the Pandavas on the sacred banks of Ganga **a boat with engines** and flags, **constructed by trusted artificers** and capable of with standing wind and wave and endued with the speed of the temptest or thought." —P. C. Roy. Mbh. p. 440

పాండవులు గంగానదిని దాటుటకు విదురుఁడు పంపిన నావ యంత్రయుక్త[1] మనియు, మనోవేగమున వాయువేగమునఁ బోఁగల దనియు వర్ణింపఁబడుటచేత మహాభారతకాలీన శిల్పులు యంత్రసహాయమున నడుపఁబడు నౌకలను నిర్మించుచుండిరని నిస్సందేహముగా చెప్పవచ్చును.

వైదిక యుగమునందు విద్యుత్సహాయమున నడుపఁబడు నౌకలను, జలాంతర్గాములను నిర్మింపఁగల శిల్పకారు లున్నట్లు కొన్ని వేదమంత్రముల వలనఁదెలియుచున్నది.

దైవీం నావం స్వరిత్రా మనాగస మస్రవంతీ మారుహేమా స్వస్తయే॥
—ఋగ్వేద. 10-63-10

ఈ మంత్రమునందు దెవీనావ యనగా దివ్యనౌక[2] యని సామాన్యార్థము. విద్యుచ్ఛక్తి వలన నడుపఁబడు నౌకయని విశేషార్థము.[3]

యాస్తే పూషన్ నావో అంతస్సముద్రే
హిరణ్యయో రంతరిక్షే చరంతి॥ —ఋగ్వేద. 6-53-3

ఓ పూషుఁడా! హిరణ్మయమైన నీ నావలలో సముద్రము నందు అంతరిక్షమునందు సంచరించుచున్నావని సామాన్యార్థము.

అంతస్సముద్రమనఁగా సముద్రగర్భము కావున అంతస్సముద్రమున, సంచరించు నావలు జలాంతర్గాములను (Submarines) విశేషార్థము[4] చెప్పఁబడినది.

వేదమంత్రములకు విజ్ఞాన వేత్తలయిన విద్వాంసులు చేసిన భాష్యములు విశ్వసింపఁదగినవి.

---

1. యంత్రయుక్త మనఁగా నావను నడపించుట కుపర్చబడిన యంత్రము గల దని కొందఱు.
"ఉస్ నౌకాకో చలానే కే లియే యంత్ర లగాయా గయా థా॥" [మహాభారత. గీతాప్రెస్]

"The ship contrived by Vidura for the escape of Pandavas **had some kind of mechanism fitted in it**; the ship strong enough to withstand hurricanes, fitted with machinery and displaying flag."
—Chamanlal : HINDU AMERICA p. 168

2. "The welloared heavenly ship that lets no water in, will we ascend for happiness" —Griffith

3 & 4 చూడు :- పండిత ధర్మదేవ మార్తాండ :- వేదోం కా యథార్థ స్వరూప్ (హిందీ) పుట, 74 - దయానంద సంస్థాన్.

## అలంకారిక వర్ణనలు : యానపాత్రలు

కామక్రోధగ్రాహాకీర్ణాం పంచేంద్రియజలాం నదీం
నావం ధృతిమయీం కృత్వా జన్మదుర్గాణి సంతర॥
—వ్యా భా. వన. 207-72

కామక్రోధ మహామకరసంకీర్ణంబు విషయజల సంపూర్ణయు నైన మోహమహానది నస్ఖలితధైర్యం బను తెప్ప జేసి యశ్రమంబున నిస్తరించి కృతార్థుండవగు మని ధర్మవ్యాధుండు కౌశికునకు దెలిపినాఁడు. — ఎఱ్ఱన. అరణ్య. 5-46

"అనీహమానుండయు దైవపరుండగువాఁడు నీరిలోని యానపాత్రంబునుంబోలె నవసన్నుండగు." — నన్నయ. అరణ్య. 1.230

అస్థిరేంద్రియ సలిలమయంబుఁ గామ
రోషదారుణగ్రాహ ప్రదూషితంబు
నైన సంసార సాగర మతులధైర్య
పోత పాత్రిక నిస్తరింపుము కుమార !

అని వేదవ్యాసుఁడు శుకమహర్షి కుపదేశించినాఁడు —తిక్కన శాంతి. 6-227*

ధర్మ ఏవ ప్లవో నాన్యః స్వర్గం ద్రౌపది గచ్ఛతామ్
సైవ నౌః సాగరస్యేవ వణిజః పార మిచ్ఛతః ॥
— వ్యా. భా, వన, 31-24

ఓ ద్రౌపదీ ! సముద్రమునందుండి తీరమునఁ జేరఁగోరు వ్యాపారికి నావ యెట్లావశ్యకమో స్వర్గమును జేరఁగోరు వానికి ధర్మాచరణమను తెప్పయవసరమని ధర్మజుఁడు ద్రౌపదికిఁ జెప్పినాఁడు.

ఇట్టి వర్ణనముల వల్ల మహాభారతకాలమున జనులు నదులందు, సముద్రములందు నావలలో పయనించుచుండిరనియు వణిజులు నౌకలతో సముద్రయానముచేయుచు విదేశీయులతో వ్యాపారము చేయుచుండిరనియుఁ దెలియుచున్నది.

---

* వ్యా. భా. శాంతి. 322-17
కామం క్రోధం చ మృత్యుం చ పంచేంద్రియ జలాంనదీం
నావం ధృతిమయీం కృత్వా జన్మ దుర్గాణి సంతర॥

పోల్చు : యథా చ నావం కౌంతేయ కర్ణధారః సమాహితః
మహార్ణవగతాం శీఘ్రం నయేత్ పార్థివసత్తమ॥ —వ్యా.భా. శాంతి 300-34

# నౌకానిర్మాణము : హరప్పాశిల్పులు

మహాభారతకాలమునకు ముందే సింధులోయలో నివసించిన మొహంజొదారో - హరప్పా ప్రాంతపు జనులు కూడ నౌకలపై సముద్రయానము చేసి విదేశీయులతో వాణిజ్యము నెఱపుచున్నట్లు చరిత్రకారులు తెలుపుచున్నారు.

పురావస్తుశాస్త్రజ్ఞులు పశ్చిమ సముద్రతీరమున ఘూర్జరదేశమున జరిపిన త్రవ్వకములలో అహమ్మదాబాదు జిల్లాలో లోథల్ అనుచోట ఒక పెద్ద నౌకాశ్రయము - నౌకానిర్మాణకేంద్రము - బయలుపడినది. 71' అడుగుల పొడవు - 150 అడుగుల వెడల్పు గల లోథల్ నౌకాశ్రయమునం దొకేమారు అరువది నౌకలు నిలువవచ్చును.

హరప్పాశిల్పులు నిర్మించిన యీ నౌకాశ్రయము ప్రపంచమునందెల్ల మొట్టమొదటిగను, మిక్కిలి పెద్దదిగను భావింపబడుచున్నది

లోథల్ నిర్మాణకేంద్రమును గనుగొని ప్రాగ్వైదిక సింధునాగరకతా ప్రవర్తకులయిన హరప్పాశిల్పుల [క్రీ. పూ. 2450-1600] వాస్తు విద్యా వైదుష్యమును వెల్లడించి దేశమునకు మహోపకారముచేసిన శ్రీ యస్. ఆర్. రావు గారి కృషి మిక్కిలి ప్రశంసనీయము.

---

Cf. Archaeology in India P 37.
Publications Division - Ministry of Information and Broadcasting Govt. of India.

''of yet greater significance are the seals in persian gulf origin and the dockyard dug up here for they bear testimony to the ancient mari time activities of the Harappa.

2. Ramesh Menon : Discoving Lothel - Article published in October 1980 issue of Mirror - PP - 56-60

"Lothel was where the Harappans lived 4000 years ago. It is one of the worlds richest sides of Indian valley civilisations"

The first dockyard in the world was probably constructed by the inhabitants of Lothel. If is the largest which was ever built by the Harappans or any Bronze Age community for building cargo. The inhabitants of Lothal were doubtless ingene ous lot. Their engineering expertise in building the dockyard speaks for itself. If is considered the mos t seintificelly designed dock of that age'

3. Ibid. P. 56

# విమాన శిల్పము

విశ్వకర్మా మహాభాగో జజ్ఞే శిల్ప ప్రజాపతిః
యో దివ్యాని విమానాని త్రిదశానాం చకార హ॥

—వ్యా భా. ఆది. 66-26-9

విమాన మన పక్షిశక్తి సదృశవేగము గల అంతరిక్ష యానమని భరద్వాజ మహర్షి తెలిపినాఁడు. [1]

'వేగసామ్యా ద్విమానోఽండజానా మితి' —బృహద్విమానశాస్త్ర. 1-1

దీనికి బోధానంద వృత్తి యిట్లునది -

గృధ్రాదిపక్షిణాం వేగసామ్యం యస్యాస్తి వేగతః
స విమాన ఇతి ప్రోక్త ఆకాశగమనే క్రమాత్॥

దేని వేగము గృధ్రాదిపక్షివేగ గుణకములతో సాదృశ్యము గలిగి యుండునో యది విమానము.

"ఏది స్వయముగా యంత్రసహాయమున భూమి మీఁదను, జలము నందును అంతరిక్షమునందును పక్షి వలె సంచరింపఁగలదో అది విమానము" అని నారాయణాచార్యుఁడు వివరించినాఁడు.

పృథివ్యప్స్వంతరిక్షేషు ఖగవద్ వేగతః స్వయమ్
యః సమర్థో భవేద్ గంతుం స విమాన ఇతి స్మృతః॥

ఏది ఆకాశగమనముతో నొకదేశమునుండి మఱియొకదేశమునకు, ఒక ద్వీపమునుండి మఱియొక ద్వీపమునకు, ఒక లోకమునుండి మఱియొక లోకమునకు పోఁగలదో అది విమాన మని అంతరిక్ష శాస్త్రజ్ఞులు చెప్పుదురు.

దేశాద్దేశాంతరం తద్వత్ ద్వీపాద్ ద్వీపాంతరం తథా
లోకాల్లోకాంతరం చాపి యోఽంబరే గంతు మర్హతి॥
స విమాన ఇతి ప్రోక్తో ఖేఽట శాస్త్రవిదాం వరైః॥

---

* పోల్చు :- యః సర్వేషాం విమానాని దేవతానాం చకార హ॥

—బ్రహ్మాండపురాణము. 2-1-59-18

1 చూడు:- 1) భరద్వాజ మహర్షి కృత బృహద్విమానశాస్త్రమ్.
"యంత్ర సర్వస్వ" గ్రంథాంతర్గత వైమానిక ప్రకరణమ్-
సంపాదక ఏవం భాషానువాదక : స్వామీ బ్రహ్మముని పరివ్రాజక్
ప్రకాశకః - సార్వదేశిక ఆర్యప్రతినిధి సభా దయానంద భవన్ నయీదిల్లీ-2

భరద్వాజ మహర్షి పూర్వాచార్య కృతములైన విమానశాస్త్రములను పరిశీలించి, వేద సాగరమును తఱచి యంత్ర సర్వస్వమను నవనీతమును మనకొసంగినాడు

నిర్మథ్య తద్వేదాంబుధిం భరద్వాజో మహామునిః
నవనీతం సముద్ధృత్య యంత్రసర్వస్వ రూపకమ్॥ —బృహద్విమానశాస్త్రము*

వేదమంత్రములందు విమాన విద్యారహస్యములు నిక్షిప్తమై యున్నవని దయానంద సరస్వతి నిరూపించినాడు.

వేద యో వీనాం పద మంతరిక్షేణ పతతామ్
వేద నావ సముద్రియః ॥ — ఋగ్వేద, 1-25-7**

అంతరిక్షము నందు విహరించు పక్షుల యాకాశమార్గములు సముద్రము లందు సంచరించు నేకల జలమార్గములు తెలిసినవాడు శిల్పవిద్యాచతురుడై హస్తకళాకౌశలముతో విమానాది యానములను నిర్మింపసమర్థుడగును.[1]

ఉత స్య దేవో భువనస్య సక్షణి
స్త్వష్టా గ్నాభిః సజోషా జూజువన్ రథమ్॥ —ఋగ్వేద. 2-31-4

[దేవతలతో నేకమనస్కుడై జగమును పాలించు త్వష్ట్ర దేవుడు మా రథమును వేగవంతము చేయుగాక !] రథమనగా విమానాది యానము.

Or, May this Tvastar, god, who rules the world with power
One-minded with the Goddesses, speed forth our car.
— Eng Tr. Griffith : The Hymns of the Rigveda.

ఈ మంత్రార్థమును గ్రహించి శిల్పులు శిల్పవిద్యాసాధ్యములై వేగముగ పోవు విమానాదియానములను నిర్మింతురుగాక ! [2]

---

* చూడు :- విమానశాస్త్రము, తెలుగు అనువాదము
పండిత, పుత్తేటి సుబ్రహ్మణ్యాచార్యులు, నెల్లూరు

** Cf : The Hymns of the Rigveda. Vol. I — Ralph T. H. GRIFFITH

He knows the path of birds that flying through heaven and Sovran of sea.
He knows the ships that are thereon".

Varuna is the lord of the air and sea.

1 & 2 చూడు :- ఋగ్వేదభాషాభాష్యము - దయానంద సరస్వతి

సోమా పూష్ణా రజసో విమానం
సప్త చక్రం రథ మవిశ్వ మిన్వమ్॥ —ఋగ్వేద. 2-40-1

[ఓ సోమపూషులారా! ఆకాశగమనము గల సప్తకలా యంత్రయుక్త మయిన రథము నెక్కి మా యొద్దకు రండు.]

వియతి గమకమ్ విమానమ్. విమాన మన ఆకాశమునందు చరించునది.

ఇట దయానంద సరస్వతి సోమా పూష్ణా యన అగ్నివాయువులను నర్దము చెప్పి, వాని సాయమున విమానములు నిర్మింపవచ్చు నను సూచన యున్నదని వ్రాసినాఁడు.[1]

ఒక మంత్రమున డేగ వలె నాకాశమునందెగురు విమాన వర్ణనమున్నది.

ఆ వాం రథో అశ్వినా శ్యేనపత్వా సుమృళీకః స్వవాం యా త్వవాఙ్
యా మర్త్యస్య మనసో జవీయాన్ త్రిబంధురో వృషణా వాతరంహాః॥
—ఋగ్వేద. 1-118-1

[ఓ అశ్వినులారా! క్రిందను మీఁదను మధ్యభాగమునను - మూఁడు చోట్ల - బంధన స్థానములు గలిగి యాకసమున డేగ వలె వాయువేగమునను, మానవ మనోవేగమునను విహరించు సుఖదాయకమయిన విమానమునుండి క్రిందికి రండు.]

ఇట రథము విమానాదియానములకు ప్రతీక.

అశ్వినులు శిల్పకర్మము లెఱిగిన స్త్రీ పురుషులు.[2]

మఱియొక మంత్రమున శిల్పవిద్యాబోధకుల ప్రశంస యున్నది.

రథం హిరణ్యవంధుర మింద్రవాయూ
ఆ హి స్థాథో దివి స్పృశమ్॥ —ఋగ్వేద. 4-46-4

[ఓ ఇంద్రవాయువులారా! మీరిరువురు చక్కగా నిర్మింపఁబడిన ఆకాశగామి యగు రథము నధిరోహింపుఁడు.]

ఇట ఇంద్రవాయువు లన విద్యుద్వాయుసదృశ శీఘ్రకారు లగు శిల్పవిద్యాధ్యాపకోపదేశకులని దయానంద సరస్వతి తెలిపినాఁడు.[3]

ఈ విధముగా ననేకమంత్రములకు దయానంద సరస్వతి చేసిన భాష్యముల వలన వైదికయుగమునందు విమానములున్నవని రూఢి యగుచున్నది.

1, 2, 3 :- దయానంద సరస్వతి : ఋగ్వేదభాషాభాష్యము,

# దేవ విమానములు

తత్ర దేవ విమానాని కామగాని సహస్రశః ॥ —వ్యా. భా. వన. 43-8

మహాభారతమునందు విమానాద్యంతరిక్షయానముల వర్ణనము లెక్కువగనే యున్నవి.

పురందర నందనుఁడు దేవపథంబున కరిగి, "రమణీయంబులగు రమ్య విమాన సంహతులదాని" నమరావతిని గాంచినాఁడు. —నన్నయ ఆరణ్య. 1-347-8

అవి దేవ విమానములు. కోరినచోటికిఁ బోఁగల శక్తి గలవి.

అర్జునుఁడు భూలోకమునుండి దేవలోకమున కరుగునపుడే యతనికి యంతరిక్షమునం దద్భుతరూపములు గల యనేక విమానములు గన్పించినవి.

దదర్శాద్భుత రూపాణి విమానాని సహస్రశః ॥ —వ్యా.భా. వన. 42-32

శతమఖుఁడు, "కాంచన చారు విమాన మాలికా గత దివిజోత్తముల్ గొలువఁగాఁగొలువుండును" —నన్నయ. సభా. 1.64

ఈ దివిజోత్తములలో బ్రహ్మర్షులు రాజర్షులు దేవర్షులు గలరు.

బ్రహ్మ రాజర్షయశ్చైవ సర్వే దేవర్షయ స్తథా
విమానై ర్వివిధైర్ దివ్యైర్ దీప్యమానా ఇవాగ్నయః ॥

—వ్యా భా. సభా. 7-26-7

యయాతి "మహాఘోరతపంబు సేసి దివ్యవిమానంబున దేవలోకంబు నకుంజనెను" —నన్నయ. ఆది. 3-201

నూఱు యజ్ఞములు చేసి సురేంద్రపదవీస్థితి నొందిన నహుషుఁడు తాను దివ్య విమానము నెక్కి దేవలోకమునఁ దిరిగినట్లు చెప్పికొనినాఁడు.

అహం హి దివి దివ్యేన విమానేన చరన్ పురా॥ —వ్యా. భా.వన. 181-33

పెన్నయను మహానది నాడిన మయూరహంసవిమాన గతులగుదు రని నన్నయ వ్రాసినాఁడు.[1] కాని యా నదీతటమున మూఁడు రాత్రు లుపవాస ముండవలయు నని మూలమునందున్నది.

తతో వేణాం సమాసాద్య త్రిరాత్రోపోషితో నరః
మయూర హంస సంయుక్తం విమానం లభతే నరః॥ —[వన. 82-33]

మయూరహంసయుక్తమనఁగా మయూరహంసప్రతిమాయుక్తమని యర్థము.

1. నన్నయ. ఆరణ్య. 2-278

ఖాండవ దహనానంతరము సురపరివృతుండయి వచ్చిన యింద్రుం డర్జునున కాగ్నేయ వారుణ వాయవ్యాది దివ్యబాణంబులిచ్చి...... దివ్య విమానారూఢుడయి దివిజాప్సరోగణసేవితుండయి దివంబున కరిగె.

—నన్నయ. ఆది. 8.321

ద్రౌపదీ స్వయంవర మహోత్సవమును జూడవచ్చిన

"దివిజ ఖచర గరుడ గంధర్వ కిన్నరుల విమానముల్
విలసిల్లె నంబరతలము నందు."[1]

సుభద్రార్జునుల వివాహమున కేతెంచి యనిమిష ప్రభుఁడు నిర్జర శ్రేణియు దివ్యకాంతులతో వెలుఁగు విమానములలో దివి కరిగిరి.

నరునకు దయ నిట్లానంద మొందించి యింద్రుం
డరిగె దివికి దివ్యానంత రత్నాంశు జాల
స్ఫురితవిమానంబుల్ నభోభాగ మెల్లన్
నెరసి వెలుఁగుచుండన్ నిర్జరశ్రేణితోడన్.[2]

దమయంతీ స్వయంవరాలోకన కౌతుకంబున నింద్రుండును లోకపాలురును,

కనక రత్న రమ్య దివ్యవిమానారూఢులయి భూలోకమునకు వచ్చి దమయంతీ స్వయంవరంబునకుఁ బోయెడువాని నలుంగని యంతరిక్షంబున విమానంబులు నిలిపి భూతలంబునకు వచ్చిరి. —నన్నయ. అరణ్య. 2-33

తతోఽంతరిక్షే విష్టభ్య విమానాని దివౌకసః ॥ —వ్యా. భా. వన. 54-30

దివౌకసులు విమానముల నంతరిక్షమునందెట్లు నిలిపిరి ? భూతలంబున కెట్లు వచ్చిరి ?

విమానచరు లంతరిక్షమునుండి క్రిందికి దిగుటకు గాలి గుమ్మటముల వంటి సాధనములుండియుండ వచ్చును. కాని విమానముల నంతరిక్షమున నిలుపుటయెట్లో యూహ కందకున్నది.

విమానచోదకుఁడీ స్తంభనరహస్యము నెఱిగి యుండ వలెను.

---

1. నన్నయ. ఆది. 7-172 : వ్యా. భా. ఆది. 186-6 అథ యయుర్ దేవగణా విమానై
2. నన్నయ. ఆది. 8-195 : వ్యా భా. 186-14 విమాన సంబాధమభూత్ సమంతాత్

ఈశ్వరుఁడర్జునునకు పాశుపతాస్త్రము ప్రసాదించినాఁడని విని "ఇంద్రుండు ధనేశ ధర్మ వరుణేశ్వరుల తోడ సురగణసహితుఁడై దివ్యవిమానముల్ వెలుగంగ వచ్చెను". —నన్నయ. అరణ్య 1-337

ఈ విమానములలో కుబేరుని విమానము మిక్కిలి కాంతిమంత మైనది.

అథ జాంబూనదవపు ర్విమానేన మహర్చిషా
కుబేరః సమనుప్రాప్తో యక్షై రనుగతః ప్రభుః ॥ —వ్యా.భా. వన. 41-7

పాండవులు గంధమాదనపర్వతము నందుండఁగా నొకనాఁడు,

ఘోరన సురదుందుభుల నినాదంబులు కిన్నర గంధర్వగీతరవము
లెసఁగ సహస్ర సూర్యేందుమండలములు వోలె విమానముల్ పొలిచివెలుఁగఁ
పాండవాలోకనపరుఁడై సహస్రాక్షుఁ డమరగణంబుతో నమ్మహాద్రి కేతెంచె.
—నన్నయ. అరణ్య. 4-44

ఈ విమానములలో వచ్చినది గంధర్వాప్సరోగణములు.

ఇంద్రుఁడు జాంబూనద పరిష్కృత మయిన రథ మెక్కి వచ్చినాఁడు.

తే సమంతా దనుయయుర్ గంధర్వాప్సరసాం గణాః
విమానైః సూర్యసంకాశైర్ దేవరాజ మరిందమమ్॥
తతః స హరిభిర్యుక్తం జాంబూనదపరిష్కృతమ్
పార్థాన మభ్యాజగామాథ దేవరాజః పురందరః ॥
—వ్యా భా. వన. 165-4, 5

ఈ రథ మంతరిక్షయానము, కావున విమానమే.

నారదుఁడు శక్రుండును సల్లాపానందముఁ బొందుచుండ నాకాశమున, బాలభానుబింబంబుఁ గీడ్పఱచునట్టి దీప్తి మండలి దోఁచె నద్దేవపతియు మునిపతియుఁజూచుచుండ గ్రక్కున విమాన మవతరించి యాసన్నయై యతివ యొత్తు. పురుహూతున కభిముఖియై కరములు మోడ్చినది.[1]

ఆ యతివ లక్ష్మీదేవి. ఆ విమానము విష్ణుమూర్తి ది.

1. తిక్కన శాంతి. 5-6 : వ్యా. భా. శాంతి. 228-16
తత్ సువర్ణార్క చిత్ర మాస్థితం వైష్ణవం పదమ్....
సావరుహ్య విమానాగ్రా దంగనానా మనుత్తమమ్
అభ్యగచ్ఛత్ త్రిలోకేశం దేవర్షిం చ నారదమ్॥

## సురేశ్వరుని సుదర్శన విమానము

తతః శక్రః సురగణైః సమారుహ్య సుదర్శనమ్॥

—వ్యా.భా. విరాట. 56-3

ఫల్గునకును కురురాట్సైన్యమునకు జరుగనున్న మహాభయంకర సంగరమును జూచు వేడుకతో సురరాజీ సుదర్శన విమానము నెక్కి వచ్చినాడు.

అరుదుగ నిట్టిలోకునికి నంతబలంబునకున్ మహోగ్ర సం
గర మగుడున్ మనం బతులకౌతుక మొంది కనుంగొనన్ సురే
శ్వరుఁడు సుదర్శనం బనఁ బ్రశంసకు నెక్కు విమాన మెక్కి యం
బరగతి వచ్చె దేవముని పంక్తులు సిద్ధగణంబు గొల్వఁగాన్॥

ఆ విమాన రత్నంబు నందు,

స్వర్గమున నున్నరాజులుఁ జక్రవర్తులును యథోచితచ్ఛత్రంబులును నిజాగ్ర చామరంబులుఁ జెలువొందఁ జారులీలఁ గొలిచియుండిరి వేడ్కలు గొనలు నిగుడ.

—తిక్కన, విరాట. 4-238-40

మూలమునం దీ విమానము కామగమనము గలదనియు, సర్వరత్న విభూషిత మనియు, నందు మణిరత్నమయములు, హిరణ్మయములు నయిన యనేక స్తంభములు గల ప్రాసాదమున్న దనియు వర్ణింపఁబడినది.

తతః కామగమం దివ్యం సర్వరత్న విభూషితమ్
విమానం దేవరాజస్య శుశుభే ఖేచరే తదా
శతం శతసహస్రాణాం యత్ర స్థూణా హిరణ్మయీ
మణిరత్నమయీ చాన్యా ప్రాసాదముపధారయత్॥

—వ్యా. భా విరాట. 56-3-7

అట్టి సుదర్శన విమానమునెక్కి వచ్చిన సురేంద్రునితో దేవ గణముతే కాక విశ్వేదేవతలు, అశ్వినీకుమారులు, మరుద్గణములు నున్నట్లు మూలము నందు వర్ణింపఁబడినది.

తతః శక్రః సురగణైః సమారుహ్య సుదర్శనమ్
సహోపాయాత్ తదా రాజన్ విశ్వాశ్విమరుతాం గణైః ॥ —విరాట. 56-3

విశ్వేదేవులు, అశ్వినులు, మరుద్గణములు శిల్పిగణములు. ఇందుఁడీ శిల్పిగణములతోఁ గలిసి యుండుట వాని శిల్పాభిమానమునకు నిదర్శనము.

# వసురాజు విమానము

వసువను చేదిభూనాథుఁడు మహానిష్ఠతో తపము సలుపుచుండఁగా నింద్రుఁడు వచ్చి,

"నీ వర్ణధర్మపరిపాలనంబునకుఁ దపంబునకు మెచ్చితి నీవు నాతోడం జెలిమిచేసి నా యొద్దకు వచ్చుచుంబోవుచు మహీరాజ్యంబు సేయుచు నుండు మని వానికి దేవత్వంబును గనకరత్నమయంబైన దివ్య విమానంబును....నిచ్చిన న వ్వసువును దద్విమానారూఢుండై యుపరిలోకంబునం జరియించుటం జేసి యుపరిచర వసుండు నాఁబరంగుచుండెను." — నన్నయ. ఆది 3-24

వాసవదత్తమయిన యీ విమానము స్ఫటికమణులతో నిర్మింపఁబడిన దనియు నాకాశగమనము గల దనియు వ్యాసభారతము వలనఁ దెలియుచున్నది.

దైవోపభోగ్యం దివ్యం త్వామాకాశేస్ఫాటికం మహత్*
ఆకాశగం త్వాం మద్దత్తం విమాన ముపపత్స్యతే
త్వామేకః సర్వమర్త్యేషు విమానవర మాస్థితః
చరిష్యస్యుపరిస్థో హి దేవో విగ్రహవానివ॥

—వ్యా. భా. ఆది. 63-13, 14

ఈ దివ్యవిమానము విశ్వకర్మ చేత నిర్మింపఁబడినట్లు వసు చరిత్రము నందు వర్ణింపఁబడినది.

ఇంద్రుఁడు వసురాజున "కవార్య మహార్య మహార్యభీశు సంయుత మణి భాసమానమగు నొక్క విమానము చూపి" యిట్లనెను,

జలనిధిసార్వభౌమతనుజా దనుజారుల యేఁగు పెండ్లి నాఁ
డలఘుఁడు విశ్వకర్మ యుభవాబ్జభవాదులు మెచ్చఁ జేసెఁ గౌ
శలమున దీని; దీని పయిఁ జారురమా పరమానుషంగుఁడై
యలరెఁ గదా గదాధరుఁ డహస్కరుపై నొఱపైన కైవడిన్॥

— భట్టుమూర్తి : వసుచరిత్ర, 3-10

---

* 1) "మై ఆప్‌కో దేవలోకవాసియోంకే ఉపయుక్త ఆకాశ్ చారీ తథా
స్ఫటిక మణిసే బనాహుఆ దివ్యవిమాన్ దేతాహూఁ
వహ్ ఆప్‌కీ పాస్ సదా బనా రహేగా॥"

—చతుర్వేది ద్వారకాప్రసాద్‌శర్మ : హిందీమహాభారత.

2) "I shall give the a crystal car such as the celestial alone have, capable of carrying thee through the mid-air"

—P. C. Roy. Mbh Sec. 63

## కార్తవీర్యార్జునుని కాంచన విమానము

దత్తాత్రేయప్రసాదేన విమానం కాంచనం తథా॥

—వ్యా.భా. వన 125.12

సహస్రబాహుఁడగు కార్తవీర్యార్జునుఁడు జమదగ్ని మహామునీంద్రు నాశ్రమమునకేగుదెంచి, అందు మునివరుచేతఁ బూజితుండయ్యును వాఁడు తన రాజ్యమదంబున మెచ్చక యయ్యాశ్రమవాసుల కవమానంబు చేసినాఁడని నన్నయ వర్ణించినాఁడు. —నన్నయ. అరణ్య. 3-145-6

దత్తాత్రేయ ప్రసాదమున లభించిన దివ్య కాంచన విమానమే హైహయాధిపతియైన సహస్రబాహువు రాజ్యమదమునకు కారణ మని వ్యాసభారతము వలనఁ దెలియుచున్నది.

దత్తాత్రేయప్రసాదేన విమానం కాంచనం తథా
ఐశ్వర్యం సర్వభూతేషు పృథివ్యాం పృథివీపతే॥
అవ్యాహతగతిశ్చైవ రథ స్తస్యమహాత్మనః
రథేన తేన తు సదా వరదానేన వీర్యవాన్
మమర్ద దేవాన్ యక్షాంశ్చ ఋషీంశ్చైవ సమంతతః
విమానే చ దివ్యేన హైహయాధిపతిః ప్రభుః
శచీసహాయం క్రీడంతం ధర్షయామాస వాసవమ్॥

—వ్యా. భా. వన. 1.5-12-16

ఇట విమాన రథ శబ్దములు పర్యాయపదములుగా వాడఁబడినవి.

## కర్దమ ప్రజాపతి కామగ విమానము

కర్దమ ప్రజాపతి స్వాయంభువ మనువు పుత్రికయైన దేవహూతిని పెండ్లాడి యామెను సంతోషపెట్టుటకు నిజయోగమాయాబలంబున నొక దివ్య విమానంబు గల్పించెను.

కర్దమయోగి భార్యాసహితంబుగ కామగవిమానారూఢుండై సమస్త భూభాగంబును వాయువేగంబునఁ గలయం గ్రుమ్మరి నిఖిల వైమానిక లోకంబు నతిశయించి లోకంబులం జరించె నని మహాభాగవతము నందు వర్ణింపఁబడినది —శ్రీమదాంధ్ర మహాభాగవతము. స్కంధ. 3-805-821

వ్యాస. భాగవతపురాణ. స్కంధ. 3-23

# పుష్పక విమానము

స హ్యాసనవరం శ్రీమత్ పుష్పకం విశ్వకర్మణా
విహితం చిత్రపర్యంత మాతిష్ఠత ధనాధిపః ॥ —వ్యా.భా. వన. 161.37

విశ్వకర్మ తన నిర్మాణకౌశలముతో శ్రేష్ఠమయిన యాసనములు గలిగి చిత్రముగ నుండునట్లు నిర్మించిన పుష్పక విమానము నందు ధనాధ్యక్షుఁడు విరాజిల్లుచున్నాఁడు [1]

"తొల్లి కుశవతి యను పుణ్యనదీ తీరంబున నమరులెల్ల సత్రయాగము సేయుచుండి నన్ను రావించిన నేనును పుష్పక విమానాధిరూఢుండనై శతపద్మసంఖ్యల యక్షరాక్షసబలంబులతో గగనగతి నందులకుఁబోవు చుంటినని కుబేరుఁడు ధర్మజునకుఁ జెప్పినట్లు నన్నయ వ్రాసినాఁడు. —అరణ్య. 4-30

కాని పుష్పక విమానము విశ్వకర్మ నిర్మిత మని తెలుపు మూల శ్లోకమును నన్నయ యనువదింప లేదు.

## పుష్పక విమాన వృత్తాంతము

బ్రహ్మణోఽర్థే కృతం దివ్యం దివి యద్ విశ్వకర్మణా
విమానం పుష్పకం నామ సర్వరత్న విభూషితమ్॥
పరేణ తపసా లేభే యత్ కుబేరః పితామహాత్
కుబేర మోజసా జిత్వా లేభే తత్ రాక్షసేశ్వరః ॥
వా. రా. సుందర. 9-10-12

దివ్యమైన పుష్పక విమానమును విశ్వకర్మ బ్రహ్మదేవుని కొఱకు నిర్మించినాఁడు.

వైశ్రవణుఁడు... చతుర్ముఖునకుందపంబు సేసి... ధనేశ్వరత్వంబును లంకయను పురంబును... వరంబులుగాఁ బడసినాఁడు. —ఎఱ్ఱన. అరణ్య. 6-271

లంకా పట్టణముతో పాటు కోరినచోటికిఁ గొనిపోఁగల పుష్పక విమానమును కూడఁ బడసినట్లు మూలమునం దున్నది.

రాజధానీ నివేశం చ లంకాం రక్షోగణాన్వితామ్
విమానం పుష్పకం నామ కామగం చ దదౌ ప్రభుః ॥
—వ్యా. భా. వన. 274-17

* చూడు :- మహాభారతము - హిందీ అనువాద సహితము - గీతాప్రెస్.

బ్రహ్మదత్తమై కుబేర వాహన మయిన యీ దివ్యపుష్పకవిమానము హంస ప్రతిమాయుక్తమై మనోవేగముతో కోరిన చోటికి పోఁగలదు.

వాహనం చాస్య తద్దత్తం హంసయుక్తం మనోజవమ్
విమానం పుష్పకం దివ్యం నైఋత్యైశ్వర్యమేవ చ॥

—వ్యా. భా. శల్య. 37-31

అఖిలవేదవేదాంగ ధనుర్వేద పారఁగుఁడయిన[1] పౌలస్త్యుఁడు పితామహు నుద్దేశించి తపంబు చేసి, కామరూపగతి, ఆత్మేచ్ఛా విహారము మనుష్యజాతి యొండుదక్క తక్కిన వారితో మరణంబు లేకుండుట మున్నుగా గల వరంబులంబడసెను[2]

వరగర్వోన్నతుఁడై దశాననుఁడు దుర్వారోద్ధతిన్ దాడిమై
నరిగెన్ గిన్నరనాథుపై;
నతఁడు కార్యం బాత్మ నూహించి
సంగర సన్నద్ధుఁడు కాక కింపురుష యక్షశ్రేణితోఁ గూడఁదా
నరిగెన్ లంకఁ బరిత్యజించి రభసోద్యత్పుష్పకారూఢుఁడై.

ఇట్లతండు గంధమాదనంబునకుం జనునెడ వెన్నడిం దగిలి దానవుండు వాని మానంబుతోడన విమానంబు నపహరించె.[3]

విమానం పుష్పకం తస్య జహారాక్రిమ్య రావణః॥

—వ్యా భా. వన 275-34

ఈ విధముగా కుబేరుని పుష్పకవిమానము రావణుని స్వాధీనమయినది.

రావణుఁడు తన విమానము నపహరించుటకుఁ గనలి యక్షేశ్వరుఁడు గురుఁడనయిన న న్నవమానించితివి, గావున నివ్విమానంబు నీ పగతుల పాలయ్యెడు మని శపించెను.

ఆ శాపకారణమున పుష్పకవిమానము రావణుని శత్రువగు శ్రీరామునికిఁ దక్కినది.

రావణవధానంతరము శ్రీరాముఁడు రత్నమయమయిన పుష్పకవిమాన మెక్కి అయోధ్యానగరమున కేగినాఁడు.

---

1. ఎఱ్ఱన అరణ్య. 6-276
2. ,, 6-280-1
3. ,, 6-385-6

అవిరోధంబుగ జానకీసహితుఁడై యాబద్ధ రత్నప్రభా
నవపుష్పంబగు పుష్పకం బను విమానంబెక్కి యర్కాన్వయ
ప్రవరుం డిమ్ముల నేగె సమ్మదభరప్రాకారవారాకర
ప్లవమానుండగుచున్ బురంబునకు ప్రాప్త శ్రీవిశేషోన్నతిన్॥

—ఎఱ్ఱన. అరణ్య. 6-286

సంతతార పునస్తేనసేతునా మకరాలయమ్
పుష్పకం చ విమానేన ఖేరేచణ విరాజితా
కామగేన యథాముఖ్యై రమాత్యైః సంవృతో వశీ॥

—వ్యా. భా. వన. 292-53-4

హంసప్రయుక్తమైన పుష్పక విమానము రామాజ్ఞతో మహానాదముతో నాకాశమున కెగిరినట్లు వాల్మీకి రామాయణము నందు వర్ణింపఁబడినది.

అనుజ్ఞాతం తు రామేణ తద్విమానమనుత్తమమ్
హంసయుక్తం మహానాద ముత్పపాత విహాయసమ్॥

—వా. రా, యుద్ధ. 123-1

రాముఁ డయోధ్యనుజేరి పట్టాభిషిక్తుఁ డయిన యనంతరము పుష్పక విమానమును పూజించి వైశ్రవణుని కొసఁగెను.

పుష్పకం చ విమానం తత్ పూజయిత్వా స రాఘవః
ప్రాదాద్ వైశ్రవణాయైవ ప్రీత్యా స రఘునందనః॥

—వ్యా. భా. వన. 291-69

రామాదులను లంకనుండి యయోధ్యకుఁ గొనిపోయిన యీ యంతరిక్ష యానము పాదరస సహాయమున నడుపఁబడు యంత్ర చోదితమై యుండు నని కొందఱు పండితు లూహించుచున్నారు.[1]

త్రేతాయుగమునాటి శిల్పర్షుల శిల్పవిజ్ఞానము ప్రశంసనీయము.

---

1. Cf : E. Vedavyas : HINDUISM IN SPACE AGE. -p. 588.

"We shall not be very surprised when we learn in Ramayana that vimanas i e. flying machines navigated at great heights with the aid of quick-silver and a propulsive wind the vimanas could cover vast distances and could travel forwards upwards and downwards".

"Enviably manoevarable space vehicles". — N. Dutt.

# పుష్పక విమాన విశేషములు

విశ్వకర్మచే శిల్పకళానిధానముగా నిర్మింపఁబడిన పుష్పక విమాన విశేషములు వాల్మీకి రామాయణమునం దనేకవిధములుగా వర్ణింపఁబడినవి.

రావణవధానంతరము విభీషణుఁడు సూర్యసదృశకాంతిగల పుష్పక విమానములో నిన్నొక్కదినములో లంకనుండి యయోధ్యకుఁ జేర్పఁగల నని[1] రామునికిఁ జెప్పి విమానమును దెప్పించినాఁడు.

ఆ విమాన మెట్లున్నదో చూడుడు :-

తతః కాంచన చిత్రాంగం వైడూర్య మణి వేదికమ్
కూటాగారైః పరిక్షిప్తం సర్వతో రజత ప్రభమ్॥
పాండురాభిః పతాకాభిః ధ్వజైశ్చ సమలంకృతమ్
శోభితం కాంచనై ర్హర్మ్యైర్ హేమపద్మవిభూషితైః ॥ 25
ప్రకీర్ణ కింకిణీజాలై ర్ముక్తా మణి గవాక్షకమ్
ఘంటాజాలైః పరిక్షిప్తం సర్వతో మధురస్వనమ్॥ 26
తం మేరు శిఖరాకారం నిర్మితం విశ్వకర్మణా
బహుభిర్భూషితం హర్మ్యై ర్ముక్తా రజత శోభితైః ॥ 27
తలైః స్ఫాటికచిత్రాంగై ర్వైడూర్యైశ్చ వరాసనైః
మహార్హాస్తరణోపేతై రుపపన్నం మహాధనైః ॥ 28
ఉపస్థిత మనాధృష్యం విమానం మనోజవమ్
నివేదయిత్వా తద్ రామాయ తస్థౌ తత్ర విభీషణః ॥ 28

—వా. రా. యుద్ధ. 121-24-29

విశ్వకర్మచే మేరు శిఖరాకారముగా నిర్మింపఁబడిన యా విమానము బంగారుపద్మములతో నలంకరింపఁబడిన కాంచనహర్మ్యములతోను, తెల్లని యుప్పరిగలతోను, ముక్తామణిజాలగవాక్షములతోను, ధ్వజపతాకలతోను, ఘంటాజాలముతోను, కాంచనాంగములు గల వైడూర్య మణి వేదికలతోను, స్ఫటికమణిచిత్ర మయిన క్రిందిభాగముతోను, విలువయిన పఱపులుఁగల వైడూర్యమణిమయములైన వరాసనముతోను, చక్కఁగా నలంకరింపఁ బడినది.

1. చూడు :- వా. రా. సుందర. 121-8, 9

అహ్నా త్వాం ప్రాపయిష్యామి తాం పురీం పార్థివాత్మజ
పుష్పకం నామ భద్రం తే విమానం సూర్య సన్నిభమ్॥

కాంచన హర్మ్యములతోను కూటాగారములతోను పుష్పక విమాన మొక విశాలనగరమువలె నున్నది [1]

మనోవేగముతో యజమానుఁడు కోరినచోటికిఁ గొని పోఁగల యా విమానమును జూచి రామ లక్ష్మణులాశ్చర్యచకితులైనారు.[2]

ఈ విమానమునందలి విశేషములు దేవతావిమానములందును లేవు.

న తే విశేషా నియతాః సురేష్వపి
న తత్ర కించి న్న మహావిశేషవత్॥ —సుందర. 8.3

ఈ విమానము మనోవేగమున పక్షివలె సంచరించుటయే గాక కోరిన రూపము ధరింపఁగలదు. అందెందఱు కూర్చుండినను మఱొకరికి తావుండును. ఆశ్చర్యకరమైన భక్తిచిత్రములతో కనులకింపుగను, మనమున కాహ్లాదకరముగను, సమశీతోష్ణస్థితి గలిగి సర్వర్తుసుఖదాయకముగా నుండునట్లు విశ్వకర్మ యీ దివ్య విమానమును మనోహరముగా నిర్మించినాఁడు.

మనోజవం కామగమం కామరూపం విహంగమమ్[3]

దేవోపవాహ్య మక్షయ్యం సదా దృష్టిమనః సుఖమ్
బహ్వాశ్చర్యం భక్తిచిత్రం బ్రహ్మణా పరినిర్మితమ్॥

నిర్మితం సర్వకామైస్తు మనోహర మనుత్తమమ్
న తు శీతం న చోష్ణం చ సర్వర్తు సుఖదం శుభమ్॥
—వా. రా. ఉ కాం. 15-3-39-42

ఇట్టి విశేషములు గల విచిత్రవిమాన మింకొకటి లేదు.

---

1. పోల్చు :- వాల్మీకి రామాయణము : సుందరకాండ. 9-13-15
ఉత్తరకాండ. 15-38-39

2. Cf :- Shakuntala Devi : Gods and Goddesses in Indian Mythology. p -59
"Brahma granted Kubera, a magic chariot Pushpaka — an aerial chariot which can move of its own accord and is so large that it can contain a whole city".

3. పోల్చు :- వా. రా. సుందర. 8-5
మనః సమాధాయ తు శీఘ్రగామినం దురాసదం మారుతతుల్యగామినమ్.

వా. రా. యుద్ధ. 127-39
హంసయుక్తం మహావేగం నిపపాత మహీతలమ్॥

# పుష్పక విమాన నిర్మాత

త దప్రమేయ ప్రతికార కృత్రిమం స్వయంసాధ్వితి విశ్వకర్మణా
దివంగతే వాయుపథే ప్రతిష్ఠితం వ్యరాజదాదిత్యపథస్య లక్ష్మతత్.
—వా. రా. సుందర. 7-2

పుష్పక విమానము స్వయముగా విశ్వకర్మచేత నిర్మింపఁబడిన దని వర్ణించిన వాల్మీకి మహర్షియే యది బ్రహ్మనిర్మితమని వేఱొకచోట చెప్పినాఁడు.

విమానం పుష్పకందివ్యం మనసా బ్రహ్మనిర్మితమ్॥—వా.రా. యుద్ధ.127-31

ఇట బ్రహ్మయన శిల్పిబ్రహ్మ యగు విశ్వకర్మ యని వ్యాఖ్యాతలు వివరించినారు.[1]

మఱియొకచోట కూడ నిట్లేయున్నది.

బహ్వాశ్చర్యం భక్తిచిత్రం బ్రహ్మణా పరినిర్మితమ్ ॥
—వా. రా. ఉ. కాం. 15-4-1*

వాల్మీకి మహర్షి విశ్వకర్మ శబ్దమునకు పర్యాయపదముగా బ్రహ్మశబ్దము నుపయోగించినాఁడని స్పష్టమగుచున్నది.

ఏలయన పుష్పకవిమానము బ్రహ్మదేవునికొఱకు విశ్వకర్మచే నిర్మింపఁబడినదని వాల్మీకియే వచించినాఁడు.

బ్రహ్మణోఽర్థే కృతం దివ్యం దివి యద్ విశ్వకర్మణా
విమానం పుష్పకం నామ సర్వరత్నవిభూషితమ్ ॥
జ్వలనార్క ప్రతీకాశం సుకృతం విశ్వకర్మణా॥ —వా. రా. సుందర. 9-11

కావున పుష్పక విమాన నిర్మాత విశ్వకర్మయే

1. Cf :- Srimad Valmiki Ramayana with Sanskrit Text and English translation part III [Yuddha. 127-31] —p p 1890-1
—Geetha Press, Gorakhpur

"There is seen in distance the well-known heavenly aerial car, shining brightly like the moon, the aerial car created with his mind by Viswakarma (the architect of Gods, who has been referred to here as Brahma by virtue of his creative talent.)

* Ibid. —p 1-56

"It contained numerous curios of art; It looked picturesque with compartments and had been constructed by Viswakarma, the architect of Gods".

## భ్రాంతిమయ విమానము :
## రావణుని రతనాలమేడ పుష్పకము

సీతాన్వేషణపరుఁడైన హనుమంతుఁడు విశ్వకర్మచే నిర్మింపఁబడిన లంకా పురమునందు గ్రుమ్మరుచు సాక్షాత్తు మయునిచే నిర్మింపఁబడినవా యను భ్రాంతిగలుగు నట్లు విశ్వకర్మ నిర్మించిన విచిత్రభవనముల[1] మధ్య నాకాశమునందు హంసలచే మోయఁబడు విమానము వలె చక్కగా నిర్మింపఁబడి, మేఘమువలె మనోహరముగనుండు ఎత్తైన రావణుని రాజభవనమునుచూచెను.

తతో దదర్శోచ్ఛ్రితమేఘరూపం మనోహరం కాంచనచారు రూపమ్
రక్షోఽధిపతి స్యాత్మబలానురూపం గృహోత్తమం హ్యప్రతిరూపరూపమ్ ॥
హంసప్రవేకై రివ వాహ్యమానం శ్రియా యుతం ఖే సుకృతం విమానమ్ ॥
—వా. రా. సుందర. 7-4-7

దేవతా వాసస్థానములందెల్ల శ్రేష్ఠమయి రత్నప్రభలతో రాజిల్లు నా పెద్ద మేడపేరు పు ష్ప క ము.

పుష్పాహ్వయం నామ విరాజమానం రత్నప్రభాభిశ్చ వివర్ధమానం
వేశ్మోత్తమానపి చోచ్చమానం మహాకపిస్తత్ర మహావిమానమ్ ॥
—వా.రా. సుందర. 7-11

ఇట విమాన మన సప్తభూమిగృహము.

విమానే వ్యోమయానే చ సప్తభూమిగృహేషు చ॥ —మేదినీ.

మహావిమాన మనఁగా చాల పెద్ద మేడ యని యర్థము.

---

1 చూడు :- వాల్మీకి రామాయణము - సుందరకాండ.

దదర్శ స కపిః శ్రీమాన్ పురీ మాకాశగా మివ
పాలితా రాక్షసేంద్రేణ నిర్మితాం విశ్వకర్మణా॥....
మనసేవ కృతాం లంకాం నిర్మితాం విశ్వకర్మణా॥ —సుందర. 2-19-20

గృహాణి నానావసురాజితాని దేవాసురైశ్చాపి సుపూజితాని
తాని ప్రయత్నాభిసమాహితాని మయేన సాక్షాదివ నిర్మితాని॥ —సుందర. 7-4

[విశ్వకర్మ కృతాన్యపి మాయయా విచిత్రరచనాదక్షేణ మయేన నిర్మితా నీవ, మయేన సాక్షాన్నిర్మితా నీవ విశ్వకర్మణా నిర్మితత్వేఽపి అనేకమాయామయత్వా న్మయ నిర్మిత సదృశానీ త్యర్థః ॥ —తిలక వ్యాఖ్య.]

పై శ్లోకము నుటంకించుచు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు,

"పుష్పకమనునది ఆకాశయానమగు విమానము కాదు. అది తొమ్మిదంతస్తుల మేడయైన విమానము. అది రావణుని సొంతసౌధము. అది మహారాజులది కావున చాల గొప్పమేడ హనుమంతుఁడు చూచిన తామేడనే. అది అర్ధయోజనము వెడల్పు. ఒక యోజనము పొడవును గలదై యుండును" అని వ్రాసినారు.[1]

దేవ రాజ ప్రాసాదములలో పుష్పక మను పేరు గల ప్రాసాదమున్నది.

వైరాజం పుష్పకాఖ్యం చ కైలాసో మాలికాహ్వయః
త్రివిష్టపం చ పంచైతే ప్రాసాదాః సర్వయోనయః ॥
ప్రథమశ్చతురస్రో హి ద్వితీయస్తు తదాయతః
వృత్తో వృత్తాయతశ్చాఽన్యోఽహ్యష్టాస్రశ్చ హ పంచమః ॥
—గరుడపురాణము. 47-19, 20

ఇందు పుష్పకము దీర్ఘచతురస్రాకృతి గలది.

లంకలో హనుమంతుఁడు చూచిన రావణుని ప్రాసాదరాజము 'పుష్పక' లక్షణములు గలిగియున్నది.

దదర్శ భవన శ్రేష్ఠం హనుమాన్ మారుతాత్మజః
అష్టయోజన విస్తీర్ణమాయతం యోజనం మహత్
భవనం రాక్షసేంద్రస్య బహుప్రాసాదసంకులమ్ ॥
—వా రా. సుందర. 9-2, 8

ఆ రతనాల మేడలోపలనున్న తామరకొలనులో నేనుఁగులు తమ తొండములతో తామరతూండ్లనుగొని లక్ష్మీదేవిని సేవించు చున్నట్లు గజలక్ష్మి విగ్రహము మలఁచఁబడియున్నది.

నియుజ్యమానాశ్చ గజాః సుహస్తాః సకేసరశ్చోత్పలపత్రహస్తాః
బభూవ దేవీ చ కృతా సుహస్తా లక్ష్మీస్తథా పద్మిని పద్మహస్తాః ॥
—వా రా. సుందర. 7-14

ఇది యీ రాజవేశ్మ విశేషములలో నొకటి.

రావణుని రాజ ప్రాసాదమయిన పుష్పక మను పేరుగల యీ మహా విమానమును నిర్మించినవాఁడు విశ్వకర్మయే.

1 చూడు :- సురవరం ప్రతాపరెడ్డి - రామాయణ విశేషములు. పుట 311

# నగరాకారవిమానము : సౌభకము

దేవాసురమనుష్యాణాం గంధర్వోరగ రక్షసామ్
అభేద్యం కామగం వవ్రే స యానం వృష్ణిభీషణమ్॥
తథేతి గిరిజాదిష్టో మయః పరపురంజయః
పురం నిర్మాయ శాల్వాయ ప్రాదాత్ సౌభ మయస్మయమ్॥
—భాగవతము, దశమ, 76-6, 7

శిశుపాలుని తమ్ముఁడగు సాల్వుఁడు కామగమనంబున తనసౌంభకంబను నగరంబుతో సన్నద్ధుండయి వచ్చి ద్వారవతీ పురంబు నవరోధించెను.
—నన్నయ, ఆరణ్య. 1-150

మూలమునందు 'సౌభ' మని యున్నది.

ఆగతః కామగం సౌభ మారుహ్యైవ నృశంసవత్॥-వ్యా భా. వన. 14-6*

సౌభము సప్తధాతునిర్మిత విమానమనియు[1] నగరాకార విమానమనియు[2] టీకాకారులు వివరించినారు.

శాల్వుఁడాకాశమున సంచరించు విమానమునం దుండియే వ్యూహము పన్నినాఁడు.

శాల్వో వైహాయసం చాపి తత్పురం వ్యూహ్య తిష్ఠతః ॥ —వన. 15-3

నన్నయ భారతము నందలి యీ క్రింది ప్రయోగములను బట్టి సౌంభక నగరము విమానము వలెనే భాసించుచున్నది.

1) సాల్వుఁడు సౌంభకారూఢుండయి సముద్రకుక్షి దేశంబునకుఁబోయె —[అరణ్య. 1-181]
2) సాల్వుఁడు వెండియు సౌంభకారూఢుండయి నాతో మాయాయుద్ధంబు సేయ సమకట్టె. —[అరణ్య. 1-187]
3) అయ్యసురయు సౌంభకంబు నదృశ్యం బగుటయు-[అరణ్య. 1-192]
4) చక్రంబు నభిమంత్రించి వైచిన నది... గగనంబునం బఱచి సౌంభక మధ్యంబునం బడెను. —[అరణ్య. 1-297]

---

* "సౌభం సుప్త ధాంతి తే సుభాః కాంచనాదయోధాతవః సజ్జమ్॥' —నీలకంఠ.

1 చూడు :- చతుర్వేది ద్వారకా ప్రసాద్‌శర్మ - హిందీ మహాభారతము —వన. పుట .63

2 చూడు :- మహాభారతము - హిందీ అనువాదసహితము - గోరఖ్‌పూర్‌ప్రతి.
'... శాల్వకే సౌభ నామక్ నగరాకార్ విమాన్ కో నష్టకర్నే కేలియే గయా'

భాగవతము నందు సౌంభక మొక విమానముగనే వర్ణింపఁబడినది.

ఒకమాటు సభమునఁ బ్రకటంబుగాఁ దోఁచు
నొకమాటు ధరణిపై నొయ్య నిలఁచు
నొకమాటు శైల మస్తకమున నర్తించు
నొకపరి చరియించు నుదధి నడుమ
నొకట తోయంబున నొక్కటియై యుండు
నొక్కెడఁ గనుఁగొనఁ బెక్కులగును
నొకమాటు సాల్వసంయుక్తమై పొడసూపు
నొక తోయ మన్నియు నుడిగి తోచు

యొక్క తేవ కొఱవి యుడుగక త్రిప్పిన
గతి మహోగ్రవృత్తిఁ గానవచ్చు
మఱియుఁ బెక్కుగతుల నరివరుల్ గలగంగఁ
దిరిగె సౌభకంబు నరవరేణ్య॥*

—ఆంధ్రి భాగవతము - దశమ, ఉత్తర. 867

చిత్ర విచిత్రగతుల గల సౌంభకవిమానగతి నెఱుగ లేక శత్రువులు కలవరపడుచున్నారు.

ఈ వర్ణనము మూలనుసరణమే.

బహురూప కైకరూపం తద్ దృశ్యతే న చ దృశ్యతే
మాయామయం మయకృతం దుర్విభావ్యం పరై రభూత్॥ 6

క్వచిద్ భూమౌ క్వచిద్ వ్యోమ్ని గిరిమూర్ధ్ని జలే క్వచిత్
అలాత చక్రవద్ భ్రామ్యత్ సౌభం తద్ దురవస్థితమ్॥ 7

—తిక్కన, భాగవత. 21-22

ఈ మహావిమానమును నిర్మించిన మహాశిల్పి మయుఁడు.

సాల్వుఁడు తపముసేయఁగా ప్రసన్నుఁడై హరుండు వాని కోర్కి కనురూపంబయిన విమానంబు నిర్మింప మయుని నియోగించిన నతండును నట్లు చేసెదనని కామగమనంబును నతివిస్తృతంబుగా లోహంబున నిర్మించి సౌభకంబను నామంబిడి సాల్వున కిచ్చినట్లు భాగవతము వలనఁ దెలియు చున్నది.

—భాగవతము. దశమ. ఉత్తర. 836

# వెలుఁగు చూచిన విమాన శాస్త్రములు

కొన్ని వేల సంవత్సరముల క్రితము మహర్షులచే రచింపఁబడి కాలాంతరముల వలన మఱుగునఁబడి యుండిన ప్రాచీన భారతీయ విజ్ఞాన శాస్త్ర గ్రంథములు నేఁడు వెలుఁగు చూచుచున్నవి.

భరద్వాజ మహర్షి కృత యంత్రసర్వస్వము నందలి వైమానిక ప్రకరణము బోధానందవృత్తి సహితముగా నాగరలిపిలో లిఖింపఁబడియున్న తాళపత్ర గ్రంథము పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థమున వేద శాస్త్ర పరిశోధకులచేఁ గనుఁగొనఁబడినది [1]

"నేటికి చాల భాగము నాశనమై కొద్దిభాగము లభిస్తున్న 'భారద్వాజ సంహిత' 'విమాన శాస్త్రము' (Aeronatics) ఆధారముగ 1895 సం॥రములో బొంబాయిలో ఒక పండితుఁడు శివకాంబాపూజీ తల్పదే విమానము నొకదానిని తయారుచేసి ప్రదర్శించెను. ఆ ప్రదర్శనను బరోడా మహారాజు మహాదేవ గోవింద రనడే మున్నగు వారు చూచిరి. ఆ విమానము 1500 అడుగుల ఎత్తున ఎగిరినది."[2]

---

1. చూడు :- విమానశాస్త్రము పరిచయము

"ఇటీవల మైసూరు అంతర్జాతీయ సంస్కృత పరిశోధక పరిషత్తు డైరెక్టరు గారు ప్రాచీన కాలంలో భరద్వాజ మహర్షిచే దేవనాగరలిపిలో వ్రాయబడిన వైమానిక శాస్త్రము అనుదానిని సంపాదింపఁగలిగినట్లు ప్రకటించియున్నారు." ఆ గ్రంథంలో మొత్తం 8 అధ్యాయములు, 500 సూత్రములు గలవు.

వేదశాస్త్ర పరిశోధకుఁ డయిన శ్రీ ప్రియరత్న ఆర్ష. బరోడా రాజకీయ సంస్కృత పుస్తకాలయమున శిథిలావస్థలో నున్న వైమానిక ప్రకరణమును సంపాదించి, దానిని హిందీభాషలోని కనువదించి 'విమాన శాస్త్రము' అను పేర ప్రకటించినాఁడు. దానిని పుతేటి సుబ్రహ్మణ్యాచార్యులు తెలుఁగుసేయగా మతోద్ధారక జిల్లెళ్ల వీర బ్రహ్మచార్యులు 1953 లో ప్రచురించినారు.

ఇంచుమించుగా నిదే సమయమున బ్రహ్మముని పరివ్రాజకస్వామి బరోడా నుండియు, పూనా నుండియు, ఉత్తర దక్షిణ భారతదేశము నందలి వివిధ ప్రాంతముల నుండి పెక్కుప్రతులను సంపాదించి శోధించి విశేషాంశములు కూర్పగా 'బృహద్విమాన శాస్త్రము' మొట్టమొదట 1958లో ప్రచురింపఁబడినది. సార్వదేశిక ఆర్య ప్రతినిధి సభ, న్యూఢిల్లీవారు 1977 లో బృహద్విమానశాస్త్రము ద్వితీయ ముద్రణము చేసినారు. [చూడు :- బృ.వి. భూమిక]

2. చూడు :- వేదభారతి - హిందూ యువకులచే సంకలితము - కొత్తపేట. 1975

రహస్యజ్ఞోఽధికారీ॥ —బృహద్విమానశాస్త్ర. అ. 1 సూ. 2

ఈ సూత్రమునకు బోధానంద వృత్తి యిట్లున్నది.

విమానే రచనే వ్యోమారోహణే చాలనే తథా
స్తంభనే గమనే చిత్రగతి వేగాది నిర్ణయే. 5

వైమానిక రహస్యార్థ జ్ఞానసాధన మంతరా॥ 6*

విమానమును నిర్మించుట, పైకెగురునట్లు చేయుట, నడపుట, నిలిపి యుంచుట, చిత్రగతుల నడపుట. వేగముగా నడపుట మొదలగు విమాన రహస్యములు తెలిసియున్న వాఁడే విమానమును నడుప సమర్థుఁడగును.

లల్లాచార్య కృత 'రహస్యలహరి' యను గ్రంథమునందు ద్వాత్రింశద్ రహస్యములు వివరింపఁబడినవి.

ఆ ముప్పదిరెండు రహస్యములలో మూఁడవది కృతకరహస్యము.

కృతకరహస్యోనామ :- "విశ్వకర్మ ఛాయాపురుష మనుమయాది శాస్త్రానుష్ఠాన (ను ?) ద్వారా తత్తచ్ఛక్త్యనుసంధానపూర్వకం తాత్కాలిక సంకల్పానుసారేణ విమానరచనా క్రమ రహస్యమ్॥"
—రహస్యలహరి*

విశ్వకర్మ ఛాయాపురుషుడు, మనువు, మయుఁడు మొదలగు శిల్పాచార్యులచే రచింపఁబడిన శాస్త్రముల ననుష్ఠించుట ద్వారా ఆయా శక్తుల ననుసంధించి, యంత్రోపయంత్రముల నమర్చి విమానములను నిర్మించు విధానము తెలిసికొనవలయును. ఇది కృతకరహస్యము.

అద్భుత మయిన దేవయానములను, పుష్పక సౌంభకాది విచిత్ర విమానములను నిర్మించిన విశ్వకర్మమయాది శిల్పాచార్యులు శాస్త్ర గ్రంథములు రచించి శిల్పవిజ్ఞానమునే కాక విమాన విద్యారహస్యములను గూడ లోకమున కందించిన విజ్ఞానవేత్తలని తెలియుచున్నది.

అట్టి యెడ భారతీయ శిల్పాచార్యులు విమానములు నిర్మించినారనుటలో నబ్బురమేమున్నది.

---

* చూడు :- బృహద్విమానశాస్త్ర : భరద్వాజప్రణీతము. [హిందీ] 1877
సంపాదకుడు; భాషానువాదకుఁడు : స్వామీ బ్రహ్మముని పరివ్రాజక.

# విమానములు : విచిత్రగతులు

విద్యుచ్ఛక్తి నుపయోగించి విమానములను పెక్కుగతుల నడపించు విధానము ప్రాచీన భారతీయవైమానికులకుఁ దెలియును.[1]

'సౌదామనీకల' యను గ్రంథమునందు విమానములను చిత్ర విచిత్ర గతుల నడపించుటకుపయుక్తమగు పండ్రెండు విధములయిన విద్యుచ్ఛక్తులు పేర్కొనబడినవి.

విమానగతివై చిత్ర ప్రభేదా ద్వాదశస్మృతాః
తత్ క్రియాకరణే విద్యుచ్ఛక్త్యయ స్తావదేవ చ॥
చలనా కంపనాచోర్ధ్వా అధరా మండలా తథా
వేగినీ అనులోమా చ తిర్యంచీ చ పరాఙ్ముఖీ॥
విలోమా స్తంభనా చిత్రా చేతి ద్వాదశ శక్తయః ॥

—సౌదామనీకల*

విమానాంతర్భాగమున వివిధయంత్రములతో పాటు రాసాయనిక విద్యుదుత్పాదక యంత్రమును సకీలముగా స్థాపింతురు.

ఒక్కొకరకమైన కీలు త్రిప్పుట వలన [లేక నొక్కుటవలన] ఒక్కొక విధమయిన విద్యుచ్ఛక్తి యుద్భవించి, తత్ప్రభావాను సారముగా విమానము తిరుగుచుండును.

చలనా విద్యుచ్ఛక్తి వలన విమానము కదలును, కంపన వలన కంపించును, ఊర్ధ్వాశక్తి వలన విమానము పైకిపోవును, అధర వలన క్రిందిని దిగును. మండలా విద్యుచ్ఛక్తి వలన విమానము మండలాకారముగా తిరుగును, వేగిని వలన విచిత్రగతులతో నడచును. అనులోమా విద్యుచ్ఛక్తి వలన విమానము కుడిప్రక్కను నడచును, విలోమాశక్తి వలన ఎడమ ప్రక్కకు నడచును. తిర్యంచీ విద్యుచ్ఛక్తి వలన విమాన మడ్డముగా నడచును, పరాఙ్ముఖి వలన వెనుకకుఁదిరుగును. స్తంభనా విద్యుత్ వలన విమాన మంతరిక్షమునందు నిలిచిపోవును, చిత్ర విద్యుచ్ఛక్తి వలన విమానము నానావిధ గతులతో తిరుగును.

---

1 చూడు :- ఖూల్ చంద్ శర్మా : పుష్పక విమాన్. పుట, 13,
శిల్పశాస్త్రి ప్రకాశన్ భండార్ ఢిల్లీ, సం. 2008 వి. [క్రీ శ. 1952]

* చూడు :- భరద్వాజ : బృహద్విమానశాస్త్ర. సం. బ్రహ్మముని పరివ్రాజక —పుట. 72

స్తంభనా విద్యుచ్ఛక్తిని గూర్చి శ్రీ రాణీ శ్రీనివాసశాస్త్రిగారిట్లు వ్రాసినారు.

"పూర్వకాలములో దేవతలు గంధర్వులు విద్యాధరులు మొదలగువారు రామరావణ యుద్ధమునందు, భారతములోని కురుపాండవ యుద్ధమునందు... విశిష్టవివాహములందు ఆకాశమున లక్షలాది విమానములతో వచ్చి ఈ స్తంభనా విద్యుత్ప్రభావము వలననే కదలకుండఁగా అంతరిక్షములో విమానములనాపి యథేచ్ఛగా చూచుచుండెడివారు."[1]

చిత్రిణీ విద్యుచ్ఛక్తి యొక్కటే విమానము నందలి ముప్పదిరెండు యంత్రముల పనులు చేయుగలదని స్ఫోటాయనాచార్యుడు చెప్పినాఁడు.

చిత్రిణ్యేవేతి స్ఫోటాయనః ॥ —బృ. వి. అ. 4 సూ. 3

వైమానిక గతివైచిత్ర్యాది ద్వాత్రింశతిక్రియా యోగే
ఏకైవ చిత్రిణీశక్త్యలమితి శాస్త్రే వినిర్మితం భవతి
ఇత్యనుభవత శ్శాస్త్రాచ్చమన్యతే స్ఫోటాయనాచార్యః ॥
—శక్తిసర్వస్వము*

రామాయణ మహాభారతము లందు వర్ణింపఁబడిన విచిత్రవిమానములు - అంతరిక్షయానములు - కవులయూహజనితములే యని యాధునికవిమర్శకులు కొందఱు భావించుచున్నారు. కాని వీరి వాదన సరియైనది కాదనియు ప్రాచీన కాలమున భారతీయుల కంతరిక్షయానములు నిర్మించు విధానము తెలియు ననియు రష్యన్ శాస్త్రజ్ఞులు తమ పరిశోధనలతో నిరూపించియున్నారు.[1]

---

1. చూడు :- రాణీ శ్రీనివాసశాస్త్రి : భారతీయ ప్రాచీన విజ్ఞానము. (4) భరద్వాజమహర్షి కృత విమాన విద్యా విశేషములు పుట. 160

* చూడు :- భరద్వాజమహర్షి - బృహద్విమానశాస్త్ర - పుట. 74
సం. బ్రహ్మముని పరివ్రాజక. 1977

2. cf :- V. Zaitsev - "TEMPLES AND SPACESHIPS" in SPUTNIK - January 1968.

"Careful research has exposed the shallowness of this argument and showed that ancients did know a science of making 'flying objects' (Whether we call them areoplanes, Space ships or Space crafts or flying saucers does not matter."

Quoted by E - Vedavyas : HINDUISM in SPACE AGE. —P. 588.

## పరిశోధకుల ప్రశంసలు

"వేలాది సంవత్సరాల పూర్వం భారతదేశంలో ఒక మహోన్నత నాగరికత, మహోన్నత సంస్కృతి పరిఢవిల్లినవని, ఆనాటి ప్రజలు మహాజ్ఞానవంతులని ఎన్నో అద్భుతమైన శాస్త్రీయ పరికరాలు నిర్మించారని వాటిలో పుష్పక విమానములు పరమాద్భుతమైన ఆకాశ నౌక లని వాటి సహాయంతో ఆనాటి ప్రజలు సూర్య చంద్రాదిలోకాలకు వెళ్లడం సంభవమయిందనీ ఒక ఇటాలియన్ శాస్త్రవేత్త వెల్లడించారు."*

1989 అక్టోబరులో బెంగుళూరులో రోదసిపై జరిగిన ప్రపంచ మహాసభలలో ప్రసంగించిన ఆ ఇటాలియన్ శాస్త్రవేత్త రాబర్ట్ పినోటీ భారతీయ అంతరిక్షయాన చరిత్రను సర్వసమగ్రంగా అధ్యయనం చేశారు.

"విమానాలు నడపడంలో 32 రహస్యాలు ఉన్నట్లు[1] ఆయన అనేక గ్రంథాలు ఉటంకించారు. వాటిలో కొన్ని నేడు శాస్త్రవేత్తలు ఉపయోగిస్తున్న రాడార్ సౌరశక్తి ఛాయాగ్రహణం పోలి ఉన్నాయని ఆయన అన్నారు."

"భారతీయ గ్రంథం వైమానికశాస్త్రం లోని శ్లోకాలను ఉటంకిస్తూ శ్రీ పినోటీ సౌమ్య సౌండాలక మౌర్త్విక అనే ఉష్ణాన్ని తట్టుకోగల ప్రత్యేక లోహాలనుండి[2] ప్రాచీన విమానాలు తయారు చేసేవారని చెప్పారు.

---

* చూడు :- ఆంధ్రప్రభ దినపత్రిక, శనివారం 15-10-1989. విజయనగరం
వార్త : అక్టోబరు 14 బెంగుళూరు "భూమిరహస్యాలన్నీ శోధిస్తాం"

1. చూడు :- బృహద్విమానశాస్త్ర : పుటలు. 7-18

2. చూడు :- అదే.... లోహాధికరణమ్॥ పు. 34-49
విమాన లోహములు :

1) ...."సౌమ సౌండాలక మౌర్త్వికాశ్చేతి ఏతత్ సంమేలనా దూష్మపా
షోడశధా భవంతి తే వైమానికా ఇతి॥" శౌనకః

2) సౌమ సౌండాల మౌర్త్విక వంశజా బీజలోహకాః
తత్సంయోకాత్సముత్పన్నా ఊష్మపా ఇతి కీర్తితాః॥
తథైవ వ్యోమయానాంగ రచనా నాన్యథా భవేత్॥ —సాంబః

3) విమానార్హాణి లోహాని భారహీనాని షోడశ॥ —మాణిభద్రః

"విమానాలపై 7 రకాల దర్పణాల [భూతద్దాల] నమర్చేవారనీ[1] వాటిని ఆత్మ రక్షణకు శత్రు విధ్వంసానికి కూడా ఉపయోగించే వారనీ అయన [శ్రీ పినోటీ] చెప్పారు."

'పింజలా దర్పణం రథ సారథులను దుష్టకిరణాలనుండి కాపాడుతుంది.'

"శత్రువిమానాలపై పూర్వీకులు ప్రయోగించిన 'మారిక' అస్త్రం ఈనాడు మనం ఉపయోగించే లేజర్ అస్త్రంకన్నా విభిన్నమైనది కాదని ఆయన అన్నారు"

"అంతరిక్ష యాత్రలు, మహాస్త్రాలు, విమానాలు గూర్చి పురాణాలలో చిత్రించిన తీరు ఆలోచిస్తే భారతదేశానికి మహోన్నత నాగరికత వుండేదని అర్థం చేసుకోవచ్చుననీ కాని అది విస్మృతిలో పడిందని ఆయన అన్నారు ఈ విషయాలు దృష్టిలో పెట్టుకొని హిందూ గ్రంథాలను పరిశీలించాలని పుష్పక విమానాలను గొప్ప శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించాలని ఆయన [శ్రీ పినోటీ] కోరారు"

ప్రాచీన భారతీయ శిల్పర్షుల విమానశాస్త్ర విజ్ఞానమును ప్రపంచమునకుఁ జాటిచెప్పిన ఇటాలియన్ శాస్త్రవేత్త శ్రీ రాబర్ట్ పినోటీ అభినందనీయుఁడు.

---

1 చూడు :- బృహద్విమానశాస్త్రి : తృతీయాధ్యాయమ్
దర్పణాధికరణమ్. పుటలు. 56-68

విమానములందు మర్చుటకు ఏడు విధములైన యాన దర్పణములు గలవు.

1) విశ్వక్రియా 2) శక్త్యాకర్షణము 3) వైరూప్యము 4) కుంఠిణీ 5) పింజలా 6) గుహాగర్భ 7) రౌద్రీ.

ఇందు పింజలా దర్పణము రథసారథుల కంటి నల్లగ్రుడ్డు నందలి పాపలోని తేజస్సు నపహరింపఁగల పింజలా విషశక్తి వి హరించును.

రౌద్రీ దర్పణము వలన జనించు 'మారికా' అను విషశక్తి చూచినంతనే శత్రు విమానములు నశింపఁగలవు.

భరద్వాజ మహర్షి కృత వైమానిక ప్రకరణమునకు పూర్వము 1 నారాయణాచార్య కృత విమాన చంద్రిక 2) శౌనక కృత వ్యోమయాన తంత్రము 3) గర్గ కృత కల్పయంత్రము 4) వాచస్పతి కృత యానబిందు 5) చాక్రాయణ కృత ఖేటయాన ప్రదీపిక 6) ధుండినాథ కృత వ్యోమయానార్క ప్రకాశము - అను నారు విమానశాస్త్ర గ్రంథము లున్నవి.

## వింతలు : విశేషములు

విమానం ప్రజ్వలద్ భాసా స్థితం పరివరమంబరే॥

—వ్యా. భా. భీష్మ. 65-43

పూర్వ మొకప్పుడు, మానస సరస్సు నుత్తర పర్వతంబు నగ్రప్రదేశంబున దేవతాముని గంధర్వాప్సరోగణంబులు గొలువం గొలువుండి కమలసంభవుండు,

మణిగణోజ్జ్వలమైన విమానమొకటి యంబరంబునఁ గాంచి
సర్వాత్ముఁ డందు సన్నిహితుఁడగు టెఱిఁగి
హర్షంబు సంభ్రమంబుఁ దలకొన లేచి నమస్కరించి.

యా విశ్వేశ్వరునితో ధరణీభారము వాపు విషయమై మాటాడినాఁడు.

—తిక్కన. భీష్మ. 2-262-9

వియత్తలమున నిలిచిన విమానమునందున్న విష్ణుమూర్తితో గంధమాదన పర్వతమ్మునఁ గొలువుండిన బ్రహ్మదేవుఁడు సంభాషించుట వింతలలో వింతగా నున్నది.

అనంతరము కొంతకాలమునకు కురుక్షేత్ర సంగ్రామము జరిగినది.

"బృందారక ప్రముఖ దేవయోనులును దివంబున నున్న పురాతన ధరారమణులును భారతరణంబుఁ గనుంగొను కుతూహలంబున వివిధ విమానారూఢులై యేతెంచిరి."

—తిక్కన. భీష్మ. 1-103

దేవతా విమానములను నిర్మించిన శిల్పాచార్యుఁడు ప్రభాస వసు పుత్రుండైన విశ్వకర్మ.

ఆ విశ్వకర్మనిర్మిత దేవవిమానుండు నిఖిల దివ్యాభరణ
శ్రీ విరచిత పరితోషితదేవుఁడు శిల్పప్రజాపతియునై నెగడెన్॥

—నన్నయ. ఆది. 3-68

విజ్ఞానవేత్త లింకను పరిశోధనలు చేసి వేదశాస్త్ర పురాణేతిహాసములందలి విమానవిద్యారహస్యములను వెల్లడింతురు గాక.



# రథశిల్ప సమీక్షణము

వేదకాలము నుండియు విఖ్యాతిగాంచిన రథశిల్పము మహాభారత కాలమున మిక్కిలి యభివృద్ధి చెందినది.

రథ శబ్దము భూజలాంతరిక్షయానముల కుపలక్షణము.

మహాభారతమునందీ త్రివిధయానముల వర్ణనము లున్నవి.

మహాభారతకాలము నాటి రథశిల్ప ప్రాచుర్యమును రథకారుల ప్రాశస్త్యమును తెలుపుటకు కురుక్షేత్ర సంగ్రామమునం దుపయోగింపఁ బడిన రథసంఖ్యయే చాలును.

ఆ కాలమున ప్రజలు పడవలపయి, యంత్రయుక్తములైన నౌకలపై జలప్రయాణములు చేయుచుండిరి. సముద్రయానము గూడ నున్నట్లు తెలియుచున్నది.

లోథెల్ అనుచోట 'మొహెంబొదారో హరప్పా సంస్కృతి' కాలము నాటి నౌకాశ్రయము కనుగొనఁ బడినది.

మహాభారతకాలమునం దంతరిక్షయానములున్నవా ? యని మన పూర్వుల ప్రజ్ఞావిశేషములను సంశయించు నట్టి బుద్ధిమంతులు కొంత ఆశ్చర్య పడు చుందురు.

ఇంద్రకుబేరాదులు విమానములందు సంచరించుచున్నట్లును విశ్వకర్మాదులు విమానములను నిర్మించుచున్నట్లును వ్యాస వాల్మీకులు సాక్ష్య మిచ్చుచుండఁగా పాశ్చాత్య పరిశోధకు లంగీకరించుచుండఁగా కాదనుటకు మనమెవ్వరము ?

రథ నౌకా విమాన రచనావిశేషములు రథకార బ్రాహ్మణుల శిల్పకళానైపుణ్యమునకు నిదర్శనములు.

నమస్తక్షభ్యో రథకారేభ్యశ్చవో నమః ॥



# శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము

## సప్తమోన్మేషము

# యంత్ర శిల్పము

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥

—భగవద్గీత*

ఓ అర్జునా! సూత్రధారుఁడు తన శిల్పచమత్కృతితో యంత్రాధిష్ఠితములైన కొయ్యబొమ్మల నాడించునట్లు పరమేశ్వరుఁడు తన మాయచేత సర్వప్రాణుల హృదయము లందు నిలిచి యెల్లర నాడించుచున్నాఁడు.

ఇట భగవల్లీల దారుశిల్పి కళాకౌశలముతో పోల్పఁబడినది.

పరమేశ్వరుఁడు, 'సంసారచక్ర క్రియా యంత్రవాహుఁడు.'

—నన్నయ. అరణ్య. 1.324

---

* చూడు :- వ్యా. భా. భీష్మ. 42-41 - హిందీటీకా సహితము - గోరఖ్‌మీర్ ప్రతి

"భ్రామయన్ భ్రమణం కారయన్ సర్వభూతాని యంత్రారూఢాని
యంత్రాణ్యారూఢాన్యధిష్ఠితాని మాయయావేతి ఇవ శబ్దో ద్రష్టవ్యః
యథా దారుకృతాపురుషాదీని యంత్రాణి మాయయా ఛద్మనా భ్రామయన్
తిష్ఠతీతి సంబంధః॥ —శంకర భాష్యము.

త్వష్టృకృతమైన యంత్రము తదధీనమై యుండు నట్లు మాయామయ జగత్తంతయు కాలకీలితకర్మాధీనమై యుండునని మఱియొకచోట చెప్పఁబడినది.

త్వష్ట్రేవ విహితం యంత్రం యథా చేష్టయితు ర్వశే
కర్మణా కాలయుక్తేన తథేదం చేష్టతే జగత్॥

—వ్యా. భా. శాంతి. 33-22

ఈ శ్లోకమునకు తిక్కన తెనిగింపు ఇట్లున్నది -

నేర్పరి పెక్కువిధంబుల నార్పగ బొమ్మలు కడంగి యాడెడు చందం
బేర్పడ గాన్పము కార్యసమర్పితకార్య కరులైన మానవుల దెసన్॥

—తిక్కన. శాంతి. 1-283

త్వష్ట యన దారుశిల్పి. విశ్వకర్మ.

'త్వష్ట' శిల్పకళాచతురుఁడు కావున తిక్కన నేర్పరి యని యనువదించినాఁడు నేర్పరి యన శిల్పకళలందు నేర్పరి.

త్వష్ట యన లుహార్ [లోహకారుడు - యంత్రశిల్పి] అని హిందీ మహాభారతకర్త యనువదించినాఁడు.1

## కాలచక్రము

చతుర్వింశతిపర్వ త్వాం షణ్ణాభి ద్వాదశప్రధి
తత్ త్రిషష్టి శతారం వై చక్రం పాతు సదాగతి॥

—వ్యా. భా. వన. 133-25

ఇరువదినాలుగు పర్వములు, పండ్రెండు ప్రధులు, ఆరు నాభులు మున్నూటయరువది అరలు గల కాలచక్రము నిన్ను రక్షించుగాక యని యష్టావక్రుఁడు జనకమహారాజు నాశీర్వదించినాఁడు.

24 పక్షములు, 12 మాసములు, 6 ఋతువులు, 360 దినములు గల సంవత్సరాత్మకచక్రమే కాలచక్రము

---

* చూడు :- వ్యా భా. హిందీ అనువాదము - గోరఖ్‌పూరు ప్రతి.

"జైసే లోహార్ యా బఢయీ కా బనాయా హుఆ యంత్ర సదా ఉస్‌కే చాలక్ కే అధీన్ రహ్‌తా హై ఉసీ ప్రకార్ యహ్ సారా జగత్ కాలయుక్త కర్మకీ ప్రేరణాసే హీ న చేష్ట హో రహా హై॥"

1 చూడు :- చతుర్వేదీ ద్వారకా ప్రసాద్‌శర్మ : హిందీమహాభారతము. ప్ర. 118

## ద్వాదశార చక్రము

ఉపమన్యుఁ డొనరించిన యశ్వినీదేవతాస్తోత్రము నందు జ్యోతిశ్చక్ర ప్రశంస గలదు. నన్నయ యేలనో దాని ననువదింపలేదు.

ఏకాం నాభిం సప్తశతా అరాః శ్రితాః ప్రధిష్వన్యా వింశతి రర్పితా అరాః
అనేమిచక్రం పరివర్తతేఽజరం మాయా అశ్వినౌ సమనక్తి చర్షణీః॥
ఏకాం చక్రం వర్తతే ద్వాదశారం షణ్ణాభిమేకాక్ష మృతస్యధారణమ్
యస్మిన్దేవా అధివిశ్వేవిషక్తా స్తావశ్వినౌ ముంచతం మా విషీదతమ్॥
—వ్యా. భా. ఆది. 3-61, 6

ఈ శ్లోకార్థమును వివరించుచు నీలకంఠుఁడు 'ద్వాదశప్రధయశ్చక్రమితి శ్రుతేః' అను ఋగ్వేదమంత్రము నుటంకించినాఁడు.

ద్వాదశప్రధయ శ్చక్రమేకం త్రీణి నభ్యాని క ఉ తచ్చికేత
తస్మిన్త్సాకం త్రిశతా న శంకవోఽర్పితాః షష్టిర్ న చలాచలాసః॥
—ఋగ్వేద 1-164-48

ఈ మంత్రము శిల్ప విషయకమైనదని శ్రీ దయానంద సరస్వతి భావించినారు.*

[ద్వాదయ ప్రధయః] ఆ యానములలో సర్వకలాయుక్తములగు నరలు ధరించుటకు పండ్రెండు ప్రథ లుండవలెను.

[చక్రమేకం] వాని మధ్య సర్వయంత్రములను ద్రిప్పుట కొక చక్రము నిర్మింపవలెను.

[త్రీణీ నభ్యాని] మధ్యలో మధ్యావయవములను బట్టి యుంచుటకు మూఁడు యంత్రములు నిర్మింపవలెను.

[సాకం త్రిశతా] వానిలో మూఁడు వందలు [శంకవోఽర్పితాః] యంత్రపు మరలు చేసి కూర్పవలెను. అవి [చలాచలాసః] యానము నడపుటకు నాపుటకు వీలుగా నుండవలెను.

[షష్టిః[ అరువది యంత్రపు మరలు [కలాయంత్రములు] కూడా దాని యందేర్పరచవలెను. ఆ యంత్రమున నివియన్నియుఁ జేయవలెను.

[క ఉ తచ్చికేత] ఈ కార్యము సంతతి నెవరెరుగుదురు ? [న] అందరు నెఱుగరు ఈ విద్యలో నిపుణులైన వారే యెఱుగుదురు.

---

* చూడు :- దయానంద సరస్వతి : వేదతత్వ ప్రకాశిక ప్ర. గోపదేవ్ - పుట. 318-19

# యంత్ర చక్రము

జ్వలనార్కప్రభం ఘోరం ఛేదనం సోమహారిణా
ఘోరరూపం తదత్యర్థం యంత్రం వై దేవనిర్మితమ్॥

—వ్యా. భా. ఆది 33.5

సోమరక్షకులైన నిర్జర వరుల నెల్ల నిర్జించి యూర్జితుండై గరుడుం డమృత స్థానంబున కరిగి... తీక్ష్ణధారంబై దేవనిర్మితంబై పరిభ్రమించుచున్న యంత్రచక్రంబు నరాంతరంబునాసంక్షిప్త దేహుండయి" చొచ్చినట్లు నన్నయ వర్ణించినాఁడు. — [నన్న య. ఆది. 2-102]

కాని యీ యంత్ర మెట్లుండునో దేనితోఁ జేయఁబడినదో నన్నయ చెప్పలేదు.

దేవనిర్మితమైన యీ యంత్రము లోహ నిర్మిత మనియు, ఘోరరూపము గలిగి జ్వలనార్కప్రభలతో సోమాపహర్తలను ఛేదింపఁజాలిన దనియు వ్యాస భారతమునందు వర్ణింపఁబడినది.

సచక్రం క్షురపర్యంత మపశ్య దమృతాంతికే
పరిభ్రమంత మనిశం తీక్ష్ణధార మయస్మయమ్॥

—వ్యా. భా ఆ. 33.4

చక్ర మనఁగా కదంబముకుళములవంటి వేయి కత్తులు గల యంత్ర మనియు నందు చిక్కువడిన యీఁగయైనను వేయి ముక్కలయి పోవు ననియు నీలకంఠుఁడు వివరించినాఁడు.[1]

గరుడునకా చక్రముక్రింద రెండు భయంకర సర్పములు గనిపించినవి.

---

1 చూడు :- వ్యా. భా. ఆది. 33-2 చిత్రశాలాప్రతి. పు. 81

చక్రం యంత్రం క్షురపర్యంతం సమంతతః కదంబ ముకులవత్
క్షురసహస్రయుతమ్ చక్రవద్వేగేన బంభ్రామ్యమానమ్
యత్ర ప్రవిష్టో మశకోఽపి సహస్రధా ఛిద్యతే
పరిభ్రమంత మితి పుంస్త్వమార్షమ్ అయస్మయమ్ లోహమయమ్॥

—నీలకంఠ

" And he (Garuda) saw placed near the Soma a wheel of Steel, keen edged and sharp as the razor revolving incessantly "

ఘోరవికార సన్నిహిత కోపముఖంబులు దీప్తవిద్యుదు
ల్కారుణ దారుణాక్షములునై నిజదృష్టివిషాగ్ని నన్యులం
జేరఁగ నీక యేర్చుచుఁ బ్రసిద్ధముగా నమృతంబుచుట్టు ర
క్షారతి నున్న యుగ్రభుజగంబుల రెంటిని గాంచి చెచ్చరన్॥

—నన్నయ. ఆది. 2-203

ఆ సర్పముల నేత్రములు విద్యుదుల్కారుణ దారణము లని నన్నయ వర్ణించినాఁడు. ఈ వర్ణనము మూలమునకు భిన్నముగా నున్నది.

విద్యుత్ప్రవాహములా భుజగముల జిహ్వలయందున్న వనియు, నిప్పులు గ్రక్కు వాని కనులయందు విషమున్న దనియు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

అధ చైశ్చక్రస్య వాత్ర దీప్తానలసమద్యుతీ
విద్యుజ్జిహ్వౌ మహావీర్యౌ దీప్తాస్యౌ దీప్తలోచనౌ
చక్షుర్విషౌ మహాఘోరౌ నిత్యం క్రుద్ధౌ తరస్వినౌ
రక్షార్థ మేవామృతస్య దదర్శ భుజగోత్తమౌ॥

—వ్యా. భా ఆది. 33-5, 6

ఇవి సజీవసర్పములా ? అమృతాపహారుల నడలగొట్టుట కా చక్రయంత్రమునం దమర్పఁబడిన కృత్రిమ భుజంగములా ?

సజీవములైనచో తీక్ష్ణధారాయుక్త సహస్రారచక్ర నిరంతర పరిభ్రమణ తీవ్రతకు నిలువనేర్చువా ?

దందశూకములకు విషము దంష్ట్రల యందుండును గాని చక్షువు లందుండునా ? జిహ్వగముగల జిహ్వలయందు విద్యుత్ప్రవాహములుండునా ?

లోకములో నిట్టి విపరీతప్రకృతిగల పన్నగములెందేని గలవా ?

అవి అమృతరక్షణార్థము యంత్రచక్రాంతర్భాగముగా సజీవ సర్పభ్రాంతి గలుగునట్లు దేవశిల్పిచేఁ గల్పింపఁబడిన విచిత్రవిషధరాకృతులే కాని నిజమైన భుజంగములు గావు ఇది నిర్జీవ యంత్రమున కుదాహరణము.

ఈ యంత్రము దేవనిర్మింతమని చెప్పఁబడినది. దేవతలలో యంత్ర నిర్మాతయెవరు ? దేవశిల్పి విశ్వకర్మయే కదా !

గరుడుఁ డీ యంత్రమును భగ్నము చేసి యమృతకలశముగొని గగనంబున కెగసినాఁడు. ఉత్పపాత జవేనైవ యంత్రమున్మథ్య వీర్యవాన్.

—వ్యా. భా. ఆది. 33-10

విశ్వకర్మకృత మయిన యంత్రశిల్ప మాధారముగా రచింపఁబడిన శిల్ప శాస్త్ర గ్రంథములలో నిట్టి చిత్రయంత్ర నిర్మాణ రహస్యములు తెలుపఁబడినవి.

రాత్రులు రాజప్రాసాదములందు ప్రవేశించు చోరులను బరిమార్చుటకు తద్వారములందు దండ ఖడ్గముద్గరకుంతాద్యా యుధములను కరముల యందు ధరించిన దారు పురుషాకృతుల నేర్పాటు చేయవచ్చునని సమరాంగణ సూత్రధార మను శిల్ప గ్రంథము నందు చెప్పఁబడినది.

పుంసో దారుజ మూర్ధ్వం రూపం కృత్వా నికేతన ద్వారి
తత్కరయోజితదండం నిరుణద్ధి ప్రవిశతాం వర్మ
ఖడ్గ హస్త మథ ముద్గరహస్తం కుంతహస్త మథవా యది తత్ స్యాత్
తన్నిహంతి విశతో నిశి చౌరాన్ ద్వారి సంవృతముఖం ప్రసభేన॥*

ఈ యంత్ర విధానమునందు చెప్పఁబడిన యంత్రములలో కొన్నియైనను యథార్థములై యుండుననియు, విమానాదులు కొన్ని బహుశః ఊహాజనితములై యుండవచ్చు ననియు వి. యస్. అగ్రవాలా అభిప్రాయ పడినాఁడు.[1]

పూర్వ కాలమున రాజ ప్రాసాదరక్షణార్థ మిట్టి యంత్రపుత్రిక లుపయోగింపఁబడు చుండినట్లు తెలియుచున్నది.[2]

---

* చూడు :- భోజః సమరాంగణసూత్రధారః యంత్రవిధానమ్. 31 అ. శ్లో. 106-7
గమక్‌వాడ్ ఓరియంటల్ సిరీజ్. 25 - ఓరియంటల్ ఇనిస్టిట్యూట్ - బరోడా 1966
సమరాంగణ సూత్రధార గ్రంథకర్త భోజుఁడు కాదనియు
తదాస్థాన సూత్రధారుఁడగు సమరాంగణుఁడే యనియు
నొక యభిప్రాయము గలదు.

1. Cf :- V. S. Agrawala : Introduction to SAMARANGANA SUTRADHARAHA. P. XVI

'**Yanthra Vidhana**' deals with a number of mechanical contrivances, some of which at least seem to have been a fact of life, others perhaps imaginary like the flying planes."

2. Cf :- Dr. V. Raghavan : Yantras and Mechanical Contrivances in Ancient India - P. 26.

also D. N. SUKLA : SILPA SASTRA - HINDU ACHIEVEMENTS in Aeronautics and Fine Arts. P P. 42, 43

## కృత్రిమంబయిన భాసము

కృత్రిమం భాస మారోప్య వృక్షాగ్రే శిల్పిభిః కృతమ్॥
—వ్యా. భా. ఆది 132.68*

అస్త్రవిద్యాపరీక్ష సేయ నెంచిన ద్రోణాచార్యుఁడు, "కృత్రిమంబయిన భాసం బను పక్షి నొక్క వృక్షశాలాగ్రంబున లక్ష్యంబుగా రచియించి దాని నందఱకుం జూపి మీమీ ధనువుల బాణంబులు సంధించి నా పంచినయప్పుడ యప్పక్షి తలఁదెగ వేయుం డే నొకళ్లొకళ్లన పంచెద" నని చెప్పెను.
—నన్నయ, ఆది. 5-284

ఈ కృత్రిమ పక్షి శిల్పుల చేఁ జేయఁబడినది. [శిల్పిభిః కృతం]

ఈ విషయము నన్నయ చెప్పలేదు.

ఈ పరీక్షలో నర్జునుఁడు నెగ్గెను. "ఇట్లశ్రమంబునఁ గృత్రిమపక్షితలఁ దెగవేసిన యర్జును నచలితదృష్టి లక్ష్యవేధిత్వంబునకు మెచ్చి ద్రోణుం డాతనికి ధనుర్వేద రహస్యంబు లుపదేశించె" —నన్నయ. ఆది. 5-254

ద్రోణుఁడాంగిరసకులశ్రేష్ఠుఁడు. "అంగిరసాం వరః" [ఆది. 132-71][1]

## లోహ వరాహము

అస్త్ర విద్యా ప్రదర్శన రంగమునం దర్జునుఁడు, "పాఱెడు సింహ వ్యాఘ్ర వరాహాది మృగంబులం దొక్కొక్క యమ్మేసి నట్ల యేనేసి యమ్ము లతిలాఘవంబున నేసి...... యట్లస్త్రవిద్యా వైచిత్ర్యంబు మెఱసి" నట్లు నన్నయ వ్రాసినాఁడు. —ఆది. 6-28

ఈ మృగములు లోహమయములు.

భ్రమతశ్చ వరాహస్య లోహస్య ప్రముఖే సమమ్॥—వ్యా. భా ఆది. 135-23

లోహముతో పశుపక్ష్యాది వివిధాకృతులు చేయువారు లోహకారులు.

---

* భాసమ్ - సిలపక్షం పక్షిణం శకుంత మిత్యన్యేగృధ్ర మిత్యపరే॥ —నీలకంఠ

1 చూడు :- శ్రీ మహాభారతము - గోరఖ్‌పూరు ప్రతి.

"ఉన్‌హోంనే కారీగరోం సే ఏక్ నకలీ గీధ్ బన్వాకర్
వృక్షకే అగ్రభాగ్ పర్ రఖ్ దియా॥"

# మత్స్యయంత్రము

యంత్రం వైహాయసం చాపి కారయామాస కృత్రిమమ్
తేన యంత్రేణ సమితం రాజా లక్ష్యం చకారమే॥

—వ్యా. భా ఆది. 185-10*

మహాభారతకాలమున క్షత్రియ కుమారుల విద్యాబల ప్రదర్శనమునకు స్వయంవర రంగములును రంగస్థలములుగా నుండెడివి.

ద్రుపదమహారాజు నేటిని డెబ్బదియేనగు దినంబున ద్రౌపదీ స్వయంవర మని ఘోషింపం బంచి, యొక మత్స్యయంత్రమును జేయించినాఁడు.

ఎవ్వరికివి మోపెట్టను దివ్వను శక్యంబుగాని దృఢకార్ముకమున్
దవ్వై దివమునఁ దిరిగెడు నవ్విలనత్యనకమత్స్య యంత్రము జేసెన్॥

—నన్నయ. ఆది. 7-26*

అట్లు చేయించి ద్రుపదుఁడు, "వైహాయసంబైన వర మత్స్యయంత్రంబు నివ్విల్లు మోపెట్టి యెవ్వఁ డేను శరముల నేయు నశ్రమమున నఁతడు నా తనయకు వరుఁడగు ధర్మయుక్తి" నని ప్రకటించినాడు. —నన్నయ. ఆది. 7-166

అర్జునుఁ డే నమ్ముల నా మత్స్య యంత్రము నురులనేసెను.

అంతరిక్షము నందుఁదిరుగు యంత్రము నందలి మత్స్య ప్రతిబింబమును నేలపైఁ గల జలపాత్రలోఁ జూచుచు లక్ష్యమును భేదింప వలయును.[1]

యంత్రము సాధారణముగ నయోమయమై యుండును. అది పైని నిలుచుట కాధారభూతమైన స్తంభము దారుమయమో లోహ మయమోయై యుండును. జలపాత్రము మృణ్మయము గాని దారుమయము గాని లోహ మయముగాని కావచ్చును. మత్స్యము కనక మయము గావున జలపాత్రయు స్వర్ణమయము కావచ్చును.

కావున నీ మత్స్యయంత్ర నిర్మాణమున కర్మారులు, దారుశిల్పులు స్వర్ణకారులు తమ తమ ప్రజ్ఞావిశేషములు చూపవలసి యుండును.

---

Cf. :- Dr. Raghavan : Yantras or Mechanical Contrivances in Ancient India. P-3 "In Maha Bharata we hear of the Matsya Yantra or revolving wheel with a fish......"

1 చూడు :- శ్రీమదాంధ్ర మహాభాగవతము. దశమ. ఉత్తర. 1083

లక్షణ జనకుఁడైన మద్రపతి, "చదల నెప్పంగి నైన గోచరము గాక వారిమధ్యములో నభిన్నాప్తిఁ దోఁచు మత్స్యయంత్రమును" గల్పించినాఁడు.

# రణ యజ్ఞము : ఆయుధ శిల్పము

సంగ్రామ యజ్ఞః సుమహాన్ యశ్చాన్యో యుధ్యతే నరః ॥
—వ్యా. భా. శాంతి. 98-11

క్షత్రియవీరులకు సంగ్రామ మొక యజ్ఞము వంటిది.

రణయజ్ఞ దీక్షితులయి శత్రువుల నోర్చిన వారు పుణ్యలోకముల కేగుదురు.

"అతులవిక్రమ సంపదన్ రణయజ్ఞదీక్షితులై రిపు వ్రతతి నోర్చిన వీరు లుగ్రతపంబు సేసిన వారు స ద్గతికిఁ బోదురు" —నన్నయ. సభా. 1-192

ఏ యజ్ఞంబును సంగ్రామ యజ్ఞంబునకు సదృశంబులు గావు. వినుము: వీర మస్తకరాశి వేదికగాఁ గృపాణబాణాది సాధనంబుల సమిత్ స్రుక్ స్రువంబులుగా శోణితం బాద్యంబుగా మాంసంబు పురోడాశంబుగా వీర వ్రత దీక్షితుండు సమరాధ్వరంబు సలిపి... మదీయలోకంబున నత్యుదాత్త పదవిం బ్రవర్తిల్లు"నని యింద్రుఁ డంబరీషునితోఁ జెప్పెనాఁడు.
—తిక్కన. శాంతి. 2-443

మూలమునందు ప్రాస తోమర ఖడ్గ శక్తి పరశ్వధా ద్యాయుధములు స్రుక్కులనియు, తీక్షములయిన సాయకములు స్రువము లనియు దంతపు పిడులు గల ఖడ్గాదులు స్ఫ్యములనియు విశదముగ నున్నది.

ప్రాసతోమర సంఘాతా ఖడ్గశక్తి పరశ్వథాః
జ్వలంతో నిశితాః పీతాః స్రుచ స్తస్యాథ సత్రిణః ॥ 16
చాపవేగాయతస్తీక్ష్ణః పరకాయ విభేదనః
ఋజు స్సునిశితః పీతః సాయకశ్చ స్రువో మహాన్॥ 17
ద్వీపి చర్మావనద్ధశ్చ నాగదంతికృతత్సరుః
హస్తి హస్త హరః ఖడ్గః స్ఫ్యో భవేత్తస్య సంయుగే॥ 18
—వ్యా భా. శాంతి. 98. 16-18

యజ్ఞాయుధములను సంగ్రామయజ్ఞాయుధములను చేయువారు శిల్పులే.

యుద్ధ పరికరములుచేయు శిల్పకారులకు - లోహ శిల్పులకు - సంగ్రామ యజ్ఞమునందు ప్రముఖమైన స్థాన మున్నది

# దేవాసుర సంగ్రామము

తతః ప్రివృత్తః సంగ్రామః సమీపే లవణాంభసః
సురాణా మసురాణాం చ సర్వఘోరతరో మహాన్॥
—వ్యా. భా. 19-11

గీర్వాణులు పూర్వగీర్వాణులు అమృతకలశార్థము గావించిన యుద్ధము నందు ప్రాసతోమర ఖడ్గ గదా పట్టిశ పరిఘాది ప్రహరణము లుపయోగింపఁ బడినవి.

ప్రాసాశ్చ విపులాస్తీక్ష్ణా న్యపతంత సహస్రశః
తోమరాశ్చ సుతీక్ష్ణాగ్రాః శస్త్రాణి వివిధాని చ॥
తతోఽసురాశ్చక్రభిన్నా వమంతో రుధిరం బహు
అసి శక్తి గదా రుగ్ణా నిపేతు ర్ధరణీతలే॥
ఛిన్నాని పట్టిశైశ్చైవ శిరాంసి యుధి దారుణైః
పరిఘై రాయసైస్తీక్ష్ణైః సన్నికర్షే చ ముష్టిభిః॥
—వ్యా. భా. ఆది. 19. 12-17*

ఈ యుద్ధమున నరనారాయణులు కోదండ చక్రోద్యత భుజులయి దైత్యోత్తములను దాకిరి.

'నరచాప ప్రవిముక్త దారుణ బృహన్నారాచధారల్ భయంకరదైతేయ నికాయకాయములపైఁ గప్పె'... ననియు

'...నారాయణోన్నత దోర్దండవిముక్తచక్ర నిహతిన్ నాకద్విషన్మస్తక ప్రతతుల్ ఘోరరణంబునం బడియె' ననియు

నన్నయ్య వర్ణించినాఁడు. —[ఆది. 2-23, 24]

---

* చూడు :- శ్రీ మహాభారతము - నీలకంఠ టీకా సహితము. చిత్రశాలా ప్రతి.

ప్రాసాః హస్తక్షేప్యాః క్షుద్రభల్లాః వింధ్యే కరకాడీతి ప్రసిద్ధాః
తోమరాః దీర్ఘదండాస్త ఏవా క్షేప్యాః లాటేష్వటా ఇతి ప్రసిద్ధాః
వివిధాని శస్త్రాణి యమదంష్ట్రాదీని లోకప్రసిద్ధాని జయధుడ ఇత్యాదీని॥ 12
అసిః ఖడ్గః శక్తిర్హస్తక్షేప్యో లోహదండః
ప్రధుబుధ్నో గదా సరలః స ఏవ॥ 13
పట్టిశః ఖడ్గ విశేష ఉభయతోధార స్తీక్ష్ణాగ్రః పట్ట ఇతి ప్రసిద్ధః॥ 14
పరిఘః పరితో హంతీతి తథా సర్వతః కంటకితో లోహదండః॥

## దేవతాప్రముఖుల ప్రహరణములు

తన కిష్టుడయిన తక్షకుఁడు ఖాండవ దహనాగ్నిజ్వాలల దగ్ధుం డయ్యెకా వగచి కడు నలిగి దేవేంద్రుఁడు ఘోర నిశితాశనితో కృష్ణార్జునలపై యుద్ధము చేయ నుద్యమింపఁగా దేవతలు తమ తమ యాయుధములు ధరించి యుద్ధ సన్నద్ధులైరి.

తతః సముద్యతాం దృష్ట్వా దేవేంద్రేణ మహాశనిమ్
జగృహుః సర్వశస్త్రాణి స్వాని స్వాని సురాస్తథా॥
కాలదండం యమో రాజన్ గదాం చైవ ధనేశ్వరః
పాశాంశ్చ తత్ర వరుణో విచిత్రాం చ యథాశనిమ్॥ 32
స్కందః శక్తిం సమాదాయ తస్థౌ మేరురివాచలః॥

—వ్యా భా. ఆది. 226.32, 34

దేవతలకు వివిధాయుధములు నిర్మించిన వాఁడు విశ్వకర్మయే.

"శిల్పప్రజాపతి ప్రభాకరుతేజం బతని మండలంబున షోడశాంశంబు దక్క బదియేను భాగంబులు వోవం దచ్చి యా తేజఃఖండంబుల విష్ణునికి సుదర్శనంబును జంద్రమౌళికి శూలంబును గుబేరునకు శిబికయుఁ గాలునకు దండంబును సేనానికి శక్తియు దేవగణంబుల కనేకాయుధంబులు గావించె" నని మార్కండేయ పురాణమునందు వర్ణింపఁబడినది.[1]

## బ్రహ్మనిర్మితకార్ముకములు

కృతయుగమున నిష్ఠాగరిష్ఠుఁడై తపమొనరించుచున్న కణ్వమహాముని తనువుపైఁ బెరిగిన పుట్టమీఁద పుట్టి యసాధారణముగా పెరిగిన వెదురు గడతో

"బ్రహ్మ జగద్ధితము గోరి చేసె నాకు విష్ణునకుఁ బినాక శార్ఙ్గము లగ్ర ఖండమున నొలర్చె గాండివంబు"

అని శివుఁడు పార్వతికిఁ జెప్పెను. —తిక్కన. అనుశాసనిక. 4.429

ధనుర్బాణములు చేయుట శిల్పవిషయము గనుక ఇట బ్రహ్మయన శిల్ప ప్రజాపతి యని చెప్పుకొన వచ్చును.

---

1 చూడు :- మారన - మార్కండేయ పురాణము. 7-127 [మూలము. 7. 17-19]
పోల్చు :- పద్మపురాణ. సృష్టిఖండ. అ. 8. 63-68

# సుదర్శన చక్రము

వజ్రనాభం తత శ్చక్రం దదౌ కృష్ణాయ పావకః
ఆగ్నేయ మస్త్రం దయితం స చ కల్యోఽభవత్తదా॥
—వ్యా భా. ఆది. 225. 23, 24*

అగ్నిదేవుని కోరికపై వరుణుఁడు,

"సహస్రకర సహస్రదుస్సహ మహః పటలభాసురం బగుచు దేవ దైత్య దానవ యక్ష రాక్షస పిశాచోరగ ప్రాశనంబయి వెలుగుచున్న సుదర్శనం బను చక్రంబును... నారాయణుని కిచ్చె."

చక్రధారియైన కృష్ణుని జూచి యగ్నిదేవుం డిట్లనియె,

ఈ చక్రము మధుసూదన నీచేత విముక్తమగుచు నీ రిపులఁ
ద్రియామాచరులజం క్రమ్మర నీ చేతికి వచ్చు దేవ నిర్మితశక్తిన్.
—నన్నయ. ఆది 8. 254.7

ఆ చక్రము లోహనిర్మిత మని యొకచోటను, చురకత్తివలె పదునైన యంచు గలదని వేఱొక చోటను వర్ణింపఁబడినది.

తచ్చాగ్ని దత్తం కృష్ణస్య వజ్రనాభ మయోమయమ్॥ —వ్యా.భా మౌసల. 3-14

క్షురాంత మమలం చక్రం కాలాంతకయమోపమమ్॥ —వ్యా. భా. వన. 22-31

చక్రమన రథ చక్రాకృతి గలిగి కత్తవాదర గల యంచును మధ్య భాగము వజ్రతుల్యమైన యినపకడ్డీయును గలిగి యుండు నాయుధవిశేషము.

ఇది విష్ణు చక్రము. పూర్వయుగమునందీ విష్ణుచక్రమును విశ్వకర్మ నిర్మించినాఁడు.

త్వష్టైవ తేజసా తేన విష్ణోశ్చక్ర మకల్పయత్॥ —విష్ణు. 3. 2-9-12**

"నీ తేజస్సుతో చక్రాని మధ్యభాగము గల యీ చక్రము విశ్వకర్మచేత నిర్మింపఁబడిన" దని యుధిష్ఠిరుఁడు సూర్య భగవానుని ప్రశంసించినాఁడు.

---

* శిల్యః సమర్థః వజ్రం వదతా్రిసా నాభౌ యస్య తత్
సూత్రబద్ధ శకునవత్ పునః ప్రయోక్తుర్ హస్త మాయాతీత్యర్థః॥ —నీలకంఠ
"And Pavaka then gave unto Krishna, a discuss with an iron stick attached to a hole in the centre". It was a fiery weapon and become his favourite." —P. C. Roy, Mbh. Exp. Tr. Sec. 227.

** పోల్చు :- పద్మపురాణము. సృష్టిఖండము.

త్వత్తేజసా కృతం చక్రం సునాభం విశ్వకర్మణా॥ —వ్యా.భా. వన. 3-48

ఈ చక్రము లభించినంతనే, చక్రధరుండను జక్రబలంబున గరుడోరగాసురఖచరవరులఁ దక్షిణంబు విగతదర్పులఁజేసెను.

—నన్నయ. ఆది. 8-279

ఈ చక్రముతో కృష్ణుఁడు శిశుపాలుని శిరచ్ఛేదము జేసెను.

"అనలశిఖాలి దూల దనుజాంతకచక్రము రాజచక్రమెల్లను భయమంద" చేదినందనుని మూర్ధ వికలంబుగఁ జేసెను. —నన్నయ. సభా. 2-68

ఈ చక్రముతోడనే కృష్ణుఁడు సౌంభకమును, సౌభపతి యగు సాల్వుని ధ్వంసము చేసెను.

"అనలజ్వాలాకరాళంబయి ప్రతికూల రాక్షస యక్ష గంధర్వ దైత్య దానవ భస్మసాత్కరణ దారుణంబయిన చక్రంబు నభిమంత్రించి సౌంభకంబుపయి వైచిన నది యుగాంతకాలపరివేషభీషణంబయిన రవి మండలంబునుం బోలె గగనంబునం బఱచి సౌంభక మధ్యంబునంబడె" —నన్నయ. అరణ్య. 1-194

అది అంపముతో దారువును కోసినట్లు సౌంభక నగరమును రెండుగా చీల్చివేసినది.

మధ్యేన పాటయామాస క్రకచో దార్వివోచ్ఛ్రితమ్॥....

—వ్యా. భా. వన. 22-31-34

ఇట దేవశిల్పి కృతమైన చక్రాయుధమును తక్షకు నాయుధమైన క్రకచముతోఁ బోల్చుట గమనింపఁదగినది.

భగవంతుఁడు కృష్ణావతారమును చాలించు సమయ మాసన్నమైనపుడు ద్వారకా నగరము నందు మహోత్పాతములు పుట్టినవి.

"...అపరదినమునం దగ్నిదత్తంబును నబ్జనాభంబును నైన కృష్ణుని చక్ర మద్భుతముగ నెగసి యఖిలజనులు వీక్షింప దివమున కరిగె."

—తిక్కన. మౌసల. 1-25

విశ్వకర్మ కృతమైన సుదర్శన చక్రము లోహముతోఁ జేయఁబడిన దనియు వజ్రతుల్యమైన నాభిస్థానము గలదనియు తీక్ష్ణమైన పరిధి గల దనియు నది యొక యాగ్నేయాస్త్రమమనియు మంత్ర పూర్వకముగా ప్రయోగింపఁ దగిన దనియు తెలియుచున్నది.

# స్కాందశక్తి

నమస్కృత్య కుమారాయ సేనాన్యే శక్తిధారిణే
అహం సేనాపతిస్తేఽద్య భవిష్యామి న సంశయః ॥

—వ్యా. భా. ఉద్యోగ. 164-7

శక్తిధరుఁడును దేవసేనాపతియు నైన కుమారస్వామికి నమస్కరించి నేను నీ సేనాపతినగుదు నని భీష్మాచార్యుడు దుర్యోధనునకుఁ జెప్పినాఁడు.

దేవతలలో మహాసేనానియైన కుమారస్వామి యాయుధము శక్తి.

సూర్యుని తరణి పట్టగా రాలిన రజముతో దేవతలకాయుధములు చేసిన విశ్వకర్మ గుహునకు శక్త్యాయుధమును జేసి యిచ్చినాఁడు.

శక్తిం గుహస్య దేవానామన్యేషాం చ యథాయుధమ్॥

—విష్ణుపురాణ. 3. 2. 9-12

షణ్ముఖుని శక్తి విలక్షణమైనది. అది శత్రు సంహారముచేసి సుదర్శన చక్రము వలె తిరిగి విడిచిన వాని చేతికి వచ్చిచేరును.

దేవతలు సమ్మోదంబుతో కార్తికేయు నభిషేకించి సేనాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టిన శుభసమయమున వానికిఁ బ్రీతుఁడై
'వాసవుం డసుర విధ్వంసకర పరిణత శక్తి' నొసఁగె.

"అమ్మహనీయ సాధనంబున ననేకకోటి శక్తు లుద్భవించి నానాదానవ ప్రకరంబుల బడలువడం జేసి యుల్కాసహస్రంబుల పిడుగుల తండంబుల మ్రోత చందంబున విరావం బావహిల్ల నది ప్రయోగించి...దైత్య బలంబులం దెగటార్చె. "అక్కుమారుండు ప్రయోగించిన నా శక్తి పగతురం బిలుకుమార్చి క్రమ్మఱఁ గరతలంబునకు వచ్చుచుండె.[2]

"అత్తారకుండట్లు తమవారు సమసిన సక్రోధుండై యగ్గుహునిఁ గిట్టి బెట్టిదంబగు నతని శక్త్యస్త్రంబుల తాకునం బడియె." —తిక్కన. శల్య. 2-189

స్కందుఁ డీవిధముగా తన శక్త్యాయుధముతో తారకాసురుని సంహరించినాఁడు

1 తిక్కన. శల్య - 2-.84 : వ్యా భా శల్య. 46-44

2 పోల్చు :- ఎఱ్ఱన. అరణ్య. 5-285 "ఇవ్విధంబున మహిషాసురుం బరిమార్చి కుమారుండు మఱియునమ్మహాశక్తిం బునః పునః ప్రయోగంబు గావించుచు ననేక దైత్య దానవ శతసహస్రంబుల వధియించె."

# ధనుర్వేదము

చతుర్విధం ధనుర్వేదం శస్త్రాణి వివిధాని చ॥

—వ్యా. భా. ఆది. 130-21*

చతుష్పాదం దశవిధం ధనుర్వేద మరిందమః
అర్జునా ద్వేద వేదజ్ఞః సకలం దివ్య మానుషమ్॥

—వ్యా. భా. ఆది. 221-72**

ధనుర్వేదము మంత్రముక్తము, పాణిముక్తము, ముక్తాముక్తము, అముక్తము నని నాలుగు పాదములు,

ఆధానము, సంధానము, మోక్షణము, వినివర్తనము, స్థానము, ముష్టి, ప్రయోగము, ప్రాయశ్చిత్తము, మండలము, రహస్యము నని దశాంగములు కలిగియుండును,

బ్రహ్మాస్త్రము మున్నగునవి దివ్యాస్త్రములు.

భృశాశ్వాదుల చేత నుపదిష్టములైనవి మానుషములు.

---

* చూడు :- నీలకంఠవ్యాఖ్య : శ్రీ మహాభారతము - చిత్రశాలాప్రతి

చతుర్విధః ముక్తమముక్తం ముక్తాముక్తం మంత్రముక్తం చేతి
ముక్తం బాణాది, అముక్తం ఖడ్గాది, ముక్తాముక్తం సోపసంహార మస్త్రం,
నిరుపసంహామస్త్రం మంత్రి ముక్తమ్॥
యద్వా శస్త్ర మస్త్రం ప్రత్యస్త్రం పరమాస్త్రం చ
యద్వా ఆదానం సంధానం విమోక్షః సంహారాశ్చ॥

** చూడు :- నీలకంఠవ్యాఖ్య : శ్రీ మహాభారతమ్ - చిత్రశాలాప్రతి.

చతుష్పాద మితి :-

మంత్ర ముక్తం పాణిముక్తం ముక్తాముక్తం తథైవ చ
అముక్తం చ ధనుర్వేదే చతుష్పాచ్ఛాస్త్ర మీరితమ్॥
ఇతి ప్రతిపాదిత పాదచతుష్టయ విశిష్టం ధనుర్వేదం॥

దశవిధ మితి -

ఆధాన మథ సంధానం మోక్షణం వినివర్తనమ్
స్థానం ముష్టిః ప్రయోగశ్చ ప్రాయశ్చిత్తాని మండలమ్
రహస్యం చేతి దశధా ధనుర్వేదాంగ మిష్యతే॥
ఇత్యుక్త దశవిధాంగసహిత మిత్యర్థః॥
దివ్యం బ్రహ్మాస్త్రాది మానుషం భృశాశ్వాద్యుపదిష్టమ్॥

# శస్త్రాస్త్ర శిల్పము

ఇష్కృణుధ్వ మాయుధారం కృణుధ్వమ్॥

—ఋగ్వేద. 10-101-2

ఓ విశ్వేదేవులారా ! బాణములు చేయుఁడు. ఆయుధములు చేయుఁడు.

శస్త్రాస్త్రములు నిర్మించుట యొక కళ.

లోహాభిసార శస్త్రాస్త్రకృతి జ్ఞానం కళా స్మృతా॥ —శుక్రనీతి

The preperation of tools and implements with iron is an art. *

ఆయుధ మను నర్థమున శస్త్రాస్త్రములు సమానార్థకములే కాని శస్త్రాస్త్రములని గాని యస్త్ర శస్త్రములని గాని ద్వంద్వసమాసము చేసినపుడు వానికి భిన్నార్థములు చెప్పుకొనవలెను.

లోహదులతో నిర్మింపఁబడు ఖడ్గాద్యాయుధములు శస్త్రములు. మంత్ర పూర్వకముగాని యంత్రము [ధనుస్సు] ద్వారా గాని అగ్నియుక్తముగా గాని విడువఁబడు బాణాదు లస్త్రములు.[1]

శస్త్రము చతుర్విధము.

శక్త్యాద్యస్త్రం పాణిముక్తం యంత్రముక్తం శరాదికమ్
ముక్తాముక్తం ధృతం యుక్తం నాగపాశాదిదీర్ఘకమ్
అముక్తం క్షురికాదిస్స్యా దితి శస్త్రం చతుర్విధమ్॥ —వైజయంతి

శస్త్రకారుఁడు } ఆయుధములు చేయువాఁడు
అస్త్రకారుఁడు } weapon maker, an armourer

శస్త్ర మార్జుఁడు : ఆయుధములు బాగుచేయు శిల్పి

ధనుర్బాణములు, ఖడ్గాద్యాయుధములు నిర్మించుట శిల్పము. ఇషుకారులు, ధనుష్కారులు, శస్త్రకారులు, అస్త్రకారులు శిల్పులు.

శస్త్రాస్త్రములను ప్రయోగించుటయందలి నేర్పు కళ.

"చాపాద్యాయుధకళా విశారద చిత్తుల్" —తిక్కన. ఉద్యోగ. 1-73

---

* Cf :- The SUKRANITI - Eng. Tr. Benoy Kumar Sarkar. Oriental Reprint - New Delhi

1. Ibid : "Astra is that which is thrown or cast down by means of charms or machines or fire.
Sastra is any other weapon, e. g. sword, dagger, kunta etc."
"Astra is a missile charged with power by a holy incantation
— Rajaji - Mahabharata.

# అస్త్రకళాచార్యులు

........భరద్వాజం ధనుర్గ్రహమ్॥ —వ్యా. భా. శాంతి. 210-21

భరద్వాజ సుతుండైన ద్రోణుం డగ్నివేశుండను మహాముని వలన ధనుర్విద్యా పారంగతుండై తత్ప్రసాదంబున నాగ్నేయాస్త్రం బాదిగా ననేక దివ్య బాణంబులు వడసినాఁడు.

తదనంతరము ద్రోణాచార్యుఁడు మహేంద్రాచలంబునం బరమతపోవృత్తి నున్న భార్గవరాముం జేరి

"ధనములలో నత్యుత్తమధనములు శస్త్రాస్త్రములు ముదంబున వీనిం గొని కృతకృత్యుఁడ నగుదును జనసుత నా కొసఁగు మస్త్రశస్త్రచయంబుల్".

అని పరశురాముచేత దివ్యాస్త్రంబులు ప్రయోగరహస్య మంత్రంబులతోఁ బడసి ధనుర్విద్యయు నభ్యసించి నాఁడు.[1]

అస్త్రాణి చ మహాస్త్రాణి శస్త్రాణి వివిధాని చ॥—వ్యా. భా. ఆది. 129-63

భారద్వాజుడు హస్తినాపురమున భీష్ముని పనుపునఁ గౌరవ పాండవ కుమారులకు శస్త్రాస్త్రవిద్యలు గఱపి ధనురాచార్యుఁడై లోకప్రసిద్ధి గాంచినాఁడు.

శస్త్ర ప్రకారనిపుణుం డస్త్రవిదుఁడు దూరపాతనాభీలుఁడు
వర్పస్త్రాసితరిపుఁడు ధనుశ్శాస్త్రపరిజ్ఞానఘనుఁ డసదృశుఁడు శక్తిన్.[2]

ద్రోణాచార్యుని ప్రియశిష్యుఁ డయిన యర్జునుఁ డస్త్రకళాకుశలుఁడు.

నరుఁ డస్త్రశస్త్రవిద్యాపరిణతి నధికుఁడయి వినయపరుఁడయి
శశ్వ ద్గురుపూజాయత్నంబునఁ బరగుచు సంప్రీతుఁజేసె భారద్వాజున్.[3]

అర్జునుఁడు ధనురాచార్యుఁడయిన ద్రోణాచార్యుని వలననేగాక యింద్రాదిదేవతల వలనను ననేక దివ్యాస్త్రములు పడసినాఁడు.

అట్లు ధనుర్విద్యావిశారదుడైన ధనంజయుఁతో నభిమన్యుడు చతుష్పాదమును దశవిధాంగకమునైన[4] "ధనుర్వేద మిమ్ముగ నభ్యసించెఁ బ్రవీరవైరి పతాకినీభేద మార్గములెల్ల నేర్చె నభేద్యవిక్రమ సంపదన్"

—నన్నయ. ఆది. 8-225

---

1 నన్నయ. ఆది. 5. 200-2 2 తిక్కన. విరాట. 5-0

3 -నన్నయ. ఆది. 5. 226 4 వ్యా. భా. ఆది. 221-72

# యుద్ధశాస్త్రము

పురాణాం చైవ దివ్యానాం కల్పానాం యుద్ధకౌశలమ్॥

—వ్యా. భా ఆది, 1-169

మహాభారతము నందు ధనుర్వేదోక్త శస్త్రాస్త్రరచనా ప్రయోగ కళాకౌశలాది విశేషములు దుర్గ సేనావ్యూహరచనాది విధులు వర్ణింపఁబడి యున్నవి.

దేవాచార్యుఁడయిన బృహస్పతియు, పూర్వదేవాచార్యుఁడైన శుక్రాచార్యుఁడును యుద్ధతంత్రము నందు కుశలులు.

వీరిరువురు నంగిరసుని శిష్యులే.[1]

"దశాననుం డుదితక్రోధుండయి... యభేద్యంబగు ఔశనస వ్యూహంబు సంఘటించి వన చరబలంబు పయి నడచినం గని రాఘవుండును బార్హస్పత్య వ్యూహంబు దీర్చి పేర్చి యెదురు కొనియె."[2]

## సేనాపతి లక్షణము

సైన్యాధ్యక్షుఁడు నానావిధ రణవిజయ మహానిపుణుఁడై రహస్యగోపనుఁడై విశ్వాసపాత్రుఁడై యుండవలయును.

మొనఁదీర్చు వెరవు, యంత్రములనేకము లొనర్చు నేర్పు
నాయుధముల విన్ననువును, బోటుల కర్జంబును,
సేనాపతికి నైజములు గావలయున్. — తిక్కన. శాంతి. 2-380

వ్యూహయంత్రాయుధానాం చ తత్త్వజ్ఞో[3] విక్రమాన్వితః
వర్ష శీతోష్ణవాతానాం సహిష్ణుః పరతంత్రవిత్॥ —శాంతి 85.32

[యంత్రాణి ధనురాదీని ఆయుధాని ఖడ్గాదీని
వ్యూహః సేనాయాః నివేశన వ్రకారవిశేషః]

---

* "కల్పానాం ధనుర్వేదోక్త శస్త్రాదివిధీనాం దుర్గసేనా రచనాది విధీనాం వా"
కల్పః శస్త్రే విధౌ న్యాయో సంవర్తే బ్రహ్మణో దినే ఇతి మేదినీ॥ —నీలకంఠ

1 చూడు :- ఎఱ్ఱన. హరివంశము. పూ. భా. 3-12

2 ఎఱ్ఱన ఆరణ్య 7-74 = —వ్యా. భా. వన 285-6, 7

3 "యంత్రోంకే ప్రయోగ్ తథా నానాప్రకార్ కే అన్యాన్య
అస్త్రశస్త్రోం కో చలానే కీ కలా కా తత్త్వజ్ఞ"
——వ్యా భా. హిందీ అనువాదము - గీతాప్రెస్. ప్రతి.

# బల సమీకరణము

కచ్చి దష్టాంగసంయుక్తా చతుర్విధబలా చమూః
బలముఖ్యైః సునీతా తే ద్విషతాం ప్రతివర్ధినీ॥
—వ్యా. భా. సభా. 5-64

అష్టాంగయుక్తమయిన చతుర్విధబలముతో శత్రుసంహారము చేయ సమర్థులయిన సేనాపతులను నియమించినావా ? అని నారదుడు ధర్మరాజును ప్రశ్నించినాఁడు. అది రాజధర్మము.

ఈ శ్లోకమునకు దేవబోధ టీక యిట్లున్నది.[1]

రథా నాగా హయా యోధాః పత్తయః కర్మకారకః[2]
చారా దేశికముఖ్యాశ్చ ధ్వజిన్యష్టాంగకం మతమ్॥
చతుర్విధం బలం మౌల మిత్రి భృత్యాటవికమ్॥
బలముఖ్యాః సేనాపతయః సునీతాః ప్రియుక్తాః॥

చతురంగబలమన రథ గజ తురగ పదాతులుగల సేన.

అష్టాంగబలమన రథగజతురగపదాతులే కాక యోధులు కర్మకారులు, చారులు, దేశికులు గల సైన్యము

కర్మకారకు లన సేవకులు. ఇట కర్మారు లని యర్థము.

సైన్యమునందు శస్త్రాస్త్రాది యుద్ధోపకరణములు చేయు లోహ శిల్పులుండ వలసిన యవసర మెంతేని గలదు.

---

1 చూడు :- శ్రీ దేవబోధ కృత మహాభారత తాత్పర్యటికా జ్ఞానదీపికా
సభా పర్వ వ్యాఖ్యానం. పుట. 7 [సభా. 5-53]
—భండార్కర్ ఓరియంటల్ రిసెర్చి ఇన్స్టిట్యూట్. పూనా

"Are thy chamus cosisting four kinds of forces viz. the regular troops, allies, the mercenaries and the irregurars, each furnished with the eight ingredients viz. the ears, elephants, horses, officers, infantry, camp-followers, spies, possesing a thorough knowledge of the country and ensigns, led out against thy enemies after having been well-trained by superior offices ?"
— Mbh-Sabha-Eng. Tr. P. C. Roy.

2. కర్మకారకః One who does any business ; a mechanic ; artisan technically a worker not hired; a blacksmith.
— V. S. Apte : S.E.D.

# మహాభారతయుద్ధము

## సమర సన్నాహము - స్కంధావార నిర్మాణము

మథురా నూషరే దేశే శుచౌ పుణ్యే మహామతిః
నివేశం కారయామాస కుంతీపుత్రో యుధిష్ఠిరః ॥....
శిబిరం మాపయామాస ధృష్టద్యుమ్నశ్చ పార్షతః॥

—వ్యా భా. ఉద్యోగ. 152-3,6

సంధి ప్రయత్నములు సఫలము కానందున యుధిష్ఠిరుఁడు ధృష్టద్యుమ్నుని సర్వసేనాధిపత్యంబునకుఁ బట్టము గట్టి...... కౌరవులతోడి కయ్యంబునకుఁ గురుక్షేత్రంబునకు విడియంబోద మని... సర్వజన సమ్మతంబుగా సమరోత్సాహంబు సేసి ప్రస్థానభేరి సఱవం బంచినాఁడు.

"ఎల్లవారి పరిచారకులును శకటాదిసకలసాధనంబులును బటగృహంబులును మొదలుగా వలయు సమస్తవస్తువు లొడగూర్చి వెడలిన దండు పఱపై సముద్రంబు గాఁపువోవు చందంబయ్యె"

ఇట్లరిగి, ధర్మపుత్త్రుండు కురుక్షేత్రంబు దఱియంజొచ్చి ఋష్యాశ్రమంబులకు దేవతాయతనంబులకు నలజడిగాకుండం బరిహారంబు సేయుచుం జని తృణకాష్ఠజలసమృద్ధంబై తగియెడు సమస్థలంబున హిరణ్వతి యను పుణ్యనది పొంత విడిదల నిరూపించి యచ్చో నిలిచె"

"తదనంతరంబ యొక్కరమ్యప్రదేశంబున రాజమందిరంబును నుచితస్థానంబుల సమస్తజన నివాసంబులునై రమణీయ బంధురంబు సింధురాశ్వశాలామాలికామనోహరంబునుంగా వీడెల్ల విడిసె...... వీటి చుట్టునుందిరిగి ధృష్టద్యుమ్నుండు సురక్షితంబు సేసి వచ్చె, రాజును దొరలును[1] చమ్మలును సకలపరివారంబును దగిన తెఱంగున నుండిరి. నానావస్తుబహుళ సంభారంబుల మహోదారం బగుచుఁ బాండవస్కంధావారంబు మహనీయాకారంబున నొప్పె"

—తిక్కన. ఉద్యోగ. 4. 130-2

---

1. రాజులకు ప్రత్యేకముగా నిర్మింపబడిన శిబిరములు విమానముల వలె నున్నవని వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది

శిబిరాణి మహార్హాణి రాజ్ఞాం తత్ర పృథక్ పృథక్
విమానీవ రాజేంద్ర నివిష్టాని మహీతలే॥ — ఉద్యోగ. 152-11

## స్కంధావారములు : శిబిరములు

రణాంగనాన్ నివృత్తస్య రాజ్ఞః సేనా నివేశనమ్
స్కంధావారా ఇతిప్రోక్తః శిల్పశాస్త్రవిశారదైః ॥

—విశ్వకర్మవాస్తుశాస్త్రము. 8-47

స్కంధావార మనఁగా విడిదల, దండువిడియుచోటు.
శిబిర మనఁగా దండునం దొక్కొక్కఁడు విడియుచోటు.
నివేశనము - ఎత్తిన దండు విడిసిన పాళెము.

## స్కంధావారములు : స్థపతులు

వాస్తుక ప్రశస్తే వాస్తుని నాయక వర్ధకి మౌహూర్తికాః
స్కంధావారం వృత్తం దీర్ఘం చతురస్రం వా భూమివేశనే వా
చతుర్ద్వారం షట్పథం నవసంస్థానం మాపయేయుః ॥

—కౌటిల్య. అర్థశాస్త్రము. 10-1*

స్థపతులు నాయకులతోను మౌహూర్తికులతోను సంప్రదించి వాస్తుశాస్త్రోక్తముగా ప్రశస్తమయిన స్థలమునందు స్కంధావారములు నిర్మింపవలెను.

స్కంధావారము వృత్తాకారముగాఁగాని దీర్ఘచతురస్రాకారముగాగాని చతురస్రాకారముగాఁగాని భూమ్యాకృతికనురూపముగా నిర్మింపఁబడును. అది నాలుగు ద్వారములు గలిగియుండును. లోపల నాలుమార్గములుగా తొమ్మిది భాగములుగా విభజింపఁబడి యుండును.

---

1) Cf.: Dr. R. Shama Sastry : Koutilya's Artha Sastra P 219.
2) Cf.: Louis Renon : The Civilisation of Ancient India P 124
"The Camp Skandhavara......was itself a fortified place carefully planned by architects, after consulting astrologers If was circular, rectangular or square recording to terrain or perferance with four gates, six roads inside it and net-work of light fortifications If was divided into nine sectors, the residence of the King forming the first two in the middle, with the womens quarters and the guard house, the audience chamber to the east etc."

* పోల్చు :- సమరాంగణ సూత్రధారః అ॥ 45-30,31

"శిబిరస్య నివేశం చ తత్త్వవేత్తా పరీక్షయేత్ । అర్థశాస్త్ర విధిజ్ఞో నా స్థపతి ర్వా ప్రకల్పయేత్॥ శిబిరం చతురస్రం స్యాత్ వృత్తం వృత్తాయతం క్వచిత్ । చతురస్రాయతం వాపి విషమం హి క్వచిద్భవేత్॥"

# కౌరవేశ్వరుని స్కంధావారము

స్కంధా వారేణ మహతా కురుక్షేత్రం జగామవా
శిబిరం మాపయామాస సమేదేశే జనాధిప॥
మధురా నూషరే దేశే ప్రభూతయవసేంధనే
యథైవ హస్తినపురం తద్వచ్ఛిబిరమాబభౌ॥

—వ్యా. భా. ఉద్యోగ. 156-36

ధర్మరాజు సమరసన్నాహము సేయుచున్నాఁడని చారులవలన విని కౌరవేశ్వరుఁడు కర్ణాదులతో సంప్రదించిమనకు వి డి ద ల కురుక్షేత్రం బని పలికి దండు సాటించినాఁడు.

"అట్టి సమయంబునఁ బ్రయాణోచితంబులగు బహుప్రకార వ్యాపారంబులందుఁ దత్పరులయిన దొరల నానాచేష్టితంబులును గరి తురగ రథంబులకు సవరణలు సమకూర్చు చతురపరిచారకుల సంభ్రమంబును వివిధాయుధంబులు రవణంబులుగా నాయితంబు సేయఁ బ్రవర్తించు పదాతి వర్గంబుల సంరంభంబునను నయ్యైసరకులు పయనంబున కనువు సేయు బలుమానుసుల తిరుగుడు వడుటను బురంబు సమరోత్సాహ చంద్రోదయంబున మహార్ణవంబై ఘూర్ణిల్లుచుండె."[1] అనంతరము రారాజు భీష్మాచార్యుని కౌరవపక్షమున సర్వసేనాధిపత్య భారపట్టబంధముగట్టి యభిషేకించినాఁడు.

అత్తఱిఁ బాషాణంబులు నెత్తురునెమ్ములును గురిసె; నిష్ఠుర నినదా
యత్తమయి నభము పిడుగులమొత్తంబులు వడియె నగరమున నెల్లెడలన్,

దానికి జను లుత్సాహ విహీనతఁ బొందంగఁ గౌరవేంద్రుఁడు నానా
దానాదులయిన శాంతి విధానము లొనరించి యానతత్పరమతియై.[2]

"నడచి కురుక్షేత్రంబు దఱియంజొచ్చి యందొక్క రమణీయ ప్రదేశంబున విడిదలగా నిరూపించి నిలిచి, భానుసుతుండును దానునుమెలంగి యెల్లవారిని విడియించి నడుమ నిజనివాసంబు గావించినఁ గౌరవేశ్వరు స్కంధా వారంబు వారణపురంబున నెవ్వ రెవ్వరెయ్యెడ వసియింతు రాచందంబున నందంబై యొప్పె. —తిక్కన. ఉద్యోగ. 4-164

మహాభారతకాలమునం దీవిధముగా స్థపతులు దారుశిల్పులు స్కంధా వారములు శిబిరములు పురదుర్గముల వలె శాస్త్రానుసారము నిర్మించుచుండిరి.

1. తిక్కన ఉద్యోగ. 4-136 2. తిక్కన. ఉద్యోగ. 4-160, 4

## శిబిరములు - శిల్పులు

తత్రాసన్ఛిల్పినః ప్రాజ్ఞాః శతశో దత్తవేతనాః
సర్వోపకరణైర్యుక్తా వైద్యాః శాస్త్రవిశారదాః॥
—వ్యా. భా. ఉద్యోగ. 152-12

ధర్మజుని శిబిరములలో దత్తవేతనులయిన శిల్పపండితులు వందల కొలఁది సర్వోపకరణయుక్తులై యుండిరి.

అర్థశాస్త్రానుసారము శిల్పుల వేతనములిట్లుండును.

| క్రమ సంఖ్య | ఉద్యోగము | Office and Work | సంవత్సర వేతనము పణములలో |
|---|---|---|---|
| 1 | కార్మాంతికులు | Superintendent of manufacturers | 12,000 |
| 2 | శ్రేణీముఖ్యులు<br>రథముఖ్యులు | Chief of military corporations<br>Chief of chariots | 8,000 |
| 3 | రథాధ్యక్షులు | Superintendents of chariots | 4,000 |
| 4 | వర్ధకులు | The Carpenters | 2,000 |
| 5 | శిల్పవంతులయిన పదాతులు | Trained Soldiers | 500 |
| 6 | కారువులు, శిల్పులు | Artisans and carpenters | 120 |
| 7 | ఆచార్యులు విద్యావంతులు [అర్హత ననుసరించి] | Teachers and Learnedmen | 500 - 1,000 |

1. సాంవ్యావహారిక కార్మాంతికమంత్రిపరిషద్ రాష్ట్రపాలాశ్చ ద్వాదశసాహస్రాః
2. శ్రేణీముఖ్యా హస్త్యశ్వ రథముఖ్యాః ప్రదేష్టారశ్చ అష్టసాహస్రాః
3. పత్త్యశ్వరథ హస్త్యధ్యక్షా ద్రవ్యవన హస్తిపాలా శ్చతుస్సాహస్రాః
4. రథానీక చికిత్సకాశ్వదమక వర్ధకయో యోనిపోషకాశ్చ ద్విసాహస్రాః
5. శిల్పవంతః పాదాతాః సంఖ్యాయన లేఖకాదివర్గాః పంచశతాః
6. కారు శిల్పినో వింశతిశతాః 7. ఆచార్యా విద్యావంతః పూజా వేతనాని యథార్హం లభేరన్ పంచశతోఽవరం సహస్రపరమ్॥

యుద్ధశిబిరము లందు శిల్పులకేమి పనియుందురా?

అసిచర్మ కార్ముక బాణతూణీర రథవరూథాదులు, ప్రాసభుసుండి పరశ్వధాదులు, శక్త్యాద్యాయుధములు మొదలయిన సాంగ్రామిక ద్రవ్యములు సమకూర్చువారు శిల్పులే కదా.

యుద్ధమునందు జయాపజయములు కొంతవరకు శస్త్రాస్త్రకారులగు శిల్పులపై నాధారపడి యున్నది.

## జయలక్షణము

యుద్ధవీరులు సంతోషముగా నుండుట జయలక్షణము.

అల్పానాం వా మహత్యాం వా సేనాయా మితి నిశ్చితః
హర్షో యోధగణస్యైకో జయలక్షణ ముచ్యతే॥ —వ్యా. భా భీష్మ. 4-15

కావున రాజులు సైనికులననేకవిధములుగా సంతోషపెట్టుచుండవలెను.

వీరోచితములయిన వేషభూషలు, తళతళలాడు శస్త్రములు యోధులకు హర్షోత్సాహములు కలిగించును, వారి ముఖములానందముతోఁ గళగళలాడుచుండును. అట్లుండుట జయలక్షణము.

"సిడములుఁ గంకటంబులును జల్కలును విండ్లు మొదలగు నాయుధంబులు రథగజహయంబుల సవరణలు నపూర్వభంగి యొప్పి యరిభీకరంబులై యుండవలయు"నని భీష్మాచార్యుఁడు ధర్మరాజునకుఁ దెలిపినాఁడు. — తిక్కన. శాంతి. 3-3

శస్త్రైరథ యంత్రైః కవచైః కేతుభిః సుభానుభి ర్మఖవరైశ్చమూనామ్
భ్రాజష్మంతీ దుష్ప్రతివీక్షణీయా యేషాం చమూ స్తేఽభిభవంతి శత్రూన్॥
—వ్యా భా. శాంతి. 102-12

యుధిష్ఠిరుని శిబిరములన్నింటియందు వివిధశస్త్రాస్త్రములు సంగ్రహింపఁబడియున్నవి.

మహాయంత్రాణి నారాచా స్తోమరాణి పరశ్వధాః
ధనూంషి కవచాదీని ఋష్టయ స్తూణసంయుతాః॥
—వ్యా. భా. ఉద్యోగ. 152-10

సమస్త సాంగ్రామిక ద్రవ్యములు సమకూర్చునది శిల్పులే కావున రాజులు వారికి తగిన వేతనము లిచ్చి యుద్ధశిబిరములందుంచవలయును.

## హలముఖాయుధములు

శక్తిప్రాస కుంత హాటక భిండివాలతోమర వరాహకర్ణ
కణప కర్పణ త్రాసకాదీని హలముఖాని॥

—అర్థశాస్త్ర. 2-10*

హలముఖము వంటి మొనగల యాయుధములు పదునొకండు గలవు.

1. శక్తి : నాలుగు హస్తముల పొడవు గల లోహదండము. కరవీర పత్రాకృతియు, గోస్తనాకృతిగల పిడియు గలది.

2. ప్రాసము : లోహమయము, కాష్ఠమయియు. 24 అంగుళములు పొడవు గలిగి రెండు పిడులు గల యాయుధ విశేషము.

3. కుంతము : 5, 6, 7, హస్తముల పొడవుగల దుడ్డు కర్ర

4. హాటకము : మూఁడు నాలుగు అంచులు గల కర్ర

5. భిండివాలము / భిండిపాలము : బృహచ్ఛీర్షము గల శలాక. ఇనుపయలుగు గల యొక ఆయుధము

6. శూలము : తీక్ష్ణాగ్రముగల శళాక, ముమ్మొనవాలు.

7. తోమరము : నాలుగు, నాలుగున్నర, ఐదు హస్తముల పొడవు గలిగి బాణము వంటి మొనగల శలాక

8. వరాహకర్ణము : పంది చెవుల వంటి అంచులు గల శలాక.

9. కణపము [కణయము] : బల్లెము : రెండుకొనలును, త్రికోణాకృతి గలిగి 22, 23, 24 అంగుళముల పొడవు గల లోహదండము. దీనిని మధ్యభాగమున పట్టుకొందురు.

10. కర్పణము : చేతితో విసరఁబడు బాణవిశేషము దీని కొనలు 7, 8, 9, కర్షములు బరువు గలిగి యుండును.

11. త్రాసకము : ప్రాసము వంటి లోహ దండము

మహాభారత సంగ్రామము నందుపయోగింపఁబడిన యాయుధము లన్నియు సువర్ణమయములుగా వర్ణింపఁబడినవి.

---

* చూడు :- డా॥ ఆర్. శ్యామశాస్త్రి : కౌటిల్యుని అర్థశాస్త్రము - ఆంగ్లానువాదము. సటీకము టీకాకారుని వివరణము.

## శక్త్యాయుధము

**ఈశానహేతోః ప్రతినిర్మితాం తాం త్వష్ట్రా రిపూణా మసుదేహభక్ష్యాం**
**ఘంటా పతాకామణి వజ్రనాలాం వైడూర్యచిత్రాం తపనీయ దండామ్**
**త్వష్ట్రాప్రయత్నా న్నియమేన క్లప్తాం బ్రహ్మద్విషామంతకరీ మమోఘామ్॥**

—వ్యా. భా. శల్య. 17-45, 46

శత్రునాశకర మగు శక్త్యాయుధము విశ్వేశ్వరుని కొఱకు విశ్వకర్మ [త్వష్ట] చేత నిర్మింపఁబడినది. ఘంటలతో పతాకలతో చక్కఁగా నలంకరింపఁబడినది. మణులు వజ్రములు పొదగఁబడిన నాలము, వైడూర్యఖచితమయిన స్వర్ణదండము గల దానిని విశ్వకర్మ నియమనిష్ఠలతో నతిప్రయత్న పూర్వకముగా నిర్మించినాఁడు.

ఈ శక్త్యాయుధము విశ్వకర్మ నిర్మిత మని తిక్కన చెప్పలేదు.

ధర్మజుని భక్తికి మెచ్చి ఫాలలోచనుఁడా శక్త్యాయుధమును వాని కిచ్చినాఁడు. అతఁడు దానిని నిచ్చలు గంధపుష్పాక్షలతో నర్చించెడివాఁడు.

యుధిష్ఠిరుఁడా మహనీయశక్తికి

పరిణతుండై రభసోదయాభినవదర్ప స్ఫూర్తి శోభిల్లుచున్
మణి దండద్యుతి మంజరీ స్ఫురణమున్ సంశోభిఘంటా పటు
క్వణనంబున్ రిపుపై నిక పరికరద్రుక్కర్ణవ్యథం జేయ భీ
షణరేఖం బగు దానిఁ బుచ్చుకొని చంచన్ముష్టిదృష్ట్యుద్ధతిన్॥

శల్యునిపైఁ బ్రయోగించినాఁడు. —తిక్కన. శల్య. 1. 277-82

రావణాసురుఁడు లక్ష్మణునిపై ప్రయోగించిన శక్త్యాయుధము మయ విశ్వకర్మ నిర్మిత మని వాల్మీకి రామాయణము వలనఁ దెలియు చున్నది.

**ఇత్యేవ ముక్త్వా తాం శక్తి మష్టఘంటాం మహాస్వనామ్**
**మయేన మాయావిహితా మమోఘాం శత్రుఘాతినీమ్॥**

—వా. రా. యుద్ధ. 100-30

మయుఁడు తన కుమార్తె యగు మండోదరిని రావణబ్రహ్మ కిచ్చి వివాహమొనరించు సమయమున నీ శక్త్యాయుధమును బహూకరించినాఁడు.

**అమోఘాం తస్య శక్తిం చ ప్రదదౌ పరమాద్భుతమ్॥**

—వా. రా. ఉత్తర. 13-21

శక్తి యన చేతితో విసరబడు లోహదండము. చిల్లకోల [శ.ర.]

శక్తిః హస్తక్షేప్యో లోహదండః ॥*

శక్త్యాయుధము నాలుగు హస్తముల పొడవుగల లోహదండము కరవీర పత్ర ముఖముగల యగ్రభాగము, గోస్తనాకృతి గల పిడియు [అధోభాగమును] గలిగి యుండు నాయుధవిశేషము.

A metalic weapon four hands long and face like a leaf of Karavira and Provided with a handle like a cow's nipple.[1]

అమరశిల్పి త్వష్ట్ర విశ్వకర్మయు, అసురశిల్పి మయ విశ్వకర్మయు దేవదానవులకు శక్త్యాద్యాయుధములు చేసి యిచ్చు శిల్పాచార్యులు. వారే యాయుధశిల్పమునకు మూలపురుషులు. వారి ననుసరించియే లోకమునందలి శిల్పులాయుధములు చేయుచుందురు.

మహాభారతమునందు పెక్కుచోట్ల శక్త్యాయుధ వర్ణనములున్నవి.

వైశ్రవణు నివాసము సమీపమున మణిమంతుఁడను రాక్షసుఁడు భీమసేనునిపై ప్రయోగించిన శక్త్యాయుధము కాంచనదండము గల దని నన్నయ్య వర్ణించినాఁడు.

"ఘనుఁడి మ్మణిమంతుఁడు కాంచన దండోద్భాసి యైనశక్తి
మరున్నందను మీఁదవైచె" —నన్నయ. అరణ్య. 4-17

అది స్వర్ణదండోద్భాసియే గాక లోహమయ మనియు నిప్పులు గ్రక్కుచున్నదనియు మూలమునందు వర్ణింపఁబడినది.

తతః శక్తిం మహాఘోరాం రుక్మదండా మయస్మయీమ్
సాగ్నిజ్వాలా మహారౌద్రా పపాత సహసా భువి॥

—వన. 160-68**

---

* చూడు :- వ్యా. భా. ఆది 19.11 - నీలకంఠ వ్యాఖ్య

1. Cf :- Kautilya's Artha Sastra. Eng. Tr. Syama Sastry Book II 18-101. P. 110

** పోల్చు :- 1) శక్తిం జగ్రాహ విపులాం హేమదండా మయస్మయీమ్ —ద్రోణ. 107-15

2) తతః శక్తిం గృహీత్వా తు రుక్మదండా మయస్మయీమ్ —ద్రోణ. 117-20

ద్రోణాచార్యునితో యుద్ధముసేయుచు,

"పార్షతుండు శక్తిఁ బరగించె నతఁడు తుత్తునియఁజేసె"
నని తిక్కన వ్రాసినాఁడు. —భీష్మ. 2-53

ఆ శక్త్యాయుధము వైడూర్యమణిఖచిత సువర్ణాలంకృత మని మూలమునందు వర్ణింపఁబడినది.

తతః శక్తిం మహావేగాం స్వర్ణ వైడూర్య భూషితామ్॥
—వ్యా. భా. భీష్మ. 53-14

ధర్మరాజు ద్రోణాచార్యునిపై, "తీవ్ర రశ్ముల మండెడు ఘనశక్తి వైచె మార్తురు దలకన్" —తిక్కన, ద్రోణ. 3-242

ఈ శక్తి యష్ట ఘంటాయుక్తమయిన స్వర్ణదండము గలది.

శక్తిం జగ్రాహ సమరే గిరీణామివ దారణీమ్
స్వర్ణదండాం మహాఘోరా మష్టఘంటాం భయావహామ్॥....
ప్రజ్వాలయంతీం గగనం దిశః సప్రదిశస్తథా॥
—ద్రోణ. 106-29

విభీషణుఁడు ప్రహస్తునిపై ప్రయోగించిన శక్తి నూఱు గంటలు గలది.

"శతఘంటా పరిభూషితంబును జగత్సంహార ఘోరానలో
ద్దీత కీలా సదృశంబునై మెఱయు శక్తిం బూన్చి మంత్రించి యు
ద్ధతతేజుండు ప్రహస్తు వైచి" నట్లు ఎఱ్ఱన మూలానుసారముగ వర్ణించినాఁడు —ఎఱ్ఱన. భారత. అరణ్య. 7-82

కర్ణుఁడు ఘటోత్కచునిపైఁ బ్రయోగించిన శక్తిపేరు వైజయంతి.

శక్తిం శ్రేష్ఠాం వైజయంతీ మసహ్యాం సమాదదే తస్య వధం చికీర్షన్॥
—వ్యా. భా. ద్రోణ. 179-52

ఈ వర్ణనములను బట్టి చూడఁగా శక్త్యాయుధము ఘంటా యుక్తమయిన లోహదండ మనియు, నది వైడూర్యాది మణులు పొదిగిన బంగారు తొడవులతో నలంకరింపఁబడుచుండెడి దనియు మంత్రపూర్వకముగా ప్రయోగింపబడి మంటలు గ్రక్కుచుండు నాయుధ విశేషమనియుఁ దెలియుచున్నది.

# వజ్రాయుధము

త్వష్టా యద్ వజ్రం సుకృతం హిరణ్మయమ్
సహస్ర భృష్టిం స్వపా అవర్తయత్॥

—ఋగ్వేద. 1. 85-9*

[త్వష్ట తన శిల్పకళాకౌశలముతో వేయి యంచులు గల సువర్ణమయ వజ్రమును చక్కగా నిర్మించినాఁడు.]

నర సుర సిద్ధ కింపురుష నాగ నభశ్చర ముఖ్యులెల్ల నీ
కరుణయ వేచి మంద్రు త్రిజగంబులు నీ కులిశాభిరక్షణ
స్ఫురణన చేసి సుస్థిరతఁ బొందుఁ బురందర సర్వలోక సుం
దర శరణంబు నా కొసఁగు దానవ సూదన పాకశాసనా॥

అని నాగమాత కద్రువ యతిభక్తి నింద్రుని స్తుతించినది.

కులిశ మనఁగా వజ్రాయుధము. ఈ వజ్రాయుధమును ధరించుట చేతనే యింద్రుడు త్రిలోక రక్షకుఁ డగుచున్నాడు.

త్రిజగద్రక్షణమునకు హేతుభూతమయిన వజ్రాయుధమును నిర్మించినవాఁడు దేవశిల్పి యగు త్వష్ట.

వజ్రాయుధ వృత్తాంతము భారతమునం దిట్లున్నది :

కృతయుగమునందు కాలకేయగణముతో వృత్రుఁడను నసుర యమరులను బాధింపఁదొడఁగెను. నిలింపులు బ్రహ్మదేవు నొద్దకుఁ బోయి వృత్రుని జంపు నుపాయ మడిగిరి.

కమలాసనుఁడు సరస్వతీ తీరమున నిశ్చింతుఁడై తపము సేయు చున్న దధీచిని వేడుకొనిన, "నిజాస్థు లిచ్చు మీకు నమ్మహాత్ముఁ డవి జయించు వజ్రమాదిగా నిఖిల దివ్యాయుధంబులై సురారివరుల నందు వజ్రంబున నింద్రుడు వృత్రు వధియించు" నని చెప్పెను. —నన్నయ. భార. అరణ్య. 3. 2-3

* "When Tvastar deft of hand had turned the thunder bolt golden, with thousand edges, fashioned skilfully Indra received it to perform heroic deeds."

— The Hymns of the Rigveda, Ralph. T.H. Griffith

దధీచి యస్థులతోఁ జేయఁబడిన వజ్రాయుధము మహా భయంకరాకృతి గలిగి షట్కోణయుక్తమై ఘోరనిస్వనోపేతమై శత్రువుల సంహరింపఁ జాలు నని బ్రహ్మదేవుఁడు చెప్పినట్లు మూలము నందు వర్ణింపఁబడినది.

తస్యాస్థిభిర్ మహాఘోరం వజ్రం సంస్క్రియతాం దృఢమ్
మహచ్ఛత్రుహణం ఘోరం షడస్రిం భీమనిస్వనమ్॥

—వ్యా. భా. వన 100-10, 11

దేవతలు దధీచిని ప్రార్థింపఁగా, నా పరమమునీంద్రుడు సంతసిల్లి కృతార్థుండ నయితి నని దేవహితార్థంబుగా నిజప్రాణంబులు విడిచె నమరు లెల్ల నమ్మహాముని యస్థు లాయుధంబులుగాఁ బరిగ్రహించి రందు

త్వష్ట యంత నూఱుధారల రమ్యమై యనలకణకరాళమైన
వజ్రి మొనరఁజేసి దీని నోర్వము దైత్యుల ననుచు నిచ్చె దాని నమరపతికి

—నన్నయ. అరణ్య. 3. 5-7

పరమేష్ఠి వచనానుసారము దేవతలు జయార్థులయి దధీచి యస్థులు గ్రహించి దేవ శిల్పి యగు త్వష్టృదేవుని సమీపించి తమ కోర్కెను దెలుపఁగా త్వ ష్టృ ప్ర జా ప తి సంతోషించి బహుప్రయత్నముతో భయంకర మయిన వజ్రము నిర్మించి దేవేంద్రుని కిచ్చి శ్రేష్ఠమయిన యీ వజ్రాయుధముతో సురారు లను వధింపు మని చెప్పినట్లు మూలమునందు వర్ణింపఁబడినది.

ప్రహృష్టరూపాశ్చ జయాయ దేవా స్త్వష్టారమాగమ్య తమర్థమూచుః
త్వష్టా తు తేషాం వచనం నిశమ్య ప్రహృష్టరూపః ప్రయతః ప్రయత్నాత్
చకార వజ్రం భృశముగ్రరూపం కృత్వా చ శక్రం స ఉవాచ హృష్టః
అనేన వజ్రప్రవరేణ దేవ భస్మీకురుష్వాద్య సురారిముఖ్యమ్॥

—వ్యా భా. వన. 100-23, 24

ఆయుధములలో వజ్రము శ్రేష్ఠ మైనది.

ఆయుధానాం వరం వజ్రమ్॥ —విరాట. 2-16

* "దేవతా ఓం కీ బాత్ సున్‌కర్ త్వష్టా ప్రజాపతీ బఢే ప్రసన్న హువే
ఉన్‌హోంనే ఏకాగ్రచిత్త హో ప్రయత్నపూర్వక
అత్యంత భయంకర్ వజ్రికా నిర్మాణ్ కియా॥
—హిందీ అనువాదము. శ్రీ మహాభారతము - గోరఖ్‌పూరు ప్రతి

## వజ్రాకృతి

ఇంద్రుం డతని [దధీచి] శల్యంబుల విశ్వకర్మ నిర్మితంబై నిశిత శతధారాసమావృతంబై వెలుంగు వజ్రాయుధంబు గైకొనినట్లు భాగవతమునందు వర్ణింపఁబడినది.[1]

అది శతహస్త ప్రమాణము గలిగి షట్కోణ యుక్తమై నడుమ సన్నగను పార్శ్వము లందు స్థూలముగను నుండి భయంకరాకృతి గలిగియుండు నని స్కాంద మహాపురాణము నందుఁ జెప్పఁబడినది.

శతహస్త ప్రమాణం తత్ షడస్రి చ సురాధిప
మధ్యే క్షామం తు పార్శ్వాభ్యాం స్థూలం రౌద్రసమాకృతి॥
—స్కాంద, నాగరఖండ. 9-74

త్వష్ట చే నిర్మింపఁబడిన వజ్రాయుధము లోహమయ మనియు, హిరణ్మయ మనియు వేయియంచులు గల దనియు నూఱు కోణములు గల దనియు ఋగ్వేదమునందు పలుతావుల వర్ణింపఁబడినది.

అభ్యేనం వజ్రీ ఆయసః సహస్ర భృష్టిః॥ —ఋగ్వేద. 1. 80-1
అథ త్వష్టా తే మహ ఉగ్ర వజ్రం
సహస్రభృష్టిం వవృతచ్ఛతాశ్రిమ్॥ —ఋగ్వేద. 6. 17-10

సహస్రభృష్టి యనఁగా ఒకేసారి వేయిమందిని హతమార్చగలదని యర్థము. అది నేటి మెషిన్‌గన్ (Machine Gun) వంటి యాయుధ మని వేదపండితులు కొందఱు భావించుచున్నారు.[2]

సహస్రభృష్టి యన వేయి నెమ్ములు (Spikes) గల దని గ్రిఫిత్ అనువదించినాఁడు.[3]

---

1. ఆంధ్ర మహాభాగవతము 6-359 = వ్యాసభాగవత పురాణము. 6-10-13
ఆథేంద్రో వజ్ర ముద్యమ్య నిర్మితం విశ్వకర్మణా॥

2. చూడు :- 1) వే. శా. స్వామీ వేదానంద (దయానంద) తీర్థ :
"స్వాధ్యాయ సందోహ" విరజానంద వైదిక సంస్థాన్
గజియాబాద్ (ఉ. ప్ర.) - పు. 369
2) దయానంద సరస్వతి : ఋగ్వేద భాషాభాష్యము.

8 Cf :- Ralph T. H. Griffith : The Hymns of the Rigveda. Vol. I
"Yea, strong one I Tvastar turned for thee, the Mighty, the bolt with thousand spikes and hundred edges."

## ఆది గద కౌమోదకి

అగ్నిదేవుని కోరికపై వరుణుఁడు "సుదర్శనం బను చక్రంబును గౌమోదకి యను గదను" నారాయణున కిచ్చెను. —నన్నయ. ఆది. 8-254

ఆది గద యైన కౌమోదకిని విశ్వకర్మ విష్ణువుచే నిహతుఁ డయిన గదాసురుని యస్థులతో నిర్మించినాఁడు.

నిశ్చలార్థం స్వయం దేవః స్థిత ఆదిగదాధరః
గదో నామాసురో దైత్యః స హతో విష్ణునా పురా॥
త దస్థినిర్మితా చాద్యా గదా యా విశ్వకర్మణా
ఆద్యయా గదయా హేతిప్రముఖా రాక్షసా హతాః ॥
—అగ్నిపురాణము. 114-26, 27

## భీమ గద

భౌమాదిత్యుండను రాజర్షి చేత నిహితంబయి సకలశత్రుఘాతిని యైన దాని భీమసేనున కొక్కగద...... నిచ్చెద నని చెప్పి ధర్మరాజు చేత సత్కృతుండయి మయుం డరిగె. — నన్నయ, సభా 1.8

సహస్రగదలతో సమానమయిన బరువుతో దృఢ మయిన యా గదపై బంగారు చుక్కలు చెక్కబడినవి.

సువర్ణబిందుభిశ్చిత్రా గుర్వీ భారసహా దృఢా
సా వై శతసహస్రస్య సమ్మితా శత్రుఘాతినీ॥ —వ్యా. భా. సభా, 3-56

గద యన ఎనిమిది కోణములు గలిగి క్రింది భాగము లావుగా నుండి గుండెను దాకునంత యెత్తుగా నుండు నాయుధ విశేషము.

అష్టాస్రా పృథుబుధ్నా తు గదా హృదయసమ్మితా॥—శుక్రనీతి. 4 7-212*

భీమసేనుఁడు మణిమంతునిపయి ప్రయోగించిన గద యినుముతోఁ జేయఁబడి బంగారు రేకు తొడుగు వేయబడినది.

రుక్మపట్టపినద్ధాం తం శత్రూణాం భయవర్ధనీమ్
ప్రగృహ్యాథ నదన్ భీమః శైక్యాంసర్వాయసీం గదామ్॥
— వ్యా. భా. వన. 160-71

* Cf ;- The SUKRA NITI : Benoy Kumar Sarkar. P 289

హేమ బంధ బంధురంబును నమోమయంబును నగు గదాదండంబుఁ దిప్పుచు భీముఁడు జయద్రథుని గవిసినాఁడు. —ఎఱ్ఱన, అరణ్య. 6-218

హేమ చిత్రసముత్సేధాం సర్వశైక్యాయసీం గదామ్
ప్రగృహ్యోదద్రవద్ భీమః సైంధవం కాలచోదితమ్॥ —వన. 171-4*

భీమ గద శైక్య నామకలోహనిర్మితము.

శల్యునితోఁబోరుచు భీముండు గన్నుల నిప్పులురాల......
నెనిమిది యంచుల నెసఁగు మెఱుంగుల దారుణంబగు గదాదండ
ముగ్రరేఖ సారించినాఁడు. —తిక్కన. శల్య. 1-168

వజ్ర సదృశమైన యీ గద వజ్రములు మణులు రత్నములు పొదిగిన బంగారు పత్రములతో నలంకరింపఁబడినది.

హేమ పట్ట పరిక్షిప్తాముల్కాం ప్రజ్వలితా మివ
శైక్యాం వ్యాలి మివోత్యుగ్రాం వజ్రకల్పా మయోమయీమ్॥
తాం వజ్ర మణి రత్నాఢ్యా మష్టాస్రిం వజ్రగౌరవామ్॥
—వ్యా. భా. శల్య. 11. 51-57

అష్టకోణయుక్తముగా లోహనిర్మితమై స్వర్ణభూషణాలంకృతమై యుండు భీమ గద నేను మనోనేత్రముతోఁ జూచుచున్నానని ధృతరాష్ట్రుడు సంజయునితో ననుచున్నాఁడు.

అష్టాస్రి మాయసీం ఘోరాం గదాం కాంచనభూషితామ్
మనసాహం ప్రపశ్యామి బ్రహ్మదండ మివోద్యతమ్॥
—వ్యా. భా. ఉద్యోగ. 51-8

ద్రోణ పర్వము నందొకచో భీమ గద యాఱు కోణముల గలిగి నాలుగు మూరలు పొడవు గలిగి యున్నట్లు వర్ణింపఁబడినది.

తతో భీమో మహాబాహుః క్రోధసంరక్తలోచనః
వజ్రకల్పాం చతుష్కిష్కుం గుర్వీం రుక్మదండాం గదామ్॥
ప్రాహిణోద్ సూతపుత్రాయ షడస్రామవిచారయత్॥
—ద్రోణ. 134-10, 11

ఈ వర్ణనములనుబట్టి మహాభారతకాలమున శిల్పులు గదాద్యాయుధములను శాస్త్రానుసారము నిర్మించుచుండి రని తెలియుచున్నది.

* "శైక్య నామక్ లోహే సే బనాయా గయాథా॥"

# ఖడ్గోత్పత్తి ప్రభావములు

రక్షణార్థాయ లోకస్య వధాయ చ సురద్విషామ్
తతః తద్రూప ముత్సృజ్య బభౌ నిస్త్రింశ ఏవ సః॥
విమలస్తీక్ష్ణధారశ్చ కాలాంతక ఇవోద్యతః ॥

—వ్యా. భా. శాంతి. 166-44

కృపాణరణనిపుణుఁడగు నకులునకు సకలాస్త్ర శస్త్రసారవిశారదుం డయిన భాగీరథీసుతుఁడు ఖడ్గ ప్రభవ ప్రభావంబుల నెఱిగించెను.

సుర మునివ్రాతములను బాధించు దైత్యులను హతమార్చుటగు పరమేష్ఠి హిమశైలతటంబున "వేయి వత్సరము లధికనియతిమెయిఁదప మొనరించి నిష్ఠఁ గ్రతువుసేసె నయ్యనగ్నిన శేషలోకభీతికరమగు సుగ్రంపు భూత మొకటి ప్రాంశు కృష్ణయై దంష్ట్రలు ప్రజరిల్లఁ బుట్టెను. దానిని జూచి భయపడుచున్న సురలను మునులను చూచి సరసిజభవుండు

"ఇది రాక్షస నాశనంబునకుం దోఁచిన యుత్పాతంబు. లోకంబుల రక్షింపను రాక్షసుల వధియింపను సాధనంబుగా ఖడ్గంబు గల్పించితి" నని పలుక నా భూతం బారూపంబు విడిచి ఖడ్గాకృతి గైకొని తన మెఱుంగులు దిక్కులం దీటుకొనఁబొచ్చె. —తిక్కన. శాంతి. 3-444

కమలాసనుఁడా ఖడ్గమును శితికంఠున కొసఁగెను. హరుఁడు దానిని హరికిచ్చెను. ఆ విష్ణువు మహాస్త్రరూపంబగు నయ్యాయుధంబు పదంపడి మరీచి కొసఁగె; మరీచి భార్గవునకు, భార్గవుండనేకమునులకు మునులింద్రునకు, నింద్రుండు లోకపాలురకు నొసంగెఁ గ్రమంబున మను ప్రభృతులైన మానవేంద్రులు వడసి నిజసంతతికి నిచ్చుచు వచ్చిరి. అందు దుష్యంతుఁడు భరతున కిచ్చె నా భరతు వంశంబునందు ఖడ్గ సంప్రదాయము గలిగి వచ్చె; నాకముని యనుగ్రహింప ద్రోణుం డధిగమించి కృపునకిచ్చెఁ; గృపుని చేత మీ రేవురుఁ బడసితిరి; విశేషించి యీ విద్యయం దత్యంతాదరణవంతుండ వగుటఁజేసి దీని వలన వెలసితివి

"నిస్త్రింశంబునకు నక్షత్రంబు కృత్తిక; యగ్ని యధిదేవత; గురుండు రుద్రుండు" అని చెప్పి వెండియు నిట్లను

"అసి విశసనంబు ఖడ్గంబు తీక్ష్ణధారంబు దురాసదంబు శ్రీగర్భంబు
విజయంబు ధర్మపాలం బన నెనిమిది పూజ్య నామంబులం బరఁగి
కృపాణంబు ప్రహరణంబులలోనం బ్రధానంబై నెగడుచుండు."

—తిక్కన శాంతి. 3-449

# హేమ పరిష్కృత ఖడ్గములు

ఉత్తరకుమారుఁడు శమీవృక్షముపై నున్న బహువిధంబులగు నాయుధంబు లుపలక్షించి వేఱువేఱు వాని చందంబు లుపన్యసించి యివి యెవ్వ రెవ్వరి వని బృహన్నల నడిగినాఁడు.

గురుభారసహో దివ్యః శాత్రవాణాం భయంకరః
కస్యాయం సాయకో దీర్ఘః శిలీపృష్ఠః శిలీముఖః॥ 11

వైయాఘ్రకోశే నిహితో హేమచిత్ర త్సరుర్మహాన్
సుఫలశ్చిత్ర కోశశ్చ కింకిణీసాయకో మహాన్॥ 12

కస్య హేమత్సరుర్దివ్యః ఖడ్గః పరమ నిర్మలః
కస్యాయం విమలః ఖడ్గో గవ్యే కోశే సమర్పితః॥ 13

హేమత్సరురనాధృష్యో నైషధ్యో భారసాధనః
కస్య పాంచనఖే కోశే సాయతో హేమవిగ్రహః॥ 14

ప్రమాణరూప సంపన్నః పీత ఆకాశసన్నిభః
కస్య హేమమయే కోశే సుతప్తే పావకప్రభే॥ 15

నిస్త్రింశోఽయం గురుః పీతః సాయకః పరనిర్వ్రణః
కస్యాయ మసితః ఖడ్గో హేమబిందుభిరావృతః॥ 16

—వ్యా. భా. విరాట. 42. 11-16*

---

* చూడు :- నీలకంఠ విరచిత భావదీపాఖ్య టీక చిత్రశాలాప్రతి -
శిలీ భేకీ పృష్ఠే చిత్రరూపేణ యస్య పరిచయార్థే శిలిముఖో
భేక్యా ముఖ మివ ముఖం యస్య సాయకః ఖడ్గః
శరే ఖడ్గే చ సాయకః ఇత్యమరః॥ 11. వైయాఘ్రకోశే
వ్యాఘ్రచర్మకోశే త్సరుః ఖడ్గాదిముష్టౌ స్యాత్ ఇత్యమరః॥
సుఫలః శోభనభల్లికః ఫలం శస్త్రాగ్రే వ్యుష్టిలాభయోః ఇతి విశ్వః
కింకిణీయుక్తః సాయకః॥ 12. గవ్యే గోచర్మజే॥ 13
నైషధ్యో నిషధదేశజః పాంచనఖే అజచర్మజే పాంచనఖ్యోఽజే కూర్మే
ఇతి విశ్వః॥ హేమవిగ్రహః సువర్ణేనాలంకృతదేహః॥ 14.
ఆకాశసన్నిభః కృష్ణభాస్వరః॥ 15. నిస్త్రింశః త్రింశతోఽంగులిభ్యోనిర్గతః
త్రింశత్యంగుల్యాధికః ఖడ్గః॥ పరేషాం శస్త్రేణ నిర్గతో యస్య
పరానభిభూతః॥ 16

ఖడ్గములను గూర్చి యుత్తరుఁ డడిగిన ప్రశ్నలనుబట్టి యవి యన్నియు సువర్ణాలంకృతములనియు నా కత్తుల యొఱలు పులి, యెద్దు, మేక మున్నగు జంతువుల చర్మములతోఁ జేయఁబడిన వనియుఁ దెలియుచున్నది.

అవి పాండవుల ఖడ్గములు :

ఏ ఖడ్గ మెవరిదో యర్జునుఁడు తెల్పినాఁడు.

భేకీ ముఖాకృతిగల యగ్రభాగమును, భేకీ చిత్రము గల పృష్ఠ భాగమును గల పొడవయిన ఖడ్గ మర్జుననిది. భేకి యన అడుకప్ప.

పులి చర్మపు టొఱ యందున్న భయంకరఖడ్గము భీమునిది. ఇది సువర్ణచిత్రితము. [హేమ చిత్రః ॥ — విరాట. 42-12]

చక్కని మొనయు బంగారు పిడియు గల దివ్య నిస్త్రింశము ధర్మరాజుది. [హేమత్సరు రనుత్తమః॥ — విరాట. 43-2।[

మేక తోలుతోఁజేయఁబడిన యొఱయందున్న ఖడ్గము నకులునిది. ఇది హేమవికృతము.

గోచర్మ మయకోశము నందున్న విశాలమైన ఖడ్గము సహదేవునిది. ఇది సువర్ణబిందు ఖచితము.

ఈ నిస్త్రింశము లన్నియు శస్త్రాఘాతములను సహింపఁజాలినవే. [చూడు :- వ్యా. భా. విరాట 43. 19-23]

సువర్ణాలంకృత మయిన యొక ఖడ్గమును గూడ రథముపై నుంపుమని బృహన్నల యుత్తరునికిఁ జెప్పినాఁడు,

ఏకం చాహర నిస్త్రింశం జాతరూప పరిష్కృతమ్॥

—విరాట. 45-4*

ఈ వర్ణనము వలన మహాభారతకాలమున లోహశిల్ప కళాకారులు లోహముతో నిర్మింపఁబడిన ఖడ్గములను బంగరుపూతతోను [పీతః] బంగరు చుక్కలతోను [సువర్ణబిందుభిరావృతః] చక్కగా నలంకరించు చుండరనియు, వానికి సువర్ణ మయములు, గజదంత మయములు, మణిమయములు[1] నైన పిడులు చేయుచుండి రనియు తెలియుచున్నది.

తిక్కన యనువాదము నందీ ఖడ్గ విశేష వర్ణనములు లేవు.

---

పోల్చు :- వ్యా. భా. 139.63

స చర్మాదత్తం కౌంతేయో జాతరూప పరిష్కృతం ఖడ్గం॥

1. వ్యా భా ద్రోణ. 48-37 ఖడ్గం మణిమయత్సరుమ్.

# శత చంద్రాసి చర్మములు

నిస్త్రింశం వ్యదృశ్యంత విమలాదిత్య సన్నిభాః
ఆర్షభాణి విచిత్రాణి శతచంద్రాణి భారత॥
అశోభయంత రణే రాజన్ పాత్యమానాని సర్వశః॥
—వ్యా. భా. భీష్మ. 87. 30-31

రణరంగము నందు ఖడ్గములు నిర్మలములై సూర్య సదృశకాంతితో ప్రకాశించుచున్నవి వృషభచర్మ నిర్మితములైన ఖేటకములు నూఱు చంద్రాకృతి చిహ్నములతో శోభిల్లుచున్నవి.

ద్రోణాచార్యుని వధించు నుద్దేశ్యముతో ధృష్టద్యుమ్నుఁడు,
"వాలునుం బలకయు ఘోరాకృతిం బుచ్చికొంచురయంబారఁ గడంగి
బెట్టిదర సంక్షోభించె నీసైన్యముల్" —తిక్కన, భీష్మ. 2-56

వాలనఁగా ఖడ్గము, కత్తి, పలక యనడాలు, ఖేటకము, చర్మము. ఖడ్గ యుద్ధమునందు శత్రువుల శస్త్రాఘాతముల నుండి తప్పించుకొనుట కుపయోగ పడు చర్మమయసాధనము.

ధృష్టద్యుమ్నుఁడు ధరించిన డాలు [పలక] నూఱు చంద్రాకార పుష్పములతో నలంకరింపబడి విశాలముగ నున్నదని మూలమునందు వర్ణింపబడినది.

తతః స విపులం చర్మ శతచంద్రం చ భానుమత్
ఖడ్గం చ విపులం దివ్యం ప్రగృహ్య సుభుజే బలీ॥ —భీష్మ 53-3(*

కర్ణాదు లనేకు లడరి యభిమన్యుని చిక్కువఱచి యలఁచిన వాలును బలకయుఁగొని యబ్బాలుఁడు రయమూర గగనభాగంబున కున్మీలిత ధృతినాయింటై లీల నెగసిపోయె మండలీభూత గతిన్. —తిక్కన. ద్రోణ. 2-110

ఖడ్గ చర్మధరః శ్రీమా నుత్పపాత విహాయసా॥ —ద్రోణ. 48-35

---

* పోల్చు:- వ్యా. భా. ద్రోణ. 191

విమలం ఖడ్గ మాదత్త శతచంద్రం చ భానుమత్॥ 25
అగృహ్ దసి ముద్యమ్య శతచంద్రం చ భానుమత్॥ 27

శతచంద్ర మనఁగా శతచంద్రచిహ్నిత చర్మమని టీకాకారులు వివరించినారు.

శతచంద్ర : mfn adorned with a hundred moons
(or moon-like spotis)

(suc) a sword or a shield adorned with a hundred moons —Momler williams.

శల్య నందనుఁడు "పలకయు వాలును గొని తెక్కలు గల పెనుఁబాము పగిది"

వెరవున ధృష్టద్యుమ్నుని శరనికరంబెల్లఁ బలక జడియుచుఁ గిరణ
స్ఫురణాతిభీషణంబై కరవాలము మెఱయఁ జిత్రగతులన్ గవిసెన్॥
—తిక్కన. భీష్మ. 193-3

సాత్యకియు విందుండును "తేరులుడిగ్గి రుద్భాసితాసి చర్మశోభిత హస్తులై సరభసముగ." తిక్కన. కర్ణ. 1-92

వారు ధరించిన ఖేటకములు శతచంద్ర చిహ్నితములు.

విరథా వసి యుద్ధాయ సమాజగ్మతు రాహవే
శత చంద్రసితే గృహ్య చర్మాణి సుభుజౌ తథా॥
వ్యరోచతాం మహారంగే నిస్త్రింశవర ధారిణౌ॥
—వ్యా. భా. కర్ణ 13-29, 30

## పసిఁడి చుక్కల పలకలు

కళింగనరపాల సుతుండగు శక్రదేవునిపై "భీమసేనుండు ఘటితకాంచన బిందు సందోహసుందరంబును దృఢవిశాలంబును నగు పలకయుం గల్పాంత కృతాంత జిహ్వాభీలం బగు కరవాలంబును బుచ్చికొని హతహయం బగు నరదంబు డిగ్గి నాఁడని తిక్కన వర్ణించినాఁడు. —భీష్మ. 2-64

భీముఁడు పుచ్చుకొన్న పలక [చర్మము] వృషభచర్మ నిర్మిత మనియు దానిపై నక్షత్రాకారములుగ నర్థచంద్రాకృతులుఁగ సువర్ణ బిందువులు చెక్కఁబడి యున్నవనియు మూలమునందు వర్ణింపఁబడినది.

నిస్త్రింశ మాదదే ఘోరం చికీర్షుః కర్మదారుణమ్
చర్మం చాప్రతిమం రాజ న్నార్షభం పురుషర్షభ॥
నక్షత్రై రర్థచంద్రైశ్చ శాతకుంభమయై శ్చితమ్॥
— వ్యా. భా.భీష్మ. 54-27,28

ఈ విధముగా శిల్పులు ఖడ్గములపైనను, పలకలపైనను సువర్ణ చిత్రరచనలు చేయు చుండిరి.

---

* పోల్చు :- వ్యా భా. భీష్మ. 116-14
ఆర్షభే చర్మణి చిత్రే శత చంద్ర ముపస్కృతః
తారకాశత చిత్రే చ నిస్త్రింశే సుమహాప్రభా॥

# లోహమయ వర్మములు

## కాంచన చిత్రి కవచములు

మర్మాణి తే వర్మాణి ఛాదయామి॥ —ఋగ్వేద. 6.75-18

శరీరము నందలి మర్మస్థలముల నాచ్ఛాదించునది వర్మము.

బాహువులను వక్షస్థలమును శరీరము యొక్క అథోభాగమును పృష్ఠమును రక్షించు నుపకరణమును తనుత్రాణ మనియు వర్మ మనియుఁ గవచ మనియు నందురు.

అమృతరక్షకులయిన వీరులు నలుపు - ఎఱుపు - తెలుపు - పసుపు వర్ణములు గల కవచములు ధరించియున్నారని నన్నయ వర్ణించినాఁడు.

**వారలు బహుప్రకారాకారులు వీరులు నిశాతఖడ్గాది మహా**
**దారుణ శస్త్రధరులు కృష్ణారుణసితపీతఘనతరాంగత్రాణుల్.**
**—నన్నయ. ఆది. 2-90**

అయ్యమరవీరులు విచిత్రములు కాంచనమయములు వైడూర్య వికృతములు నైన కవచములు ధరించినట్లు మూలమునందు వర్ణింపఁబడినది.

**ధారయంతో విచిత్రాణి కాంచనాని మనస్వినః**
**కవచాని మహార్హాణి వైడూర్యవికృతాని చ॥ —వ్యా. భా. ఆది 30-47**

కుమారాస్త్రవిద్యాప్రదర్శన సమయమునం దర్జునుఁడు, "హరి విచిత్ర హేమకవచావృతుఁడై" రంగమధ్యమున నిలిచి నట్లు నన్నయ మూలాను సారముగనే వర్ణించినాఁడు.

కాంచనం కవచం బిభ్రత్ ప్రత్యదృశ్యత ఫాల్గునః ॥ —ఆది.135-9

అర్జునుఁడు దివ్యాస్త్రలాభార్థ ముత్తరదిశ కరుగునపుడు, 'కనక వర్మావృత ఘనతరతనుఁ జూచి' యందఱును సంతసించిరి. —నన్నయ. అరణ్య. 1-283

"హేమ చంద్రక కనద్వర్మంబు" నీకెంతయుఁ దగియుండు నని విరాటమహారాజు బృహన్నలతో నన్నాఁడు. —తిక్కన. విరాట. 1.235

సాధారణముగా కవచములు లోహమయములు.

లౌహాని కవచాని చ॥ —వ్యా. భా. విరాట. 62-4

ఖడ్గాదులు నిర్మించు కర్మారులే కవచములను నిర్మించువారు.

మహాభారత కాలమున శిల్పులు కవచములను ఇనుముతోనే గాక రాగితోను, వెండితోను, కంచుతోను, ఉక్కుతోను నిర్మించుచుండిరి.

అర్జునుఁడు తన బాణములతో భేదించిన కొంతమంది యుద్ధవీరుల కవచములు తామ్రరజత లోహనిర్మితములు.

శరైః సంఛిద్యమానానాం కవచానాం మహాత్మనామ్
తామ్ర రాజత లోహానాం ప్రాదురాసీ న్మహాస్వనః ॥
—వ్యా భా. విరాట. 62-7

ఘటోత్కచుఁడు విపులమైన కాంస్య కవచము ధరించినాఁడు.

ధారయన్ విపులం కాంస్యం కవచం చ మహాప్రభమ్॥
—వ్యా. భా. ద్రోణ. 176-11

కవచాంతర్భాగము లోహమయ మయినను దానిపై శిల్ప కళాకారులు బంగారు పూత పూసియు, బంగారుతొడుగు వేసి దానిపై చిత్ర రచనలు చేసియు, తమ కళానైపుణ్యమును జూపుచుండిరి.

విరాటరాజు సోదరుఁడైన శతానీకుఁడు ధరించిన కవచ మట్టిది.

స వజ్రాయస గర్భం తు కవచం తత్ర కాఁచనమ్ *
విరాటస్య ప్రియో భ్రాతా శతానీకోఽభ్యహారయత్॥—విరాట. 31-11

శతానీకుఁడు ధరించిన కవచము మణిమయాలంకృత మని తిక్కన వర్ణించినాఁడు.

భీకర బాణవర్షముల పెల్లున వైరులు తల్లడిల్ల.... శతా
నీకుఁడు దాఁకెఁ గంకట మణిద్యుతి విద్యుదుపాంతకాంతియై.
—తిక్కన. విరాట. 3-171

---

* చూడు:- శ్రీమన్మహాభారతము - విరాటపర్వమ్ —నీలకంఠ టీక.
వజ్రాయస మశని లోహమ్ య ద్వా వజ్రవచ్ఛేద్య మభేద్యం చ
యదయః భాషాయాం పోలాద ఇతి సంజ్ఞితం
త ద్వజ్రాయసం తన్మయో గర్భోఽంతః కవచం తేన సహితం
స వజ్రాయసగర్భమ్॥ పాఠాంతరే సన్నాహాయ సజ్జీభావాయ
సగర్భం సకంటకమ్॥
గర్భో భ్రూణేఽర్భకే వృక్షే సంధౌ పనస కంటకే ఇతి నానార్థః
'వజ్రం స్యాద్దీరకే పవౌ' ఇతి చ॥ 11. అభ్యహారయత్ బబంధ॥

మదిరాక్షుడు [మదిరాశ్వుడు] ధరించిన కవచము సర్వశస్త్రాస్త్ర క్షమముగా నుక్కుతోఁజేయబడి సువర్ణపత్రాచ్ఛాదితమును యొప్పు చున్నట్లు వ్యాసభారతమునందు వర్ణింపఁబడినది.

సర్వపారసవం వర్మ కల్యాణపటలం దృఢమ్*
శతానీకావరజో మదిరాక్షోఽభ్యహారయత్॥

—వ్యా. భా. విరాట. 31-12, 13

అతని తమ్ముఁడైన మదిరాశ్వుఁడు........వచ్చె సముజ్జ్వలహేమవర్మ నిర్యాతరుచిచ్ఛటాపటల రంజిత హేతిమహోగ్రసైన్యుఁడై.

అని తిక్కన వ్రాసినాఁడు. —విరాట. 3-146

విరాటుఁడు ఖచిత కాంచన బిందు సందోహంబగు సన్నాహంబు పెట్టుకొని యుద్ధమునకు బయలు వెడలె నని తిక్కన వర్ణించినాఁడు.

— విరాట. 3-144

మత్స్యరాజు సూర్య సదృశకాంతి గల నూఱు సుళ్లు, నూఱు సూక్ష్మ చక్రములు (బిందువులు), నూఱు నేత్రాకార బిందువులు కవచమంతటను నూఱు సౌగంధిక జాతి పద్మములు చిత్రింపఁబడిన "అభేద్యకల్ప" నామక కవచమును ధరించినట్లు మూలమునందు వర్ణింపఁబడినది.

శత సూర్యం శతావర్తం శతబిందు శతాక్షిమత్॥ 13
అభేద్యకల్పం మత్స్యానాం రాజా కవచమాహరత్
ఉత్సేధో యస్య పద్మాని శతం సౌగంధికాని చ॥ 14

—వ్యా. భా. విరాట. 31. 13-14**

---

* చూడు :- శ్రీమన్మహాభారతమ్ - విరాటపర్వమ్ - నీలకంఠ టీక
పారసవం పరాన్ సునోతి పీడయతి సువతి క్షిపతి వా పరసవమ్
ఋదోరప్ స్వార్థే తద్ధితః పారసవం శస్త్రం సర్వశస్త్రసహ మిత్యర్థః ॥
కల్యాణపటలం సువర్ణపత్రాచ్ఛాదితమ్ 'కల్యాణమక్షయేస్వర్ణే' ఇతి విశ్వః ॥

** ఆవర్తే పునః పునర్ స్నాయతి విలసతీతి యోగాత్
చంద్రః పద్మం వా బిందుః సూక్ష్మచక్రమ్ అక్షి నేత్రాకారం చక్రమ్॥ 13
ఉత్సేధో ఉచ్ఛ్రాయే సంపూర్ణే విస్తారే కల్హార జాతీయాని
శతం పద్మాని పంక్త్యా నివిష్టాని ఏవం విశాల మిత్యర్థః ॥ 14

"కౌరవసైన్యంబు భర్మపరికర్మ నిర్మాణశోభితవర్మంబులును వివిధవర్ణ విచిత్రతనుత్రాణంబులను...... పరమాభీల సుందర సమ్మర్దంబయ్యె" నని తిక్కన వర్ణించినాఁడు. —భీష్మ. 1-95

యుధిష్ఠిరుఁడు తన బాణములతో కృతవర్మధరించిన సువర్ణజటిత వర్మమును బగులఁగొట్టినాఁడు.

తే తస్య కవచం భిత్వా హేమ చిత్రం మహాధనమ్॥ —ద్రోణ. 165-29

భీమసేనుఁడు కర్ణునిపైవైచిన పదునాలుగు నారాచములు సూతపుత్రుని సువర్ణ చిత్రకవచమును ఛేదించినవి.

ప్రాహిణోద్ సూతపుత్రాయ భీమసేన శ్చతుర్దశ
తే తస్య కవచం భిత్వా స్వర్ణ చిత్రం మహౌజసః॥ —ద్రోణ 134-25

కాంతిమంత మయిన కర్ణుని కవచమును శిల్పి వరేణ్యులు చాలకాలము పరిశ్రమించి నిర్మించిరి. అట్టి శ్రేష్ఠ మయిన కవచము నర్జునుఁడు తన బాణములతో నొకక్షణములో భేదించినాడు.

మహాధనం శిల్పివరైః ప్రయత్నతః
కృతం తదస్యోత్తమ వర్మ భాస్వరమ్
సుదీర్ఘకాలేన తతోఽస్య పాండవః
క్షణేన బాణై ర్బహుధా వ్యశాతయత్॥ —వ్యా. భా. కర్ణ. 90-70

"ఫాలాక్షుండు గ్రహమండిత వ్యోమమండలం బుపాదానకారణంబుగా విశ్వకర్మ కావించిన కవచంబు దొడిగి" దానవ సంత్రాసనోత్సాహుఁ డయినట్లు తిక్కన వర్ణించినాఁడు.

విశ్వకర్మ నిర్మించిన కవచము రత్నాలంకారభూషితము.

దివ్యం చ వర్మ విహితం మహార్హం రత్నభూషితమ్
అభేద్యం విరజస్కం వై కాలచక్రబహిష్కృతమ్॥ —వ్యా. భా. కర్ణ. 34-37

ఈ వర్ణనము లన్నింటిని బట్టి చూచినచో మహాభారతకాలమున శిల్పులు లోహమయములగు కవచములకు బంగారు తొడుగులు వేయు చుండిరనియు, కొన్నింటిపయి బంగారుచుక్కలు సూర్యచంద్రాది వివిధాకృతులు చెక్కు చుండిరనియు, కొన్నింటిపయి రత్నములు ఖచితము చేయుచుండి రనియు కవచనిర్మాణమున కాద్యుఁడు శిల్పప్రజాపతి విశ్వకర్మ యే యనియు దెలియుచున్నది.

# కవచధారణ విధి

కవచములను మంత్రపూర్వకముగా ధరింపవలయును. అట్లయిన నా మంత్రశక్తి వలన నవి శత్రుదుర్భేద్యము లగును.

"....అగ్గురుం డక్కురుపతిఁ గనుగొని...... నేడొక్క యద్భుతంబు సూపెద నిక్కవచధారణంబు చేత రక్షితుండవై యతనిం దలపడుము. కృష్ణుఁడును సమస్తజనంబులు వెఱగు పడం దదీయశరంబులు నీ తనువు దాఁకకుండఁగలయవి యని చెప్పి పసిండి కత్తళంబునం దాశక్తి యావహించి యిచ్చినం బుచ్చుకొని ప్రీతుండగుచు నియతాత్ముఁడై దానిం దొడిగినాఁడు."1

"అప్పు డాచార్యుం డిది తొల్లి దేవసంరక్షణార్థంబుగా నజుండు దేవేంద్రున కిచ్చె నది యతండంగిరసునకు నంగిరసుండు బృహస్పతికి బృహస్పతి యగ్నివైశ్యునకు నగ్నివైశ్యుండు నాకును దీని నొసంగె నని యెఱింగించి సమంత్రకంబుగా దొడిగి నానావిధ వాక్యంబుల దీవనలిచ్చి పొమ్మని యనుజ్ఞ చేసెను."2

దుర్యోధనుఁడట్లు గురుకరుణఁ గవచమును బడిసినాఁడే కాని యతఁ డా విద్యారహస్యము లెఱుఁగఁడు

"వినుమాఁటది పోలెం దన తనువున కట్టంబు గాఁగఁ దగిలిచి కొన్నాఁ
డనఘ! యిటులైననెట్లగు నని యెఱుఁగఁడు దీని విధములన్నియుఁ దెలియన్"
—తిక్కన. ద్రోణ. 3-201

ద్రోణాచార్యుని ప్రియశిష్యుం డయిన యర్జునుఁ డాకవచవిద్యా రహస్యము లెఱుఁగును.

"కవచధారణమను ఘనవిద్య గవ్వడి కే నెఱింగించితి" నని ద్రోణాచార్యుఁడే చెప్పినాఁడు. —తిక్కన ద్రోణ. 2-105

అంతియకాక నివాతకవచవధార్థ మరుగు నప్పు డర్జునునకు సురేంద్రుడు "స్వర్ణరూపంబైన యభేద్యకవచము" నిచ్చినాఁడు.3

ఆ విధముగా నస్త్ర విద్యారహస్యము లెఱిగిన యర్జునుఁ డజేయుఁడు.

---

ఈ 2 :- తిక్కన, ద్రోణ. 3 116 = వ్యా భా. ద్రోణ. 94

3 :- నన్నయ. అరణ్య. 4-56 = వ్యా. భా. వన. 168-75

పోల్చు :- వ్యా భా. ద్రోణ. 103-20

"పునర్దదౌ సురపతిర్మహ్యాం వర్మ సుసంగ్రహమ్॥"

## హిరణ్మయ శిరస్త్రాణములు

విద్యుద్ధస్తా అభిద్యవః శిప్రాః శీర్షన్ హిరణ్యయీః
శుభ్రా వ్యంజత శ్రియే॥ —ఋగ్వేద. 87-25*

మరుత్తులు హిరణ్మయము లయిన శిరస్త్రాణము [శిప్రాః] ధరించినట్లు ఋగ్వేదము నందు వర్ణింపఁబడినది,

మహాభారతకాలమునను యుద్ధవీరులు సువర్ణమయ కవచములు శిరస్త్రాణములు ధరించుచుండిరి.

అర్జునుఁడు "తనుత్రాణ తలత్రాణంబులు" దాల్చినాఁడు.
—తిక్క న. విరాట. 4-168

సువర్ణమయ తనుత్రాణ శిరస్త్రాణములు ధరించినవాఁడు భీష్మాచార్యుఁడని యర్జునుఁ డుత్తరునకుఁ దెలినాఁడు.

హైమం చంద్రార్క సంకాశం కవచం యస్య దృశ్యతే
జాతరూప శిరస్త్రాణం మనస్తాపయతీవ మే॥ —విరాట 55-57

దుశ్శాసనుఁడు హేమమయ శిరస్త్రాణము ధరించినాఁడు.

జాంబూనద శిరస్త్రాణః శూర స్తీవ్రపరాక్రమః॥ —ద్రోణ. 90-6

దుర్యోధనుఁడు, "కనకచిత్రంబులగు శిరస్త్రాణకంకటంబులు గైకొని ధరియించి కాంచనాచలంబు ననుకరించుచు గద చేతనమర్చి" పాండవాగ్రజునిపై కుఱికెను. —శల్య. 2-14

తతస్తు వసుతో రాజన్ వర్మ జగ్రాహ కాంచనమ్
విచిత్రం చ శిరస్త్రాణం జాంబూనద పరిష్కృతమ్॥
—వ్యా. భా శల్య. 32-63

ఈ వర్ణనములనుబట్టి ఋగ్వేద కాలమునను మహాభారత కాలమునను యుద్ధవీరులు హిరణ్మయ శిరస్త్రాణములు ధరించుచున్నట్లు తెలియుచున్నది.

ఖడ్గములు, కవచములు చేయు లోహకారులే శిరస్త్రాణములు కూడ నిర్మించి బంగారు పూత మెఱుఁగు వేయుచుండిరి.

---

* Cf :- R. V. 8-7-25 Eng. Tr. Griffith
"They deck themselves for glory, bright celestial, lighternig in their hands and helms of gold upon their heads."

1 పోల్చు :- శిరస్త్రాణైః సకాంచనైః॥ —వ్యా. భా. ద్రోణ. 113-4

## రుక్మ పృష్ఠ చాపములు - హేమ పుంఖ బాణములు

మహాభారత సంగ్రామమున యుద్ధవీరులు ధరించిన ధనుర్బాణములు సువర్ణ రజత పరిష్కృతములు.

జాతరూప పరిష్కారై ర్ధనుర్భిః సుమహాస్వనైః
సువర్ణ పుంఖై రిషుభిర్నారా చైశ్చ సహస్రశః ॥
—వ్యా. భా. ద్రోణ. 138-18

ముఖ్యముగ వింటి కొప్పులు, బాణముల క్రిందిభాగములు బంగారు పూతలతో నలంకరింపఁబడి యున్నట్లు వ్యాసభారతము నం దనేక విధములుగా వర్ణింపఁబడినది.

రుక్మ పృష్ఠాని చాపాని వ్యతిషిక్తాని ధన్వినామ్॥ —విరాట 32-3*

సాత్యకిస్తు రణే ద్రోణం రాజన్ వివ్యాధ సప్తభిః
హేమపుంఖైః శిలాధౌతైః కంక బర్హిణ వాజితైః ॥ —ద్రోణ. 113-24**

పృష్ఠ మన వెనుకభాగము వింటి కొప్పు

రుక్మ పృష్ఠః } బంగారము (బంగరు రంగు) పూయఁబడిన కొన గల విల్లు
సువర్ణ పృష్ఠః } Coated with gold; gilded.

పుంఖ మన బాణము క్రింది చివర. పింజె. అల్లె త్రాటికిc దగిలించు భాగము
The feathered part of the arrow

హేమ పుంఖః = సువర్ణాలంకృత మయిన పుంఖము గలది,

---

* పోల్చు :-1) రణే చారూణి చాపాని హేమ పృష్ఠాని మారిష
జాతరూపమయైః పుంఖైః రాజితైః నిశితా శరాః ॥
—వ్యా. భా. భీష్మ.96-48, 49

2) సువర్ణ పృష్ఠానాం చాపానాం కూజతే రణే॥ —వ్యా. భా. ద్రోణ. 130-121
"సువర్ణమయ పృష్ఠభాగ్‌వాలే సమ్మిలిత శబ్దోంకో"

** "రాజన్ తబ్ సాత్యకి నే సమరాంగణ్ మే శాన్‌పర్ చఢాకర్
తేజ్ కియే హుఏ॥ "సువర్ణమయ పాంఖ్ వాలే తథా కంక
ఔర్ మోర్ కీ పాంఖోంసే సంయుక్త హుఏ సాత్ బాణోం ద్వారా
ద్రోణాచార్యకో క్షత విక్షత కర్ డాలా॥"
—పుట. 3403 శ్రీ మహాభారత - హిందీ అనువాద.

## చిత్ర విచిత్ర చాపములు

నానాధాతు విచిత్రాణాం కార్ముకాణి మహాత్మనామ్
విస్ఫారితాన్యదృశ్యంత తోయదేష్వివ విద్యుతః ॥ —భీష్మ. 49-32

యుద్ధవీరుల కార్ముకములు నానావిధవర్ణములతో మేఘము లందలి విద్యుల్లతల వలె మెఱయుచు దృష్టిగోచర మగు చున్నవి.

పాండవుల ధనువులు స్వర్ణమయములయిన యెద్దులు, కోతులు, చేపలు, నెమళ్లు మున్నగు వాని చిత్రములతో నలంకరింపఁబడి యున్నట్లు తిక్కన వర్ణించినాఁడు.

"నీలోత్పల చ్ఛాయ నెరసి సౌపర్ణవృషావలి నొప్పు బాణాసనంబుఁ
దాళప్రమాణ సుందరమునై భర్మశాఖామృగాంచితమగు కార్ముకంబుఁ
దీవ్రకుశానల దీప్తాకృతియుఁ గనత్కనక మత్స్యంబులుఁగలుగు ధనువు
మెఱుగాఱు సారంబు మెఱయఁగాంచనమయూరముల శోభిల్లు
చాపమును వరుసఁ
బాండవాగ్రజుండుఁ బవనపుత్రుఁడు నకులుండుఁ దదనుసంభవుండుఁ
బట్టునవి కుమార!" - యని బృహన్నల యుత్తరునకుఁ దెలిపినాఁడు.[1]
ఈ సందర్భమున తిక్కన వర్ణనము మూలభిన్నముగా నున్నది.
ధర్మరాజాదుల కార్ముకముల వర్ణనము వ్యాసభారతమునం దిట్లున్నది:

పూజితం సురమర్త్యేషు బిభర్తి పరమం వపుః
సుపార్శ్వం భీమసేనస్య జాతరూపగ్రహం ధనుః
యేన పార్థోఽజయత్ కృత్స్నాం దిశం ప్రాచీం పరంతపః ॥ 8
ఇంద్రగోపక చిత్రం చ యదేత చ్చారు దర్శనమ్
రాజ్ఞో యుధిష్ఠిర స్యైతద్ వైరాటే ధనురుత్తమమ్॥ 9
సూర్యాయస్మింస్తు సౌవర్ణాః ప్రకాశం తే ప్రకాశినః
తేజసా ప్రజ్వలంతో వై నకులస్యైతదాయుధమ్॥ 10
శలభా యత్ర సౌవర్ణా స్తపనీయ విచిత్రితాః
ఏత న్మాద్రీ సుతస్యాపి సహదేవస్య కార్ముకమ్॥ 11

1. తిక్కన. విరాట. 4-125 = వ్యా. భా. విరాట. 4 3. 8-11

# గాండీవము

బిందవో జాతరూపస్య శతం యస్మిన్ నిపాతితాః
సహస్రకోటి సౌవర్ణాః కస్యైతద్ ధనురుత్తమమ్॥ —విరాట. 42.1

ఇది యొక చాపము విస్మయ మొదవించుచుఁ గొండచిలువ యొకొనాఁ దగి యున్నది ఖచితకనక కమలసముదయద్యుతి సగూముపహానోజ్జ్వల మగుచున్.

దీనిం బాండవుల యం దెవ్వరు ధరియింతు రని ఉత్తరకుమారుఁ డర్జునుని ప్రశ్నించినాఁడు. —తిక్కన. విరాట. 4.118

అది యర్జునుని చాపము గాండీవము. శాతకుంభ పరిష్కృతము.

సర్వాయుధమహామాత్రం శాతకుంభపరిష్కృతమ్*
ఏతత్త దర్జునస్యాద్ గాండీవం పరమాయుధమ్॥ ఒవిరాట. 43.2

"ఆవ్యవురుసోపలాలిత ముద్యోతితరోచి రుద్గమోగ్రం బరినిర్భేద్యము దివ్యజనన మనవద్యం బది కార్ముకైకవరము కుమారా!"

"అమ్మహనీయ చాపంబు బ్రహ్మ శతసహస్రవర్షంబులు, ప్రజాపతి చతుష్షష్టి సహస్రంబులు నిందుండు పంచాశీతి హాయనంబులు సోముండు పంచశతాబ్దంబులు వరుణుండు శతశరత్సమితియుఁ గ్రమంబునం ధరియించిరి. వరుణుచేత నగ్నిదేవుఁడు వేడుక పడి పుచ్చికొని పదంపడి యద్భుత కర్మంబునకుమెచ్చి వివ్వచ్చున కిచ్చె నతండును నఱువదేనేండ్లు ధరియింపంగలవాఁ డిట్లిది త్రిలోకపూజ్య మహిమ నొప్పుచుండు" నని యర్జునుఁడు వైరాటికిఁ దెలిపినాఁడు. —తిక్కన. విరాట. 4. 121-2

ఈ గాండీవము శత సహస్ర కార్ముకములతో సమానమైన దనియు రాష్ట్ర వర్ధనహేతు వనియు చిత్ర విచిత్ర వర్ణములతో నొప్పుచున్న దనియు దేవ దానవ గంధర్వాదులచే నెల్లపుడు పూజింపఁబడు చుండెడి దనియుఁ వ్యాస భారతమున ఆదిపర్వము నందు వర్ణింపఁబడినది.

ఏకం శత సహస్రేణ సంమితం రాష్ట్ర వర్ధనమ్
చిత్ర ముచ్చావచై ర్వర్ణైః శోభితం శ్లక్ష్ణ మవ్రణమ్॥
దేవ దానవ గంధర్వైః పూజితం శాశ్వతీః సమాః
ప్రాదాచ్చైవ ధనూరత్న మక్షయ్యే చ మహేషుధీ॥ —ఆది. 225-8. 9*

* పోల్చు :- సువర్ణ వికృతు దివ్యం శ్లక్ష్ణ మాయత మవ్రణమ్॥ —వ్యా.భా. విరాట. 42-8

## కర్ణుని విజయచాపము

సర్వాయుధమహామాత్రిం విజయం నామ తద్ధనుః
ఇంద్రార్థం ప్రియకామేన నిర్మితం విశ్వకర్మణా॥

—వ్యా. భా. కర్ణ 32-44*

మును విశ్వకర్మ దేవేంద్రునకై నిర్మించె మహితచాపము విజయం
బను చాపము దానన బహుదనుజుల మర్దించె నతఁ డుదగ్రస్ఫూర్తిన్

పరిచయ సక్తచిత్తుఁడయి భార్గవ రామున కాతఁడిచ్చిన్
బరుష పరాక్రమమ్మున నృపాలుర నెల్లను నమ్మహాభుజుం
డిరువది యొక్కమాఱు సమయించెఁ దదీయ నితాంతశక్తి న
ప్పరమదయాపరుండొసఁగెఁ బార్థివ నా కది కూర్మి పెంపునన్.

"నా విజయంబును విజయు గాండివంబును నొక్కరూప" అని కర్ణుఁడు శల్యునికిఁ దెలిపినాఁడు. —తిక్కన. కర్ణ. 1-232, 3

కర్ణుని ధనుస్సు సువర్ణాలంకృతము.

స విస్ఫార్య మహచ్చాపం కార్తస్వరవిభూషితమ్

—వ్యా. భా. ద్రోణ. 139-24. 25

కర్ణుఁడు స్వర్ణభూషితమయిన మహాచాపము నెత్తి క్రూరదృష్టిలో భీముని చూచుచు ధనుష్టంకారముచేసినాఁడు "...అంతం గాంచన భాసితంబగు శరాసనంబుగొని రాధేయుండు రయంబునఁ దీవ్రశరంబులు" కిరీటిపైఁ బరగించినాఁడు. —తిక్కన. ద్రోణ. 4 301

కర్ణుఁడు భీమునితో యుద్ధము చేయుచు,

పఱపె బలువింటఁ గర్ణుండు పటుశరములఁ
పట్టపగలింట సూర్యుని ప్రభలువొలయ" —తిక్కన. ద్రోణ. 4-231

ఈ శరములు సువర్ణపుంఖయుక్తములని చూలమునందున్నది.

స్వర్ణపుంఖాః సువిశితాః కర్ణచాపచ్యుతాః శరాః
ప్రాచ్ఛాదయన్ మహారాజ దిశః సూర్యస్య చ ప్రభాః॥ —ద్రోణ. 139-3౯. 31

---

* పోల్చు :- "ఏవ ముక్త్వా మహారాజ సూతపుత్రః ప్రతాపవాన్
ప్రగృహ్య విజయం వీరో ధనుశ్శ్రేష్ఠం పురాతనమ్॥—వ్యా భా. కర్ణ, 64-45
కర్ణుని కార్ముకము పేరు కాలపృష్ఠ మని యమరము,

## కంకపత్రములు : కాంచనపుంఖములు

స శీఘ్రితర మాదాయ ధను రన్యద్ప్రతాపవాన్
ద్రోణ మభ్యహనద్ రాజంస్త్రింశతా కంక పత్రభిః॥

—వ్యా. భా. ద్రోణ. 21-11

కంక పత్రము లనఁగా బాణములు రాపులుఁగు ఱెక్కలు కట్టబడినవి. సత్యజిత్తు ద్రోణాచార్యునిపై ముప్పది (మూఁడు వందలు) బాణములు ప్రయోగించినాఁడు.

మహాభారతకాలమున శిల్పకారులు లోహమయ బాణములు నిర్మించి బాణమూలములను రాపులుఁగు. నెమలి, గ్రద్ద మున్నగు పక్షుల ఱెక్కలతో నలంకరించి వానికి బంగారు రంగు పూతపూయు చుండిరి. శిలీముఖాగ్రభాగములను శాణముపై నూఱి పదను పెట్టుచుండిరి.

హేమపుంఖైః శిలాధౌతైః కంకబర్హిణ వాజితైః॥ —ద్రోణ. 119-24*

గార్ధ్రి పత్రాన్ శిలాధౌతాన్ కార్తస్వరవిభూషితాన్॥ —ద్రోణ. 139-39**

భీమసేనుం "రెండు విల్లుగొని నానాకంక పత్రంబులం" గర్ణుని బొదివి పట్టు తిక్కన వర్ణించినాఁడు. —తిక్కన. కర్ణ. 2-218

కృతహస్తుండు ప్రహస్తుఁ డాహవకళాకేళీ విదగ్ధుండు ద
ర్పితుఁడై తాఁకె విభీషణుం గడఁకమైఁ బెంపారి వారిద్దఱున్
శితశల్యాగ్ర మయూరపత్ర విశిఖ శ్రేణీ శతచ్ఛన్నులై
ధృతి నొప్పారిరి చిత్రవారిధర పంక్తిచ్ఛన్న శైలాకృతిన్॥

—ఎఱ్ఱన ఆరణ్య 7-82

దుర్యోధనస్తు దశభిః గార్ధ్రిపత్రైః శిలాశితైః॥ —భీష్మ 73-17

స వరాహధ్వజస్తూర్ణం గార్ధ్రిపత్రానజిహ్మగాన్
ఆశీవిష సమప్రఖ్యాన్ కర్మార పరిమార్జితాన్॥ —ద్రోణ. 146-56

---

* పోల్చు :- 1) కంకబర్హిణ వాససః॥ —వ్యా. భా. కర్ణ. 56-26
2) తే కర్ణ చాపప్రభవా శరా బర్హిణ వాససః॥ —ద్రోణ. 137-6

** పోల్చు :- 1) "ఇషూన్ గార్ధ్రవాసపాన్" —ద్రోణ. 139-12
2) "చకర్త గార్ధ్రి పత్రేణ" —విరాట. 61-39
"శరైః స్తీక్ష్ణైర్ గృధ్రపత్రై రజిహ్మగైః॥" —విరాట. 41

## కర్మార కౌశలము

సూర్య రశ్మి ప్రతీకాశైః కర్మార పరిమార్జితైః ॥—వ్యా.భా.ద్రోణ.21-26*

కర్మారలచే మెఱుఁగు పెట్టఁబడిన బాణములు సూర్యకిరణములు వలెఁ బ్రకాశించుచున్నవి.

శల్యుతోఁ బోరుచు "నకులుఁడు రభసంబున సాయకదశకో మతని యురంబు నందుఁ జొనిపె" నని తిక్కన వ్రాసినాడు. —శల్య. 1-223

ఆ సాయకములు లోహమయములనియు, సుపర్ణపుంఖయుక్తములనియు కర్మారులచేత. సానపెట్టబడిన వనియు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

సర్వపారశవై[1] ర్బాణైః కర్మార పరిమార్జితైః
స్వర్ణపుంఖైః శిలాధౌతైః ధనుర్యంత్రప్రచోదితైః ॥ —శల్య 15-14

రారాజు ధృష్టద్యుమ్నుని "ఫాలమున గుప్పించెన్ దశోగ్రాస్త్రముల్. కాలాయసనారాచము లోలి నుదుట వాటియున్న నొప్పారెం బాంచాల వరు ముఖము మధుకరమాలికచేఁ బొలుచు తమ్మి మాడ్కిన్ జూడన్"
అని తిక్కన వర్ణించినాఁడు. —కర్ణ. 2-268

లోహమయములయిన యీ నారాచములు కర్మారులచే(లోహ శిల్పులచే) మెఱుగు పెట్టఁబడి యున్నట్లు మూలమునందు వర్ణింపఁబడినది.

తస్య తేఽశోభయన్ వక్త్రం కర్మారపరిమార్జితాః ॥ —కర్ణ. 56-30

కర్ణుఁడు క్రుద్ధుఁడై భీమసేనుని జంపుతలంపున వానిపై విసరిన సువర్ణమయ బాణములు లోహకారులచేఁ బదును పెట్టఁబడినవి.

తథా కర్ణః శితాన్ బాణాన్ కర్మార పరిమార్జితాన్
సువర్ణ వికృతాన్ క్రుద్ధః ప్రాహిణోద్ వధకాంక్షయా॥
—వ్యా భా. ద్రోణ. 139-49

---

పోల్చు.- 1) "కర్మారధౌతై ర్నిశితైరుజ్జ్వలైర్నారాచ ముఖ్యైః
త్రిభి రుగ్రవేగైః॥" —వ్యా. భా. శల్య. 20

"స సంధాయ శరాన్ తీక్ష్ణాన్ కర్మార పరిమార్జితాన్" —భీష్మ. 113-49

1 పోల్చు:- "అథ కార్ష్ణాయసై ర్బాణైః॥" —ద్రోణ. 21-4

2.... "సునార్ కే బాంజే హుఏ సువర్ణ భూషిత
తీఖే బాణోంకా ప్రహార్ కియా॥" —వ్యా.భా. హిందీ టీక గీతాప్రెస్ ప్రతి

# కనక లిప్త బాణములు

కృపాచార్యుఁడు "మండి కనకలిప్త ఘన బాణంబు వనచర కేతువుం" దాకించి నాఁడు.[1] —తిక్కన. విరాట. 5-148

త్రిగర్తపతి సుశర్మ విరటునిపై వేసిన యేఁబది బాణములు కాంచన పుంఖ యుక్తములు.

ఇంచుకయు నీడఁబోవక కాంచనపుంఖ ప్రకాండ కాంతిస్ఫాయ
త్పంచాశ బ్బాణంబులు నించె నతఁడు మత్స్యమేదినీపతి మేనన్.
— తిక్కన. విరాట. 5-189

"భీముఁడు నిగుడించు హేమలిప్త నారాచధారలు గగనలక్ష్మి కనకా భరణముల చెన్ను చేకొనియె. —తిక్కన. ద్రోణ. 4-231

సువర్ణపుంఖై ర్భీమేన సాయకై ర్నత పర్వభిః
గగనే రచితా మాలా కాంచనీవ వ్యరోచయత్॥ —ద్రోణ. 139-42

దుశ్శాసనుఁడు భీమునిపై విడిచిన బాణము సువర్ణరత్న భూషితము.
తతః శరం సూర్య మరీచి సప్రభం సువర్ణవజ్రోత్తమ రత్నభూషితమ్॥
—వ్యా. భా. కర్ణ. 2-35

భీమసేనుఁడు కర్ణుని "ఉద్యోతిత హేమభూషిత చతుర్దశ మార్గణవిద్ధుఁ" జేసినాఁడని తిక్కన మూలానుసారముగ వర్ణించినాఁడు. —తిక్కన, ద్రోణ. 4-200

తే తస్య కవచం భిత్వా స్వర్ణ చిత్రం మహౌజసః
హేమపుంఖా మహారాజ వ్యశోభంత దిశోదశ॥ —ద్రోణ. 134-25

ద్రోణాచార్యుడు ధర్మనందనుని చక్రరక్షకులలో నొక్కఁడగు సుకుమారునిపై వైచిన బాణములు సువర్ణపుంఖ యుక్తములు.

పెనుగాలిఁ బెఱుఁగు గార్చిచ్చును బోలెం బొదలి గురుఁడు సుకుమారునిఁ
గాంచనపుంఖ శరజ్వాలా వినిపాతితుఁజేసి[2] తఱిమి విభునిం గదిసెన్.
—తిక్కన. ద్రోణ. 1-203

ధృష్టద్యుమ్నుఁడు నుజ్జ్వలదష్టాపదపుంఖమార్గణావలి నయ్యుత్కృష్ట
గజఘటలఁ గలఁచెనవష్టంభ విజృంభణంబు వైరులు లొగడన్.
—తిక్కన భీష్మ. 2-210

1 పోల్చు :- "కనక లిప్తకాండంబు లూడు కొనం దాకిన" —తిక్కన. కర్ణ. 2-227

2 పోల్చు :- "గాండీవంబును కాంచనపుంఖంబులగు బాణంబులును" —విరాట 4-116

## బహుప్రకారబాణములు

నారాచై ర్వత్సదంతశ్చ భల్లై రంజలికై స్తథా
క్షురప్రై రర్ధచంద్రైశ్చ సాత్వతేన విదారితా॥
—వ్యా. భా. ద్రోణ 115-27, 28

బాణములు నారాచములు, వత్సదంతములు, భల్లములు, అంజలికములు, క్షురప్రములు అర్ధచంద్రములు నవి బహు విధములు గానున్నవి.

జాతరూప పరిష్కారై ర్ధనుభిః సుమహాస్వనైః
సువర్ణపుంఖై రిషుభి ర్నారాచైశ్చ సహస్రశః॥ —ద్రోణ. 138-18

స వత్సదంతం సంధాయ జిహ్మగా నలసన్నిభమ్॥ —ద్రోణ. 113-49

అథాపరేణ భల్లేన హేమపుంఖేన పత్రిణా॥ —ద్రోణ. 117-15

అప్పాండవవీరుండు [భీమసేనుఁడు] రోషాతి భీషణుండై యేరికిం దేఱి చూడరాక పటుభల్లంబున నతినిశిత క్షురప్రముఖంబున శిత వ్రదరంబున శాత క్షురికా ముఖంబున దీప్తార్ధ చంద్రాంబకంబున ఖర నారాచంబున క్రూర బాణంబున వక్కుమార సప్తకంబు సమవర్తి సమీపంబున కనిపె
—తిక్కన. భీష్మ. 3-73

## అర్ధచంద్ర బాణములు

వాఁడియైన కత్తివాతి యమ్మునఁగొని పగతు శిరము చెక్కలెగయ గొట్టి
వరులకెల్లఁజూడ నవ్వగు నట్లుగాఁ గలయ నైదు కూకటుల నొనర్చె.
—ఎఱ్ఱన. అరణ్య. 6-250

కత్తి వాతియమ్ము = అర్ధచంద్రబాణము.

అర్ధచంద్రేణ బాణేన కించి దబ్రువత స్తదా॥ —వ్యా. భా. వన. 272-9

సాత్యకి "యర్ధచంద్ర బాణహతి[1] గురుపుత్రు ధనువు" దునిమినాఁడు.
—తిక్కన. కర్ణ 2.258

---

1 పోల్చు :- తిక్కన. ద్రోణ. 3-158 నానార్ధచంద్రబాణములు
,, 3-264 అర్ధేందుశర చయం బడరించె
'అర్ధచంద్రః' క్షురప్రస్స్యాత్॥ —హలాయుధ నిఘంటువు [శ. ర.]
నారాచము = అచ్చము ఇనుపబాణము.
"సర్వలోహాస్తు యే బాణా నారాచాస్తే ప్రకీర్తితాః"

## భల్లములు

ద్రోణాచార్యుఁడు ధృష్టద్యుమ్నునితోఁ బోరుచు,

"భల్లముల గట్టి మై మఱు వెల్లఁజించి
యతని నెత్తుటిలో ముంచె శిరశరముల" —తిక్కన, భీష్మ, 2-53

ఈ భల్ల నామకబాణములు సువర్ణపుంఖయుక్తములై పచ్చనిరంగును వాఁడి మొనలును గలిగి యున్న వని మూలమునందు వర్ణింపఁబడినది.

భల్లాన్ సునిశితాన్ పీతాన్ రుక్మపుంఖాన్ సుదారుణాన్॥ —భీష్మ. 2-53*

తేజోధనుం డైన యర్జునుఁడు ప్రగుణమణి జాంబూనద మయంబును హస్తికక్ష్యాత్మకంబును నగు నతని[కర్ణుని] కేతనంబును గనకపుంఖ ప్రభాభాసితం బైన భల్లంబునఁ బడనేసి నట్లు తిక్కన వర్ణించినాఁడు. — కర్ణ. 3-357

సువర్ణ మౌక్తిక వజ్ర మండితముగా శిల్పులచేఁ జక్కగా నిర్మింపఁబడిన కర్ణున ధ్వజమును కిరీటి సువర్ణపుంఖయుక్తమయిన క్షురప్రముతోఁ బడఁగొట్టి నట్లు మూలము నందు వర్ణింపఁబడినది.

తం హస్తికక్షాప్రవరం చ కేతుం సువర్ణముక్తామణి వజ్రపృష్ఠమ్
జ్ఞాన ప్రకర్షోత్తమ శిల్పియుక్తైః కృతం సురూపం తపతీయ చిత్రమ్॥
తతః క్షురప్రేణ[1] సుసంశితేన సువర్ణపుంఖేన హుతాగ్ని వర్చసా
శ్రియా జ్వలంతం ధ్వజమున్మమాథ మహారథస్యాతిరథో కిరీటీ॥
—వ్యా. భా. కర్ణ. 91-35, 37

## నామాంకితబాణములు

యుద్ధవీరులు కొందఱు బాణములపై తమనామములు చెక్కించుకొను చుండిరి.

ఛమ నామాంకితా బాణాన్ స్వర్ణపుంఖాన్ శిలాశితాన్॥ —ద్రోణ. 138-5

సర్వమాసీద్ జగత్పూర్ణే పార్థనామాంకితైః శరైః
రుక్మపుంఖై స్తైలధౌతైః కర్మార పరిమార్జితైః॥ —శల్య. 24-60

---

* చూడు :- శ్రీ మహాభారతము - హిందీ అనువాద సహితము, గీతాప్రెస్.
"ద్రోణాచార్యనే ధృష్టద్యుమ్న పర్ సువర్ణపాంఖోంసే యుక్త అత్యంతతీక్ష్ణ పానీదార్ ఔర్ భయంకర్ భల్ల నామక బాణ్ చలాగయే॥

1 క్షురప్రము :- గుఱ్ఱపు నాడము వలె అర్థ చంద్రాకారమగు అలుఁగు గల బాణము; అర్ధచంద్ర బాణము.

## శబ్ద భేది బాణములు

గంధర్వరాజు మాయాబలంబున నంతర్హితుండై తన విక్రమముఁ జూప వాని నుఱక నింద్రసూనుండు గాండీవి శబ్దభేదులయిన సాయకములఁ జిత్రసేను సర్వగాత్రంబు భేదించి యొక్క మాత్రలోన నుడిపెఁగడఁక.

—ఎఱ్ఱన. అరణ్య. 5. 424-6

శబ్దభేది యన ధ్వనిచేత లక్ష్యమును గొట్టునది. – (సూ.ని.)

## సర్పముఖాస్త్రము

"అశ్వసేనాభిధానుండగు నాగకుమారుఁడు సర్పముఖశరాకారంబు గైకొని తన యొద్దనుండఁ దాను పసిండి యొఱం బెట్టి యనుదినంబును గంధ పుష్పంబుల నక్షతంబుల నర్చించుచు నయ్యర్జునుమీఁదం బ్రయోగించువాఁడై యున్న" కర్ణుఁడు దానిని కిరీటిఁజంప నేయఁగా గుఱితప్పి కిరీటమును దాఁకినది.

—తిక్కన. కర్ణ 3-316

## అంజలికం బైన మహాస్త్రము

కులిశప్రస్ఫురణా పహాసన విభా గుచ్ఛంబులన్ గల్గి యాఁ
కలిమై వచ్చు కృతాంతవక్త్రమన నుగ్రింబై మురారాతి రు
ద్రుల చక్రంబును శూలముం దెగడుచుం గ్రూరంపు టొప్పారు
నంజలికం బైన మహాస్త్రముం దొడివి కర్ణంబుబ్బనం జేయుచున్.

ఏను దపశ్చరణంబు దానంబున గురుజనాభితర్పణమున నిత్యా
నూన వ్రత శీలుఁడ నేనియుఁ గర్ణుతలఁదెగ్రించు నీ శర మనియెన్ *

అర్జునుఁడు ప్రయోగించిన యంజలికాస్త్రము అభిచారిక ప్రయోగము దుద్భవించిన కృత్య వలె నున్నది.

కృత్యా మథర్వాంగిరసీ మివోగ్రాం
దీప్తా మసహ్యాం యుధి మృత్యునాపి॥ —కర్ణ. 91-48

---

పోల్చు :- 1) "నేనును దదాశ్రితుల గతాసులఁజేసితి
బ్రసభంబున శబ్దభేది బాణప్రతతిన్॥" —[ఎఱ్ఱన. అరణ్య. 1-193]

2) శబ్దభేది దివ్యాస్త్రంబుల్ —ఎఱ్ఱన. అరణ్య 7-135

* తిక్కన. కర్ణ 3-350 - వ్యా. భా. కర్ణ, 91-40

# దివ్యాస్త్రములు : దివ్యబాణములు

దివ్యాస్త్రము లనఁగా వివిధ దేవతామంత్రములతో నభిమంత్రించి ప్రయోగింపఁబడు బాణములు.

అర్జునుని యస్త్రవిద్యాప్రావీణ్యమునకు మెచ్చి ద్రోణాచార్యుఁడు వానికి ననేకదివ్యబాణము లిచ్చినాఁడు.[1] పరమేశ్వరుఁడు పాశుపతాస్త్రము ప్రసాదించినాఁడు- తదనంతరంబ "యింద్రాదిదేవతల వలన నైంద్రాగ్నేయ యామ్య రాక్షస వరుణ వాయవ్య కుబేర గాంధర్వ పైచాచ బ్రాహ్మ్యంబులనం బరఁగు దివ్యాస్త్రంబులు వడసి" నాఁడనియు,...

..."అమరావతికరిగి యం దమరేంద్రు నాచార్యుంగా వరించి తత్ప్రసాదంబున దివ్యాస్త్రంబుల ప్రయోగంబును నుపసంహారంబును నివర్తనంబునుఁ బ్రాయశ్చిత్తంబును బ్రతిఘాతంబులును నేర్చినాఁడనియు నన్నయ వ్రాసినాఁడు. —నన్నయ. అరణ్య. 4-53

వ్యాసభారతమునందు పదునైదు దివ్యాస్త్రములు పేర్కొనఁబడినవి.

అవాప్య దివ్యా న్యస్త్రాణి సర్వాణి విబుధేశ్వరాత్
ఆగ్నేయం వారుణం సౌమ్యం వాయవ్య మథ వైష్ణవమ్
ఐంద్రం పాశుపతం బ్రాహ్మం పారమేష్ఠ్యం ప్రజాపతేః
యమస్య ధాతుః సవితు స్త్వష్టుర్ వైశ్రవణస్య చ॥ *
తాని ప్రాప్య సహస్రాక్షా దభివాద్య శతక్రతుమ్॥

—వ్యా. భా. వన 164-79

ఈ పదునైదు దివ్యాస్త్రములలో శిల్పాధిపతియగు విశ్వకర్మ [త్వష్ట] అధిదేవతగా గల బాణ ముండుట యొక విశేషము.

ఇట్టి దివ్యబాణములు ధనురాచార్యు నొద్దను గలవు. భారద్వాజుఁడు వాని నర్జునునిపై ప్రయోగింపఁగా ధనంజయుఁడు వాని నాయా దివ్యాస్త్రముల తోడనే త్రిప్పి కొట్టినాడు.

ఐంద్రం పాశుపతం త్వాష్ట్రం వాయవ్య మథ వారుణమ్
ముక్తం ముక్తం ద్రోణచాపాత్ తజ్జఘాన ధనంజయః ॥

—వ్యా. భా. ద్రోణ. 188-31

---

1. చూడు :- నన్నయ. ఆది. 5-259

* పోల్చు :- "ధాత స్త్వష్టశ్చ సవితుర్ వైవస్వత మథాపి వా॥" —భీష్మ. 21-42

## త్వష్ట్రనామక దివ్యాస్త్రము

**అథాస్త్ర మరిసంఘఘ్నం త్వాష్ట్రమభ్యస్యదర్జునః**
**తతో రూప సహస్రాణి ప్రాదురాసీత్ పునః పునః ॥**

—వ్యా. భా. ద్రోణ. 19-11

అర్జునుఁడు త్రిగర్తసేనలపై త్వష్ట్రనామకాస్త్రమును ప్రయోగించినాఁడు.

నరుండు దేవదత్తంబు పూరించి యవష్టభంబునఁ ద్వష్ట యిచ్చిన మహాస్త్రంబు ప్రయోగించినం దత్ప్రభావంబున

గాండీవి చండమయి వారొండొరులకుఁదోఁచి యొకళులొకళుల
నానా చండాస్త్ర శస్త్రసముదయ ఖండితులుగఁజేసి పడిరి కలనన్గలయన్.

—తిక్కన, ద్రోణ, 1. 250-1

అలంబుసుఁడు, "మాయావిలాసోగ్ర కాయంబు గైకొని యఖిల దిక్కులఁదోఁచి" విజృంభించి నంత భీమసేనుఁడు గినిసి.

"యుజ్జ్వలత్ త్వష్ట్రబాణ ప్రయోగమునఁ బ్రభంజనాత్మకుఁ
డమ్మాయ వాయఁజేసి తఱిమి యేసియేసి యారక్కసుఁబఱపె నధిప."

—తిక్కన. ద్రోణ. 3-266

వాయునందనుఁడా దివ్యబాణమును స్వయముగా త్వష్ట ప్రయోగించినట్లే ప్రయోగించినాఁడు.

**సంధధే త్వాష్ట్ర మస్త్రం స స్వయం త్వష్టేవ మారుతిః ॥**

—వ్యా. భా. ద్రోణ. 104-30

దుర్యోధనుఁడు పురికొల్పఁగా నాచార్యుఁ డుత్సాహదీప్తుండై యా ధర్మతనయుఁ దాఁకి "వాయవ్య వారుణాగ్నేయ త్వాష్ట్ర సావిత్రంబులగు సాయకంబుల" వరుస నేసెను. 1

ఈ వర్ణనములవలన త్వష్ట్రదేవతాకమైన దివ్యాస్త్రము పరస్పరశత్రుభ్రాంతి గలిగించు ననియు, రాక్షసమాయలు తొలగింపగలదనియుఁ దెలియు చున్నది.

త్వష్ట్రబాణమనగా త్వష్ట్ర దేవతా మంత్రములచే నభిమంత్రించి ప్రయోగింపఁదగినది.

1. తిక్కన ద్రోణ. 5 92 = వ్యా. భా. ద్రోణ. 157-34
వారుణం యామ్య మాగ్నేయం త్వాష్ట్రం సావిత్ర మేవ చ॥

# పాశుపతాస్త్రము

**దదామి తేఽస్త్రం దయిత మహం పాశుపతం విభో ॥**

—వ్యా. భా. వన. 40-15

విరూపాక్షుండు నిజరూపంబుతో నర్జునునకు సన్నిహితుండై... నా స్వరూపంబు నూడు మని దివ్యదృష్టి యిచ్చినఁ జూచి పార్థుండు కృతార్థుండై దండప్రమాణామంబు చేసి...

త్ర్యంబక నాకు నభీష్టవరముఁ బ్రసాదించెదేని రౌద్రము దివ్యా
స్త్రంబనఁ బరఁగిన పాశుపతాస్త్రంబుఁ బ్రసాదింపు మిందుధర దయతోడన్.

అని ప్రార్థింపగా... నీశ్వరుఁడనుంగరుణించి విశుద్ధాత్ముండైన పార్థునకు మంత్ర ధ్యాన జపహోమ పూర్వకంబుగా సుంధానమోక్షణ సంహారసహితంబుగాఁ బాశుపతాస్త్రంబిచ్చి దీనికి నసాధ్యం బెద్దియును లే దల్పులయందుఁబ్రయుక్తంబైన జగత్సంహారంబు సేయు నని చెప్పి పురాంతకుండంతర్హితుండయ్యె.[1]

అర్జునుఁడీ పాశుపతాస్త్రమును పౌలోమ కాలకేయులను నసురుల పయి ప్రయోగించినాఁడు.

ఉరగ ఫణాగ్ర రత్న కిరణోల్లసదుగ్రభుజున్ వృషాంకు శం
కరు శశి ఖండమండితశిఖండు శివున్ హృదయాంబుజంబునన్
దిరముగ నిల్పి పాశుపతదివ్యశరం బరివోసి యేసితిన్
సురరిపు కోటిమీఁద హరి సూతుఁడు మాతలి మెచ్చి చూడఁగాన్.

ఆ దివ్యాస్త్ర ప్రభావంబున సింహ శరభ శార్దూల శుండాల మహిష మహోరాక్ష యక్ష రాక్షస పిశాచ గంధర్వ రూపంబులుద్భవిల్లియ సురుల నెల్ల విగతాఘులం జేసితి' నని యర్జునుఁడు తెలిపినాఁడు.[2]

పరమేశ్వరుఁడు పాశుపతాస్త్రముతో త్రిపురసంహారము చేసినాఁడు.

"కోపసందీప్తుఁడై చాపంబు సజ్యంబు గావించి మౌర్వి మార్గణముఁగూర్చి పాశుపతాస్త్ర సంబద్ధంబుగాఁ జేసి పురములు మూఁటిని బుద్ధినిలుప నవి యొక్క చోటికి నప్పుడ కూడిన... నయ్యుగ్రుండు దెగ వాపి యేసినఁ బురత్రయంబు గాలి నీఱై పశ్చిమాబ్ధిఁ దొరఁగె"[3]

పాశుపతాస్త్రము విశ్వకర్మకృతమే. —తిక్కన. కర్ణ. 1-252

1) నన్నయ. అరణ్య. 1. 325-30 2) నన్నయ. అరణ్య 4. 84-86
3) తిక్కన. కర్ణ. 1-293

## ఐంద్రాది బాణములు

### ఐంద్రి బాణము

అర్జునుఁడైంద్రిబాణము సమంచితభక్తి ధరించి మంత్రి వి
స్ఫూర్జిత గాండివుండయి రిపుప్రకరంబులు సంచలింప న
త్యూర్జిత శక్తి నేయుఁడు మహోగ్రబహు ప్రదరప్రకారతా
దుర్జయ లీల నిర్మథనదోహలిమై యది కర్ణుఁగిట్టినన్.

అతఁ డభిమంత్రిత బాణ వ్రతతిఁ దదుద్రేక మడఁచి పార్థుని మేనన్
శిత శరములు" నినిచెను. —తిక్కన కర్ణ. 3 290-1

కర్ణుఁడు మహేంద్రాస్త్రమును భార్గవాస్త్రముతో ప్రతిఘటించి నట్లు మూలమునందు వర్ణింపఁబడినది.

ప్రాదుశ్చక్రే భార్గవాస్త్ర మహాత్మనా మహేంద్రశస్త్రాభిముఖాన్ విముక్తాం
శ్ఛిత్వా కర్ణః పాండవస్యేషు సంఘాన్॥ —కర్ణ. 8-928

ఇంద్రతనయుఁడు కురుసేన పై "నైంద్రాస్త్రము ప్రయోగించిన నది నానా ప్రకార క్రూర శరకలాపంబుపం గవిసి కౌరవ సైన్యంబు నొప్పించె," 1

శ్రుతాయువు నమితాయువు నర్జును నలయింపఁగా శౌరి ప్రభోధింపఁదేతి "ధనంజయుం డైంద్రాస్త్రంబు ప్రయోగించుటెయు నది వివిధాయుధాకారంబువం గవిసి యయ్యిరువుర హస్త మస్తక శకలంబులు ధరం దొరగించె." 2

### ఆగ్నేయ వారుణాస్త్రములు

ఆగ్నేయాస్త్రము ద్రోణుఁడేసిన సముద్యజ్జ్వాలికామాలికో
ద్విగ్నంబయ్యె నభంబు వారుణశరా విర్భావముంజేసెఁ గ్రో
ధాగ్ని స్ఫూర్తి వెలుంగ నా శినివరుం డబ్బాణముల్ దాసిని
ర్మగ్న వ్యోమచరంబులై తొడరి పోరంజొచ్చె నొండొంటితోన్. 3

ఘోరంబుగాఁగ హాహాకారము లెసఁగంగ బలయుగంబును డయ్యం
బోరి పెడఁబాసి శాంతములై రెండును నిలిచె నమ్మహాస్త్రములధిపా.
—తిక్కన. ద్రోణ. 3. 138-9

---

1. పోల్చు :- తిక్కన. భీష్మ. 2-164 2. తిక్కన. ద్రోణ. 3-76
3. తిక్కన కర్ణ, 3-288

వరుణాస్త్రము × శోషణాస్త్రము

కాలకేయులు మాయయుద్ధంబు సేయ సమకట్టి నామీఁద వరుణాస్త్రంబునేసిన,

బలరిపుఁడు నాకు నిచ్చిన యలఘు విశాతముఖశోషణాస్త్రంబు[1]
వినిర్గళ దవిరళజలధారావలి నెల్లం దక్షణంబు వట్టఁగఁజేసెన్.

తిమిరబాణము × సూర్యబాణము

తిమిరబాణ ముగ్రంబుగా వారలేసి రంత దిక్కులెల్లఁగప్పె...

వాసర నాయకుండఁచి వ[illegible]ంబున [illegible]్యబాణ[2] మే
నేసితి నింద్రుఁడొ[illegible] సు[illegible]యు [illegible]మందఁగా జగ
త్త్రిసి తమిశ్రిరాశి ని[illegible] దిక్కు[illegible] తెల్లగా మహో
గ్రాసురు లాహవంబున [illegible] పడ మా[illegible]లి [illegible]చ్చిచూడఁగాన్.

అని యర్జునుఁడు ధర్మరాజాదులకుఁజెప్పినాడు. —నన్నయ. అరణ్య. 4. 68-71

మేఘానిలబాణములు

ఫల్గునుండు మేఘబాణమేసిన భూనభోనంతరంబు సంభృతాంధకార
మయ్యె సూతసూనుఁడనిలాస్త్రమేయుడు నా తమంబు విరిసె నాక్షణంబు.*

యుద్ధవీరు లీ విధముగా పరస్పరవిరుద్ధగుణములుగల దివ్య బాణముల నొండొరులపై ప్రయోగించుచు తమ శక్తియుక్తులను బ్రదర్శించు చుండిరి.

అర్జునుఁడు తనపై ప్రయోగించిన దివ్యాస్త్రముల నశ్వత్థామ యాయా బాణములతోనే యెదుర్కొని నాఁడు.

అలిగి నరుఁడైందర్రి మాదిగఁగల దివ్యాస్త్రంబులేదుఁగా వయ్యె యు
జ్జ్వల మార్గణంబులను నక్కలశభవసుతుండు మాన్పెఁ గౌరవముఖ్యా.
—తిక్కన. కర్ణ. 2-373

1 నన్నయ. అరణ్య. 4-67 = వ్యా. భా. వన. 171-8
తతోऽపదిష్ట మింద్రేణ దివ్య మస్త్రం విశోషణమ్.

2 పోల్చు :- తిక్కన. భీష్మ. 2. 203
దనుజేశ్వరుఁడు మాయం బొదవించినఁదమము గపిసె భూనాయక ఫల్గున
సుతుఁడు భాస్కరాంబకమున వెలుఁగొనరించె సుర సమూహము పొగడన్.

* తిక్కన. అరణ్య. 3-89, పోల్చు :- నన్నయ, ఆది. 8-277 "మారుతాస్త్రము"

## పర్జన్యాస్త్రము

వినుఁడుశరతల్పగతుఁడనై యునికిఁజేసి, యన్యసలిలంబు సేవింప ననుచితంబు నాకుఁ దేజోమయాస్త్ర విన్యాసవిధి సముత్థితంబైన భూజల మొకఁడుదక్క.

వెరవునఁ దేనేర్తు వీవ వే తెమ్మనఘా! అని భీష్మాచార్యుఁడు కోరినంత నర్జునుఁడు గంగానందనునకుఁబ్రదక్షిణంబుసేసి తేజోమయంబయిన మార్గణంబు పర్జన్యమంత్రాభిమంత్రితంబు గావించి మహీతలంబుగాఁడ నేసిన భాసురచ్ఛాయం బగు తోయంబు ధారారూపంబున దివ్య గంధ రసోపేతంబయి యెగసిన కౌరవులు ప్రకంపగాఢ విస్మయులైరి. —తిక్కన, భీష్మ. 3. 428-31

### సరోవరోత్పాదనము

రథాశ్వములకు త్రావుటకు నీరు కావలయునని కమలనాభుఁడు చెప్పినంతనే యర్జునుఁడు దివ్యాస్త్రముతో కొల నుత్పాదించిన తీరు చిత్రముగ నున్నది.

ధర దివ్యాస్త్రహతిం బగిల్చి కొల నుత్పాదించి పే దానికిన్
శర జాలంబుల నిల్లు గట్ట మనసై న్యంబుల్ వెఱం బొందె న
చ్చెరువొందెన్ సురసంఘముల్ హరి నుతించెం బొంగి యప్పార్థు భూ
వర మున్నిట్టివి సూడరున్ వినరు నెవ్వారుం ద్రిలోకంబులన్.

—తిక్కన ద్రోణ 3. 161-2

అర్జునుఁ డిట్లుచేయుట విశ్వకర్మకృతమైన యద్భుతకృత్యము వలె నున్నదని మూలమునందు వర్ణింపఁబడినది.

అభిహత్యార్జునశ్చక్రే వాజిపానం సరః శుభమ్॥
శరవంశం శరస్థూణం శరాచ్ఛాదన మద్భుతమ్
శరవేశ్మాకరోత్ పార్థ స్త్వష్టేవాద్భుతకర్మకృత్॥

—వ్యా. భా. ద్రోణ 99. 59-62

---

* వ్యా. భా. భీష్మ. 121-23,24

పర్జన్యాస్త్రేణ సంయోజ్య సర్వలోకస్య పశ్యతః
అవిధ్యత్ పృథివీం పార్థః పార్శ్వే భీష్మస్య దక్షిణే॥
ఉత్పపాత తతో ధారా వారిణో విమలా శుభా....

## ప్రస్వాపాస్త్రము : మోహనాస్త్రము

ప్రాజాపత్యం విశ్వకృతం ప్రస్వాపం[1] నామ భారత
న హీదం వేద రామోఽసి పృథివ్యాం పుమాన్ క్వచిత్॥

—వ్యా. భా. ఉద్యోగ. 183-12

ప్రస్వాపాస్త్రమున కధిదేవత శిల్పప్రజాపతియగు విశ్వకర్మ.

ప్రస్వాపాస్త్రమునే తిక్కన మోహనాస్త్ర మనినాఁడు.

"పవలు నన్నెత్తి రథంబుపయిం బెట్టిన యెనమండ్రునుం బ్రభాత సమయంబునం గలలోన వచ్చి,

నీవు నేమును నొక్కటి నీకువెఱవనేల గాంగేయ। రాము జయించునట్టి
శరము సుమ్మని మోహనాస్త్రంబు నాకు నిచ్చిపోయిరి క్రమ్మఱ నెక్కడేని.

అని భీష్మాచార్యుఁడు తెలిపినాఁడు. —తిక్కన, ఉద్యోగ, 4. 338-9

భీష్మునకుఁ గలలోనఁ గనిపించిన యెనమండ్రు విప్రులు అష్టవసువులు వసువులు శిల్పులే. ప్రభాస వసుపుత్త్రుం డైన విశ్వకర్మచే నావిష్కరింపఁబడిన ప్రస్వాపాస్త్రమును [మోహన బాణమును] వసువులు వసుమూర్తి యైన గాంగేయున కొసఁగుట మిక్కిలి సమంజముగా నున్నది.

### మోహనాస్త్రము - ప్రజ్ఞాబాణము

మోహనాస్త్రమును ప్రయోగించిన జనులు సమ్మోహితులై చేష్టలు దక్కి యుందురు. వారికిఁ దెలివిదెప్పించుటకు ప్రజ్ఞా బాణము ప్రయోగింప వలయును.

ధృష్టద్యుమ్నుఁడు ద్రోణదత్తప్రమోహబాణంబున కౌరవ వీరుల నందఱ నిశ్చేష్టితులం జేసిన... ద్రోణా చార్యుండు

వినుత ప్రజ్ఞా బాణంబున మోహనబాణశక్తి వోఁజేసిన సం
జనిత ప్రాణోజ్జ్వలులై యనికిం గ్రమ్మఱఁ గడంగి రయ్యోధవరున్.[2]

---

1. చూడు :- శ్రీమన్మహాభారతము - హిందీ అనువాదసహితము - గీతాప్రెస్
ఉద్యోగ. 183-12 (పుట. 2510)
"భారత యహ ప్రస్వాపనామక అస్త్ర హై జిన్‌కా దేవతా ప్రజాపతి హై విశ్వకర్మానే ఇన్‌కా అవిష్కార్ కియా హై॥"
2. తిక్కన. భీష్మ. 2-272 = వ్యా. భా. భీష్మ. 77-55
"తతః ప్రజ్ఞాస్త్రమాదాయ మోహనాస్త్రం వ్యనాశయత్"

# భార్గవాంగిరసమహాస్త్రములు

## భార్గవాస్త్రము

జామదగ్న్య కలితాస్త్రుండైన కర్ణుఁడు పాండవసైన్యముపై భార్గవాస్త్రము ప్రయోగింపఁగా నమ్మహనీయ సాధనంబు

ఘోరానేకశరాకృతిం బరగి సంక్షోభంబు గావించుచున్... భటచయం బత్యంత చూర్ణీకృతాకారత్వంబు భజింపఁగేళి సలిపెన్ గౌంతేయసైన్యంబునన్.

—తిక్కన, కర్ణ. 3-14

## అంగిరసమహాస్త్రము

"అంగిరసుం డమరపతికి నొక్క మహాస్త్రం బిచ్చె దాని నతండు
నా కొసఁగె నది నిఖిలకవచ నిర్భేదనశీలంబై యుండు దాన
నిమ్మెయివఱు వఱవుల్లు సేసెద" నని యర్జునుఁడు

"వెసనా దివ్యశరం బనూనమంత్ర ప్రకాశమగునట్లుగా గొనయమునఁ జేర్చి తిగిచి" ద్రోణదత్తాద్భుతకవచధారియైన దుర్యోధనునిపై ప్రయోగించినాఁడు

—తిక్కన, ద్రోణ. 3-204

మూలమునందీ మహాస్త్రము మానవాస్త్రముగా పేర్కొనఁబడినది.

మానవాస్త్రేణ మానార్హ్యాస్త్రీక్షవరణభేదినా॥ —ద్రోణ. 103-22

# నారాయణాస్త్రము

అశ్వత్థామ నియతుండై నారాయణాస్త్రమును ప్రయోగించిన

ధరణీచక్రము దిర్దిరం దిరిగె మార్తాండుండు గుంఠీభవ
త్కిరణుండయ్యె దిశావితానము వడంకెన్ మిన్నదిర్చెన్ మహీ
ధర సంతానము లోలి గ్రక్కదలె నుద్రాంతంబులై యంబుధుల్
వారలెం గట్టల మీద బిట్టపితుగుల్ మ్రోసెన్ మహోద్రగతన్.

ఇట్లు భీకరాకారంబై దుర్వారం బయిన యద్దివ్యసాధనంబు మండలార్ధ చంద్ర భల్ల నారాచ క్షురప్రముఖంబులు ననల మయంబులు నగు ననేక దేదీప్యమాన మార్గణ మూర్తులు గైకొని కౌంతేయ సైన్యసంతానం బంతయు నొక్కపాయగా గవిసి నట్లు వర్ణింపఁబడినది [1]

భూమిపై నిరాయుధులై నిలుటయే దీనికిఁ బ్రతివిధానమవి జనార్దనుఁడు తెలిపినాఁడు.

---

1 తిక్కన, ద్రోణ. 5-376 = వ్యా. భా, ద్రోణ. 199-15

# బ్రహ్మశిరోనామకాస్త్రము

అస్త్రం బ్రహ్మశిరోనామ యద్దహేత్ పృథివీ మపి॥

"......తన వలని భక్తిస్నేహంబులకు మెచ్చి భారద్వాజుండు వానికి [అర్జునునకు] బ్రహ్మ శిరం బను దివ్యబాణంబు సప్రయోగ నివర్తనంబుగా నిచ్చి యిట్లనియె.

దీని నగస్త్యుం డరగు దివ్య మునీంద్రుఁడు దొల్లి ప్రీతితో
భూసుత యగ్నివేశుఁ డను భూరి మునీంద్రున కిచ్చె వారలున్
మానుగ నాకు నిచ్చిరి; క్రమంబున నేనును నీకు నిచ్చితిన్
దీనికి నీవ యర్హుఁడవు తేజమునం గడుఁ బెద్ద గావునన్.

దీని మానవుల యందుఁ బ్రయోగించకుండునది యల్పతేజులయందుఁ బ్రయుక్తం బయి యిది జగంబులఁ గాల్చు; నిన్ను బాధించు నట్టి మానవులు గలిగిరేని ప్రయోగించునది వారి నశ్రమంబున సాధించు నని దాని మహిమ చెప్పె" —నన్నయ. ఆది. 6. 98-100*

"సకల పృథివిని దహింపఁజాలు బ్రహ్మశిరోనామకంబగు దివ్యాస్త్రమును" ద్రోణుఁ డశ్వత్థామకుఁ గూడ నిచ్చినాడు.

అగ్గురునందనుఁ డా దివ్యాస్త్రము దలంచి యొక్కయిషీకంబు పుచ్చుకొని యందయ్యస్త్రంబు నావహించి యపాండవమయ్యెడు మని దారుణభాషణంబుతోడఁ ప్రయోగింపఁగా,...

సవ్యసాచి యస్త్రమస్త్రంబు నుపశమించు గావుత మని యస్త్రదేవతలకు నమస్కరించి శివంబుఁ జింతించుచుఁ బ్రయోగించిన నా దివ్యాస్త్రంబు కల్పాంత జ్వలనంబునుం బోలె నాభీల జ్వాలా మాలాకరాళంబై యుప్పరం బెల్ల నిగిడి యశ్వత్థామాస్త్రంబు గ్రమ్మదింప నుత్సహించిన, నది కమ్మఱక పెరిగి సముద్దామధామంబగుటయు నయ్యస్త్రద్వితయంబు నాటోపంబున,

జలధుల్ ఘూర్ణిల్లె నుల్కాశతములు వడియెం జండభానుండు మాసెం
గులశైలంబున్ వడంకెం గురిసె నురవడిన్ ఘోరపాషాణ ధారా
వలి నాకాశంబు ధాత్రీవలయముఁ దిరిగెన్ వజ్రనిర్ఘోష మెందుం
జెలఁగన్ జొచ్చెన్ జనం బచ్చెరువును భయమున్ జెంది నిశ్చేష్టమయ్యెన్.

—తిక్కన. సౌప్తిక. 2. 60-65

# బ్రహ్మాస్త్రము

ద్రోణాచార్యుఁ డర్జునునిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగింపఁగా నర్జునుఁడు దానిని బ్రహ్మాస్త్రముతోడనే వారించినాఁడు.

క్షితియుం బర్వతకోటియుం వడఁకె నగ్నిచ్ఛాయలయ్యెన్ దిశల్
చతురంభోనిధులుం గలంగె భయలోలంబయ్యె దేవవ్రజం
బతిసంక్షోభమువొందె నొక్కమొగి సైన్యద్వంద్వమున్ ద్రోణుఁ డు
ద్ధతి బ్రహ్మాస్త్రము మౌర్వితో నియతమంత్రస్ఫూర్తి సంధించినన్.

ఇట్లు సువిహితసంధానుండై యతం డమ్మహాస్త్రముఁ బ్రయోగించిన

అంతరంగంబు నం దొకయింతయేని యలుకులేక తనర్చి బ్రహ్మాస్త్రమునన
వేడుకకు మరలించిన విధము దోఁప నద్భుతంబుగ వారించె నర్జునుండు.[1]

అశ్వత్థామ "నియతిం బావకబాణ మేయుఁడు... సర్వభూతభయదా
కారంబునంబేర్చి యత్యయకాలజ్వాలనోద్ధతింగవిసి యేకాక్షోహిణిఁ దుంపఁగన్"

ఎల్ల దివ్య బాణంబులఁ బొల్లవోవఁ జేయునట్లుగ బ్రహ్మసృజించినట్టి
కీర్తనీయ మహాస్త్రంబు క్రీడి మంత్రనిష్ఠ యొప్పఁ బ్రయోగించె నరవరేణ్య.

ఆ బ్రహ్మాస్త్రముచేత నద్భుతంబగు నశ్వత్థామ యాగ్నేయాస్త్రంబు సంక్షీణం బయినది,[2]

శ్రీ రాముఁడు రావణునిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించినాఁడు.

కమనీయకనకపుంఖప్రభాభాసియుఁ దీక్ష్ణముఖంబును దివిజ యక్ష
ముని సిద్ధ సాధ్య సమ్మోదావహంబు నై విలసిల్లు బాణ ముర్వీవరుండు
గైకొని బ్రహ్మాస్త్రకలిత మంత్రాభియుక్తంబుగా నొనరించి కార్ముకమున
సంధించి జగములుజయవెట్టఁ జెచ్చెరఁదివిచి యేయుటయును దీవ్రభంగి
గడఁగి యాశరంబు కల్పాంతదహనంబుపోలెఁ బంక్తికంఠుఁ బొదివి నీఱు
గా నొనర్చె సూత ఘనరథరథ్యసమన్వితముగ నొక్కమాత్రలోన.[3]

ఈ విధముగా మహాభారతకాలమునందు శస్త్రాస్త్రకళాకోవిదులైన యుద్ధవీరులు మంత్రకలితములైన దివ్యాస్త్రములను ప్రయోగించు చుండిరి.

1. తిక్కన. ద్రోణ. 5. 297-9 = వ్యా. భా. ద్రోణ. 198. 48-51
2. తిక్కన. ద్రోణ. 5. 400-1 3. ఎఱ్ఱన. అరణ్య. 7-151

## అ స్త్ర పూ జ

యు ద్ధ వీ రు లు తమ తమ యస్త్రములను గంధమాల్యాదులతో నర్చించుచుండిరి.

మురారి యర్జుమనకు సైంధవుని జూపి యిద్దురాత్ము మస్తకమును దునుము మనినంత,

ఆతఁడు గని గంధమాల్యార్చితమై దొన మెఱయుచున్న శిత శర ముగ్రో
ద్ధతి నేయ డేగ పులుఁగునుగతిఁగొను క్రియ నది హరించెగ్రిక్కన శిరమున్.

అని తిక్కన మూలానుసారముగా వర్ణించినాఁడు. —తిక్కన, ద్రోణ, 4-319

ఇంద్రాశని సమస్పర్శం దివ్య మంత్రాభిమంత్రితమ్
సర్వభారసహం శశ్వద్ గంధమాల్యార్చితం శరమ్॥ —ద్రోణ. 146-21

## త్ర్యం బ క బ లి

కృష్ణుండును జిష్ణుతోన తదీయసదనంబునకుం జని విమల జలంబులం గృతాచమనుం డయి యొక్క వివిక్త ప్రదేశంబున దర్భశయ్య గావించి దాని నక్షతగంధపుష్పంబుల నలంకరించి యాయుధంబు లర్చించి చుట్టు నిడి కవ్వడి నందుండు మని నియోగించి నీవు నిశాసమయంబునం జేయు దేవపూజ యింతకుమున్న చేయ వని తలంపించిన నతండును బాదప్రక్షాళనంబు నుపస్పర్శనంబును నాచరించి తాను నిత్యంబును నడపు త్ర్యంబకపూజనంబు తెఱంగున మాల్యానులేపనధూప దీపనైవేద్యంబు జనార్దనునకు సమర్పించెను.
—తిక్కన. ద్రోణ. 2-339

తతో మాల్యేన విధివ ల్లాజై ర్గంధై: సుమంగలై:
అలంచకార తాం శయ్యాం పరివార్యాయుధోత్తమై: ॥

తత: స్పృష్టోదకే పార్థే వినీతా: పరిచారకా:
దర్శయంతోఽంతికే చక్రు ర్నైశం త్రైయంబకం బలిమ్॥
— ద్రోణ. 78-3, 4

మ హా భా ర త ము న యోధులు సంగరమునందు గెలుపొందుటకు రాత్రివేళల త్ర్యం బ క పూ జ లు నా యు ధ పూ జ లు చేయుచుండి రని విదితమగుచున్నది.

# యంత్ర శిల్ప సమీక్ష

మహాభారత కాలము నాటికి ధనుర్వేదాంతర్గత మయిన యంత్ర శిల్ప మభివృద్ధి చెందినది.

ధనురాదులు యంత్రములుగా భావింపఁబడినవి.

కవచములు, ఖడ్గములు, శక్త్యాద్యాయుధములు మున్నగు వివిధ యుద్ధోపకరణములు లోహమయములే కాని భారతమునం దవి సువర్ణ విభూషితములుగా వర్ణింపఁబడినవి. అట్లే ధనుర్బాణములును.

ఇట్టి వర్ణనములనుబట్టి మహాభారతకాలమున శస్త్రాస్త్రములు చేయు లోహశిల్పులు సువర్ణశిల్పమునందును నిపుణు లని గాని లేదా వేర్వేఱు శిల్ప కళ లందు నేర్పరు లయిన శిల్పులు కలిసి పనిచేయు చుండిరని గాని చెప్పవచ్చును.

మహాభారతమునందు వర్ణింపఁబడిన ఆగ్నేయ పాశుపత నారాయణ బ్రహ్మ బ్రహ్మశిరోనామకాది దివ్యాస్త్రములు నేటి యన్త్రాస్త్రముల ను దలపించుచు నానాటి లోహశిల్పుల ప్రజ్ఞాపాటవములను చాటిచెప్పుటయే గాక భారతీయ సాంకేతిక శిల్ప విజ్ఞాన వికాసములకుఁ దార్కాణములై యున్నవి.[1]

మహాభారతాద్యనేక గ్రంథముల యందలి శస్త్రాస్త్ర వర్ణనములే యనంతరకాలమున శిల్పాచార్యులకు లక్షణగ్రంథకర్తలకు లక్ష్యములై యుండు ననుటలో సందియము లేదు.[2]

---

1. Cf :- D. N Sukla : SILPA SASTRA Hindu Achievements in Areonatics and Fi ne Arts p 30-31

"In Mahabharata th-re are clear and vivid descriptions of a good number of Yantras e g. Sastras (throwing weapons) Astras (defending weapons, bows and arrows equally terrible as the modern weapons......

"All this speaks of a great advancement in the science of warfare... (and) sientific knowledge in the times of the Mahabharata

2. Ibid.

"......enunciation of the norms and guiding principles for the artisans."



# శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము

## అష్టమోన్మేషము

### పంచ శిల్పములు : ప్రకీర్ణ శిల్పములు

విశ్వకర్మా మహాభాగో జజ్ఞే శిల్పప్రజాపతిః
కర్తా శిల్ప సహస్రాణాం త్రిదశానాం చ వర్ధకిః ॥
—వ్యా. భా. ఆది. 88-28

దేవ వర్ధకియు శిల్పప్రజాపతియు నయిన విశ్వకర్మ లోకము నందలి నానావిధశిల్పములకు మూలపురుషుఁడు.

వర్ధకి యన దారుశిల్పి. ఇట వర్ధకి శబ్దము శిల్పిజన సామాన్య వాచకము. శిల్పముల కన్నింటికి తక్షణము మూలము.

దారు శిల్పి గృహమును నిర్మించి నట్లు విశ్వశిల్పి యగు విశ్వకర్మ యీ విశ్వమును నిర్మించినాఁడని భావించినవేదర్షి యిట్లు ప్రశ్నించుచున్నాడు.

కిగ్ం స్విద్ వనం క ఉ స వృక్ష ఆసీర్యతో
ద్యావా పృథివీ నిష్ట తక్షుః ॥ —ఋగ్వేద, 10-81-4

[స్వర్గ మర్త్యలోకములు సృష్టించుటకు కారణ భూతమైన వనమేది ? వృక్షమేది ? ]*

---

* Cf :- R T. H. Griffth : The Hymers of the Rigveda Vol. II.
"What was the tree, what wood it Sooth Produce it, from which they fashioned out earth and heaven ? "

# పంచశిల్పప్రథ

విశ్వకర్మ పుత్రులుగా ప్రసిద్ధి కెక్కిన మనుమయ త్వష్ట శిల్పి దైవజ్ఞులను నేగురు శిల్పాచార్యులు క్రమముగా నయో దారు తామ్ర శిలా సువర్ణ శిల్పములను లోకము నందు ప్రవర్తిల్లఁజేసి రనియుఁ దద్వంశీయు లయిన శిల్పు లీ పంచశిల్పముల ననేక విధములుగా విస్తరింపఁజేసి రనియు స్కాందమహాపురాణము నందుఁజెప్పబడినది.

మనుమయశ్చ త్వష్టా చ శిల్పీ విశ్వజ్ఞ ఏవ చ
పంచైతే దేవ ఋషయో విశ్వకర్మ ముఖోద్భవాః
సృష్టి ప్రివర్తకా హ్యేతే రథకారాస్తు పంచ చ॥

—నాగరఖండ. అ 5*

ఆదినుండియు మానవుల మనుగడ కుపకరించు సాధనముల నన్నింటినో శిల్పులు తమ బుద్ధి కుశలతతో కనిపెట్టుచున్నారు.

తిలే తైలం గవి క్షీరం కాష్ఠే పావక మంతతః
ధియా ధీరో విజానీయా దుపాయం చాస్య సిద్ధయే॥

—వ్యా. భా. శాన. 32-27

ఈ ధీరలు శిల్పులే. రథకారులైన ఋభువులు బ్రాహ్మణులు.

ధీరాసో హి ష్ఠా కవయో విపశ్చిత స్తాన్వ ఏనా
బ్రాహ్మణో వేదయామసి॥ ఋగ్వేద 4-4-20

పూర్వ ప్రకరణములందు వాస్తు శిల్పము. యజ్ఞ శిల్పము రథశిల్పము, యంత్ర శిల్పము మొదలగు ప్రధాన శిల్పములను గూర్చి చెప్పితిని

ఈ ప్రకరణమునందు తక్షణము దారు శిల్పము; తామ్ర శిల్పము, దంత శిల్పము, కల్పవృక్ష కామధేన్వాది నానావిధ శిల్పములు చర్చించబడును.

---

* పోల్చు :- శివే! మను మయస్త్వష్టా తక్ష శిల్పీ చ పంచమ
విశ్వకర్మ సుతాహ్యేతాన్ విద్ధి శిల్పప్రవర్తకాః ॥ —రుద్ర యామళము
ఈ పంచ శిల్పులను గూర్చిన విశేషములు మఱియొక ప్రకరణమునందు వివరింపఁబడినవి.

# 1. తక్షణము - దారుశిల్పులు

భారత దేశమున నం దనాదిగా భూమిని దున్ని పంటలు పండించు పద్ధతి యున్నది.

పృథివీం లాంగలేనేవ భిత్వా బీజం వపత్యుత॥ —వ్యా. భా. వన 32-47

కడు నిమ్ముగా దున్ని బీజముల నల్లి కర్షకుఁడున్నఁ
దడయక వర్షంబు గురిసి కావించుఁ దత్ఫలసిద్ధి॥
—నన్నయ. ఆరణ్య 1-285

భూమిని దున్నించుట కుపయోగించు సాధనము నాఁగలి. ఈ నాఁగళ్లను, గొఱ్ఱు మొదలగు కర్షకోపకరణములను నిర్మించు వారు తక్షకులు లేక వర్ధకులు.

లాంగలాదులు అయోముఖములు కనుక వడ్రంగులు కర్మారులతోఁ గలిసి పనిచేయు చుండిరి.

భారతదేశమున నేటికిని గ్రామ ప్రాంతములయం దెల్లెడల నీ శిల్పులే లాంగలాద్యుపకరణములను నిర్మించుచున్నారు-

నువ్వులనుండి తైలము దీయుట కుపయోగించు గానుఁగలను, యజ్ఞార్థ మగ్ని నుత్పాదించుట కుపయోగించు నరణులను చేనేత మగ్గములను నిర్మించువారు దారుశిల్పులే.

విలువైన వస్తువులను దాచుకొనుట కుపయోగించు పెట్టెలు దారు మయములే,

"ఆదిత్యప్రేరితం బయి యనర్ఘ రత్న వసుభరితంబయిన యొక్క మంజస నదీ ప్రవాహంబునఁ దన యొద్దకు వచ్చిన దానిలోఁజెచ్చెరఁ దన కొడుకుఁ బెట్టి కుంతి నిజపురంబునకుఁ జనియె" —నన్నయ. ఆది. 5-30*

మంజస = మంజూష = పెట్టె - కఱ్ఱతో నిర్మింపఁబడినది,

చమస పాత్రలు, శయనాసనములు దారుశిల్పములే.

---

* పోల్చు :- ఎఱ్ఱాప్రెగడ. అరణ్య. 7-341

"అక్షణంబ యొక్క మంజూషలోన నబ్బాలకుం బదిలంబుగా నిడి
దాని నతి దృఢంబుగా నొక్కతెప్పం బంధించి"

## ఆ స న ము లు

ఆసనం సర్వతోభద్రం జాంబూనదపరిష్కృతమ్
కృష్ణార్థే కల్పితం తత్ర ధృతరాష్ట్రస్య శాసనాత్॥
—వ్యా. భా. ఉద్యోగ. 93 38

తేజోరాశియగు "రాజీవాక్షుండు...
తన కనిపెట్టిన మణిమయ కనకోన్నత పీఠమునఁ బ్రకాశంబున
నిల్చినయెడఁ దోఁచిరి నారదముని ప్రముఖు లంతరిక్షమున నుజ్జ్వలులై.

భీష్ముఁడు మునిపుంగవుల కొఱకు "క న క మ ణి మ యా స న ం బు లనేకంబులు" దెప్పించినాఁడు. —తిక్కన,ఉద్యోగ, 3 250-2

ఆసనాన్యథ మృష్టాని మహాంతి విపులాని చ
మణి కాంచన చిత్రాణి సమాజహ్రు స్తత స్తతః॥
—వ్యా. భా ఉద్యోగ 93-48

"విదురుండును మణిపీఠంబునఁ గృష్ణుని వెనుకదెసఁ దదీయోన్నత పీఠంబునఁ గరం బత్తమిల్లి యుండె."[1]

## ప ర్యం క ము లు

సుయోధనుఁడు వేరోలగంబున సింహాసనాసీనుఁడై యుండి తానున్న యెడకు వచ్చిన శ్రీకృష్ణుని పూజించెను.

"అతఁడనుపఁగఁ గనకమయోన్నత పర్యంకంబునందు నారాయణుఁ డూర్జిత మహిమనుండి యభ్యర్చితుఁడయ్యెఁదగంగ నతనిచే సత్కృతులన్"[2]

"రాత్రి యగుటయుం దగిన యభ్యంతర మందిరంబున హంసతూలికా తల్పంబున భుజంగతల్పునునిచి యతనికడ" విదురుం డుచితాసనంబుననుండె.

దారుమయములైన శయ్యాసనములు భారతమునందు మణికాంచన చిత్రితములుగా వర్ణింపఁబడినవి.

---

1 తిక్కన. ఉద్యోగ. 3-353 = వ్యా. భా. 93-51
విదురో మణిపీఠే తు శుక్ల స్పర్ధ్యాజినోత్తరే.

2. తిక్కన. ఉద్యోగ. 3-209 = వ్యా. భా. ఉద్యోగ. 90-8
తత్ర జాంబూనదమయం పర్యంకం సుసంస్కృతమ్
వివిధాస్తరణాస్తీర్ణమభ్యుపావిశ దచ్యుతః॥

# కాంచన పీఠములు

సుయోధనుఁడు "కర్ణుం గాంచనపీఠంబున నునిచి యంగ రాజ్యంబున కభిషిక్తుం" జేసి నట్లు నన్నయ మూలానుసారముగా వర్ణించినాడు.[1]

కాంచన పీఠమనఁగా కాంచనాలంకృతమైన దారుమయ పీఠము.

సాధారణముగా పట్టాభిషేక సమయములందు రాజులు కూర్చుండుటకు చంద్రకర్ర తో నిర్మింపఁబడిన 'ఆసంది' యను సింహాసనము నుపయోగింతురు.

లొడితెడు ఎత్తుగల నాలుగు కాళ్లును, అడుగు ఎత్తుగల పైభాగమును గలిగి నలుచదరమై ముంజగడ్డితో నల్లబడిన పీటను 'ఆసంది' అందురు.

ఔదుంబరపీఠము

కర్ణుని సర్వ సైన్యాధ్యక్షునిఁగా పట్టము గట్టనపుడు ఔదుంబర పీఠ ముపయోగింపఁబడినది

రారాజు... "సమున్న తౌదుంబర పీఠంబునం బరమాస్తరణం బొనర్చి యంగపతి నందు నిలిపి...... అభిషేకించి పట్టము గట్టి" నట్లు తిక్కన మూలాను సారముగా వర్ణించినాఁడు. —తిక్కన కర్ణ. 1-56

ఔదుంబరే సుఖాసీనమాసనే క్షౌమసంవృతే॥ —వ్యా. భా. కర్ణ. 11-49*

1. నన్నయ. ఆది. 6-49 = వ్యా. భా. ఆది. 136-37

....కాంచనే పీఠే మంత్రివిద్భిర్మహారథః అభిషిక్తోఽంగరాజ్యేన

* పోల్చు :- వాల్మీకి రామాయణము, అయోధ్య. 14-37

"ఔదుంబరం భద్రపీఠ మభిషేకార్థ మాహృతమ్॥

ఔదుంబర్యాసందీ తస్యై ప్రాదేశమాత్రాః పాదాః॥ [ఇతి బ్రాహ్మణ ప్రసిద్ధమ్.]

భద్రపీఠం భద్ర సూచక చిహ్న చిహ్నిత పీఠవిశేషశ్చ ఆహృతమ్॥

Cf :- Padmini Sen Gupta : Every Day Life in Ancient India - p. 40

"The throne, called Simhasana, was always necessary in royal households and various forms of ottamang are described in ancient homes. There were certainly chairs, as a verse in the Rigveda gives the following description "

'Of golden form, of golden aspect, of golden hue and shining seated on a golden seat "

"హిరణ్యాత్ప్రరియో నేర్నిషద్యా" — ఋగ్వేద 2. 35-10

# సింహాసనములు

ధర్మజుఁ డాస్థాన మండపంబునకు వచ్చి,

ఉదయధరణీధరంబుపై నొప్పు దివసనాథునెనయుచు సింహాసనంబుమీఁదఁ బొలిచె లీలావతీకర కలిత చామరములు వొలయంగ నుచితజనములు గొలువ.

—తిక్కన. ద్రోణ, 3. 3-8

సర్వతోభద్ర మను నీ సింహాసనము సువర్ణవికృత మనియు మౌక్తిక వైడూర్యాది మణులు పొదగఁ బడినదనియు మంచి పఱపు గలదియు విశ్వకర్మ చే నిర్మింపఁబడిన దనియు మూలము నందు వర్ణింపఁబడినది.

సౌవర్ణం సర్వతో భద్రం ముక్తావైడూర్య మండితమ్*
పరార్ధ్యాస్తరణాస్తీర్ణం సోత్తరచ్ఛద మృద్ధిమత్
విశ్వకర్మకృతం దివ్య ముపజహ్రు ర్వరాసనమ్॥

—వ్యా. భా. ద్రోణ 82-83, 84

అగ్నిపురాణము నందు భద్రాసనలక్షణ మిట్లు చెప్పఁబడినది.

భద్రాసనం క్షీరవృక్షైః పంచాశ దంగుళోచ్ఛ్రితైః
విస్తారేణ త్రిహస్తం స్యాద్ సువర్ణాద్యైశ్చ చిత్రితమ్॥

—అగ్నిపురాణ. 246. 3-4

భద్రాసనములు క్షీరవృక్షదారువుతో ఏఁబది అంగుళముల ఎత్తు. మూఁడు హస్తములు వెడల్పు గలిగి యుండు నట్లు నిర్మింపవలయును. శోభార్థము బంగారు తొడవులు మొదలగు వానితో నలంకరింప వలయును.

మానసోల్లాసము అను శిల్పశాస్త్రగ్రంథమునందు సింహాసన లక్షణ మిట్లు చెప్పఁబడినది.

రుచిరేణ సువర్ణేన నిర్మితం రత్నరంజితమ్
అష్టభిస్ స్ఫాటికై స్సింహై ర్మూర్ధ్ని తత్సువిరాజితమ్॥
అధః కాంచన విన్యస్త రత్నవేదిత్రయాన్వితమ్
ఆస్థాన మండపే రాజ్ఞాం సింహాసన మిదం వరమ్॥

---

* పోల్చు :- వ్యా. భా. ఉద్యోగ. 93-38

ఆసనం సర్వతోభద్రం జాంబూనద పరిష్కృతమ్
కృష్ణార్థే కల్పితం తత్ర ధృతరాష్ట్రస్య శాసనాత్॥

## 2. లోహశిల్పము : కర్మారులు

బ్రహ్మణస్పతి రేతా సం కర్మార ఇవాధమత్
దేవానాం పూర్వే యుగేఽసతః స దజాయత॥

—ఋగ్వేద. 10. 72-2

అసత్తు నుండి సత్తు ఉద్భవించి నట్లు. దేవతల పూర్వయుగము నందు కర్మారుఁడు ముడి పదార్థములను మూసలో కరిఁగి యేకముచేసి నూతన పదార్థములను సృష్టించి నట్లు బ్రహ్మణస్పతి - జగత్సృష్టి కర్త - యీ లోకములను సృష్టించినాఁడు.

మహాభారతకాలము నాటికి లోహ శిల్ప మభివృద్ధి చెందినది.

హలముఖాద్యుపకరణములే కాక లోహకారులు ఇనుముతో గదాసి పరశ్వధ శూల పట్టిస పరిఘ శతఘ్ని ప్రముఖ ప్రహరణంబులు యంత్ర చలితాస్త్రములు నిర్మించుచుండిరి.

విశ్వకర్మ పంచ పుత్రులలో నొకఁడైన మయుఁడు దారుశిల్పమును పెంపొందింపఁగా, మనువు లోహశిల్పమును ప్రవర్తిల్లఁ జేసినాఁడు. పెక్కు సందర్భములందు తక్షకులు - కర్మారులు కలిసియే పనిచేయుచుందురు,

రథయంత్రశిల్ప విశేషములు సప్తమోన్మేషమునందు వివరింపఁబడినవి.

---

Cf :- (1) Jeanine Miller : The Vedas.

"The lord of the prayer, even like a smith, forged these (worlds) together, in the primeval age of the gods, as Being emerged from Non-being."

(2) Ralph T. H. Griffith : The Hymns of the Rigveda. Vol. II

"These Brahmanaspati produced with blast and melting like a smith."

These = All beings ;
Like a smith = as a blacksmith blows up his fire and melts metal.

పరశువు = గండ్రగొడ్డలి; పరిఘ = ఇనుపకట్ల గుదియ
శతఘ్ని = నాలుగు మూరలు నిడివిగల యినుప ముండ్లకర్ర
శతఘ్ని యన ఫిరంగి యని కొందఱు.
సింహాసనస్య రక్షార్థం శతఘ్నీః స్థాపయేద్గృహే॥

—ఇతి వశిష్ఠ ధనుర్వేదే.

# 3. తామ్రశిల్పము : వివిధ పాత్రలు

త్వష్టా మాయా వేద మపసా మపస్తమో
బిభర్తి పాత్రా దేవపానాని శంతమా॥ — ఋగ్వేద. 10. 64-9*

శిల్పకారులలో నత్యంతనిపుణుఁ డయిన త్వష్ట తన శిల్పచాతుర్యముతో దేవతలకు పానపాత్రలు చేసియిచ్చువాఁడు.

'చమసములు', 'గ్రహములు' - అనఁబడు సోమపాత్రలు దారుమయములే. 1 కాని యార్యులు క్రమముగా తామ్రపాత్రలు కాంస్యపాత్రలు నుపయోగింపఁజొచ్చిరి.

మహాభారతకాలమున జనులు తామ్ర పాత్రలు, కాంశ్య పాత్రలు వాడుచుండిరి.

ధర్మజుఁడు సూర్యునారాధించుచు జపముసేయుచుండ తపనుండు ప్రత్యక్షమై "నీ తపంబునకు మెచ్చితి నీ పండ్రెండేండ్లును వన్యఫలమూలశాకంబుల నీ మహానసంబున ద్రుపదరాజపుత్త్రి చేత నారాధితంబులై యక్షయంబులైన చతుర్విధాహారంబు లగు నని యొక్క తామ్రస్థాలి నిచ్చి వరంబిచ్చి యంతర్హితుఁడయ్యె" — నన్నయ, అరణ్య. 1-43

గృహ్ణీష్వ పిఠరం తామ్రం మయా దత్తం నరాధిప
యావద్వర్త్స్యతి పాంచాలీ పాత్రేణానేన సువ్రత॥
— వ్యా. భా వన. 3-72**

పిఠరము = వంటకుండ = స్థాలి.

---

* Cf. :- Griffith : The Hymns of the Rigveda Vol. II
"Tvastar, most deft of workmen, knew each magic art, bringing most blessed bowls that hold the drink of Gods".

1. చూడు :- వైదిక సాహిత్యచరిత్రమ్ - పి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రిణా కె. యల్. వ్యాసరాయశాస్త్రిణాచ విరచితమ్ - పుట. 2f1

** గృహ్ణీష్వ గృహాణ పిఠరం పరివేషణ పాత్రం తామ్రం తామ్రమయం
వర్త్స్యతి వృత్తిం జనజీవికారూపాం కరిష్యతి
పాత్రేణ పాత్రప్రసూతేనాన్నేన ॥ 72 ॥
యావద్వర్త్స్యతి తావదన్నాద్యం ఓదదానికం అక్షయ్యం
భవిష్యతీతి సంబంధః॥ — నీలకంఠ.

## తామ్ర పాత్రల విశిష్టత

ఉపవాసే బలౌ చాపి తామ్రపాత్రం విశిష్యతే
బలిం భిక్షాం తథార్ఘ్యం చ పితౄణాం చ తిలోదకమ్
తామ్రపాత్రేణ దాతవ్య మన్యథాఽల్పఫలం భవేత్
గృహ్యా మేతత్ సముద్దిష్టం యథా తుష్యంతి దేవతాః ॥

—వ్యా. భా. అనుశాసనిక. 126 2-223

ఉపవాసములందు, పూజాసమయములందు తామ్రపాత్రల నుపయోగించుట శ్రేష్ఠము. పూజాసామగ్రి నుంచుటకు, భిక్షాదానమునకు, అర్ఘ్యప్రదానమునకు, పితరులకు తిలోదకము లొసఁగుటకు తామ్రపాత్రల నుపయోగింపవలెను. అట్లైన దేవతలు సంతృప్తులై పుణ్యఫలముల నొసఁగుదురు. అన్య పాత్రల నుపయోగించిన వారి కల్పఫలములు గలుగును.

పూర్ణిమనాఁడు చంద్రోదయ సమయమున తామ్రపాత్రలో మధు మిశ్రిత పక్వాన్నమును సోమునకు బలియొసఁగ వలెను.

గృహీత్వౌదుంబరం పాత్రం పక్వాన్నం మధునా సహ
సోమస్యోత్తిష్ఠ మానస్య పౌర్ణమాస్యాం బలిం హరేత్॥

—వ్యా భా. అను. 34-4

అమావాస్య తిథి తామ్రపాత్రయందు మధుమిశ్రిత తిలోదకమును పితరులకు తర్పణము చేసినచో శ్రాద్ధ కర్మ ఫలించును.

అమావాస్యాం తు యే మర్త్యాః ప్రయచ్ఛంతి తిలోదకమ్॥
పాత్ర మౌదుంబరం గృహ్య మధుమిశ్రం తపోధన
కృతం భవతి తైః శ్రాద్ధం సరహస్యం యథార్థవత్॥

—వ్యా. భా. అను. 125-81

ఔదుంబరము = ఒక లోహము, రాగి.

తామ్రము కాంస్య పిత్తలాది లోహముల కుపలక్షకము.

తామ్ర పాత్రలు చేయు శిల్పులే కాంస్యకారులును.

త్వాష్ట్రకః కాంస్యకర్తా చ॥ —[ఇతి శైవాగమే]

శౌల్బికులు - కాంస్యకారులు విశ్వకర్మ పంచపుత్రులలో నొకఁడైన త్వష్టృ వంశీయులు.

## కాంస్య పాత్రలు

అథాస్మై సురా కంసం హస్త ఆదదతి॥ —యజుర్వేద

రాజసూయ యాగము నందధ్వర్యుడు సురాయుక్తమగు కాంస్య పాత్రను యజమానుని హస్తమునం దుంచ వలెనని శుక్ల యజుర్వేదము చెప్పుచున్నది.

రాజసూయ యాగముచేయుచున్న ధర్మరాజు కొఱకు దేవకాంత లిందుఁన కిచ్చు వరుణసంబంధమయిన యమృతమును కలశోదధి కాంస్య పాత్ర యందుఁదెచ్చినాడు.

యథైవ మధు శక్రాయ ధారయం త్యమర స్త్రియః
తదస్మై కాంస్య మాహర్షీద్ వారుణం కలశోదధిః ॥
—వ్యా. భా. సభా. 51-23*

కాంస్య మన కంచుతో నిర్మింపఁబడిన పానీయపాత్ర

## దుగ్ధ పాత్రిలు

రాజసూయమునకు వచ్చిన రాజులు కొందఱు వేలకొలఁది యడవి యావులను దోహనార్ధము కంచుగిన్నెలను దెచ్చిరి.

దక్షిణార్థం సమానీతా రాజభిః కాంస్యదోహనాః
ఆరణ్యా బహుసాహస్రా అపశ్యంస్తత్ర తత్ర గాః ॥ —వ్యా. భా. సభా. 32-27

రేవతీ నక్షత్రమునందు, "కంచు కుండతో మొదవు" దాన మిచ్చిన నూర్ధ్వలోకములు గలుగును. —తిక్కన. అను. 2-378

కాంస్యోప దోహనాం ధేనుం రేవత్యాం యః ప్రయచ్ఛతి
సా ప్రేత్య కామానాదాయ దాతార ముపతిష్ఠతి॥ —వ్యా. భా. అను. 64-33

[కంచుతో నిర్మింపఁబడిన దుగ్ధపాత్రలో గోదానము చేసినచో నా ధేను వా దాత కోరికలు దీర్చి వాని సేవ కొఱకు నిలిచియుండును.]

---

* పాఠాంతరము - "యస్మైవ మధు శక్రాయ..."
—వ్యా. భా. సభా 45-26 స్వాధ్యాయ మండల్ ప్రతి

మధు = అమృతం; ధారయంతి = బిభ్రతి; కాంస్య = పానీయ పాత్రం; వారుణం వరుణసంబంధి; కలశోదధిః సముద్రః ॥ —దేవబోధటీక.

"And Ocean himself brought unto him in Vessels of white copper the nectar that is generated in his waters which is so superior...
— P. C. Roy.

కాంస్యదోహనయుక్తముగా కపిల గోవును దానము చేసిన పుణ్య లోకములు ప్రాప్తించు నని సరస్వతీదేవి తార్క్ష్యమహామునికిఁ జెప్పినది.

దదాతి యోవై కపిలాం సుచైలాం కాంస్యోపదోహాం ద్రవిణై రుత్తరీయైః
తైస్తై ర్గుణైః కామదుహా౽థభూత్వా నరం ప్రదాతారముపైతి సా గౌః॥
యావంతి రోమాణి భవంతి ధేన్వాస్తావ త్ఫలం భవతి గోప్రదానే
పుత్రాంశ్చ పౌత్రాంశ్చ కులం చ సర్వ మాసప్తమం తారయతే పరత్ర॥
—వ్యా. భా. వన. 186-11,12

భారతానుశాసనిక పర్వమునం దీ శ్లోకమిట్లేయున్నది. దానిని తిక్కన యిట్లు తెనిగించినాఁడు.

"కాంస్యోపదోహయుఁగాంచన చారుశృంగయుః ధవళాంబర కలితయు
స దక్షిణయు నయి తగు గోవుఁ బాత్రత్వ భవ్యవిప్రునకు సద్భక్తితోడ
నిచ్చిన దానికి నెన్ని రోమము లన్నిదివ్యసంవత్సరములు త్రిదశలోక
మున వసింతురు కులంబున నేఁడుతరముల జనముల ననుతు రధిప. *

## తి ల ధే ను దా న ము

అట్లె బంగారు కొమ్ములతోను కంచుకుండతోను ద్రవ్యోత్తరీయముల తోను దక్షిణాసహితముగా తిలధేను దానము చేసిన వసులోకము ప్రాప్తించు నని చెప్పఁబడినది.

స దక్షిణాం కాంచనచారు శృంగీం
కాంస్యోపదోహాం ద్రవిణై రుత్తరీయైః
ధేనుం తిలానాం దదతో ద్విజాయ
లోకా వసూనాం సులభా భవంతి॥
—వ్యా. భా. వన. 168-13 **

ఈ విధముగా మహాభారతకాలమున జనులు కాంస్యపాత్రలను పానీయ పాత్రలుగను దుగ్ధపాత్రలుగను ఉపయోగించుచుండిరి. కాంస్య దోహనములతో గోదానము చేసిన పుణ్యలోకములు ప్రాప్తించు నని విశ్వసించుచుండిరి.

---

* తిక్కన. ఆనుశాసనిక. 2-387 = వ్యా. భా. అను. 57-30

** తిలధేనుకాండే ప్రసిద్ధా॥ — నీలకంఠ.

# 4. శిలాశిల్పము

కారు రహం తతో భిష గుపలప్రక్షిణీ ననా
నానాధియో వసూయవః ॥ —ఋగ్వేద. 9 112-3*

[నేను శిల్పిని, నా తండ్రి వైద్యుఁడు; నా తల్లి తిరుగలితో పిండి విసరుచుండునది.]

కొందఱు భాష్యకారు లీ మంత్రమునకు "నా బుద్ధి కవితా వైద్య శిల్పాదుల యందు ప్రవర్తిల్లు చున్న" దని యర్థము చెప్పినారు.[1] ఇట 'ఉపల' శబ్దము శిలాశిల్ప సూచకము.

శిలా కర్తా చ శిల్పికః ॥ –[శైవాగమము]

శిలలతో పనిచేయువారు శిల్పు లని యర్థము.

శిలాశిల్పము చేయువారు పంచబ్రహ్మలలో నొకడైన శిల్పి వంశీయులు.

శిలా శిల్పమన కేవలము శిలలతో విగ్రహములు నిర్మించుటయే కాదు. పాషాణములతో తిరుగళ్లు, పాత్రములు ఆయుధములు మొదలగు వానిని చేయుటయు.

మహాభారతకాలమున శిల్పులు శిలలతో మందిరములు సభా భవనములు తోరణములు, వేదికలు నిర్మించుచుండిరి.

ఇందుల కుదాహరణముగా మయ సభ, ధృతరాష్ట్రుఁడు వేవురు శిల్పాచార్యులచే నిర్మింపించిన సభా భవనము, మణికుట్టిమములు, రత్నవేదికలు పేర్కొన వచ్చును.[2]

---

* Cf. :- Ralfh T. H. Griffith : The Hymns of the Rigveda Vol. II.
"A bard am I, my dad's a leech; mummy lays corn on the stones, strivcing for wealth - with various plans"

1 చూడు :- పం. ఆర్యముని. పం. శివశంకర్ — ఋగ్వేద భాషాభాష్యము. రెండవ సంపుటము. పు. 357. దయానంద సంస్థాన్ ప్రచురణ.

ఉపల ప్రక్షిణీ = పాషాణోంకా సంస్కార్ కర్నేవాలీ
మేరీ బుద్ధి ముఝే మందిరోంకా నిర్మాతా భీ బనాసక్తీ హై॥

2 చూడు :- డా॥ శోభిరాల సత్యనారాయణ : శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము ప్రథమ ద్వితీయ భాగములు.

# 5. సువర్ణ శిల్పము

దైవజ్ఞః స్వర్ణకారశ్చ॥ —[ఇతి శైవాగమే]*

సువర్ణ శిల్పమును లోకమునందు విస్తరింపఁ జేసినవాఁడు విశ్వకర్మ పంచపుత్రులలో నైదవ వాఁడయిన దైవజ్ఞుఁడు.

ఈ దైవజ్ఞునకే విశ్వజ్ఞుఁ డను నామాంతరమున్నది. కావున విశ్వకర్మ కులోత్పన్నులయిన స్వర్ణకారులు దైవజ్ఞ (విశ్వజ్ఞ) వంశీయులు.

మానవులకు శరీరాలంకారాభిరుచి యెక్కువయిన కొలఁదియు స్వర్ణ భూషణాలంకార రచనమును క్రమక్రమముగా వృద్ధిచెందుచు మహాభారత కాలము నాటికి పరాకాష్ఠ చెందినది.

మహాభారతమునందు స్వర్ణశిల్ప ప్రాశస్త్య మనేకవిధములుగా నుగ్గడింపఁ బడినది. తద్విశేషము లీ గ్రంథమున పూర్వప్రకరణము లందు వివరింపఁ బడినవి.

ఈ యన్వేషమున మఱికొన్ని విశేషములు చర్చింపఁబడును.

## మణి ముద్రికలు : నవరత్న భూషణములు

మహాభారతకాలమున హిరణ్యకారులు కంకణకుండలాది మాంగల్యా భరణములనేకాక మహిమాన్వితములైన మణిముద్రికలను నవరత్నభూషణము లను నిర్మించుచుండిరి.

మయ నిర్మిత సభాభవన ప్రవేశమునకు ముందు ధర్మరాజు పదివేవురు విప్రులకు మణిముద్రిక లొసఁగినాఁడు.

> వీరుఁడు ధర్మజుండు పది వేవురు విప్రుల కొప్పఁ బాయసా
> హారము భక్తిఁ బెట్టి మఱి యందఱకున్ జెఱి వేయి వేయి వి
> స్తారయశుండు ధేనువుల ధర్మవిధిన్ మణిముద్రికాద్యలం
> కార[1] దుకూల పుష్పఫల గంధయుతంబుగ నిచ్చె లీలతోన్.

ఉత్తర వివాహ మహోత్సవసమయమున మత్స్యమహీపతియు సుదేష్ణాదులును, నానానవరత్నభూషణములు ధరించిరి.[2]

---

* చూడు :- బ్రాహ్మణోత్పత్తి మార్తాండ.

1 —నన్నయ, సభా, 1-15    2 తిక్కన, విరాట, 5-384

## నవరత్నాంగులీయక రచనావిధానము

ధారణం నవరత్నానాం గ్రిహసంతోష కారకమ్
సర్వపీడా హరం చైవ లోకానాం పీ్రితివర్ధనమ్॥
— విఘంటు రత్నాకరము

నవరత్నములు ధరించుట వలన నవగ్రహములకు సంతోషము కలుగును. సర్వపీడలు హరించును. లోకులకుఁ బ్రీతి హెచ్చును. 1

శుక్రుని కొఱకు హీరకమును, చంద్రునికొఱకు ముత్యమును మంగళుని (కుజుని) కొఱకు ప్రవాళమును, రాహువు కొఱకు గోమేధికమును, కేతువు కొఱకు వైఢూర్యమును, గురువు కొఱకు పుష్యరాగమును, బుధుని కొఱకు మరకతమును ప్రాగాది దిక్కులందమర్చి మధ్యభాగమున మార్తండుని కొఱకు మాణిక్యమును స్వర్ణాది ధాతువులందు స్థగితము చేయవలె నని ధర్మశాస్త్ర గ్రంథములందుఁ జెప్పఁబడినది.

హీళుం ముచం ప్రిమం గోరాం వైకే పుగుం మబుమ్
ప్రాచ్యా రత్నాని ఖేటాళ్చ మధ్యే మాణిక్య ముష్ణగోః॥ —ఇతి బోపదేవః॥ *

నవగ్రహములకు జపహోమములు చేసి నవరత్నముద్రికను ధరించిన వారికి గ్రహములు వశ మగు నని మానసోల్లాసమునందుఁ జెప్పబడినది.

అర్కేందురక్తజ్ఞ గురుభృగుమందాహికేతవః
మాణిక్యం మౌక్తికం చారువిద్రుమం గారుడం పునః
పుష్పరాగం లసద్వజ్రిం నీలం గోమేదకం తథా
వైడూర్యం నవరత్నాని ముద్రాం తాం కల్పయేచ్ఛుభామ్॥

జపహోమాదికం సర్వే కుర్యాత్ పూర్వోక్త వర్త్మనా
యో ముద్రాం ధారయేదేతాం తస్య స్యు ర్వశగా గ్రహాః॥

"నవరత్నముద్రిక లొనర్చుటలో బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడగు శిల్పాచార్యుఁడు నవగ్రహముల ననుష్ఠించి గ్రహములకు దగిన యుచ్చకాలముల

1 చూడు :- వడ్డెపాటి నిరంజనశాస్త్రి : విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము, పుట. 116

* భట్టనీలకంఠ : ఆచారమయూఖము (ద్వితీయ భాగము) బొంబాయి ధర్మశాస్త్ర గ్రంథమాల, 16

తత్తద్రత్నములఁ బ్రతిష్ఠింపవలయు" నని గురుచరిత్ర యను మహారాష్ట్ర గ్రంథము నందు వ్రాసియున్నది. 1

ఉత్తరము

| పడమర | | | | తూర్పు |
|---|---|---|---|---|
| | వైడూర్యం | పుష్యరాగము | మరకతము | |
| | నీలాలు | మాణిక్యము | వజ్రము | |
| | గోమేధికం | ప్రవాళము | ముత్యము | |

దక్షిణము

గ్రహములన్నియు సోచ్చక్షేత్రము లందుట కుదరగు కనుక గ్రహములు తమ సోచ్చ వర్గోత్తమ స్వ నవాంశల యందున్న సమయము నం దాయా రత్నములను తాపడము చేసి తయారు చేసిన యుంగరము నవగ్రహపూజా పూర్వకముగా ధరించిన శుభఫలములు గలుగును.

## సూర్య కిరణ చికిత్స

సువర్ణ రత్నధారణ మొక విధమగు సూర్య కిరణ చికిత్స యను భావము వైదిక యుగమునుండియు నున్నది.

అగ్ని మీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజమ్
హోతారం రత్న ధాతమమ్॥ —ఋగ్వేద. 1. 1-1

అగ్ని దేవుఁడు రత్నముల నిచ్చువాఁడు. రత్నధాతమమ్ అనఁగా రత్నములు ధరించువాఁడని కొందఱు వ్రాసినారు. 2

ఎట్లయినను అగ్నికి రత్నములకు సంబంధ మున్నదనుట స్పష్టము రత్నములఁదు దివ్యాగ్నితేజము నిక్షిప్తమై యుండును.

సూర్యరశ్మి ప్రసారము వలన నాయారత్నగుణములు ధాతుగుణములు కలిసి యాయా రత్నములు ధరించినవారి శరీరములందుఁ బ్రవేశించి శారీరక మానసిక దోషములను పోఁగొట్టి యారోగ్యము నొసఁగును.

ఆయారత్నముల కధిపతులయిన గ్రహములకుఁ బ్రీతి గలిగించి తత్తద్ గ్రహానుగ్రహమునకు పాత్రులను జేయును.

రత్నము హిరణ్యాది ధాతువులందు తాపడముచేసి వివిధాభరణములను నిర్మించువారు హిరణ్యకారులే. వీరు దైవజ్ఞ వంశీయులు.

---

1 చూడు :- నిరంజనశాస్త్రి : విశ్వబ్రాహ్మణ వంశాగమము. పు. 116

2 Cf. :- Dr. G. S. Kapoor : Remedial Measures in Astrology —P. 90 " The Supreme Lord is one who wears Ratnas (gems)...... It shows a hint that the heavenly FIRE (Agni) is present in the Ratnas in the form or rays"

# పంచశిల్పప్రపంచనము : ప్రకీర్ణశిల్పములు

పంచశిల్పప్రపంచనము వలన నానావిధశిల్పము లుత్పన్నమయినవి.

సమస్త శిల్పములకుఁ గర్త విశ్వకర్మ పరమేశ్వరుఁడే యైనను పరశివ విశ్వకర్మ ముఖోద్భవులయిన మను మయ త్వష్ట శిల్పి దైవజ్ఞులను పంచ బ్రహ్మలు అయో దారు తామ్ర శిలా స్వర్ణాది పంచశిల్పములను లోకము నందు విస్తరిల్లఁజేసిరి.

అయసాం మనుః కర్తా చ కాష్ఠకారో మయః స్మృతః
త్వాష్ట్రకః కాంస్యకర్తా చ శిలాకర్తా చ శిల్పికః
దైవజ్ఞః స్వర్ణకారశ్చ పంచానాం కర్మ పంచకమ్॥

—ఇతి లైంగే శైవాగమ్.*

విశ్వకర్మ మూలపురుషుఁడుగాఁ గల పంచబ్రహ్మలు, వారి సంతతియు, శిష్య ప్రశిష్యులు నానావిధశిల్పముల నభివృద్ధి చేసి పాంచాల బ్రాహ్మణులుగా ప్రసిద్ధిఁగాంచిరి.

ఇది శిల్పి బ్రాహ్మణ సంప్రదాయము.

మహాభారతమున లోహమయ వస్తువులు దారు శిల్పములు సువర్ణాలంకృతములుగా వర్ణింపఁబడి యుండుట చేత లోహకారులు వర్ధకులు, స్వర్ణకారులు పరస్పర సహకారముతో పనిచేయుచుండిరని తెలియుచున్నది.

కనకలాంగులములు, స్వర్ణాలంకృతములైన యజ్ఞోపకరణములు శస్త్రాస్త్రములు నిందుల కుదాహరణములు.

శిలాశిల్పుల విషయము వేఱుగా నున్నను వారికిఁ గూడ లోహకారులచేఁ జేయఁబడిన టంకము-శాణము మున్నగు శిల్పాయుధముల యవసరమున్నది.

స్వర్ణకారులును లోహశిల్పులచే నిర్మింపఁబడిన యినుప పనిముట్ల పయి నాధారపడియుందురు.

అట్లే తక్కిన శిల్పకళాకారులును. ఈ విధముగా వివిధశిల్పములందు ప్రవీణులయిన శిల్పకారు లెల్లరు కలసిమెలసి పనిచేయుచు సహజీవనము గడుపుచుండిరని స్పష్టమగుచున్నది.

---

* చూడు :- పండిత హరికృష్ణశాస్త్రి :
బ్రాహ్మణోత్పత్తి మార్తాండ. అ. 51 (పుట. 564) 1954
— శ్రీ వేంకటేశ్వర ప్రెస్ ప్రకాశన్ - బొంబయీ. 4

# పూర్ణకుంభములు

పూర్ణాత్పూర్ణ ముద్ధరంతి పూర్ణాత్పూర్ణం ప్రచక్షసే
హరంతి పూర్ణాత్ పూర్ణం చ పూర్ణమేవావశిష్యతే॥
—వ్యా. భా. ఉద్యోగ. 49-3*

భారతీయ సంస్కృతిలోను శిల్ప సాహిత్యములలోను పూర్ణకుంభమునకు ప్రత్యేక స్థానమున్నది.

పూర్ణకలశ భావన వేదకాలమునుండియు నున్నది.

ఆ పూర్ణో అస్య కలశః స్వాహా ః [సేవతేన]
సిక్తేన కోశం సిసిచే పిబధ్యై ॥ —ఋగ్వేద. 3. 32-25

[యజమానుని కలశము అమృతముతో నిండియున్నది. వానికి మేలు గలుగు గాక. ఈ కలశమును పానీయముతో నింపినాను.]

ఆ విశన్ కలశ నుతో విశ్వా అర్షన్నభి శ్రియః ॥
—ఋగ్వేద. 9 62-19

[శస్త్ర విద్య నభ్యసించిన కుమారుని కొఱకు - సేనాపతి కొఱకు - ఈ సోమ కలశము నందు (విశ్వశ్రియః) సర్వశ్రేయములు ప్రవేశించుఁ గాక.]

కాలమునకు మూలాధారము పూర్ణకుంభమే- అది యనేక విధములు గా నభివ్యక్త మగుచున్నది.

పూర్ణ కుంభోఽధికాల ఆహిత స్తం పై
వశ్యామో బహుధా ను సంతః [సంతమ్]
స ఇమా విశ్వాభువనాని ప్రత్యజ్
కాలం తమాహుః పరమో వ్యోమిన్॥
—అథర్వ. 19. 53-3**

అమృత పూర్ణకలశము పూర్ణానందమయ జీవితమునకు సంపత్సమృద్ధికి శాశ్వతత్వమునకు ప్రతీక.

---

* పోల్చు :- పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే॥ —[ఈశావాస్య.]

** Cf :- Bloomfield : Hymns of the Atharva Veda P. 224
"A full Jar has been placed upon TIME, him verily we see existing in many forms. He carries away all these beings (worlds); they call him Time in the highest heaven."

అష్ట మంగళములలో పూర్ణ కలశ మొకటి.

మృగరాజో వృషో నాగః కలశో వ్యజనం తథా
వైజయంతీం తథా భేరీ దీప ఇత్యష్టమంగళమ్॥ *

ప్రయాణ సమయములందును పెద్దలకు స్వాగతము చెప్పు నపుడును వివాహాది శుభసమయము లందును పూర్ణ కుంభముల నుపయోగించుట సంప్రదాయ సిద్ధముగ నున్నది.

పూర్ణ కుంభో ద్విజా గావో యచ్చాన్యత్కించి దుత్తమమ్
శుభం స్వస్త్యయనం చాపి భవిష్యతి తవాండజ॥

—వ్యా. భా ఆది 29-34

గరుడుండు నిజ జననీదాస్య నిరాసార్థం బురగుల కమృతంబు దేర నరుగునపుడు, "పూర్ణకుంభములు, ద్విజులు, గోవులు, తదితర మంగళకర వస్తువులు నీకు మేలు గూర్చుంగాత" మని కశ్యప ప్రజాపతి యాశీర్వదించి పంపినాండు.

శ్రీకృష్ణుండు రాయబారార్థము కరిపురమునకు జనునపుడు, పూర్ణ కలశ వృషభాది భద్ర పదార్థంబుల నవలోకించుచుం బుణ్యాంగనలు సేసలొలుకం జిత్తంబు ప్రసన్నతం బొంద వెడలినాండు. —తిక్కన. ఉద్యోగ. 3-132

హస్తినాపురమున శ్రీ కృష్ణుని రాకకుం జేయు సన్నాహములలో పూర్ణ కుంభములతో నెదుర్కొనుట యొకటి.

అర్జునుండు ప్రాణతుల్యుండు హరికి నట్లు గాన జలపూర్ణమంగళకలశమునకుం
బాద్యమునకుం గుశల సంప్రశ్నమునకు మిగుల నొండు జనార్దనుమెచ్చుగాదు.

అని విదురుండు ధృతరాష్ట్రునికి జెప్పినాడు.[1]

ద్రౌపదీ వివాహ మహోత్సవ సమయమున పాండు కుమారులు "ప్రత్యగ్రపల్లవశాల్యకితాంచిత కాంచన పూర్ణకలశోపశోభితంబును" ...నయిన వివాహమండపంబునకుం జని నట్లు వర్ణింపం బడినది

—నన్నయ. ఆది. 7-283

* Cf :- V. S. Apte - Sanscrit English Dictionary.

1 తిక్కన. ఉద్యోగ. 3-169 = వ్యా. భా. ఉద్యోగ. 87-13

"అన్యత్ కుంభా దపాం పూర్ణా దన్యత్ పాదావనే-నాత్."

## న గ రా లం క ర ణ ము

పూర్ణకుంభములు పూర్ణజీవితమునకు ప్రతీక. కావుననే గృహమునందు ప్రాణు లాయురారోగ్యములతో సుఖముగా నుండుటకొఱకు, గృహదేవతా ప్రీత్యర్థము గృహములమీఁదను గృహ ద్వారములందును పూర్ణకుంభములు నిలుపు సంప్రదాయ మేర్పడినది.

ఇంద్రప్రస్థ పురద్వారములు పూర్ణకుంభములతో నలంకరింపఁబడినవి.[1]

యుద్ధానంతరము ధర్మరాజు హస్తినాపురము ప్రవేశించు సమయమునం దందలి జనంబులు క్రముక కదళీస్తంభ పూర్ణ కుంభ స్థాపనంబులను నప్పురం బలంకరించిరి. —తిక్కన. శాంతి. 1-354

వారిపూర్ణములయిన కుంభములను నగరద్వారము లందుంచి నట్లు మూలమునందు స్పష్టముగ నున్నది.

కుంభాశ్చ నగరద్వారి వారిపూర్ణా నవా దృఢా
కన్యాస్సుమనసో గౌరాః స్థాపితా స్తత్ర తత్ర హ॥—శాంతి. 37-48

## కాం చ న క ల శ ము లు

అభిషేచనిక ద్రవ్యములలో కలశములు ముఖ్యమయినవి.

అభిషేచనికం భాండం సర్వసంభార సంభృతమ్
కాంచనౌదుంబరాస్తత్ర రాజతాః పృథివీమయాః*
పూర్ణకుంభాః సుమనసో లాజా బర్హీంషి గోరసమ్....
—వ్యా. భా. శాంతి. 40-10, 11

యుధిష్ఠిరుని పట్టాభిషేక సమయమున ధౌమ్య పురోహితుఁడు "పార్థివంబులు హైమంబులు రాజతంబులు రత్నమయంబులు నగు కుంభంబు లొనర్చి వానను గాంగంబులగు జలంబులు నినిచి యన్నింటికి రత్నమంగళతరు త్వక్పల్లవ కుసుమంబులను బంచగవ్యంబులను సమంత్రకంబుగా సంస్కారంబు నిర్వర్తించి" నట్లు తిక్కనవ్రాసినాఁడు.[2]

కాని మూలము నందలి రాగి కుండల స్థానమున రత్నకుంభముల నుంచినాఁడు.

---

1 చూడు .- శోభిరాల సత్యనారాయణ : శ్రీ మదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము. [ప్రథమ భాగము, పుటలు. 97-98

* ఔదుంబరా స్తామ్రమయా॥ —నీలకంఠ

2 తిక్కన శాంతి, 1-373

ఈ చతుర్విధకుంభముల ప్రత్యేక ప్రయోజనము అగ్నిపురాణము నం దిట్లు చెప్పఁబడినది.

అభిషించే దమాత్యానాం చతుష్టయ మథో ఘటైః
పూర్వేణ హేమకుంభేన ఘృతపూర్ణేన బ్రాహ్మణః
రూప్య కుంభేన యామ్యే చ క్షీర రూపేణ క్షత్రియః
దధ్నా చ తామ్రకుంభేన వైశ్యః పశ్చిమగేన చ
మృణ్మయేన జలేనోదక్ శూద్రామాత్యో అభిషేచయేత్॥
—అగ్నిపురాణ 218. 18-20

కర్ణుని అంగరాజ్య పట్టాభిషిక్తుని జేసినపుడు మంత్రవేత్త లయన బ్రాహ్మణులు కాంచన కలశములనే యుపయోగించినారు.

తత స్తస్మిన్ క్షణే కర్ణః సలాజకుసుమై ర్ఘటైః
కాంచనైః కాంచనే పీఠే మంత్రవిద్భిః మహారథః ॥
అభిషిక్తోఽంగరాజ్యే చ సశ్రియోయుక్తో మహాబలాః ॥

దుర్యోధనుఁడు "...రత్న కాంచన కలధౌత మయంబులగు కలశంబులఁ దీర్థ జలంబుల దెప్పించి ...భీష్మాభిషేచనం బొనరించెను.
—తిక్కన. ఉద్యోగ. 4-157

"నీ తనూభవుండు కనక కలశంబులం బావనజలంబులు దెప్పించి మంగళోపకరణశోభితంబు గావించి ...ప్రభూత భూపతులుం దానును ద్రోణాచార్యునకు సేనాధిపత్యాభిషేక పట్టబంధం బొనర్చి" పేర్చెను.
— తిక్కన. ద్రోణ. 1-5

కర్ణుని సర్వసేనాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టునపుడు "రారాజు దగు రాజులుం దానును శాంతకుంభ కుంభంబులం బవిత్ర జలంబులు దెప్పించి మహనీయ మణి కుసుమౌషధి గంధాక్షత మంత్ర కలనం బాచరించి ...యభిషేకించి యలంకరించి పట్టంబు గట్టి" నట్లు తిక్కన వర్ణించినాఁడు.
— కర్ణ. 1-56

అభిషేకోపయుక్తములగు స్వర్ణ రజత తామ్ర మహీమయంబులగు కలశములను నిర్మించు వా రెల్లరు శిల్పకారులే.

## రుక్మ పాత్రిలు

మహాభారత కాలమున భాగ్యవంతులు బంగారు పళ్లెరములలో భుజించుచుండిరి.

పాండవులు ద్రుపదరాజ నివేశమున కరిగినపుడు ద్రుపదుఁడు వారికి పంపిన వస్తువులలో బంగారుతోను వెండితోను చేయఁబడిన పాత్ర లనేకము లున్నవి.

ఉచ్చావచం పార్థివ భోజనీయం పాత్రీషు జాంబూనద రాజతీషు॥
—వ్యా. భా. ఆది. 193-13

ధర్మజుని రాజసూయయాగము నందు,

"...పదివేవు రుత్తమభూసురు లతని యగ్రాసనమున
కలధౌతమయపాత్రములఁ బ్రతిదినమును గుడువను*
గట్టను దొడువఁ బూయ ననుభవింపఁగలుగుటది యేమి
పురుషార్థమయ్యా!" అని దుర్యోధనుడు యుధిష్ఠిరు
నైశ్వర్యము నుగ్గడించినాఁడు.

"నిత్యంబును బదివేవురు బ్రహ్మణులు బ్రహ్మవిదులు పసిండి
తళిగల నిష్టాన్నంబులు గుడిచి తృప్తు లయినం దద్భుక్తశేషం
బుపయోగించుచున్న నీకు వన్యమూలఫలాశనంబు లుపయోగించుచు
న్నయ్యల యందుఁ గ్రోధంబు విడిచి యునికి యుచితంబు గాదు"
అని ద్రౌపది ధర్మజునితో నన్నది. —నన్నయ. ఆరణ్య. 1-214

మూలమునం దిట్లున్నది.

భుఁజతే రుక్మ పాత్రీభి యత్రాహం పరిచారికా
ఆరణ్యకేభ్యో లౌహాని భాజనాని ప్రయచ్ఛసి॥
—వ్యా. భా. వన. 36-13**

ఈ భోజన భాజనములు నిర్మించువారు స్వర్ణశిల్పులే.

---

* నన్నయ. సభా. 2-121 = వ్యా. భా. సభా. 49-18
భుఁజతే రుక్మ పాత్రీభిర్ యుధిష్ఠిర నివేశనే॥

** పోల్చు :- భుంజతే రుక్మ పాత్రీషు యుధిష్ఠిరనివేశనే॥
—వ్యా భా, సభా, 133-42

# సువర్ణ శంఖము

ఉపాగృహ్ణాద్ యమింద్రాయ పురాకల్పే ప్రజాపతిః
తమస్మై శంఖ మాహార్షీ ద్వారుణం కలశోదధిః
శైక్యం నిష్క సహస్రేణ సుకృతం విశ్వకర్మణా
తేనాభిషిక్తః కృష్ణేన తత్రమే కశ్మలో౽భవత్॥

—వ్యా. భా. సభా 53. 14-15*

విశ్వకర్మచే సహస్ర నిష్కములతో చక్కగా నిర్మింపఁబడిన వారుణశంఖమును, పూర్వయుగమున ప్రజాపతిచే మహేంద్రునకు బహూకరింపఁబడిన దానిని సముద్రుఁ డొక శైక్యమునందు తేగా దానితో శ్రీకృష్ణుఁడు యుధిష్ఠిరున కభిషేకము చేసినాఁడు దానిని జూచి నేను మూర్ఛఁజెందితి నని దుర్యోధనుఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పినాడు.

ఇట కొందఱు విద్వాంసులు "విశ్వకర్మచే నిర్మింపఁబడిన శైక్యపాత్రలో తేఁబడిన సముద్రజలములను శంఖమునందు గ్రహించి శ్రీ కృష్ణుఁడు యుధిష్ఠిరు నభిషేకించివాఁ"డని యర్థీకరించినారు.[1]

నన్నయ యీ శ్లోకముల ననువదింపలేదు.

భారతయుద్ధానంతరము పట్టాభిషేకసమయమున
"అంత నూర్జిత శుభవేళయగుడు శంఖ చక్రగదాధరుఁడా సమర్చిత శంఖమెత్తి పృథివి కధిపతివగు మని ప్రీతి నా పృథాసుతుని నభిషిక్తుఁజేసె నధిప."

ఈ శంఖము హేమభూషితమే.

....శంఖ స్తథా హేమ విభూభిషితః ॥ —వ్యా. భా. శాంత. 40-11

---

* "And the Ocean himself brought in a sling that big conch of Varuna, which the celestial artificer Visvakarma had constructed with a thosand niskas of gold and which Prajapathi, had in a former Kalpa presented unto Indra

It was with this conch Krishna bathed Yudhishtira after the conclusion of sacrifice and beholding it I swooned away".

—P.C.Roy Mbh.

1 చూడు :- శ్రీ మహాభారతము. టీకాసహితము. గీతాప్రెస్ ప్రతి. పు. 837

"విశ్వకర్మానే ఏక్ హజార్ స్వర్ణముద్రా ఓంసే జిస్ శైక్యపాత్ర నిర్మాణ్ కియా థా ఉన్ మేస్థిత సముద్రోంజల్ కో శంఖ్ మే లేకర్ శ్రీ కృష్ణనే యుధిష్ఠిర్ కో అభిషేక్ కియా॥"

# దంతశిల్పము

భారతదేశమునం దత్యంత ప్రాచీనకాలముననే దంతశిల్ప మభివృద్ధి చెంది యున్నది.

5000 సంవత్సరముల క్రితమే భారతీయులు దంతశిల్పకళావైశిష్ట్యమును గుర్తించిరనియు హస్తకళాకారులు గజదంతముతో చిన్నవియు పెద్దవియు నగు వస్తువులు శిల్పకళామయములుగా నిర్మించుచుండి రనియు సింధు లోయలో నుపలబ్ధ మయిన వస్తుజాలమునుబట్టి తెలియుచున్నది [1]

దివిశా ప్రాంతమునందలి దంతశిల్పుల సంఘమొకటి సాంచీస్తూపమున తూర్పు ద్వారతోరణము నందలి యూర్ధ్వపట్టిక నొకదానిని దానము చేసినట్లు క్రీ పూ 200 సం॥ నాటి శాసన మొకటి తెలుపుచున్నది.[2]

దీనిని బట్టి క్రీ. పూ. రెండవశతాబ్దము నాటికి ఉత్తర భారతమున గజదంత శిల్ప కళా కా రు లు సంఘములుగా నేర్పడి దంతశిల్పాభివృద్ధికి పాటుచుండిరని విదిత మగుచున్నది.

భా ర త దే శ వాతావరణస్థితికి తట్టుకొని నిలువలేక కాలగర్భములో కలిసిపోయినవి పోగా మిగిలిన దంతశిల్పవస్తువులుకొన్ని మాత్రము సాక్షీభూతములుగా నున్నవి.[3]

మహాభారతమునందు గజ దంత శిల్పమయములయిన శిబికాసనములు, ఖడ్గ త్సరుపులు, చిత్రములు మొదలగు వస్తువులు వర్ణింపఁబడినవి.

---

1. Cf. : Indian Handicrafts — P. 8 and P. 49.
Publications Division, Ministry of Information and Broad Casting - Government of India. 1972
"Indus Valley sites have shown that carving in Ivory was practised in India 5000 years ago. The decorative value of Ivory was recognised at an early age and ivory was used for objects both small and large in a number of ways".

2 చూడు :- డి. సోమేశ్వరరావు : మన శిల్పకళా సంపద పుట. 2

3. P. S. Rawson : Early Art and Architecture - A cultural History of India. ed. by A L Bashan P. 197.

శి బి కా స న ము లు

అసనాని మహార్హాణి యానాని శయనాని చ
మణికాంచన చిత్రాణి గజదంతమయాని చ॥

——వ్యా. భా సభా. 51-32

ధ ర్మ రా జు రాయసూయమునకు వచ్చిన పూర్వదేశాధీశులు......
"మణికాంచన రచిత గజ దంతమయ శిబికాసనంబు లిచ్చి" రని నన్నయ మూలానుసరణముగా వర్ణించినాఁడు.  ——నన్నయ. సభా. 2-113

"...ప్రియ మహార్హాసనశయన రతుల ...కుశబ్రుసీశయనాభిరతులుగా నట్లు సూచిసూచి యే నెట్లు చిత్తోపశాంతి సేయుదాన" నని ద్రౌపది శోకతప్త హృదయయై ధర్మరాజుతోఁబలికినట్లు నన్నయ వ్రాసినాడు. —(అరణ్య. 1-210)

ఈ మహార్హాసనములు గజదంత మయములనియు రత్నస్థగితములనియు మూలమునందు వర్ణింపఁబడినవి.

దాంతం యచ్చ సభా మధ్య ఆసనం రత్నభూషితమ్*
దృష్ట్వా కుశబ్రుసీం చే మాం శోకోమాం రుంధయేత్యయమ్॥

——వ్యా భా. వన 27-11

ధృ త రా ష్ట్రు ని యాస్థానమునందు బంగారము తోను కర్ర తోను నినుము తోను దంతము తోను చేయఁబడిన యాసనములున్నవి.

రుచిరై రాసనై స్త్రీణాం కాంచనై ర్దారవై రపి
అశ్మసారమయై ర్దాంతైః స్వాస్తీర్ణై సోత్తరచ్ఛదైః॥

——వా. భా. ఉద్యోగ, 46-5

యుధిష్ఠిర పట్టాభిషేక సమయమున కుంతీదేవి సువర్ణాలంకృత గజ దంతమయ మహాసనమున గూర్చుండినట్లు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

దాంతే సింహాసనే శుభ్రే జాంబూనద విభూషితే
పృథాపి సహదేవేన సహాస్తేన కులేన చ॥

——వ్యా. భా. శాంతి. 40.4

---

* పోల్చు:- వాల్మీకి రామాయణము. సుందర; 10-2

దాంత కాంచన చిత్రాంగైః వైడూర్యైశ్చ వరాసనైః॥

## దంతపు కత్తి పిడులు

ధర్మజుని రాజసూయమునకు వచ్చిన ప్రాగ్జ్యోతిషాధిపతి భగదత్తుండు గజదంతపుపిడిగల ఖడ్గములను సమర్పించినాఁడు.

అశ్మసారమయం భాండం శుద్ధదంతత్సరూ నసీన్
ప్రాగ్జ్యోతిషాధిపో దత్వా భగదత్తోఽవ్రజత్తదా॥
—వ్యా. భా. సభా. 51-16

మఱియొకచోట దంతపు పిడులు గల ఖడ్గములు బంగారముతో నలంకరింపఁబడి నట్లు వర్ణింపఁబడినది.

హస్తిదంతత్సరూన్ ఖడ్గాన్ జాతరూపపరిష్కృతాన్॥ —వ్యా. భా. భీష్మ. 90-50

## దంతపాంచాలికలు

పాంచాలికా పుత్రికా స్యాత్ వస్త్రదంతాదిభిః కృతా ఇత్యమరః

పాంచాలిక యనఁగా వస్త్రదంతాదులచేత నిర్మింపఁ బడిన బొమ్మ.

విరాటరాట్పుత్రిక యాటవస్తువులలో దంతపాంచాలిక లుండి యుండును[1]

రావణాంతః పురమునందలి స్ఫటికమణిమయ కుట్టిమములు దంతపు బొమ్మలతోను మౌక్తిక వజ్రప్రవాళ రజతకాంచనాది చిత్రములతోను నలంకరింపఁబడి యున్నట్లు వాల్మీకిరామాయణమునందు వర్ణింపఁబడినది.

స్ఫాటికై రావృతతలాం దంతాంతరితరూపికామ్
ముక్తావజ్రప్రవాళైశ్చ రూప్య చామీకరై రపి॥ —సుందర. 923

ఈ వర్ణనములను బట్టి చూడఁగా మహాభారత కాలము నాటికే భారత శిల్పకళాకారులు కష్టతరమైన దంత శిల్పమునందు ప్రావీణ్యమును గడించినా రని విదిత మగుచున్నది.[2]

---

1 చూడు .- వ్యా.భా. విరాట. 27-29 - ఈ గ్రంథమున 29 పుట.

2. Cf .- Jaslees Dhamija : Indian Folk Arts and Crafts. p 80
"Ivory was a precious material and a difficult one to carve but Indian craftsmen had mastered this art even in ancient times."

# ఛత్ర చామరములు

**ఉపవేశ్య హరిం తత్రి ఛత్రిం కృత్వా మనోహరమ్**
**శ్లక్ష్ణం కోటి శలాకం చ విశ్వకర్మ వినిర్మితమ్**
**పాండురం రత్నదండం చ స్థూల ముక్తావలంచితమ్॥**

—స్కాందపురాణ-కాశీఖండ. 23-43,44

విశ్వేశ్వరుడు విశ్వరక్షార్థంబుగా చతుర్భుజుఁ జతుర్దశ భువనాధిపత్యంబునకుఁ బట్టాభిషిక్తుం జేసి యనంతరంబ.

మండువేసవినాటి మార్తాండ బింబంబు గోడగించు పసిండిగుబ్బ తోడఁ
దొలుకారు క్రొమ్మెఱుంగుల ధాళధళ్యంబు ధవళించు రత్నదండంబు తోడ
నచ్చవెన్నెల చాయ హెచ్చుగుందాడెడు వెలిపట్టు జగజంపువలువ తోడఁ
గడలియం దేకోదకమువేళఁ బుట్టిన పగడంపుఁదీగల వంజు తోడ
వేనవేల్ యోజనంబుల విరివి నొప్పు లక్షకోటి శలాకికాలంకృతంబు
తారకాస్థూల మౌక్తిక స్థాపితంబు విష్ణునకుఁబట్టె వెనకయ్య వెల్లగొడుగు.

—శ్రీనాథుఁడు. కాశీఖండము. 4-288

విష్ణుమూర్తికి వెనకయ్య పట్టిన వెల్లగొడుగు నింత మనోహరముగా వర్ణించిన శ్రీనాథుఁ డా శ్వేతాతపత్రము విశ్వకర్మ నిర్మిత మని చెప్పలేదు. మూలమునందు స్పష్టముగనే యున్నది కదా!

పరమేశ్వరుఁడు పెండ్లికొడుకై వెడలునపుడు సూర్యుఁడు విశ్వకర్మచే నిర్మింపఁబడిన గొడుగును బట్టి నట్లు కాళిదాసు వర్ణించినాఁడు.

**ఉపదదే తస్య సహస్రరశ్మి స్త్వష్టా నవం నిర్మిత మాతపత్రిమ్॥**

—కుమారసంభము. 7-41

కావున ఛత్ర నిర్మాణమున కాద్యశిల్పి విశ్వకర్మ యనియే తెలియుచున్నది

ఈశ్వరుఁడు కుమార సహితుఁడై భద్రవటము చేరు సమయమున

"నయ్యాదిదేవునకు చంద్రుండు ధవళాతపత్రంబు ధరియించె ననిలాగ్నులు చామరహస్తులై కొల్చిరి"

—ఎఱ్ఱన ఆరణ్య. 5-264

ఛత్రచామరములు రాజ చిహ్నములు.

అంగరాజ్యమున కభిషిక్తుఁడయి కర్ణుఁడు రాజచిహ్నము లైన ఛత్ర చామరములతో నొప్పుచున్నట్లు వ్యాసభారతమునందు వర్ణింపఁబడినది.

రాజలింగై స్తథాన్యైశ్చ భూషితో భూషణైః శుభైః
సచ్ఛత్రో వాలవ్యజనో జయ శబ్దోత్త రేణ చ॥

—వ్యా. భా ఆది. 136-38

రాజసూయావభృథంబున "అభిషిక్తుఁడయిన యయ్యమరాజ సుతునకు
సాత్యకి మౌక్తిక చ్ఛత్ర మొప్పఁబట్టె, భీముండును బార్థుండు
మణి హేమదండచామరయుగధారులయిరి."

అని నన్నయ వర్ణించినాఁడు. —సభా. 2-119

ఛత్రమునకు ముత్యాలసరములు, చామరములకు మణి హేమ దండములు నన్నయ చేసిన సవరణలు.

అమరావతియం దర్జునుఁడు, "సుర విలాసినీ కలితచారు చామీకర దండ చామర సమీరాలోల కుంతలుఁడై" నట్లు వర్ణింపఁబడినది.

—నన్నయ. అరణ్య. 2-356

యుద్ధమునకు బయలు దేరిన ధర్మరాజు వెలిగొడుగు దంతశలాకలతోఁ జేయఁబడినది.

సముచ్ఛ్రితం దంతశలాక మస్య సుపాండురం ఛత్ర మతీత భాతి॥

—వ్యా. భా. భీష్మ. 21-6

యుద్ధ సమయమున కర్ణుని శిరముపై గల శ్వేతచ్ఛత్రము నూఱు శలాకలు గలిగి పూర్ణచంద్రుని వలె ప్రకాశించుచున్నట్లు వర్ణింపఁబడినది.

పూర్ణచంద్ర సకాశేన మూర్ధ్ని ఛత్రేణ భారత
ధ్రియమాణేన సమరే శ్రీమ చ్ఛత శలాకినా॥

—వ్యా. భా. కర్ణ. 61-41

ఈ వర్ణనములను బట్టి మహాభారతకాలమున శిల్పులు ఛత్ర చామరములను మణిహేమ దండ యుక్తములుగ నిర్మించుచుండిరనియు, ఛత్రములను మౌక్తిక దామములతో నలంకరించుచుండిరనియు దెలియుచున్నది.

# గాంధర్వ విద్య

గాంధర్వం నారదో వేద (భరద్వాజం ధనుర్గ్రహమ్)॥
—వ్యా. భా. శాంతి. 210-21

అష్టాదశవిద్యలలో సామవేదోపవేద మయిన గాంధర్వవిద్య యొకటి.[1]

గాంధర్వ మన గంధర్వులకు సంబంధించినది.

గంధర్వులు గానమే ధర్మముగాఁ గలవారు. [గంధర్వాః గానం ధర్మః యేషాంతే] అనియు, గానము ధరించిన వారు [గానం ధారయం తీతి గంధర్వాః] అనియు నుత్పత్త్యర్థములు చెప్పఁబడినవి. —అమరకోశము

గాంధర్వ విద్యా ప్రవర్తకుఁ డయిన నారదుఁడు షోడశ గంధర్వులలో నొకఁడై యుండవచ్చును.

గాంధర్వ మన సంగీతము. గాంధర్వం గీతి శాసనమ్. —వైజయంతి

గాంధర్వ మన జంత్రములతోడి గాన మనియుఁ జెప్పఁబడినది.

గీతం చ గేయం చ యత్తు తంత్రీ సముద్భవమ్
తన్నిర్గీతం బహిర్గీతం గాంధర్వం దివ్యమైశ్వరమ్॥ —వైజయంతి

గీత వాదిత్రముల ననుసరించి యుండు నృత్యము కూడ గంధర్వ విద్యాంతర్గతమే.

గీత వాద్య నృత్యములు మూఁడింటికి సంగీత మనిపేరు.

గీతం వాద్యం తథా నృత్యం త్రియం సంగీత ముచ్యతే॥

గంధర్వుల పాటలు : అప్సరసల యాటలు.

---

నృత్య గీత విశారదలయిన గంధర్వాప్సరోగణములు కుబేరుని సభ యందున్నారనియు, గీత వాదిత్రనృత్యములతో కుబేర సభ మనోహరముగ నుండు ననియు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

అనిశం దివ్య వాదిత్రైర్ నృత్యగీతైశ్చ సా సభా
అశూన్యా రుచిరా భాతి గంధర్వాప్సరసాం గణైః ॥ — సభా. 10-13

నృత్య గీత వాద్యముల సమాహారమును తౌర్యత్రిక మనియు నందురు.

---

1 చూడు :- తిక్కన. శాంతి. 3-119

కుబేర సభ యందలి దేవతలు గంధర్వాప్సరో గణములతో, గలిసి దివ్యతాన యుక్తముగా గానము చేయుచుండిరి.

తత్ర దేవాః సగంధర్వా గణై రప్సరసాంవృతాః
దివ్యతానై ర్మహారాజ గాయంతిస్మ సభాగతాః ॥
—వ్యా. భా. సభా. 10-9

తాన మనఁగా తన్నకారముతోఁ గూడిన పాట.

## రాక్షస స్త్రీలు

రక్షో గణముల కధిపతియైన "కిన్నరేశ్వరుండు విశ్రవసు పాలి కరుదెంచి మహాత్మా నేను నీకుం బుత్తుఁడ నయ్యెద నాకుం గరుణింపు మని యతనిం బ్రసన్నుంజేసి నృత్త గీత విద్యా విశారదలయిన రాక్షస స్త్రీలం బుష్పోత్కటయు మాలినియు సాకయు ననువారి ముప్వుర నవ్విప్రునకుఁ బరిచారికలుగా నిచ్చెను." —ఎఱ్ఱన. అరణ్య. 6-271

అందుఁ బుష్పోత్కటకు విశ్రవసునకు రావణకుంభకర్ణులు పుట్టిరి. రాక్షసులు దేవ గణముల యందలివారే.

విద్యాధరోఽప్సరసో యక్ష రక్షో గంధర్వ కిన్నరాః
పిశాచో గుహ్యకః సిద్ధో భూతోఽమీ దేవయోనయః ॥ —అమరకోశము

## సంగీతము - సర్వేశ్వరుఁడు

నృత్య గీత వాదిత్రాది కళలకు మహాదేవుఁడే మూల పురుషుఁడు.

నమో నర్తన శీలాయ ముఖ వాదిత్రవాదినే
వాద్యోపహారలబ్ధాయ గీత వాదిత్రశాలినే॥

అని పరమేశ్వరుఁడు ప్రస్తుతింపఁబడుచున్నాడు. —వ్యా. భా. శాంతి, 285-22

సర్వేశ్వరానుగ్రహము వలననే సకలకళలు వర్ధిల్లుచున్నవి. సంగీతమునకు వాద్యసహకార మవసరమని వేదర్షులే గుర్తించిరి.

అవ స్వరతి గర్గరో గోధా పరి సనిష్వణత్
పింగో పరి చనిష్క దింద్రాయ బ్రహ్మోద్యతమ్॥ —ఋగ్వేద. 8. 58-9*

[మంద్రస్వరమున మేము చేయు గానము గర్గర గోధా పింగాది వాద్యఘోషతో తారాస్థాయి నందుకొని యింద్రుని చేరుఁగాక.]

* చూడు :- శివనాథ ఆహితాగ్ని : ఋగ్వేదసార సంగ్రహః ॥ పుట. 67

# చతుర్విధ వాద్యములు

సర్వ తూర్య నినాదీ చ సర్వాతోద్య పరిగ్రహః ॥—వ్యా. భా. అను. 17-61

పరమశివుఁడు మురజాది మంగళవాద్యములను మ్రోయించువాఁడు, అనేక విధములయిన వాద్యములను సంగ్రహించువాఁడును.

వాద్యములు నాలుఁగు విధములు.

తతం వీణాదికం వాద్య మానద్ధం మురజాదికమ్
వంశాదికం తు సుషిరం కాంస్యం తాళాదికం ఘనమ్॥ —అమరము

1 తతము :- వీణ మొదలయిన తంత్రీవాద్యముపేరు.

ధనుర్జ్యాఘోషయే వీణాది తంత్రీ వాద్యోత్పత్తికి మూలము.

పార్థుఁడు "గుణధ్వని తంత్రీనాదంబుగా నా విండ్లవా రొత్తుకాఁబుగా గాండివంబు వీణగా వినోదంబు సలిపె." —తిక్కన. విరాట. 5-13

ధనురాకారము గల వీణ క్రీ. పూ. 3వ శతాబ్దమునాటి శిల్పములందు గలదు. వేదకాలమునందలి "కర్కరి" —[ఋగ్వేద 2 44-2] "వాణ" [యజుర్వేద. 7, 5-9] ఈ జాతికి చెందినవి.

2 ఆనద్ధము :- మద్దెల మొదలయిన చర్మవాద్యముల పేరు.

భూమి దుందుభి, దుందుభి, భేరి, పటహా - ఒకప్రక్క వాయింపఁబడు చర్మ వాద్యములు.

మృదంగబు, ఆడంబరము రెండు ప్రక్కల వాయింపఁబడునవి. తూణము, పణవము. ననునవి యీ జాతి వాద్యములే -

ఉత్తర భారతమునం దొక రాజభవనము నందు క్రీ పూ. మూడవ శతాబ్ది నాటి మృదంగము కనుగొనఁబడినది

3 సుషిరము :- పిల్లన గ్రోవి మొదలయిన ముఖవాద్యముల పేరు
వెదురు తో చేయఁబడు వేణువు. కొమ్ముతో చేయఁబడు కాహళము, నాడి [ఋ. 10. 135-7] మున్నగునవి సుషిరములు.

4 ఘనము :- తాళములు మొదలయిన కంచువాద్యములు.

"అఘాతి" యను వాద్యయు [ఋగ్వేద. 10. 146-2]
కాంస్యములు (కంచుతాళములు) గంట మున్నగునవి.

చతుర్విధ మిదం వాద్యం వాదిత్రాతోద్య నామకమ్॥ —అమరము

# నర్తకుడు - నృత్యకళ

నృత్య ప్రియో నిత్యనర్తో నర్తకః సర్వలాలసః ॥

—వ్యా. భా. అను. 17-50

శివుఁడు నృత్య ప్రియుఁడు మహానర్తకుఁడు.

నేటికిని శివుఁడు నటరాజుగా పూజింపఁబడుచున్నాడు.

నృత్యము తాండవ మనియు లాస్య మనియు రెండు విధములు.

**తాండవము** :- తండునా ప్రోక్త మితి తాండవమ్.

తండువు చేత నుపదేశింపఁబడినది తాండవము. తండు వన శివుఁడు.

లాస్య మనఁగా క్రీడించుటకు యోగ్యమయినది.

లసితుం యోగ్యం లాస్యమ్॥

శివుఁడు తాండవప్రియుఁడు; లలితా పరమేశ్వరి లాస్యప్రియ.

భారతమునం దీరెండు విధముల నృత్యములు పేర్కొనఁబడినవి.

1 **తాండవము** :- కురుక్షేత్ర సంగ్రామము నందు గాంగేయుడు ప్రళయకాల తాండవ ప్రవర్తియైన ఫాలలోచను లీల నాజిరంగంబునం బరాక్రమనృత్యంబు వెను సెయుచున్నఁ బాండవయాదవాది యోధులు వెఱగుపడి చూచుచుండిరి.

—తిక్కన. భీష్మ. 2-137

సౌభద్రుఁడు రణరంగమునందు విజృంభించి వీర నృత్యము చేసినాఁడు

రంగత్ప్రధన స్తుత్యతురంగముఁడై
తాండవాభిరతుఁడగు హరు లీలం గడఁగి వీర నృత్యము
సంగరమునఁజేసె శత్రులుమెచ్చన్॥ —తిక్కన. భీష్మ. 2-318

2 **లాస్యము** :- అర్జునుఁడు పుట్టినపు డప్సరసలు లాస్యము చేసిరి.

సరససుర వధూలాస్యంబులున్
సిద్ధ విద్యాధర పటు పటహాతోద్యంబులున్
కిన్నరీ కింపురుష లలిత గీతంబుల్ మహారమ్యమయ్యెన్
వర ముని దివిజాశీర్వాదనాదంబుతోన్. —నన్నయ. ఆది. 5-127

....నృత్యంతేఽప్సరసాం గణాః ॥ —ఆది. 187-14

# తౌర్యత్రికము : విశ్వకర్మ

సర్వాణి శిల్పకర్మాణి తౌర్యత్రిక మథాపి చ
సర్వం జ్ఞాస్యసి కర్తుం త్వం ద్వితీయ ఇవ పద్మభూః ॥
—స్కాంద. కాశీఖండ 86-76

"సర్వశిల్పములను నృత్య గీత వాద్యములను నీవు రెండవబ్రహ్మవలె చేయ నేర్తువు" అని పరమేశ్వరుఁడు త్వష్టృ ప్రజాపతిపుత్త్రుఁ డయిన విశ్వకర్మకు వర మొసఁగెను.

తౌర్యత్రిక మనఁగా నృత్య గీతవాద్యముల స్వరసంవాదము.

తౌర్యత్రికం నృత్త(త్య) గీత వాద్యం నాట్య మిదం త్రయమ్....

తౌర్యత్రికము :- తూర్య మనఁగా మద్దెల మొదలైనవి అందుఁ బుట్టిన శబ్దము తౌర్యము. దానితో మూఁడవయములు గలిగినది.

నాట్యము :- నట సంబంధమైనది.

ఈ రెండును నృత్త గీత వాద్యములకు పేర్లు [1]

విచిత్రము లయిన వివిధ వాద్యములు నిర్మించువాఁడు విశ్వకర్మయే యని విష్ణురహస్యము నందును జెప్పఁబడినది.

విశ్వకర్మా స్వయం తత్ర చిత్రాన్ లోకాన్ వినిర్మమే
వస్త్రవాద్యాని వస్తూని విచిత్రాణి పృథక్ పృథక్॥
—విష్ణు రహస్యము. అ. 35*

వర్షము కురియు నపుడు వాయువేగమున జలాశయమున పడు ధారలచే జల పక్షులు చేయు మధురధ్వనులను విని, వాని యందలి సర్వభేదములను గ్రహించి స్వాతిముని "పుష్కర, మృదంగ, పణవ, దర్దుర వాద్యములను విశ్వకర్మ సాహాయ్యమున రచించెను" అని పోణంగి శ్రీరామ అప్పారావుగారు తన నాట్యశాస్త్రము నందు వ్రాసినారు. (చూడు :- పు. 828)

స్వాతి మునికి సాహాయ్యపడిన విశ్వకర్మ (శిల్పాచార్యుఁడు) ఎవరో తెలియదు. కాని యీ యైతిహ్యమువలన వాద్యయంత్రములు నిర్మించువారు విశ్వకర్మలే యని స్పష్టమగుచున్నది.

---

1 చూడు :- అమరకోశము - సంస్కృతాంధ్ర వివరణము -[వేంకటశేషాచార్యులు]

* చూడు :- నిరంజనశాస్త్రి : విశ్వకర్మ బ్రాహ్మ వంశాగమము. పు. 26

## మంగళ ధ్వనులు : మంజు గీతములు

తతః స్తుతి పురాణజ్ఞా రక్తకంఠా స్సుశిక్షితాః
అస్తువన్ విశ్వకర్మాణం వాసుదేవం ప్రజాపతిమ్॥
పఠంతి పాణిస్వనికా స్తథా గాయంతి గాయనాః
శంఖా నథ మృదంగాశ్చ ప్రవాద్యంతి సహస్రశః ॥
వీణా పణవ వేణూనాం స్వనశ్చాతిమనోరమః ॥

—వ్యా. భా శాంతి. 53. 2-4

[విశ్వకర్మయు ప్రజాపతియు నైన వాసుదేవుని మేలుకొలుపుటకు స్తోత్రములు పురాణములు తెలిసిన వందిమాగధులు మధురకంఠములతో స్తోత్రములు చేసిరి గాయకులు లయ తాళబద్ధముగా పాటలు పాడిరి. వాద్యకారులు శంఖ మృదంగాది వాద్యములు మ్రోయించిరి. మనోహరమయిన పణవ వీణా వేణు స్వనములు వినిపించిరి.]

వ్యాస భారతము నందలి యీ సన్నివేశమును వర్ణించుచు తిక్కన "ప్రభాతం బగుటయు మంజు పాఠకరవమును మధుర మాగధ స్వనంబును వినుచు మాధవుండు మేలుకాంచినాఁ"డని మాత్రము వ్యాసి[1] మూలమునందలి వాద్యయంత్రములను వదలినాఁడు.

ద్రోణ పర్వమున ధర్మజుఁడు నిదుర మేలుకాంచు సందర్భమును వర్ణించు నపుడును తిక్కన మంగళ వాద్యముల పేరెత్తలేదు.[2]

మూలము నందు మృదంగఝుర్ఝరాద్యనేక వాద్యములు పేర్కొనఁబడినవి.

మృదంగా ఝర్ఝరా[3] భేర్యః పణవానక గోముఖాః[4]
ఆడంబరాశ్చ శంఖాశ్చ దుందుభ్యశ్చ మహాస్వనాః
వాదయంతి సుసంహృష్టాః కుశలాః సాధుశిక్షితాః ॥ —ద్రోణ. 32-4

ఈ వర్ణనములనుబట్టి మహాభారతకాలమున రాజకుటుంబములలో రాజ పురుషులు నిదుర లేచు సమయమున వందిమాగధుల గీతములతో మంగళ వాద్యములు మ్రోయించుచుండి రనియు తెలియుచున్నది.

---

1 చూడు :- తిక్కన. శాంతి, 2-128 2 తిక్కన. ద్రోణ. 3-6
3 కయామురి యను వాద్యవిశేషము 4 గోముఖాడంబరములు వాద్యవిశేషము

# మంగళ తూర్యములు

సమస్త శుభకార్యములందు మంగళ వాద్యములు మ్రోయించుదురు.

ద్రౌపది వివాహవేదిక కడ కరుదెంచినపుడు

భూరిభూసురేంద్ర పుణ్యాహరవమును మంగళప్రదీప్త మధురరవము
వివిధతూర్య వేణువీణారవంబును విస్తరిల్లె విపులవిభవయుక్తి.

—నన్నయ. ఆది 8-284

యుధిష్ఠిర పట్టాభిషేకసమయమున, "శంఖానకదుందుభి ప్రభృతి మంగళతూర్యంబుల గంభీర నాదంబులం బెలంగె" —తిక్కన, శాంతి. 1-375

"ద్రోణాచార్యునకు సేనాధిపత్య పట్టాభిషేకబంధం బమర్చి పేర్చిన భేరీ మృదంగపణవాదితూర్య నినాదంబులు నిగిడి నింగిముట్టె"

—తిక్కన. ద్రోణ. 1-75

"యుధిష్ఠిరుండు సంతుష్టాంతరంగుండై శంఖ భేరీ మృదంగాది మంగళ తూర్యంబులు సెలంగ సకలసైన్య సమేతుండుగా వెడలి నడచి మొగంబున నెలమి నెలకొనం గ్రౌంచవ్యూహం బమర్చి పేర్చి" —భీష్మ. 3-247*

విజయోత్సాహముతో వచ్చుచున్న యుత్తరు నెదుర్కొనంబోయి
మంగళ తూర్యవములు సెలంగంగ
మౌక్తికవిమిశ్ర లలితాక్షత వృష్టిం గురిసిరి విప్రులుం
బుణ్యాంగనలును భద్రవాక్యయంబులతోడన్. —తిక్కన విరాట. 5-2‹3

---

* పోల్చు :- 1 శంఖ భేరీ మృదంగాది తూర్య స్వనంబులు సెలంగ
సింహనాదంబులం బేర్చిన పాండవ సేనం జూచి —తిక్కన ద్రోణ, 1-194
2 కాహళ ఢుంఢుభి ప్రభృతి తూర్య శ్రేణులు. —తిక్కన. భీష్మ. 3-248

ఆనకము = 1 తప్పెట, 2 భేరి, 3 మద్దెల.
భేరీ దుందుభులు సమానార్థకములు.
కాహళము = 1 పెద్ద ఢక్క, 2 బాకా
పణవము = వాద్య విశేషము - ఉడుక = హుడుక్కము
మృదంగము మురజము = మద్దెల, 2 తప్పెట.

# దుందుభి

ధీభిః కృతః ప్రవదాతి వాచ ముద్ధర్షయ
సత్వనా మాయుధాని॥ —అథర్వ. 5. 20-8*

[శిల్పకర్మచేఁ జేయఁబడిన దుందుభి గంభీరశబ్దములు చేయు చున్నది. సైనికుల శస్త్రములుపై కెత్తఁబడినవి.]

శిల్ప కర్మచేత చేయఁబడిన దనఁగా శిల్పకారులచేతఁ జేయబడినదని యర్థము.

"The Dundubhi or war drum, has dominated the martial music of India throughout her history. There are hymns even as early as the Atharvaveda...".[1]

దుందుభులు దారువుతోను వృషభ చర్మముతోను నిర్మింపఁబడెడివి.

ఉచ్చైర్ ఘోషో దుందుభిః సత్వనాయన్
వానస్పత్యః సంభృత ఉస్రియాభిః॥ —అథర్వ. 5. 20-1

సంగ్రామ యజ్ఞములో దుందుభి యుద్గాతగా భావింపఁబడినది.

ఉద్గాతా తత్ర సంగ్రామే త్రిసామా దుందుభిర్ నృప॥
—వ్యా. భా. శాంతి. 98-25

[ఓ రాజా! సంగ్రామము నందు దుందుభి మూఁడు సామవేద మంత్రములు పఠించు ఉద్గాత వంటిది.]

కృష్ణుఁడు సాల్వుంజంపి కాని యిప్పురంబు సొరనొల్ల నని నిశ్చయించి... ప్రయాణభేరి సఱవం బంచి... యసంఖ్యాత చతురంగ సైన్యంబుతో నరిగెను.
—నన్నయ. అరణ్య. 1-170

త్రిస్సామా హన్యతా మేషా దుందుభిః శత్రుభీషణా॥
అని మూలమునందున్నది. —వ్యా. భా. వన. 20-10*

దుందుభి మంద్రమధ్య తారములను మూఁడు స్వరగ్రామములు గలది.

---

* చూడు :- క్షేమంకరదాస్ త్రివేదీ - అథర్వ వేదభాషా భాష్యము
ధీభిః = శిల్పకర్మ సే  కృతః = బనాయా గయా
వాచమ్ = శబ్దము,  ప్రవదాతి = అచ్ఛేప్రకార్ బోలే.

1 : Cf. : S. Krishna Swami : Musical Instruments of India. P-10.
Publications Division - Govt. of India

* త్రిః సామా త్రిస్వరా నీచమంద్ర తారభావేన. —నీలకంఠ.

## ధర్మాలంకృతమయిన భేరి

అర్జునుఁడు యదు సైన్యముల నోడించి సుభద్రం దోడుకొని పోవుచుండఁగా, "అట సభా పాలుండు ప్రబల జలధర ధ్వాన గంభీర బేరీ ధ్వని నర్జును పరాక్రమము నెఱిగించెను." — నన్నయ. ఆది. 8-203

ఈ భేరి సువర్ణమండితమని మూలమునందు వర్ణింపఁబడినది.

తేషాం శ్రుత్వా సభాపాలో భేరీ సాంనాహికీం తతః
సమాజఘ్నే మహాఘోషాం జాంబూనద పరిష్కృతామ్॥

—వ్యా భా ఆ. 220-11

## స్వయం వాదక భేరీ వాద్యములు

"గౌతమానుగ్రహంబున నీ దుర్గ బలంబుసనుం జేసి యిమ్మాగధుల నెవ్వరును జయింప నోప రనుచుఁ దద్ద్వారంబున బురంబు సొర నొల్లక చైత్యక గిరి శృంగంబున కరిగి యందున్న మూఁడు భేరులం జూపి తొల్లింటి మాగధులు మానుషాదం బను వృషభంబు వధియించి దాని చర్మంబున వీని నిర్మించి రివి యిప్పురంబు వింత వారు సొచ్చునప్పు డమ్మని శక్తిం జేసి మ్రోయు" నని కృష్ణుఁడు భీమార్జునులకుఁ దెలిపినంత వార లాక్షణంబ భేరులు మూఁటిని వ్రచ్చి... గిరి వ్రజంబు సొచ్చిరి.

ధర్మజుని అశ్వమేధ యాగమున భోజనశాలలో లక్షమంది బ్రాహ్మణులు భుజించినంతట తనంతతాను మ్రోయు భేరి యొకటి యున్నది.

విను లక్ష భూసురులు కుడిచిన నొక మరి మ్రోయు భేరి చెలఁగుచునుండున్
జన నాయక యెప్పుడు నేమని చెప్పుదు నశ్వమేధ యజ్ఞ విభూతిన్.

—తిక్కన అశ్వ 4-14

భేరీ దుందుభులు సమానార్థకములు.

పూర్ణే శత సహస్రే తు విప్రాణాం తత్ర భుంజతామ్
దుందుభి ర్మేఘ నిర్ఘోషో ముహుర్ముహు రతాడ్యత॥

—వ్యా. భా. అశ్వ. 85-36

ఇవి యానాటి శిల్పకారుల శిల్ప చమత్కారములకు నిదర్శనములు.

# వీణా వాద్యము

సప్త తంత్రీ ప్రథితా చైవ వీణా॥ —వ్యా. భా. వన. 134-14

సప్తస్వర తంత్రీయుక్త మయిన వీణ ప్రసిద్ధమయినది.

వాదిత్రములలో తంత్రీ వాద్యము ప్రధానమయినది. అందు వీణ శ్రేష్ఠ మయినది.

వాదిత్రాంతర్గత్వేఽపి తంత్రీవాద్యం ప్రధానం
తత్రాపి వీణా వాద్యం. —అని యశోధరుడు.[1]

ఋగ్వేదమునందు 'వాణ' యను సప్తస్వర వాద్యయంత్రము పేర్కొనఁబడినది.

వాణస్య సప్త ధాతు రిజ్జనః॥ —ఋగ్వేద 10-224

కృష్ణ యజుర్వేదమునందు శత తంత్రీయుక్త 'వాణము' పేర్కొనఁబడినది.

వాణః శతతంతు ర్భవతి॥ —యజు. 1-75

శత తంత్రీ వాణము మేడి కొయ్యతోఁ జేయఁబడిన దండము గలదనియు ముంజదర్భతో పేనఁబడిన పదేసి తంత్రులు గలదనియు సూత్రకారుఁడు వివరించినాఁడు.

"ఔదుంబరస్య వీణాదండస్య దశాతిమథిన్యేకస్మి
న్నధి మథతే దశ దశ మౌంజాంస్తంతూన్
ప్రవయతి స వాణః శతతంతుః॥"*

---

1 చూడు :- వాత్స్యాయన కామసూత్రమ్. 3. 16-27
యశోధర కృత జయమంగళ వ్యాఖ్య.

* (1) చూడు :- కృ. య. తై. సం. 7-5-9 —ఆనందాశ్రమ సంస్కృత గ్రంథావళి
పుట. 3762

2. Cf :- S. Krishna Swami. Musical Instruments of India. -p. 10.
The T. S. gives full description of the Veena. It is brightly painted and studded with precious stones. The belly of the instrument is covered with red leather and has ten holes to which strings of twisted darbha grass or moonja are fastened. The stem is made of wood."

సప్త స్వరములు పలికించుటకు వీలుగా తంత్రుల నమర్చి వాద్య యంత్రమును నిర్మించుట శిల్పము.

ఆ యంత్రముతో వలసిన స్వరములను వలసిన స్థాయిలో పలికించుట కళ.

వీణాదండము కకుభము నిబంధనము అను నవి వీణ శరీరభాగములు.

శిల్పులీ వివిధ భాగములను విడి విడిగా చేసి వాని నొకటిగా నొనర్చి వీణను రూపొందింతురు.

మహాభారతకాలమున శిల్పులీ వీణలను దార్వాదులతో నిర్మించుటయే కాక వానిని మణులతో నలంకరించుచుండిరి.

ఉపవాస దీక్షలో నసువులు బాసిన మనుజుఁడు వైడూర్య ముక్తామణి ఖచిత వీణా మురజాది నాదములతోను దివ్యఘంటా నాదములతోను వేల కొలఁది యప్సరాంగనలతోడను నిండిన విమానమునందు స్వర్గ సుఖము లనుభవించునని యంగిరస మహర్షి యుపవాసవ్రత మహిమను జెప్పినట్లు వ్యాసభారతమునందు వర్ణింపఁబడినది.

వైడూర్యముక్తా ఖచితే వీణా మురజ వాదితే॥ —వ్యా. భా. అను. 107-67

వీణ కంటె భిన్నమయిన 'వల్లకి' యను వాద్యయంత్రము పేర్కొనఁబడినది,

వీణానాం వల్లకీనాం చ వేణునాం చ విశాంపతే॥ —వ్యా. భా. అను 106-49

వీణా వాద్యము మంగళకర వస్తువు. ప్రతిగృహమునందు నుండఁదగినది.

అజోక్షా చందనం వీణా హ్యాదర్శో మధు సర్పిషీ
విష మౌదుంబరం శంఖః స్వర్ణనాభో౽థ రోచనాః
గృహే స్థాపయితవ్యాని ధన్యాని మనురబ్రవీత్॥

—వ్యా. భా. ఉద్యోగ 41-10

వీణా గానము వినిపింపక పోవుట యశుభసూచకముగా భావింపబడినది.

'వేణు వీణా గాన స్వనములను వీఁకఁ గలుగవు కృష్ణా.'

—తిక్కన. ద్రోణ. 2-228

వీణా వాద్యమును కనిపెట్టినవాఁడు నారదుఁడని చెప్పఁబడినది-[1] కాని యీ నారదుఁడు దేవ గంధర్వుఁడో బ్రహర్షియో తెలియదు.

1 చూడు :- మోనియర్ విలియమ్- సంస్కృతాంగ్లపదకోశము పు. 1005

భారతము నందు కలహ ప్రియుఁడగు నారదుండు 'కచ్ఛపి' వీణతో పొలుపుమిగులుచుండును. —తిక్కన. శల్య. 2-218

కచ్ఛపీం సుఖశబ్దాం గృహ్య వీణాం మనోరమామ్॥ —వ్యా. భా. శల్య. 54 10

కాని నారదుని వీణ 'మహతి' యనియు సరస్వతీ దేవిది 'కచ్ఛపి' యనియు లోకమునందు ప్రసిద్ధి.

మహతీం నారదస్య స్యాత్ సరస్వత్యాస్తు కచ్ఛపీ॥ —వైజయంతి

## సప్తస్వర సరస్వతి :

బ్రాహ్మీ తు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ॥ —అమరం

'ప్రణవాదిక రూపత్వనిరూఢిఁబుట్టు వాక్కు' —తిక్కన. అశ్వమేధ. 2-14

ప్రణవరూపిణి యైన వాణి సప్తస్వర సంశోభితయై బ్రహ్మదేవుని కొలువు నందుండును.

(సావిత్రీ దుర్గతరణీ) వాణీ సప్తవిధా తథా॥ —వ్యా. భా. సభా. 11-9

ప్రణవరూపిణి యగు వాణి అకార, ఉకార, మకార, అర్ధమాత్ర నాద బిందు శక్తి యను సప్తప్రకారయుక్త యని టీకాకారుడు వివరించినాడు.[1]

సప్తవిధ యన సరిగమపధని యను సప్తస్వరములతో శోభిల్లునది.

షడ్జాది సప్త స్వరములు సామగానము నందును, సంగీత సాధనము నందును ప్రయోగింపఁబడుచున్నవి.

షడ్జ ఋషభ గాంధార మధ్యమ పంచమ ధైవత నిషాదాః॥
—పింగళ సూత్రము. 3-64

ఉదాత్తాది సప్తస్వరములు వేదమంత్ర పఠనోపయుక్తములు.

1 ఉదాత్తము, 2 ఉదాత్తతరము, 3 అనుదాత్తము
4 అనుదాత్తతరము, 5 స్వరితము, 6 స్వరితానుదాత్తము,
7 ఏకశ్రుతి - అనునవి.

---

1 చూడు :- శ్రీ మహాభారతము - హిందీ అనువాద సహితము. గీతాప్రెస్

పోల్చు :- తిక్కన. శాంతి. 6-139
వినుము : స్వర వ్యంజనభూషిత యగ్రభాగసంస్ఫుర దోంకార
నితాంత హృద్య మధుగర్భ నిజాకృతి సరస్వతి దోఁచెన్.

# వాగ్దేవి : వాదిత్రములు

వాగ్వై దేవేభ్యోఽపాక్రామ ద్యజ్ఞాయాతిష్ఠమానా
సా వనస్పతీన్ ప్రావిశత్ సైషా వాగ్ వనస్పతిషు వదతి
యా దుందుభౌ యా తూణవే యా వీణాయా....

—తై. సం. 7. 1-4*

వాగ్దేవత యజ్ఞము నందుండ నొల్లక దేవతలను వదలి వనస్పతులందు ప్రవేశించినది. ఆ వనస్పతుల శబ్దమే దుందుభి యందు తూణమునందు వీణయందు వినబడుచున్నది.

సమస్త శబ్దములకు వాగ్దేవియే మూలకారణము.

శబ్ద మాకాశ సంభవ మనియు, నా శబ్ద గుణము షడ్జ ఋషభ గాంధార మధ్యమ పంచమ ధైవత నిషాదము లని యేడు విధములుగా నున్నదనియు నా శబ్ద గుణము సర్వత్ర వ్యాపించియున్నను. పటహాదులందు, మృదంగ భేరీ శంఖాదులందును రథాదులందు వినఁబడుచుండు ననియు భృగుమహర్షి భారద్వాజునకుఁ దెలిపినట్లు మహాభారతమునందు వర్ణింపఁబడినది.

తత్రైక గుణ మాకాశం శబ్ద ఇత్యేవ తత్ స్మృతమ్
తస్య శబ్దస్య వక్ష్యామి విస్తారం వివిధాత్మకమ్
షడ్జ ఋషభ గాంధారౌ మధ్యమో ధైవతస్తథా
పంచమశ్చాపి విజ్ఞేయ స్తథా చాపి నిషాదవాన్॥
ఏష సప్త విధ ప్రోక్తో గుణ ఆకాశ సంభవః
ఐశ్వర్యేణ తు సర్వత్రి స్థితోఽపి పటహాదిషు
మృదంగ భేరీ శంఖానాం స్తనయిత్నో రథస్య చ
యః కశ్చిద్ శ్రూయతే శబ్దః ప్రాణినోఽప్రాణినోఽపివా॥

—వ్యా. భా. శాంతి, 184. 39-42

---

* Cf :- A.B. Keith : TAITTARIYA SAMHITA. (Eng. Tr.)

Speeeh went away from gods, not being willing to serve for the sacrifice. She entered the trees, It is the voice of the trees that is heard in the drum, lute and the flute.''

# నృత్య కళా ప్రాశస్త్యము

యస్యాం గాయన్తి నృత్యన్తి మర్త్యా వైలబాః ॥
............ యస్యాం వదతి దుందుభిః ॥
సా నో భూమిః ప్ర ణుదతాం సపత్నాన్॥

—అథర్వ. 12. 1-41

ఏ భూమి మీఁద మనుజులు గొంతెత్తి పాడుచు నృత్యము చేయు చుందురో ఏ భూమి మీఁద జయ భేరులు మ్రోగు చుండునో ఆ భూమి మా శత్రువులను తఱిమికొట్టుగాక!

వైదికార్యులు నృత్య గాన ప్రియులు.

పంచజనుల 'కధిపతియును పూర్వర్షి సంస్తవనీయుఁడు జగన్నాటక సూత్రధారియు నయిన యింద్రుఁడు నర్తకుఁడు-

యః పూర్వ్యా మనుష్టుతి మీశే కృష్టీనాం నృతుః ॥

—ఋగ్వేద. 8. 57-7

ఉషోదేవి. యొక నర్తకి వలె నున్నట్లు వర్ణింపఁబడినది.

అధి పేశాంసి వపతే నృతూరివ........ —[ఋగ్వేద. 1. 92-4]

చతుష్షష్టి కళలలో నృత్యమునకు ప్రత్యేకస్థానము కల్పింపఁబడినది. వాత్స్యాయనుఁడు చతుష్షష్టి కళలలో గీత వాద్యనృత్యములు మూఁడును మూఁడు వేర్వేఱు కళలుగా పేర్కొనినాఁడు.1

---

* పోల్చు :- తవ త్యన్నె నృతోఽప ఇంద్ర ప్రథమం పూర్వ్యం
దివి ప్రవాచ్యం కృతమ్॥ —ఋగ్వేద 2. 22-4

ఇంద్ర ఇన్నో దాతా రాజానాం నృతుః ॥ —ఋగ్వేద. 8, 92-3

Cf. :- A. C. Bose . Call of the Vedas : P. 286, Note on R.V. 6-29-3

"Here God India is called a Dancer. Dancing, the beauty of movement - the rhythm of life, is attrilnted to the Devine...".

In the later times the figure of Dancing Siva has been much admited."

1 చూడు :- వాత్స్యాయన : కామ సూత్రమ్.

కాని గీత వాద్య నృత్యములు మూఁడును పరస్పరాశ్రయములై యవినాభావ సంబంధము గలిగి యుండును.

ఈ మూఁడు కళలలో వాద్యము ముఖ్య మైనది.

వాద్య సహకారముతో గీత గానము గాన వాద్యానువర్తనమున నర్తనము ను శోభాయమానములై సకలజనమనో రంజకములగును.

భారతము నం దెల్లెడలను నృత్య గీత వాద్యములు మూఁడును కలిసి యున్నట్లే వర్ణింపఁబడినది.

దేవ దానవ మానవ జాతులలో స్త్రీ పురుషులు కొందఱ లలిత కళల యందు నైపుణ్యము గలిగియుండిరి.

పురుహూతుండు... కుమారస్వామికి "నఖిలదేవ సేనాధిపత్యంబునం దభిషేకం బొనరించి నంత...

కిన్నెర గంధర్వ గానంబులు, మంగళ తూర్యారావంబులు
నప్సరో నర్తనంబులుఁ గల్పతరుకుసుమ వర్షంబులు
సమకాలప్రవర్తంబులయ్యె" —ఎఱ్ఱన అరణ్య. 5-232

దైత్య జాతి స్త్రీలు నృత్య గీత వాద్యములందు నేర్పరులే.

దైత్యాంగనలు సరసిజభవునిచే వరములు వడసిన సుందోపసుందుల చెంతజేరి వారిని పొగడుచు నృత్య గానములతోను వాదిత్ర స్వనములతోను వారి నలరించు చుండిరి.

తతో వాదిత్ర నృత్యాభ్యా ముపాతిష్ఠతి తౌ స్త్రియః
గీతైశ్చ స్తుతి సంయుక్తైః ప్రీత్యా సముపజగ్మిరే॥ —వ్యా. భా. ఆది. 2,6-8

## కచదేవయానుల కళాభినివేశము

బృహస్పతి సుతుఁడు కచుఁడు వివిధ వాద్యములు మ్రోయించుచు నృత్య గానములతో గురు పుత్రిక యయిన దేవయానిని సంతోషపెట్టు చుండెను. దేవయానియు తన మధురగానముతో వాని నలరించుచు నేకొంతసేవఁజేయు చుండెను

గాయన్ నృత్యన్ వాదయంశ్చ దేవయానీ మతోషయత్....
దేవ యాన్యపి తం విప్రం నియమ వ్రత ధారణమ్॥
గాయంతీ చ లలంతీ చ రహః పర్యచరత్ తథా॥—వ్యా. భా. ఆది. 26 76. 24-4

## యజ్ఞములో గీత వాదిత్ర నృత్యములు

ధర్మరాజు రాజసూయ యజ్ఞ దీక్షితుఁ డైనపుడు

చేద నినాదము నాశీర్వాదనినాదము ననేక వాదిత్ర మహా
నాదంబుఁ జెలఁగె నన్య నినాదంబు జనంబులకు వినంబడకుండన్.

—నన్నయ. సభా. 1-292

ధర్మజుని యశ్వమేధము "కనుఁగొను కౌతుకంబునఁ గూడి చనుదెంచి
దివ్యమునీంద్రు లతిప్రియమున నభినందనముసేయ

నఖిల గంధర్వులు నానందనములగు గానములను. నప్సరః స్త్రీలు
హృద్యములై నృత్య విశేషములను" నుల్ల సిల్లుచుండ.[1]

నా యాగము శోభిల్లుచున్నది.

అందు వీణాగాన విశారదులైన నారద తుంబురాది దేవ గంధర్వులుండుట యొక విశేషము.

నారదశ్చ బభూవాత్ర తుంబురశ్చ మహాద్యుతిః
విశ్వావసు శ్చిత్రసేన స్తథాఽన్యే గీతాకోవిదాః ॥

రమయంతి స్మ తాన్ విప్రాన్ యజ్ఞకర్మాంతరేషు వై
గంధర్వా గీత కుశలా నృత్యేషు చ విశారదాః ॥ —వ్యా. భా. అశ్వ. 88-40

దిలీప చక్రవర్తి యశ్వమేధ సమితిఁజేసి యింద్రుని మెప్పింపఁగా

"అర్థి విశ్వావసుండాదిగాఁ గలుగు గంధర్వులు హృద్యవాదన మొనర్ప
నప్సరో నికురుంబ మాటలుఁబాటలుకై" వినోదించిరి.

—తిక్కన. ద్రోణ. 2-203 [శాంతి. 1-235

విశ్వావసువు స్వయముగా సప్తతంత్రీవీణ వాయించినాడు.

ననృతు ర్దేవ గంధర్వా షట్ సహస్రాణి సప్తధా
అవాద్యయత్ తత్రీ వీణాం మధ్యే విశ్వావసుః స్వయమ్॥

—వ్యా. భా. శాంతి. 99-75

విశ్వావసువు వీణపేరు బృహతి - తుంబురుని వీణపేరు కళావతి.

---

[1] తిక్కన, అశ్వమేధ. 4-179 = వ్యా. భా. 88-38

స యజ్ఞః శుశుభే సాక్షాత్ దేవర్షి సంకులః
గంధర్వ గణ సంగీతః ప్రనృత్తోఽప్సరసాం గణైః ॥

# సంగీత నృత్యోత్సవములు

ద్వారకా పురవాసులు రైవతకాద్రి మహోత్సవము జరుపుకొనిన తీరు నన్నయ మనోహరముగా వర్ణించినాఁడు.

పొలుపుగఁ బూసి కట్టి తొడి భూరివిభూతి ప్రకాశితంబుగాఁ
గలయఁగ దత్పురీజనులు కాంస్య మృదంగ ముకుంద వేణు కా
హళ పటహ ధ్వనుల్ సెలఁగ నాటలుఁ బాటలు నొప్ప నెల్లవా
రలుఁ జని చేసి రర్చనలు రైవతకాద్రికి నుత్సవంబుతోన్.

గురుకుచయుగ్మముల్ గదలఁ గ్రొమ్ముడు లందుల పుష్పముల్ పయిం
దొరఁగ నిదాఘబిందు వితతుల్ సెదరన్ మదితామదంబునన్
బరవశ లయ్యు నింపెసఁగఁ బాడుచు తాళము గూడమెట్టుచున్
దరుణియ లొప్పనాడిరి ముదంబునఁ దమ్మ జనాళి మెచ్చగాన్.

—నన్నయ. ఆది 8. 174-5*

పురజనులే కాక యంతః పురాంగనలు కూడ నాట పాటల యం దాసక్తి గలిగియుండిరి.

విహారార్థము కృష్ణార్జునులతో యమునాతీరమున కరిగిన ద్రౌపదీ సుభద్రాద్యంతఃపురకాంతలలో కొందఱు సంతోషముతో నృత్యము చేసిరి. కొందఱు పాటలు పాడిరి.

యమునా తీరము నందలి హర్మ్యములు చుట్టు ప్రక్కలఁగల వనములు వేణు వీణా మృదంగాది వాద్యముల మధుర శబ్దములతో నిండిపోయినవి.

కాశ్చిత్ ప్రహృష్టా ననృతు శ్చుక్రుశుశ్చ తథాపరాః
జహసుశ్చ పరా నార్యో జగుశ్చాన్యా వరస్త్రియః ॥

వేణు వీణా మృదంగానాం మనోజ్ఞానాం చ సర్వశః
శబ్దేన పూర్యతే హర్మ్యం తద్ వనం సుమహర్ధిమత్॥

—వ్యా. భా. ఆది. 221. 24. 6

---

* వ్యా. భా. ఆది. 218-4

వాదిత్రాణి చ తత్రాన్యే వాదకాః సమవాదయన్
ననృతు ర్నర్తకా శ్చైవ జగుర్గేయాని గాయనాః ॥

## వారాంగనా నృత్యములు

భూలోకమునందు వారకాంత లప్సరసల స్థాన మలంకరించిరి. వారు తమ నృత్యగానములతో సకలజనులకు వినోదము గలిగించుచుందురు.

జనక మహారాజు శుకమహర్షిని సేవించుచుండగా...

రూప విభ్రమముల నప్సరోజనంబుఁ గ్రేణిసేయు వారాంగనాశ్రేణి గీత
నృత్య నిరతి నారాధింప నిర్విశేషయోజితేంద్రియుఁడై యతఁడుండె నధిప.
—తిక్కన. శాంతి. 6-269

ఉత్తర వివాహ సమయమున, "నృత్త గీతాది వైచిత్ర్య మనోహర వారనారీ జనంబుల వలనను... మత్స్య మహీపతి మందిరంబు పరమ సంపద్భరితంబై యుండె" —తిక్కన. విరాట. 5-403

కువలయాశ్వుఁడు కుమార సహస్రంబుతో నిజ పురంబున కరిగి వారాంగనా నృత్య గాన విశేషంబు లాలోకించుచు రాజధానిం బ్రవేశించి సముజ్జ్వల సామ్రాజ్య సౌఖ్యంబులం బరగుచుండె. —ఎఱ్ఱన. ఆరణ్య. 4-415

## పరిచారికల కళాప్రావీణ్యము

చతుష్షష్టి కళావిశారదలు నృత్య గాన కళాకుశలలు నయిన తరుణులు లక్ష మంది తన యొద్ద పరిచారికలుగా నున్నారనియు వారిని ద్యూతమునందు పణముగా నొడ్డుదు ననియు ధర్మజుఁడు పలికినాఁడు.

శతం దాసీ సహస్రాణి తరుణ్యో హేమభద్రికాః
మణీన్ హేమ చ బిభ్ర త్యశ్చతుష్షష్టి విశారదాః
అనుసేవాం చరంతీమాః కుశలా నృత్య సామసు॥—వ్యా. భా. సభా. 61. 8-10

## సంగ్రామ రంగము : సంగీత గోష్ఠులు

కురుక్షేత్రమున యుద్ధవిరామ సమయములందు కౌరవ పాండవ వీరులు వినోదార్థము సంగీత సాహిత్యగోష్ఠులు సలుపుచుండిరి.

రెండు వీళ్లజనంబులురేలు వివిధ హృద్య సంగీతములను
సాహిత్య లలిత మధుర గోష్ఠీ వినోదములను ప్రమోదభరితులై
పొద్దు పుత్తురు భరతముఖ్య. —తిక్కన. భీష్మ. 1-343

ఇది భరత వీరుల లలిత కళాభిరుచికి నిదర్శనము

## సంగీత శిక్షణ

అర్జునుఁ డమరావతిలో చిత్రసేనుఁడను గంధర్వుని వద్ద గాంధర్వ విద్య నభ్యసించినాఁడు.

"...చిత్రసేనుఁడన్ గంధర్వపతితోడ గారవమున వజ్రధరుఁడు
గీత వాద్యనృత్యంబులు గఱపఁ బంచెఁబార్థు" —నన్నయ. ఆరణ్య. 1-369

మర్త్యలోకమున లేని దేవ విహితములయిన నృత్యగీత వాద్యములను చిత్రసేనుని వలన నేర్చుకొను మనియు దానివలన నీకు మేలు గలుగు ననియు దేవేంద్రుఁ డర్జునకుఁ జెప్పినట్లు మూలమునందు గలదు.

నృత్యం గీతం చ కౌంతేయ చిత్రసేనా దవాప్నుహి
వాదిత్రం దేవవిహితం నృలోకే యన్నవిద్యతే
తదర్జస్వ కౌంతేయ శ్రేయో వై తే భవిష్యతి॥
—వ్యా. భా వన. 44-6, 7

అర్జునుఁడట్లు నృత్యగాన వాద్యకళాకుశలుఁడైనాఁడు.[1]

## నాట్యాచార్యుఁడుః నరుఁడు

నృత్యగుణా ననేకాన్ వాదిత్రగీతాంశ్చ గుణాంశ్చ సర్వాన్.—వ్యా భా. వన. 44-11

అర్జునుఁడు నేర్చిన గాంధర్వ విద్య యజ్ఞాతవాసంబునం దక్కఱకు వచ్చినది.

యర్జునుఁడు బృహన్నల వేషముధరించి విరాటు కొలువునఁజేరి

ఒండు పనులకు నెలవు లేమునికిఁజేసి యభ్యసించితి శైశవమాదిగాఁగ
దండలాసక విధమును గుండలియును బ్రెక్కణంబు తెఱంగును బ్రేంకణంబు*
విశ్రుతవాద్యంబులు మంజుశ్రుతిసంభావ్య గీత సుగతులు సద్భా
వాశ్రయములుఁ దజ్జన్యరసాశ్రయములు నైన యభినయంబు[1] తెలుగుదున్.
అని విన్నవించికొనినాఁడు. — తిక్కన. విరాట. 1. 204-1

---

* 1) దండలాసకము = కుండలాకార నృత్యము; గొండ్లి

2) కుండలి = నృత్య విశేషము, కోలాటము

3) ప్రెక్కణము = అభినయముతోడి నృత్యము

4) ప్రేంకణము : శిరమున కలశములు పెట్టుకొని చేయు నృత్యము
ప్రేరణి పేరణి = భాండోపరి నృత్యము

1 ఆహార్యము, ఆంగికము, వాచికము, సాత్త్వికమునని యభినయములు నాల్గు విధములు.

మహాభారతకాలము నాటి నృత్యరీతు లెవ్వియో తెలియదు కాని తిక్కన మాత్రము తనకాలమున తెలుఁగునాట ప్రచలితమగుచున్న నృత్యరీతులను బృహన్నల చేతఁ జెప్పించినాఁడు.

విరాటమహారాజు తన గాదిలికూతు నుత్తరను వానికిఁజూపి

"బాలకేళి మీఁది భరముఁ గ్రమంబున విడిచి కళల యందువేడ్క సొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు నెలఁత కేడుగడయు నీవ కాదె "[2]

అని యుత్తరను నట్టువొజ్జ కప్పగించినాఁడు.

ఈ వర్ణనముల వలన మహాభారతకాలమున రాజపుత్త్రులు రాకుమారికలు సంగీత నృత్య విద్యాభ్యాసము చేయుచుండిరని స్పష్టమగుచున్నది.

## ప్రదర్శన పూర్వరంగము

ఏ ప్రదర్శనమున కయినను పూర్వరంగముండక తప్పదు. ముందుగా నాట్యప్రదర్శనమున కనువుగా రంగవాటమును సిద్ధముచేయ వలెను. అది శిల్పుల పనియే.

మత్స్యమహీపతి నగరు నందు నర్తనశాల యున్నది.

రంగాజీవులు పాత్రోచితమైన వేషభూషలు ధరింపవలసిన యవసర మెంతేని గలదు.

చతుర్విధాభినయములలో ఆహార్యము ముఖ్యమయినది.

ఆహార్య మన హారాది భూషణములచేఁ గలిగెడి యభినయము (శ.ర.)

వివిధ పాత్రలకుఁ దగిన వేషములు, హారాది భూషణములు తయారు చేయువారు శిల్పులే. ఇందు వివిధాభరణములు నిర్మించువారు స్వర్ణకారులు. వానిని పాత్రధారుల కలంకరించుట యొక కళ. భూషణ యోజనము రూప శిల్పుల పని.

నాట్య ప్రదర్శనమునకు వాద్య సహకార మవసరము. వాదిత్రములను నిర్మించువారు దారు శిల్పులు.

నర్తకుల కాళ్లకు మువ్వలు. నట్టువాంగమున కుపకరించు కంచు తాళములు చేయువారు కాంస్యకారులు.

ఈ విషయము లన్నింటిని దృష్టియందుంచుకొని యోచించనచో సకల సంగీత నృత్య ప్రదర్శనము లందు వివిధ శిల్పకళాకారుల పాత్ర విదితము కాగలదు.

## కల్పవృక్షములు

కల్పవృక్షమనఁగా కోరిన ఫలముల నిచ్చు వృక్షము.

అమరావతియం దిట్టి వృక్షములున్నవి.

తతః శక్రస్య భవన మపశ్య దమరావతిమ్
దివ్యైః కామఫలైర్ వృక్షై రత్నైశ్చ సమలంకృతామ్॥

—వ్యా. భా. వన. 168 45

కల్పవృక్షములు కామఫలములనే కాక వస్త్రాభరణములను గూడ నొసఁగు చున్నవి.

అలకాపురి యందలి యంగనామణులకు చతుర్విధాభరణముల నొక్క కల్పవృక్షమే యిచ్చుచున్నదని మహాకవి కాళిదాసు వర్ణించినాఁడు.

వాసశ్చిత్రం మధు నయనయో ర్విభ్ర మాదేశదక్షం
పుష్పోద్భేదం సహ కిసలయై ర్భూషణానాం వికల్పమ్॥
లాక్షారాగం చరణకమల న్యాసయోగ్యం చ యస్యా
మేకః సూతే సకల మబలామండనం కల్పవృక్షః॥ —ఉత్తరమేఘము. 12

కురుభూములకుం జని హరివాసంబను పురంబుపై విడిసినప్పుడయ్యుత్తర కురుభూముల రాజులెల్ల నర్జునున కతిప్రీత చిత్తులయి యపరిమిత దివ్యాభరణంబులు దెచ్చి యిచ్చిరి. —నన్నయ. సభా. 1. 236-40

ఈ దివ్యాభరణములు మానవ శిల్పి నిర్మితములు కావు. ఉత్తర కురుభూము లందలి కల్పవృక్షముల యం దుద్భవిల్లినవి.

ఉత్తర కురుభూములందలి విచిత్రములు - విశేషములు భీష్మపర్వము నందు వర్ణింపఁబడినవి.

ఉత్తరాః కురవో రాజన్ పుణ్యాః సిద్ధ నిషేవితాః....
అపరే క్షీరిణోనామ వృక్షా స్తత్ర నరాధిప
వస్త్రాణి చ ప్రసూయంతే ఫలే ష్వాభరణాని చ
మిధునాని చ జాయంతే స్త్రియశ్చాప్సరోపమాః
మిధునం జాయతే కాలే సమంతచ్చ ప్రవర్ధతే
తుల్య రూప గుణోపేతం సమవేషం తథైవ చ॥

—వ్యా భా. అను. 7. 6-12*

* పోల్చు :- వాల్మీకి రామాయణము. కిష్కింధ 43. 38-40

కల్పవృక్షములు బంగారురంగు గలిగియుండును.

తపనీయనిభౌ చిత్రా కల్పవృక్షా వివాద్భుతౌ॥ —వ్యా. భా. ద్రోణ. 169-18

తపనీయనిభౌ కల్పవృక్షా వివ ద్రుమౌ॥ ,, 170-6

ధర్మజుని కోష్ఠాగారము, 'సకలసంకల్పసిద్ధికరంబై కల్ప ద్రుమంబు ననుకరించు' చున్నట్లు వర్ణింపఁబడినది. —నన్నయ. సభా. 1-273

సకలసంకల్పములకు మూలము మనస్సే. సంకల్పబలమున కోరికలు సిద్ధించును. కావున కల్పవృక్షము మనస్సునకు ప్రతీక.

ఈ భావముతోడనే కవులును శిల్పులును కల్పవృక్షములను సృష్టించిరి.[1]

రైవతకోత్సవ సమయమున రైవతకాద్రి రత్నచిత్రప్రాసాదముల తోడను కల్పవృక్షములతోడను శోభిల్లుచున్నది.

ప్రాసాదై రత్నచిత్రైశ్చ గిరేస్తస్య సమంతతః
స దేశః శోభతో రాజన్ కల్పవృక్షైశ్చ సర్వశః॥
—వ్యా. భా. ఆది. 219-3

ఈ కల్పవృక్షము లలంకారార్థము శిల్పులచేఁ గల్పింపఁబడిన కృతక వృక్షములు [2]

సాంచీ మహాస్తూప దక్షిణదిగ్ద్వారము నందలి ప్రతీచీముఖ స్తంభము పయి నుత్తర కురుభూములు శిల్పింపఁబడినవి.

అట్లే భారహుత్ మున్నగు శిల్పకళాక్షేత్రములందును కల్పవృక్షరచనలు కన్పించుచున్నవి [3]

ఈ విధముగా మహాకవుల యూహాజనితము లయిన కల్పవృక్షములకు శిల్పులు రూపకల్పన చేసి చూపినారు.

---

1. Cf: - V S. Agrawala : Studies in Indian Art. p- 45
"The artists made full use of a rich conception like this and employed Kalpa Vrikshe as one of the symbols which adorned art both in respect of beauty of form and depth of meaning."

2. "The Region around the hill was adorned with many a mansion decked with gems and many an artificial tree of gaudy hue."
—P. C. Roy - M. Gh P. 603

3. Cf :- V. S. Agrawala : Studies in Indian Art. —p, p, 48-51

# నందినియా ? శిల్పకళానందినియా ?

తక్షన్ ధేనుం సబర్ దుఘామ్॥ —ఋగ్వేద. 1. 20-3*

ఋభువులు కామధేనువును నిర్మించినట్లు ఋగ్వేదము చెప్పుచున్నది.

కోరిన కోరికను వర్షించు వసిష్ఠుని హోమధేనువు నందిని ఋభుకృత కామధేనుయంత్రము వలెనున్నది

"దక్ష ప్రజాపతి పుత్త్రిక యగు సురభికిం గశ్యపునకుం బుట్టిన నందిని తనకు హోమధేనువయి కోరిన వస్తువులు గురియుచుండెను "1

విశ్వామిత్రుఁ డొకప్పుడు వసిష్ఠు నాశ్రమంబునకురాగా "నమ్ముని వరుండు విశ్వామిత్రు నతి ప్రీతిం బూజించి వానికిని వాని సేనకు నభిమతంబు లైన యాహారంబులు గురియు" నందిని యను తమ హోమధేనువును బంచిన నదియు

ఘృతనదులును నోదన పర్వతములు దధికుల్యములు నవారిత రస పూరిత బహువిధోపదంశోన్నత పుంజంబులును దక్షిణంబుగ గురిసెన్.
— నన్నయ, ఆది. 7-97

ఇవియే కాక రత్నములు వస్త్రములుకూడఁ గురిసినట్లు మూలమునందుఁ గలదు.

రత్నాని చ మహార్హాణి వాసాంసి వివిధాని చ
తైః కామైః సర్వసంపూర్ణైః పూజితశ్చ మహీపతేః ॥
—వ్యా. భా. ఆది. 174-12

ఇట్లు చతుర్విధాహారంబుల నందఱ దృప్తులంజేసి యున్న యా నందినింజూచి విశ్వామిత్త్రుఁడు విస్మితుండయి 'నాకీ ధేనువు నిమ్మని' కోరెను. వసిష్ఠుఁ డందులకు నిరాకరించెను.

దీనిని బలిమినైన బరిగ్రహింతు నని విశ్వామిత్రుఁడు వసిష్ఠు హోమ ధేనువుంబట్టికొనం బంచిన నది పట్టిక యఱచుచు వసిష్ఠు నొద్దకు వచ్చి నన్నేల యుపేక్షింతు రని పలికిన విని యమ్ముని మిన్న కుండెను.

---

* పోల్చు :- ధేనుం ప్రత్నస్య కామ్యం దుహానా... ॥ —ఋగ్వేద 3-58

1 నన్నయ ఆది. 4-158 = వ్యా. భా. ఆది. 99-8

గాం ప్రజాతా తు సా దేవీ కశ్యపాద్ భరతర్షభ॥

"తదీయాభిప్రాయం బెఱిగి నందినియు తన పత్సంబుఁ బట్టికొన వచ్చిన జనుల కలిగి చిందఱ రేఁగి నిదాఘ సమయ మధ్యందిన దినకర మూర్తియుం బోలె దుర్నిరీక్ష్య యయి యంగవిక్షేపంబున నంగార వృష్టిం గురియుచు వాలంబున శఋరులను శకృ న్మూత్రంబుల శక యవనపాంఢ్ర పులింద ద్రవిళ సింహళులను బుట్టించిన

నలి రేఁగి కలఁగి తద్బలములు విశ్వామిత్రుసైన్యముల కేను మడుంగులు
పెరిఁగి మూఁడు యోజనములు వాఱఁగ నెగిచె నొక్కమొగిఁ బ్రతిబలమున్"

—నన్నయ. ఆది. 7. 107-9

భాసకృతమగు ప్రతిజ్ఞాయౌగంధరాయణ నాటకములో ప్రద్యోతన మహారాజు కపటయోగమున ఆ యు ధీ య కృత్రిమ వా ర ణ ద్వారమున వత్సరాజును వంచించి పట్టుకొని నట్లు వర్ణింపఁబడినది.

'మహామాత్రో త్త్రరాయుధీయాధిష్ఠితః ప్రిత్యుద్గతః
స కృతక హస్తీ' —ప్రతిజ్ఞాయౌగంధరాయణము. 1. 6-75

గ్రీకులకు ట్రోజనులకు జరిగిన యుద్ధములో గ్రీకులు కుయుక్తితో దా రు మ య హ య ము న ం దు దాగి 'ట్రాయ్' నగరమును ప్రవేశించి నిశీథ సమయమున నగర రక్షకులతో పోరాడి దానిని వశపఱచుకొని నట్లు గ్రీకు పురాణములలో వర్ణింపఁబడియున్నది.[1]

వసిష్ఠుని హోమధేనువు నందిని కశ్యప సంతాన మని చెప్పఁబడినది.

కశ్యపుఁడు శిల్పాచార్యుఁడు. కావున నందిని కశ్యప కృత కళాయంత్ర మని చెప్ప వచ్చును.

అష్టాదశ శిల్పాచార్యులలో వసిష్ఠుఁ డొకఁడు.[2]

వ సి ష్ఠా శ్ర మ ము న ం దట్టి ధేమరూప కళాయంత్రము లుండుట వింతకాదు.

---

1 చూడు :- హోమరు - ఇలియడు

Cf :- H. J. Rose : Gods and Heros of the Greeks. — pp. 136-7

"Finally Epics...... constructed an immence wooden horse in which a picked body of men was coacealed......In the night the hidden men came out."

2 చూడు :- మత్స్య పురాణము.

# ద్యూతకళ : అక్షశిల్పము

చతుష్షష్టికళలలో నొకటి యైన ద్యూతము బహుపురాతన మయినది. సింధునాగరతాకాలమునకు నక్షద్యూత మున్నట్లు తెలియుచున్నది.[1]

ఋగ్వేదకాలమున పాచికలు విభీతక (తాండ్రచెట్టు) ఫలములతో తయారుచేయుచుండిరి.

ప్రావపా మా బృహతో మాదర్యంతి ప్రివాతేజా ఇరిణే వర్వృతానాః
సోమస్యేవ మౌజవతస్య భక్షో విభీదకో జాగృవిర్
మహ్యమచ్ఛాన్ ॥ —ఋగ్వేద 10 34-1

ద్యూతమునం దక్ష సంఖ్య ఏఁబది మూడు.

త్రి పంచాశః క్రీడతి వ్రాతః ॥ —ఋగ్వేద, 10. 34-8

అనంతరకాలమున విభీతకబీజములకు బదులు దారువుతోఁ గాని గజదంతముతోఁ గాని నాలుగు పలకలు గల ఖండములుగా చేయఁబడిన పాచిక లుపయోగింపఁబడు చుండినట్లు బౌద్ధ జాతకకథల వలనఁ దెలియుచున్నది. ఈ పాచికల కొక్కొక పక్క నిర్దిష్టమయిన సంఖ్యలో చుక్క లుండును.

జూదగాండ్రు ఇరువది నాలుగు ఎత్తులలో నొక్కొక డొక్కొక సంఖ్యను జెప్పి పందెము కాయును పాచికలు వేసినప్పుడు ఆ సంఖ్య వచ్చిన నాతఁడు గెలిచినట్లు. ఇదియొక పద్ధతి.[3]

---

1. Cf :- B. B. Lal : "The Indian Civilisation"— in A cultural History of India. ed.-by A. L. Basham - 17

2. R. T. H. Griffith : The Hymns of the Rigveda.
"The nuts of the Vibhitaka or later Vibhitaka tree were used as dice in early time".

3. Ibid :- Merrily sports their troop the three and fifty etc.

4. Cf :- Louis Renou : The civilisation of Ancient India. p - 164
"In the Jatakas, nuts were replaced by wooden or Ivory Prisms with four edges the four faces being marked with dots......"

రాజసూయము : అక్షక్రీడ

రాజసూయ యాగమునందు రాజు అధ్వర్యునితో పాచికలాడుట యొక విధిగానున్నది.

అభిభూరి త్యస్మై పంచాక్షన్ పరిణిధాయేత్॥
—శుక్ల. యజు 10-28

రాజును సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి యధ్వర్యుఁడు బంగరు నగిషీ గల యైదు పాచికలు దెచ్చి రాజు చేతికీయవలెను.

రాజ సూయమునందు గౌరవింపఁదగిన ద్వాదశ రత్నులలో అక్షావాపుఁడు గూడ నొకఁడు.

ధర్మరాజు రాజ సూయయాగమునందు మత్స్య మహీపతి సువర్ణ జటితములయిన యక్షసారెల (నైదింటిని) దక్షిణగాఁ దెచ్చి యిచ్చినాఁడు.

మత్స్యస్త్వక్షాన్ హేమనద్ధాన్....॥ —వ్యా భా. సభా. 53-8

మహాభారతకాలమున రాజులు ద్యూత క్రీడాసక్తులై యుండిరి.

మాయాదురోదర వ్యాజమున పాండవుల రాజ్యలక్ష్మి నపహరింప వలెనను దురుద్దేశ్యముతో దుర్యోధనుఁడు ద్యూతార్థమొక సభాభవనమును నిర్మింపుమని కోరఁగా ధృతరాష్ట్రుఁడు వేవురు శిల్పాచార్యులను రావించి సభాభవనమును నిర్మింపఁ బంచినాఁడు.[2]

'ఆ ధృతరాష్ట్రుచేసిన యనర్ఘమణి ప్రాకరానుబద్ధ శోభాధృతి నొప్పుచున్న సభ'[3] యందు కౌరవ పాండవులు సుహృద్ద్యూతము నం బ్రవర్తిల్లుటకు శకుని ధర్మరాజు నొడఁబఱచినాఁడు.

---

* Cf :- Ralph. T. H. Griffith : The Texts of the White Yajurveda. Notes on X 28

"He puts five dice into the sacrificers hand, in the shape of golden shells, representing the four quarters of the sky and the zenith."

చూడు :- పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి : రాజసూయ రహస్యము. పు. 42

1 చూడు :- మహాభారతము : గీతాప్రెస్ ప్రతి. పట. 867
"మత్స్య నరేశ్ నే సువర్ణజటిత ఘురీ లా దీ॥"

2 నన్నయ. సభా. 2-129 3 నన్నయ సభా. 2-162

## ద్యూ త క ళ

ద్యూతకళావిదుఁడగునాతఁడు లోకజ్ఞుఁడును మహామతియును వి
ఖ్యాతుఁడు నగు సత్‌క్షత్రియనీతి విదుఁడు తగునె దాన నిందిపఁగన్.[1]

అని యుపన్యసించి...... శకుని

"చందన కర్పూరవారి పరిషిక్తంబైన ద్యూ త ర ం గ బు నం దు ముందఱ గంధపుష్పార్చితంబు లయిన యభిమతాక్షంబు లమర్చి కొని"[2] దుర్యోధనుని పక్షమున ధర్మరాజుతో జూదమాడి వాని నోడించినాఁడు.

అభిమతాక్షముల్ దొల్చి మాయావిదుండు
సుబలరాజాత్మజుఁడు ధర్మసుతు జయించె॥[3]

## సు వ ర్ణ మ ణి మ యా క్ష ము లు

అజ్ఞాతవాసకాలమున కంకభట్టుగా విరాటురాజు కొలువునఁజేరి;

"ఆతనితో నొక్కొకమరి కౌతూహలవృత్తి కిం దగం దొడిగి మృదు
ద్యూతంబునఁ గ్రీడింతుం జేతోముద మొదవ నక్షశిల్పప్రౌఢిన్.

మణిమయమ్ములుఁ గలధౌతమయములును సువర్ణమయములు నాదిగా వలయునట్టి యడ్డసాళులు గలవు నాకభిమతముగ వానిఁ గొంపోయి చూపుదు వరుస తోడ" అని ధర్మజుఁడు తెలిపినాఁడు. —తిక్కన. విరాట. 1. 71-27*

రంగు రంగుల యడ్డ సాళులె కాదు; నెత్తపలకలును గలవు.

వైడూర్యాన్ కాంచనాన్ దాంతాన్ ఫలై[4] ర్జ్యోతీ రసైః సహ
కృష్ణాక్షాన్ లోహితాక్షాంశ్చ నిర్వర్త్స్యామి మనోరమాన్॥

— వ్యా భా. విరాట. 1-25*

ఈ విధముగా పాచికలను నెత్తపలకలను జేయుట శిల్పవిషయమే.

ఈ వర్ణనముల వలన మహాభారతకాలమున రాజులు శిల్పాచార్యులచేత ద్యూతశాలలు నిర్మింపించుకొనుచుండిరనియు. పాచికలను సువర్ణమయములు గను వైడూర్యమణిమయములుగను గజదంతమయములుగను తయారు చేయించు కొనుచుండిరనియుఁ దెలియుచున్నది.

---

1. నన్నయ. సభా. 2-169; 2. సభా. 2-178, 3 సభా. 2-276

4 "ఫలైః శారీస్థాపనార్థాని కోష్ఠయుక్తా కాష్ఠాదిమయాని ఫలకాని తైః సహ॥"
ఫల మన శారిఫల(క)ము. నెత్తపలక —[నీలకంఠ.

# అష్ట శోభనములు

అష్టశోభన మనఁగా ఎనిమిది విధములైన నగరాలంకరణము.

నీళ్లు చల్లుట, ముగ్గులు పెట్టుట, పందిరులు వేయుట, తోరణములు గట్టుట, ధ్వజము లెత్తుట [కొందఱు ఇట నృత్య గీత వాద్యము లందురు.] చిత్రములు వేయుట, ధూపదీపములు పెట్టుట, పూర్ణకుంభములుంచుట యనునవి. —సూర్యరాయాంధ్ర నిఘంటవు

వీనిలో చివరి యాఱును శిల్పకళాకలితములే.

ముగ్గులు పెట్టుటయు నొక కళయే.

"...పాంచాలపతియును గరం బనురాగంబునఁ బురం బష్టశోభనంబు సేయించి సమారబ్ధ వివాహ మహోత్సవుం డయ్యె. నంత నిరంతర క్రముక కదళీస్తంభ శుంభత్సంభృత నవామ్రాశ్వత్థ పల్లవ మాలాలంకృత ద్వార తోరణంబులను జందనోదక సంసిక్త ప్రాంగణ రంగవల్లీ కృత కర్పూర మౌక్తికపుంకరంబులను గౌతుకోత్సవ మంగళ శృంగార వరాంగనా ప్రవర్త్యమాన స్వవినియోగ కృత్యంబులను...... జేసి యొప్పుచున్న ద్రుపదరాజ మందిరంబు..." అని నన్నయ ద్రౌపదీవివాహ మహోత్సవము నతిమనోహరముగా వర్ణించినాఁడు. —ఆది, 7-283

పునః స్వయంవర వ్యాజమున తనపతిం బడసి సుఖంబున్న దమయంతిం జూచి సంతసిల్లి విదర్భేశుఁ డయిన భీమ నరపాలుఁడు "...తన పురంబునం దష్టశోభనంబులు, దేవగృహంబుల యందు విశేషపూజలు సేయించె" నని నన్నయ వ్రాసినాఁడు —అరణ్య. 2-221

మూలమునందు అష్టశోభన మనుమాట లేదు. కాని ధ్వజములెత్తుట, రాజమార్గములందు నీళ్లు చల్లుట, పూలుచల్లి యలంకరించుట, ద్వారములకు తోరణములు గట్టుట మొదలయిన యంశములు వర్ణింపఁ బడినది.

అశోభయచ్చ నగరం పతాకధ్వజ మాలినమ్
సిక్తాః సుమృష్టపుష్పాభ్యా రాజమార్గాః స్వలంకృతాః ॥

ద్వారి ద్వారి చ పౌరాణాం పుష్పభృంగోపకల్పితాః
అర్చితాని చ సర్వాణి దేవతాయతనాని చ॥ —వ్యా. భా. వన 77 6-8

నగరాలంకరణమునకు శిల్పుల యవసరమెంతేని గలదు.

# వివాహ మండప విశేషములు

"...ద్రుపదరాజ మందిరంబునం బూర్వోత్తర దిగ్భాగంబున
విచిత్ర చిత్ర వితత వితాన మౌక్తిక కుసుమమాలాలంబనాభిరామంబును
సమీచీన చీనాంశుక విరచితస్తంభ వేష్టనంబును
ప్రత్యగ్ర పల్లవశాల్యక్షతాంచిత కాంచనపూర్ణకలశోపశోభితంబును
లాజాజ్యపూర్ణ సౌవర్ణపాత్ర సమారబ్ధ పుష్పసమిత్కుశశ్మశమ్యాభిరమ్యంబును
నవ గోమయశ్యామ మరకత మణిప్రభా పటల లిప్త హిరణ్మయ
వేదీ మధ్య సమిద్ధాగ్ని కుండమండితంబును
సర్వాలంకారసుందరంబు నయిన వివాహమండపంబు..."

అని నన్నయ వర్ణించినాఁడు. —నన్నయ. ఆది. 7-283

ఈ వర్ణనము వలన స్పష్టమగుచున్న యంశము లివి :-

1) వివాహమండపము రాజమందిరమున కీశాన్య భాగమున నిర్మింపఁబడినది.

2) వితానములకు ముక్తాహారములు, కుసుమమాలలు వ్రేలాడఁ గట్టఁబడినవి. వితానముల యంచులు చిత్రముగనున్నవి.

3) స్తంభములకు చీని చీనాంబరములు చుట్టఁబడినవి.

4) స్వర్ణమయములయిన పూర్ణకుంభములు నూత్నపల్లవముల తోడను శాల్యక్షతలతోడను నొప్పుచున్నవి.

5) పేలాలతోను, నేయితోను నిండిన బంగారు పాత్ర లున్నవి.

6) హిరణ్మయవేది [బంగరుటరుగు] గోమయముతో నలుకఁబడి మకరత మణికాంతులు వెదజల్లుచున్నది.

7) ఆ వేదిక మధ్య మందుచున్న యగ్నికుండ మున్నది.

ఈ విధముగా ద్రౌపదీ వివాహమండపము సర్వాంగ సుందరముగా నున్నది.

ఈ సమస్త కార్యములు చేయువారు శిల్పులే.

శిల్పులీ వివాహమండప, వివాహవేదీ, వివాహపీఠికాదులు శాస్త్రానుసారము నిర్మింతురు.

# స్వ స్తి క ము

తత్రోపవిష్టో ధర్మాత్మా శ్వేతా స్సుమనసోఽస్పృశత్
స్వస్తికా నక్షతాన్ భూమిం సువర్ణం రజతం మణిమ్॥

—వ్యా. భా. శాంతి. 40-7

ధర్మాత్ముఁడయిన యుధిష్ఠిరుఁడు జాతరూపనవరత్న ఖచితంబును ధృఢపాదంబును నగు భద్రపీఠంబు.[1] పైఁ గూర్చుండి తెల్లని పూవులు, స్వ స్తి క ము, అక్షతలు, భూమి, బంగారము, వెండి, మణి - అను వానిని స్పృశించెను.

స్వ స్తి క మన మంగళకర వస్తువు. వస్తువుల పయిఁగాని మనుష్యుల శరీరము పయిఁగాని శుభసూచకముగా రచింపఁబడు చిహ్నము.[2]

ఇట స్వస్తిక మనఁగా సర్వతోభద్రాది మంగళకర చిహ్నములు రచింపఁబడిన దేవపీఠ మని నీలకంఠుఁడు వివరించినాఁడు.

స్వస్తికా స్సర్వతోభద్రాద్యంకితాని దేవపీఠాని॥ —నీలకంఠ.

స్వస్తికము ప్రాణదాత యగు సూర్యునకు ప్రతీక.

శుభ ప్రదమయిన స్వస్తికము శిల్పరచనావిశేషమే.

## స్వ స్తి వా చ న ము

తతో నిష్క సహస్రేణ బ్రాహ్మణాన్ స్వస్తి వాచయన్
తే ప్రీతా బ్రాహ్మణా రాజన్ స్వస్త్యూచు ర్జయమేవ చ॥

—వ్యా. భా. శాంతి. 40-20

వేదాధ్యయనసంపన్నులైన బ్రాహ్మణులు భూరిదక్షిణలతో ప్రీత చేతస్కులై స్వస్తివాచనములు పలికి జయజయధ్వానములు చేసిరి.

స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతి ర్దధాతు॥

—ఋగ్వేద 1 89-6

---

1 తిక్కన. శాంతి. 1-373 = వ్యా. భా. శాంతి. 40-1

2. Any Lucky or auspicious object (espl) a kind of mystical cross made on persons and things to denote good Luck.
—Momier williams

శుభకార్యములలో మంగళహారతు లొసఁగు పుణ్యస్త్రీలు తమ యఱచేతులపై స్వస్తికాది మంగళచిహ్నములు రచించుకొను చుండిరి.

విజయోత్సాహముతో వచ్చుచున్న యుత్తరకుమారున కెదురేగిన పురంధ్రీమణులు తమ హస్తములపై స్వస్తికాదులు ధరించి యున్నట్లు వర్ణింపఁబడినది.

........సర్వం పురం స్వస్తిక పాణి భూతమ్॥

—వ్యా. భా. విరాట. 68 27*

సాధారణముగా భద్రపీఠాదులు నిర్మించువారు దారుశిల్పులే. కాని యుధిష్ఠిరుఁడు కూర్చుండిన పరమాసనము 'జాతరూప నవరత్న ఖచిత' మని చెప్పఁబడినది. కావున దారుశిల్పి కృతమయిన సింహాసనమును సువర్ణకారులు కనకరత్న ఖచితముగా నలంకరించినా రని చెప్పవచ్చును.

సమస్త శుభకార్యములలో స్వస్తికాది మంగళకరచిహ్నములతో భద్రపీఠములను నిర్మించుటయే కాక బహువిధాలంకరణములతో జనులకు కనుల పండువు చేయు కల్యాణకరులగు శిల్పివరేణ్యులకు సకలదేవతలు శుభ ప్రదులగుదురు గాక !

విశ్వేదేవా నో అద్యా స్వస్తయే
వైశ్వానరో వసురగ్నిః స్వస్తయే
దేవా అవంత్వృభవః స్వస్తయే
స్వస్తి నో రుద్రః పాత్వంహసః ॥

— ఋగ్వేద. 5. 51.13

విశ్వేదేవులు, వసుప్రదుండగు నగ్ని నేడు మాకు శుభము గూర్తురు గాక!

దేవతాశిల్పులగు ఋభువులు మాకు మేలుఁగూర్తురు గాక !

కష్టముల బారినుండి తప్పించి రుద్రులు మమ్ము కాపాడుదురు గాక !

---

* స్వస్తికమ్ మంగళారార్తికాది దధి దూర్వాది చ పాణి యస్య తమ్
స్వస్తిక పాణిభూతమ్ బుద్ధిమత్॥ — నీలకంఠ

# ప్రకీర్ణ శిల్ప సమీక్ష

లోకము నందలి సమస్త శిల్పములకు మూలము విశ్వకర్మయే యని భారతము వక్కాణించుచున్నది. [కర్తా శిల్ప ప్రాణాం]

మహాభారతకాలము నాటికి ప్రసిద్ధములయిన అయోదారు తామ్ర శిలా సువర్ణాది పంచశిల్పములే కాక తదనువర్తనములైన యనేక శిల్పకళలు రూపుదిద్దుకొన్నవి.



రాజులు శిల్పకళా ప్రియులు.

శయ్యాసనములు, ఛత్రములు, కత్తిపిడులు, పాచికలు మొదలయినవి సువర్ణ గజ దంతమయములు. కొన్ని దంతాలంకృతములు.

ఆ కాలమున సామాన్యజనులు కంచు పెళ్లెరముల యందును రాజులు బంగారు తళిగల యందును భుజించుచుండిరి.



రాజ్యాభిషేకములందుపయోగింపఁబడు పూర్ణకలశములు కొన్ని సువర్ణమయములు. శంఖములు కాంచనదామజుష్టములు.

మహాభారతకాలమున నృత్యగీత వాద్యములు రాజాదరణము పొందినవి.

తౌర్యత్రికమున కధిపతి త్వష్టృ ప్రజాపతి సుతుఁడగు విశ్వకర్మ.

కవులు, శిల్పులు తమ కల్పనాచాతుర్యముతో కల్పవృక్షములు కామధేనువులు సృష్టించినారు.

సమస్త శుభకార్యములలో సర్వాలంకరణములు చేయువారు శిల్పకళాకారులే



మానవ జీవితము శిల్ప కళామయముగ నున్నది.

శిల్పము లేనిదే జీవితము లేదు. శిల్పము లేని లోకము లేదు.

శిల్పం వినా నహి త్రిషు లోకేషు విద్యతే.

ఇది శిల్పభారతము

ఈ భారత శిల్పకళా దర్శనము సుదర్శనమై సుమనోరంజనమగుగాక !

పండిత ప్రకాండులచే ప్రశంసింపఁబడిన
సిద్ధాంత గ్రంథము

# శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము

ప్రథమ భాగము : వాస్తు శిల్పము

ద్వితీయ భాగము : యజ్ఞ శిల్పము - పూర్త శిల్పము

తృతీయ భాగము : రూపప్రతిరూప రథ యంత్ర ప్రకీర్ణ శిల్పములు

## ఇది శిల్ప భారతము

శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము
చతుర్థ భాగము
శిల్పభారతము - శిల్పాచార్యులు
త్వరలో ప్రచురింపఁబడును.

శ్రీ విశ్వకర్మ విజ్ఞానకేంద్ర
శ్రీకాకుళం

# ముఖ్యమైన ముద్రారాక్షసములకు సవరణలు

# శుద్ధపత్రిక

## పంచమోన్మేషము

| పుట | పంక్తి | అచ్చయిన దానికి బదులు ఉండవలసినది |
|---|---|---|
| 3 | 20 | విద్యా ఓం |
| 8 | 17 | లావణ్యవతి |
| 9 | 9 | లతాలలితాంగి |
| | 10 | సురేంద్రకన్యకలు |
| 10 | 2 | తస్యాత్మజా |
| | 17 | సౌందర్య |
| 11 | 27 | భ్రూమధ్యమున విభూత్యర్థము |
| 12 | 19 | పన్నగభామ |
| | 24 | యురస్స్థలి |
| 13 | 7 | సురగరుడోరగ...సిద్ధ |
| | 23 | బుద్ధి |
| | 24 | షడున్నతా షట్సు...స్తన |
| | 28 | గద్గదభాషిణీ |
| 14 | 26 | శంఖవద్ |
| 16 | 22 | దురదృష్టము |
| 18 | 21 | వ్యాజము |
| 20 | 19 | విపిన |
| 30 | 8 | సంగ్రహించి |
| | 20 | ఇనుపకూపు |
| | 24 | యాయసాంగనా |
| | 28 | గురుతల్పి |
| 32 | 4 | కనియెన్ [5] రాజీవాక్షు |
| 33 | 25 | కర్మకారకైః |
| 34 | 9 | దానవా నభిసంశ్రితః |
| 35 | 13 | ముండః |
| 36 | 2 | స్థాపితవా నసి |
| | 22 | బాలస్యాశ్వాః [23] చిత్రేఽపి |

| పుట | పంక్తి | అచ్చయిన దానికి బదులు ఉండవలసినది |
|---|---|---|
| 38 | 8 | రక్షోఽతీవ |
| 39 | 8 | పురం బష్ట శోభనంబు |
| | 19 | యౌవనాన్వితామ్ |
| 41 | 4 | శిల్పిశ్రేష్ఠుండయిన |
| | 21 | వర్ణింప |
| 42 | 24 | బ్రహ్మణో హి ప్రభూతోఽగ్ని రగ్నే రపి చ |
| 43 | 24 | [విచ్చు] నిచ్చుగాక |
| 44 | 3 | సర్వాస్త్రతాఫలాః క్రియాః |
| | 16 | భూషణము లందు |
| 45 | 11 | [భర్తృ] భర్తు |
| 46 | 18 | కావలయును |
| 47 | 11 | దాసీం |
| 50 | 11 | పాదచారిణియై [19] ఉత్తర |
| 51 | 7 | ప్రవాళ చిత్రే |
| 53 | 4 | యోగంబున |
| 58 | 2 | అగ్న్యాది |
| | 21 | సువర్ణం స్యాత్ |
| 59 | 9 | [పె] పేళ్లు |
| | 20 | పరస్పరం స్పర్ధమానా |
| 60 | 8 | హేమ[కూ] మాలీ...పావ |
| | 18 | పలాశ వృక్షముల |
| 61 | 6 | కేయూరాంగదధారిణి |
| | 28 | సహస్రాభరణాంగదైః |
| 65 | 14 | బిభర్తి |
| | 18 | స్పృహాం చక్రే...... వక్షోఽలం కరణో మణి |
| 66 | 3 | నాయకుండా నమత |
| 67 | 3 | అనిమిషప్రభుండు |
| 68 | 14 | మణివరైః |

| పుట | పంక్తి | అచ్చయిన దానికి బదులు ఉండవలసినది |
|---|---|---|
| 70 | 9 | తనువున |
| | 20 | జానామ్యహం |
| 71 | 26 | ప్రసాధనాలంకృతులలో |
| 72 | 2 | పంక్తిని 5వ పంక్తిగా చదువు కొనవలెను |
| 73 | 14 | సాబలస్యాభ్యుపేతాః |
| 75 | 14 | రాయబారము కొఱకు |
| | 25 | స్పర్శవంతి |
| 76 | 10 | ప్రదదౌ బహూన్ [23]బైలాన్ |
| 77 | 14 | యుష్టిషములు |
| 79 | 7 | దారూణాం ద్రుపదా మపి |
| | 12 | తెనిగించినాఁడు |
| | 17 | వరంబు వడిసి |
| | | షష్ఠోన్మేషము |
| 82 | 3 | రమమాణోఽస్మింస్తిష్ఠతీతి |
| | 12 | ధ్వని |
| 86 | 27 | రథారూఢ |
| 87 | 23 | సూత్రాణి |
| 88 | 9 | ధృష్టద్యుమ్నుఁడు [26] శ్రేష్ఠ |
| 101 | 18 | హైమత్రికోశం |
| | 19 | తురగప్రబర్హైర్ |
| | 22 | యొసఁగినాఁడు |
| 105 | 24 | వర్చసా |
| 106 | 15 | అపక్వామ |
| | 25 | త్రాపనం శాస్త్ర వాఙాం |
| 107 | 9 | జాంబూనదమయా ధ్వజాః |
| | 14 | కేతనము |
| 108 | 7 | స్యందనంబు |
| 109 | 10 | 'యమేన దత్త' |
| | 25 | యోగక్షేమం |
| 112 | 24 | [క] అనీకిని |
| 114 | 13 | గుణములుత్పన్నములగును |
| 118 | 12 | దలంపఁబడి |
| 119 | 10 | వేశ్యాంగనల |
| | 12 | విలసదనులేపన |
| 121 | 10 | ద్వైపీనావ |
| 124 | 16 | పృథివ్యప్స్వంతరిక్షేషు |
| 125 | 11 | నౌకల |
| 129 | 26 | వైష్ణవం పదమ్ |
| 131 | 20 | [సా] సార్వభౌమ |
| 133 | 26 | దదౌ ప్రభుః |
| 135 | 7 | ఖే చరేణ |
| 136 | 15 | హర్మ్యైశ్చ |
| | 18 | ఉపస్థిత మనాధృష్యం తద్ విమానం |
| | 19 | నివేదయిత్వా రామాయ |
| 138 | 2 | కృతం స్వయం |
| 139 | 15 | వేశ్మోత్తమానా మపి |
| 140 | 24 | పద్మిని పద్మహస్తా |
| 142 | 17 | మూలానుసరణమే |
| | 22 | [తిక్కన] వ్యాస. భాగవత |
| 144 | 3 | విమాన రచనే |
| | 9 | విమాన రహస్య[స్మ] |
| | | సప్తమోన్మేషము |
| 152 | 9 | చందంబేర్పడ |
| 153 | 4 | ఏకం చక్రం |
| | 16 | ప్రభులుండవలెను. |
| | 22 | మూఁడువందలు |
| 155 | 16 | అమృతాపహారులు |
| | 26 | నిర్మితమని |
| 156 | 18 | గయక్వాడ్ |
| 158 | 3 | చకార [మే] సః |
| | 7 | నేటికి |
| | 10 | విలసత్కనక మత్స్యా |
| | 28 | చదల నెబ్బంగి |

| (cut off) | పుట | పంక్తి | అచ్చయిన దానికి బదులు ఉండవలసినది |
|---|---|---|---|
| బదులు | | | |
| | 159 | 10 | శోణితం బొజ్యంబు |
| | | 17 | సంఘూతాః |
| | | 19 | తీక్ష్ణః |
| | | 20 | ఋజుస్సునిశితః |
| క్షేమ | | 23 | నాగదంతకృతత్సర్తుః |
| | | 24 | ...ఖడ్గః |
| | 60 | 3 | ఘోరతరో మహాన్ |
| | | 9 | సుతీక్ష్ణాగ్రాః |
| | | 13 | పరిఘైరాయసై స్తీక్ష్ణైః |
| | 62 | 3 | ఆగ్నేయ |
| ష్యం తద్ | | 6 | ప్రశమనంబుయి |
| | | 11 | త్రియామాచరులజంపి |
| ాయ | 167 | 12 | మహార్ణాణి |
| | | 15 | పరిజ్ఞాన |
| ు | 171 | 29 | విధిజ్ఞో వా |
| ా | | 31 | క్వచిత్ప్రవేత్ |
| | 4 | 9 | సేనాయా మితి |
| భాగవత | 6 | 9 | వైడూర్య స్థగితమయి |
| | 78 | 11 | శక్తిం జగ్రాహ |
| క] | | 18 | ప్రహృష్టయాపాశ్చ |
| | | 4 | తాం శత్రూణాం భయవర్ధినిమ్ |
| | 3 | 1 | నయోమయంబు |
| | 5 | 5 | గురుభారసహా |
| | | 16 | హేమబిందుభిరావృతః |
| . | | 19 | శిలీ భేకీ - భేక్యా |
| | 9 | 14 | వర్ణింప |
| | | 18 | కవచావృతుండై |
| | 2 | 23 | అభేద్యం |
| | 4 | 7 | ధరించుచుండిరి |
| | 7 | 5 | సముపగూహనమగుచున్ |
| | | 10 | ఏతత్ తదర్జునస్యాసీద్ |
| ుశి | | 11 | ఆద్యపురుషోపలాలిత |
| | | 25 | శ్లక్ష్ణ [27] ప్రాదాచ్చైవ |

| పుట | పంక్తి | అచ్చయిన దానికి బదులు ఉండవలసినది |
|---|---|---|
| 198 | 6 | మర్దించె |
| | 7 | కాతఁడిచ్చినన్ |
| | 23 | ఘూ[చూ]లము |
| | 24 | కర్ణచాపచ్యుతాః[తః]శరాః |
| | 26 | ఏవముక్త్వా |
| | 28 | [శ] కర్ణుని కార్ముకము |
| 199 | 22 | గార్ధ్రపత్రా |
| | 26 | వాససః |
| | 28 | శరై స్తీక్ష్ణైర్ |
| 200 | 9 | సర్వపారశవైర్ బాణైః |
| | 26 | కార్ష్ణాయసై ర్బాణైః |
| 201 | 7 | పంచాశద్బాణంబులు |
| | 16 | మార్గణ [25] మార్గణావలి |
| | 26 | వైరులు వొగడన్ |
| | 28 | కనకలిప్త |
| 202 | 3 | విదారితాః |
| 203 | 14 | తపనీయ చిత్రమ్ |
| | 16 | మహారథస్యాధిరథేః కిరీటీ |
| | 20 | భీమనామాంకితా బాణా స్స్వర్ణపుంఖాః శిలాశిత |
| | 21 | జగత్పూర్ణం |
| 204 | 20 | యంజలికాస్త్రము అభిచారిక ప్రయోగమునందుద్భవించిన |
| 205 | 7 | పైశాచ |
| 206 | 14 | డమ్మాయ |
| 207 | 6 | దండప్రణామంబు |
| | 10 | సంధాన |
| 208 | 14 | శరకలాపంబునం |
| 210 | 27 | తతోధారా |
| 211 | 15 | సమంజసముగా |
| 212 | 16 | [ఖే] భేదినామని |
| | 27 | ప్రతివిధాన |
| 215 | 9 | ఇంద్రాశనిసమప్రఖ్యం |

## అష్టమోన్మేషము

| పుట | పంక్తి | అచ్చయిన దానికి బదులు ఉండవలసినది |
|---|---|---|
| 218 | 16 | ఋభువులు బ్రాహ్మణులు |
| 220 | 10 | సమాజహ్రు |
| 221 | 25 | ఔదుంబర్యాసందీ తస్యై |
| 224 | 29 | ఓదనాదికం |
| 225 | 1 | ఉపవాసే బలౌ |
| | 18 | తర్పణము |
| | 26 | శైవాగమే |
| 226 | 18 | నూర్ధ్వలోకములు |
| 227 | 3 | సుచేలాం [6] సర్వ |
| 229 | 6 | కులోత్పన్నులు |
| | 27 | మార్తాండ |
| 230 | 4 | నిఘంటు |
| | 22 | తస్య స్యుర్వశగాగ్రహాః |
| 231 | 19 | రత్నము లందు |
| 234 | 14 | రాయబారము కొఱకు |
| | 28 | పాదావసేచనాత్ |
| 236 | 4 | ఘృతపూర్ణేన |
| | 13 | స త్రియా యుక్తో మహాబలః —వ్యా భా. ఆది. 136-37 |
| | 22 | శాతకుంభ |
| 237 | 9 | భూసురులతనియుగ్రాసనమున |
| | 20 | పాత్రీభర్ |
| 238 | 2 | ఉపగ్రహ్యాద్ |
| | 20 | విభూషితః |
| 239 | 18 | ఖడ్గ |
| 240 | 2 | ఆసనాని |
| | 11 | మహార్హాసనములు |
| | 14 | శోకో మాం ప్రదహత్యయమ్ |
| 242 | 3 | శ్లక్ష్ణం |
| 243 | 18 | మతీవ [త] భాతి |
| | 22 | మూర్ధ్నిచ్ఛత్రేణ |
| 244 | 8 | ఉత్పత్త్యర్థము |
| 245 | 19 | నర్తనశీలాయ |
| 246 | 26 | వాద్య[య]ము |
| 247 | 1 | నర్తకుఁడు |
| 248 | 25 | య్యైతిహ్యము |
| 252 | 1 | భేరి (6) భేరీం |
| | 22 | సమానార్థకములు |
| | 26 | శిల్పచమత్కారములకు |
| 253 | 13 | సూత్రకారుఁడు |
| 254 | 11 | అప్సరోఽంగనలు |
| | 22 | స్థాపయితవ్యాని |
| 255 | 12 | వాణీ సప్తవిధా |
| 256 | 11 | [వి] నిషాదము |
| | 15 | ఇత్యేవ (19) సప్తవిధః ప్రోక్తో |
| 257 | 10 | సంస్థాపనీయుఁడు |
| | 23 | Indra (India) |
| 258 | 24 | నేకాంతసేవ |
| 259 | 3 | ఆశీర్వాదనినా(వా)దము |
| | 23 | అవాదయత్ |
| 260 | 7 | రైవతకాద్రిః (10) నింపెసఁగ |
| 263 | 11 | తప్పదు (14) యవసర |
| 264 | 14 | కల్పవృక్షః (24) వృక్షాణి |
| | 28 | వ్యా భా భీష్మ [అను] |
| 266 | 22 | [ప[ వసిష్ఠు |
| 267 | 1 | తన [ప] వత్సంబు |
| | 23 | ధేనురూప |
| 270 | 2 | ద్యూతకలాకుశలుండగు... తగునె దాని నిందింపఁగన్ |
| | 19 | లోహితాక్షాంశ్చ |

# అవలోకిత గ్రంథ పట్టిక

1. కవిత్రియము వారి శ్రీమదాంధ్ర మహాభారతము
2. వ్యాస భారతము - ఔత్తరాహ - దాక్షిణాత్య ప్రతులు
3. వాల్మీకి రామాయణము
4. ఋగ్వేదము, యజుర్వేదము, అధర్వవేదము (4) పురాణములు

శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము - ప్రథమ ద్వితీయ భాగములో పేర్కొన్న శిల్పశాస్త్ర గ్రంథములే కాక మఱి కొన్ని ప్రామాణిక గ్రంథములు :-

1 భాగవతాగ్ని విష్ణు పద్మ మత్స్య, మార్కండేయ, స్కాందాది పురాణములు (సంస్కృతము)

2 బ్రాహ్మణోత్పత్తి మార్తండ

3 ఆచార మయూఖము (ద్వి.భా) భట్ట నీలకంఠ, బొంబాయి

4 వేదోంకా యథార్థస్వరూప్ - పండిత ధర్మదేవ మార్తాండ

5 వేదభారతి [హిందూ యువకులచే సంకలనము] కొత్తపేట

6 భారతీయ ప్రాచీన విజ్ఞాన శాస్త్రము - రాణీ శ్రీనివాసశాస్త్రి

7 భరద్వాజ మహర్షి కృత బృహద్విమానశాస్త్రమ్
—సం. స్వామి బ్రహ్మముని పరివ్రాజక్

8 విమానశాస్త్రము (తెలుగు) -
—పం. పుత్తేటి సుబ్రహ్మణ్యాచార్యులు, నెల్లూరు

9 ఆంధ్రప్రభ దినపత్రిక. 15-10-1985 శనివారం - విజయనగరం

10 సురవరం ప్రతాపరెడ్డి : రామాయణ విశేషములు

11 భైరవకవి : రత్నపరీక్ష [అగస్త్యకృతము]

12 భూల్‌చంద్ శర్మ : పుష్పకవిమాన [హిందీ] - శిల్పగ్రంథప్రకాశన్, ఢిల్లీ

13 కౌటిల్య - అర్థశాస్త్ర

14 భోజః సమరాంగణ సూత్రధారః (గయక్‌వాడ్ ఓరియంటల్ సీరీజ్, బరోడా)

15 మారన : మార్కండేయ పురాణము.

## BOOKS IN ENGLISH

1) SUKRA NITI : Tr. by Benoy Kumar Sarma
2) V. S. Agrawala : The Heritage of Indian Art
3) B. K. Chaturvedi : The Jewellery of India
4) Dr. G. S. Kapoor : Remidial Measures in Astrology
5) Jasleen Dhamija : Indian Folk Arts & Crafts
6) Indian Handicrats
7) V. S. Agrawala : Introduction to Samarangana Surtadharah gaikhwad - Oriental series : Baroda.
8) D. N. Sukla : SILPA SASTRA - Indian Achievements Areonatics and fine Arts-
9) Dr. Raghavan : Yantras or Mechanical contrivances in Ancient India.
10) D. D. Kosambi : The Culture and Civilisation in Ancient India
11) Chaman Lal : Hindu America
12) E. Vedavyas : HINDUISM IN SPACE AGE.
13) H. J. Rose : Gods and Heros of the Greeks
14) B. B. Lal : The Indian Civilisation - in A Cultural History of India.
15) V. M. Apte : Rigveda Mantras in their Ritual setting in the Griha Sutras.
16) Padmini Sen Gupta : Everyday Life in Ancient India.
17) Ramesh Menon : Discovering Lothel (An article in MIRROR) — Oct. 80
18) S. Krishna Swamy : Musical Instruments of India.

# కృతజ్ఞతానివేదనము

శ్రీ విశ్వకర్మా విజ్ఞాన కేంద్రకు విరాళము లిచ్చిన వితరణశీలురకు,

ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయము నందించిన తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి వారికి, సర్వదా కృతజ్ఞుడను.

ఈ గ్రంథమును సకాలంలో ముద్రించి యిచ్చిన మహోదయ పవర్ ప్రెస్, శ్రీకాకుళం వారికి తదధిపతులు శ్రీ తిమ్మరాజు శివరావుగారికీ, చిరంజీవి ప్రభాకర్ గారికి వారి సిబ్బందికీ ధన్యవాదములు.

గ్రంథము నంతయు శ్రద్ధగా చదివి ముద్రారాక్షసముల నెత్తిచూపి సవరణలు సూచించిన మిత్రులు శ్రీకాకుళం ప్రభుత్వ కళాశాల సంస్కృత అధ్యాపకులు శ్రీమాన్ శ్రీనివాస రామానుజం ఎం. ఏ. (Sanskrit), ఎం. ఏ. (Telugu), M.Phil, B.Ed గారికి కృతజ్ఞతాపూర్వక వందనములు.

శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళా చర్చనము - తృతీయ భాగము హైదరాబాదులో ఆవిష్కరించిన తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు -

ఆచార్య డా॥ పేర్వారం జగన్నాథం, M. A. Ph., D. గారికి

సమ్యగ్దృష్టితో రమ్యానుశీలనం చేసిన సహృదయ సాహితీవేత్త -

ఆచార్య డా॥ కొత్తపల్లి వీరభద్రరావు, M. A., Ph. D. గారికి

తమ అమూల్యాభిప్రాయము నిచ్చిన అష్టావధాని -

డా॥ బేతవోలు రామబ్రహ్మం, M. A., Ph. D. గారికి

సాదరముగా సన్మానములు జరిపిన మిత్రులకు, సాహితీ మిత్రులకు, వక్తలకు, ఆశీర్వక్తలకు - అందరికీ నా కృతజ్ఞతా పూర్వకవందనములు.

ఈ సౌహార్దము జూపి నందుకు ఫలం బేమందురా ? యుర్విపై
వ్యాసప్రోక్తము నన్నయాది కవి వర్య ప్రోక్తముస్ భారతం
బీ సిద్ధాంతము మత్కృతంబు తిరమైయెన్నాళ్లు శోభిల్లునో
యా సోమార్కముగా భవద్యశము దా నన్నాళ్లు వెల్గొందుతన్.

__శోభిరా

# అంకితము

ఈ సిద్ధాంత గ్రంధమును
స్వర్లోకవాసులైన పుణ్యశ్లోకులు
నా తలిదండ్రులు
నాగరత్నమాంబా లింగయాచార్యులకు
శ్రద్ధాంజలి ఘటించి
సమర్పిస్తున్నాను

ధృతి శోధించి రచించితి
నతిరమ్యంబైన శ్రీమదాంధ్ర మహాభా
రత శిల్పకళాదర్శన
కృతి; నంకిత మిత్తు జననికిని జనకునకున్

—సత్యనారాయణ



విశ్వకర్మన్ నమస్తే పాహ్యస్మాన్

— అథర్వ. 2-35



# శ్రీ విశ్వకర్మ భగవాన్

విశ్వకర్మన్ నమస్తేఽస్తు విశ్వాత్మన్ విశ్వసంభవ
అపవర్గోఽసి భూతానాం పంచానాం పరతః స్థితః ॥

— భారతము

# శ్రీ విశ్వకర్మ విజ్ఞాన కేంద్ర - శ్రీకాకుళం

స్థాపితము : 14-9-84



సంచాలక్ : డా॥ యస్. యన్. శోభిరాల, యం. ఏ., పి. హెచ్. డి.

ఉప సంచాలక్ : శ్రీమతి శోభిరాల సుందరం, యం. ఏ.

సహాయక్ : కుమారి శోభిరాల శ్రీవిద్య, నాట్య ప్రవీణ
Dip. in Bharata Natyam & Kuchipudi Dance

* * * * *

**ముఖ్యాశయములు :**

1. శిల్ప సాహిత్యము ప్రచురించుట
2. శిల్పకళపై నధ్యయనము చేయువారికి తగు సూచనలిచ్చి ప్రోత్సహించుట.

# సాహితీప్రియ బంధుమిత్రులు

శుభాకాంక్షలతో



సుమాంజలులతో

శ్రీమతి ఉమాదేవి & శ్రీమతి వరలక్ష్మి
నంద్యాల

---

శుభాశీః సుపక్షర



సుమమాలలతో

శ్రీయుతులు దరిశి హేమసుందరరావు
వారి ధర్మపత్ని శ్రీమతి కనకదుర్గ
విశాఖపట్నం - 16

# మహారాజ పోషకులు

విశ్వకర్మ విజ్ఞాన కేంద్ర స్థాపనకు
తగు సూచనల నిచ్చియు భూరి విరాళము నిచ్చియు
ప్రోత్సహించిన మహాశయుడు

శిల్పసాహిత్యాభిమాని

వివేకి వితరణశీలి



శ్రీ పట్నాల వీరాచారి

పటమట - విజయవాడ

## పోషకులు : ప్రోత్సాహకులు

మా సంస్థకు వేయి రూపాయలకు మించి
విరాళము లిచ్చిన దాతలు మహారాజ పోషకులు

యథాశక్తి విరాళములొసంగిన సాహిత్యాభిమానులు పోషకులు

హితులు సాహితీసమారాధకులు ప్రోత్సాహకులు

## మహారాజ పోషకులు

వాస్తుశిల్పరత్న కీ॥ శే॥ కందుకూరు మణిభూషణాచార్యులవారి

ద్వితీయ వర్ధంతి సభలో వారి పుత్రరత్నము



విజయవాడ వాస్తవ్యులు

ఆచార్య విశ్వకర్మ



శ్రీ కందుకూరు వేంకటగోవిందేశ్వరశర్మ

డా॥ శోభిరాం వారికి సమర్పించిన

శ్రీ మణిభూషణాచార్య స్మారక పురస్కారం నగదు రు. 1116/-

---

వదాన్య శిఖరులు



శ్రీ వల్లపూడి చంద్రశేఖరశాస్త్రి, B. E., F I. E.,
Retired Senior Agricultural Engineer.

వారి ధర్మపత్ని శ్రీమతి వరలక్ష్మీదేవి — హైదరాబా

# మహారాజ పోషకులు

సహృదయులు, సాహిత్యప్రియులు

లు ఐం వృ బి ద్యాబాత్ర శే



డా॥ యం. వి. రమణరావు, M. D., M. S.,

వారి సతీమణి శ్రీమతి సుబ్బలక్ష్మి — శ్రీకాకళం



డా॥ సి. కృష్ణారావు, యం.డి,

రిజిష్టర్డు సివిల్ సర్జన్ & ఫిజీషియన్

వారి ధర్మపత్ని శ్రీమతి పద్మావతీదేవి —శ్రీకాకుళం

## సాహి మిత్రులు

### శ్రీకాకుళం ఉపనిషన్ గ అధ్యక్ష కార్యదర్శుల

1. డాక్టర్ ఈశ్వర సీతారామధన్వంతరి, అధ్యక్షులు
2. డాక్టర్ శోభిరాల
3. శ్రీ న్ కవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు. కార

### విజయనగర జయ భావన' అధ్యక్ష కార్యదర్శు

1. డా॥ ఆచార్య భావన్, అధ్యక్షులు
2 డా॥ శోభిరాల
3. డా॥ ఎ. గోపాలరావు, M.A., Phd.. ప్రధాన కార్యదర్శి

# విశ్వబ్రాహ్మణ ధర్మపీఠము - హైదరాబాదు

సభాపతిగా

డా॥ శోభిరాల సత్యనారాయణ, యం. ఏ.,4 పిహెచ్, డి.

ఆధిష్ఠాతృ వర్గ సభ్యులతో



1 'సాహిత్యబ్రహ్మ' డా॥ వి. వి. యల్. నరసింహారావు, M. A., Ph. D. —ఉప సభాపతి

2 'విజయరత్న' వసునూరి బ్రహ్మానందాచార్యులు —కోశాధికారి

3 'విశ్వజ్ఞ' వడ్లపూడి చంద్రశేఖరశాస్త్రి, B. E., F. I. E. —ప్రధాన సంచాలకులు

ఫలశ్రుతి

మన శిల్పము మన సంస్కృతి
మన నాగరకతను తెలుపు మహితగ్రంథం
బును జదివి బుధులు మెచ్చిన
జనహిత మగు నాదు జన్మ చరితార్థ మగున్.

— శోభిరాలు